కూర్పు :

ఎస్. కె. వెంకటాచార్యులు, యం.ఏ.




ప్రకాశకులు :

తులసీ పబ్లిషరు ... జయవాడ-1

విద్యా ... కులు

The Vicar of Wakefield

BY

Oliver Goldsmith

మూల్యము: రు. 7-00

ముద్రణ:

సోమే[illegible]ంగ్ ప్రెస్.

# సజ్జనులు

కొందఱు మనుజులు వివాహము చేసికొనరు; బ్రహ్మచారులుగనే యుండి జనాభానుగూర్చి మాట్లాడుచుందురు. అట్టి వారికంటె వివాహము చేసికొని సంతానాభివృద్ధి చేయువారే దేశమునకు, మానవజాతికి చక్కని సేవచేయుచున్నారని నేను మొదటినుండియు అభిప్రాయపడుచున్నాను. ఈ అభిప్రాయము తోనే నేను చర్చి ఉద్యోగమును స్వీకరించిన మొదటి సంవత్సరములోనే వివాహమును గూర్చి ఆలోచింపసాగినాను. ఆ సంవత్సరములోనే నేనొక యువతిని వివాహము చేసికొని యుంటిని. సాధారణముగ పలువురు పైపై మెఱుగులను చూచి వివాహము చేసికొందురు. నేను మాత్రము బాహ్యస్వరూపము నేమాత్రమును లెక్కించు వాడనుగాను. ఆ సూత్రమునకు కట్టుబడియే నేను వివాహము చేసికొంటిని.

నా భార్య మంచి స్వభావముగలది. తల్లిదండ్రులామెను చక్కగా పెంచియుండిరి. ఆమెకొక మాదిరిగా చదువు వచ్చును. వంట పనులయందు మాత్ర మామెను మించు వారెవ్వరును నుండరని నిస్సంశయముగ చెప్పవచ్చును. గృహ విషయముల నన్నిటిని చక్కగా తీర్చి దిద్దగలనని ఆమె ఎంతయు గర్వించుచుండెడిది. కాని ఆమె చాకచక్యము వలన మేము పొదుపు చేసికొన గలుగుట మాత్రము జరుగలేదు; మా సంపద ఏమియు వృద్ధిచెందలేదు.

మే మిరువురము ఒకరి నొకరము గాఢముగా ప్రేమించు

కొనసాగితిమి. వయస్సు మీరుచున్న కొలది ఆ ప్రేమ ఇంకను అభివృద్ధి చెందసాగెను. నేను నా భార్యను కోపింపవలసిన అవసరముగాని నా భార్య నన్ను కోపింపవలసిన అవసరంగాని ఏమియు లేకుండెను. మేమిరువురము ఈ ప్రపంచమును ద్వేషింపవలసిన అవసరముకూడ ఏమియు లేకుండెను. మేమొక చక్కని గృహములో నివసించుచుంటిమి. మా గృహముచుట్టు చుట్టును మనోహరమైన దృశ్యములుండెను. మా ఇరుగు పొరుగు వారుగూడ చాల మంచివారు. మేము గ్రామ జీవితము నకు సంబంధించిన ఆటపాటలలో పాల్గొనుచుండెడివారము. సమీపమునున్న ధనికుల ఇండ్లకు పోవుచుండెడివారము; బీద లకు సాహాయ్యము చేయుచుండెడివారము. మేము విప్లవము నకు భయపడవలసిన అవసరమేమియు నుండెడికాదు. మా సాహస కృత్యము లన్నియు ఇంటిలోని కుంపటి వద్దనే!

మా యిల్లు రాజబాటకు ప్రక్కనే యుండెను. అందు వలన బాటసారులు తరచుగా మా యింటికి వచ్చుచుండెడి వారు; మే మొసగు సారాయమును సంతృప్తితో స్వీకరించు చుండెడివారు. మా సారాయము చాల ప్రసిద్ధి చెందినది. అందు లోపమేమియు లేదని నేను గట్టిగా చెప్పగలను. మా దూరపు బంధువులు గూడ ఎవ్వరి సాహాయ్యము లేకుండగనే, మా యింటికివచ్చి మా ఆతిథ్యమును స్వీకరించుచుండెడి వారు. గ్రుడ్డివారు, కుంటివారు, ఇతర వికలాంగులుకూడ మా యింటికి వచ్చెడివారు. "మన రక్తమాంసములు, వీరి రక్త మాంసములు ఒకటే కావున వీరందరును మనతో పాటుగనే కూర్చుండి భోజనము చేయవలయును" అని

నా భార్య అనుచుండెడిది. అందువలన మాతోబాటు భోజనము చేయుటకు ధనికులు లేకున్నను, ఆనందించు మిత్రులు మాత్రముండెడివారు. ధనికులను మన ఆతిథ్యముతో సంతృప్తి పఱచుట చాలకష్టము. బీదవారగు అతిథులే మన ఆతిథ్యమున కెంతయు సంతృప్తిచెంది సంతసింతురు. కొందఱు అందమైన పుష్పములను, సీతాకోక చిలుకలను చూచి సంతసింతురు. నేను దరహాస వదనములనుచూచి సంతసించు చుండెడి వాడను.

ఒకొ్కక్కప్పుడు మా యింటికి అవాంఛనీయమైన దూరపు బంధువులు, అతిథులు వచ్చుచుండెడివారు. వారి నేవి ధముగనైనను వదలించుకోవలసిన అవుసర మేర్పడు చుండెడిది. అప్పుడట్టివారికి మేము వానకోటునో, చెప్పుల జతనో, స్వప్న మైన ఖరీదుగల గుఱ్ఱమునో ఇచ్చుచుండెడి వారము. అంతటితో మాకు వారిపీడ వదలి పోయెడిది. ఏలయన వారు వానిని మాకు తిరిగి యిచ్చుట కెన్నడును వచ్చెడివారు కారు. ఆ యుపాయము నవలంబించుటవలన దుష్టులు మా యింటికి మాటి మాటికి వచ్చుటకు వీలుండెడిది కాదు. కాని మా యింటికి వచ్చినవారు మాత్రము భోజనము చేయకుండ, మా సారాయమును రుచి చూడకుండ బయటకు పోవుటకు వీలుండెడిదికాదు. వేక్ఫీల్డు గ్రామములోని చర్చి అధికారి గృహద్వారము అతిథులకెల్లప్పు డును తెఱచి యుండెడిది.

ఆ విధముగ మేము చాల సంవత్సరములు వేక్ఫీల్డు గ్రామమున సుఖముగా జీవించితిమి. అప్పుడప్పుడు మాకు కొద్ది కష్టములు కలుగు చుండెడివి ఆ కష్టములవలన సౌఖ్యముల విలువ ఇంకను హెచ్చుచుండెడిది. బడి పిల్లలు అప్పుడప్పుడు

నాతోటలో ప్రవేశించి ఫలములను దొంగిలించుకొని పోవు చుండెడివారు. పిల్లులు అప్పుడప్పుడు నాభార్య తయారుచేసిన వంటకములను తినిపోవుచుండెడివి. చర్చిలో నేను ఉపన్యసించు చుండగా పెద్ద భూస్వామి అప్పుడప్పుడు గుఱ్ఱుపెట్టి నిదురపోవు చుండెడివాడు. పెద్ద భూస్వామి భార్యను చర్చికివచ్చిన నాభార్య చక్కగా పలుకరించెడిది. భూస్వామిభార్య మాత్రము సరిగా మాట్లాడెడిదికాదు. కాని మే మా విషయములను మఱచిపోవు చుండెడివారము.

మేము మాపిల్లలను గారాబముతో పెంచలేదు. అందు వలన వారు మంచి బలిష్ఠులుగను, ఆరోగ్యవంతులుగను తయా రైరి. మా కుమారులు ఎంతటి శ్రమకైనను ఓర్చి చుఱుకుగా పని చేయుగలిగిన సామర్థ్యము కలిగి యుండిరి. మా కొమార్తెలు అంద చందములతో నొప్పుచు వికసించిన పుష్పములవలె నుండిరి. నే నప్పుడప్పుడు నా పిల్లలమధ్య నిలబడి వారి వంకకు చూచుచుండెడివాడను. వృద్ధాప్యములో నా కుపకరించునది వారేకదా. అప్పుడు వారికి నేను కౌంట్ ఆబెన్సబర్గ్‌కు సంబం ధించిన ప్రసిద్ధిచెందిన కథను చెప్పుచుండెడివాడను. రెండవ హెన్రీ జర్మనీలో విజయయాత్ర సాగించుచున్నప్పుడు పలువురు అతనికి ధనపు సంచులను సమర్పించు చుండెడివారు. కౌంట్ ఆబెన్సబర్గ్ మాత్రము తన ముప్పది ఇద్దఱు పిల్లలను చక్రవర్తికి సమర్పించి "ప్రభూ! నేను మీకింతకంటె విలువైన బహుమాన మేమి సమర్పింపగలను ?" అని యనెను.

నాకు ఆఱుగురు పిల్లలు మాత్రమే యుండిరి. కాని వారు చాల విలువైన వారనియు, దేశమునకెంతో ఉపయోగింతు

రనియు నేను భావించు చుండెడివాడను. వారిని కన్నందుకు దేశము నా కెంతయు ఋణపడియున్నదని తలచుచుండెడివాడను. మా పిల్లలలో పెద్దవాని పేరు జార్జి. అది అతని పెత్తండ్రి పేరు. మాకు పదివేల పౌనుల ధనము నొసగి పరలోకమున కేగిన మహనీయుడు జార్జి. మా రెండవ సంతానము అమ్మాయి. నే నామెకు ఆమె మేనత్త పేరు గ్రిసెల్ పెట్టదలచినాను. కాని నా భార్య గర్భిణిగా నున్నపుడు ఎన్నో నవలలను చదివినది. దాని ఫలితముగ ఆ అమ్మాయికి ఒలీవియా అను పేరు పెట్ట వలెనని నన్ను నిర్బంధించినది. నే నందుల కంగీరింపక తప్పినది కాదు. ఇంకను సంవత్సరము తిరుగకముందే మాకు మఱియొక కూతురు జన్మించినది. ఆమెకు గ్రిసెల్ అను పేరును తప్పక పెట్టవలెనని నేను నిర్ణయించుకొన్నాను. కాని అంతలో మా దూరపు బంధు వొకర్త ఆ అమ్మాయికి దైవమాతగా నుండి, "ఈ బాలికకు సోఫియా అను పేరు నొసగవలయును" అని యన్నది. ఆ బంధువు ధనికురాలు. మే మామె కోరికను మన్నించినాము. ఈ విధముగ మా కుటుంబములో నిరువురకు కాల్పనిక గ్రంథములలోని నామముల నిడుట తటస్థించినది. నేను కోరి ఆ పేర్లు పెట్టలేదని గట్టిగా చెప్పగలను. నాలుగవ సంతానము మగ పిల్లవాడే. అతని పేరు మోజెస్. పండ్రెండు సంవత్సరములు గడచిన తరువాత మాకు మఱి యిరువురు మగ పిల్లలు జన్మించినారు.

నా సంతానమును చూచుకొని నే నెంతయు గర్వించు చుండెడివాడను. ఈ విషయమును అంగీకరించుటకు నేను ఏ మాత్రము సిగ్గుపడుట లేదు. కాని నా భార్యగర్వమును, సంతృ

పిని వర్ణింపనలవికాదు. మాయింటికి వచ్చినవారు నాభార్యతో ఇట్లను చుండెడివారు: "ప్రిమ్‌రోజ్ సతీమణీ! ఈ ప్రాంతములో నీ పిల్లలవంటి చక్కని పిల్లలు మఱియొకరు లేరన్నచో, అందు అతిశయోక్తి అణుమాత్రమైనను లేదు. అప్పుడు నా భార్య ఇట్లను చుండెడిది: "వారు భగవంతుడు తయారుచేసినట్లు ఉన్నారు. వారు మంచి వారైనచో అందముగ నున్నట్లే. ఏల యనగ చక్కని ప్రవర్తనగలవారు చక్కని వారే కదా. ఇందు ఆశ్చర్యమేమియులేదు". పిమ్మట నామె పిల్లలను తలపై కెత్తు డనెడిది. పిల్లలట్లు చేసెడివారు. మా పిల్లలు అందమైన వారను టకు ఎటువంటి సందేహము లేదు. బాహ్యస్వరూపము అత్యల్ప మైన విషయమను సంగతి నాకు తెలియును. నేను దానికి ఎటు వంటి విలువను ఈయను. కాని ఆ ప్రాంతములోని వారందఱు నా పిల్లల చక్కదనమును గూర్చి మాట్లాడు కొనుచుండుటవలన నేనుగూడ చెప్పవలసి వచ్చినది. ఒలీవియాకు పదునెనిమిది సంవత్సరముల ప్రాయము వచ్చినది. ఆమె అందచందముల నేమని వర్ణింపవచ్చును! ఆమె శరీరమునుండి వెలువడు కాంతి పుంజములు కడు మనోహరమైనవి. సోఫియా అందచందము లంత కొట్టవచ్చినట్లు కనబడవు. కాని ఆమెకూడ అందమైనదే. ఆమె సౌందర్యము సౌమ్యభావముతో కూడుకొన్నది. అదియే దాని ఆకర్షణ.

యువతుల అభిప్రాయములు చాలవఱకు వారి అంద చందముల తీఱుపై ఆధారపడియుండునని చెప్పవచ్చును. ఓలీ వియా తన్ను పలువురు ప్రేమింపవలయునని తలచుచుండెడిది. సోఫియా ఒక్క ప్రేమికుడు లభించిన చాలు ననుకొనెడిది.

ఒకప్పుడు నేను సంతోషముగ నున్నపుడు తన యుల్లాసముతో నన్నింకను సంతోష పెట్టుటకు ప్రయత్నించు చుండెడిది. మఱియొకప్పుడు నేను ఆలోచనలలో మునిగి యున్నపుడు తన బుద్ధి విశేషముతో నాకానందమును చేకూర్చుచుండెడిది. కాని ఎవరు కాని మితిమీఱి ప్రవర్తించెడివారు కారు. ఒక్కొక్కప్పుడు వారు ఒకరి రూపమును మఱియొకరు ధరించుచుండెడివారు.

మా పెద్దకుమారుడు జార్జి ఆక్సుఫర్డులో చదువుకొని యుండెను. అందువలన నతని కచ్చటి మంచి మర్యాద లన్నియు బాగుగ తెలియును. నే నతని నేదేని యుద్యోగములో ప్రవేశ పెట్టదలచితిని. రెండవ కుమారుడగు మోజెసును నేను వ్యాపారములో ప్రవేశపెట్టదలచితిని. అందువలన నతనికి ఇంటివద్దనే అందుకు పనికివచ్చు చదువు చెప్పించితిని. కాని ప్రపంచమన్న నేమో ఇంకను సరిగా తెలియనివారినిగూర్చి చెప్ప ప్రయత్నించుట అనవసరము. మా కుటుంబమువారందఱిలోను ఒక విధమగు పోలిక కలదనిచెప్పిన చాలుననుకొందును. అందఱును ఉదారస్వభావము కలవారు; నిష్కపటులు; ఇతరులను సులభముగా నమ్మెడివారు; ఇతరులకు హానిచేయ దలంపనివారు; వేయేల ? అందఱును సజ్జనులే.

## 2

మా కుటుంబమునకు సంబంధించిన ఐహికవిషయము లన్నిటిని ముఖ్యముగా భార్యయే చూచుచుండెడిది. ఆధ్యాత్మిక విషయములుమాత్రము సంపూర్ణముగ నా అధీనములో నుండె

డివి. చర్చి ఉద్యోగము చేయుటవలన నాకు వచ్చుచున్న సంవత్సర భృతి మున్నూరు రూపాయలు. ఆ రూపాయలను నేను ఆ గ్రామములోని విధవలకు, తల్లిదండ్రులులేని పిల్లలకు ఇచ్చుచుండెడివాడను. నాకు వేఱె స్వంతధనము కలదు. అందువలన ఇంకను ధనము ప్రోగుచేయవలెనను ఆశ నా కేమాత్రముండెడిదికాదు. ప్రతిఫలము నాశించకుండ నా విద్యుక్తధర్మమును నేను నెఱవేర్చుట నా కెంతయు సంతోషకారణముగ నుండెడిది. నేను నా పనిలో నాకు సాహాయ్యపడుటకు మఱియొక యుద్యోగిని నియమించుకొనలేదు.

ఆయూరిలోని వారందఱు నాకు బాగుగ తెలిసినవారే. వివాహమైనవారు మితిమీరి ప్రవర్తింపరాదనియు, నిగ్రహము గలవారుగా నుండవలయుననియు నేను బోధించుచుండెడివాడను. వివాహము చేసికొనవలయునని బ్రహ్మచారుల నుద్బోధించుచుండెడివాడను. వివాహమునుగూర్చి మాట్లాడుటకు నే నెప్పుడును ఉత్సాహపడుచుండెడివాడను. వివాహము చేసికొనుటవలన గలుగు లాభములనుగూర్చి నేను ఎన్నో ఉపన్యాసములు తయారు చేసికొనియుంటిని. అందు రెండవ వివాహము కూడదని నేను తయారుచేసిన యుపన్యాసము చాల ముఖ్యమైనది. భార్య మరణించిన తరువాత మఱియొక భార్యను స్వీకరింపరాదని నేను గట్టిగా నొక్కి వక్కాణించుచుండెడివాడను. ఏండ్లు గడచినను ఈ విషయమున నా అభిప్రాయ మణుమాత్రమైనను సడలలేదు.

రెండవ వివాహము కూడదను విషయమునుగూర్చి ఇదివఱ కెందఱో మహానుభావులు ఎంతో శ్రమించి చాల విలువైన గ్రంథములను రచించియుండిరి. నేను చిన్నప్పుడే వానిని చదివి

యుంటిని. నేను అంతటితో సంతృప్తిచెందక ఆ విషయము గూర్చి కొన్ని గ్రంథములనుకూడ ప్రచురించియుంటిని. అవి అంతగా అమ్ముడు పోలేదు. అదృష్టవంతులకు మాత్రమే నా యుత్తమ గ్రంథములను చదువు నవకాశము లభించుచున్నదని తలచి సంతృప్తిచెందు చుండెడివాడను. ఇది నాలోని బలహీనతయని కొందఱు మిత్రులనుచుండెడివారు. వారట్లు తలంచుటకు కారణము వారు నేను చదివినట్లు గ్రంథములను చదువకుండుటయే. వారికావిషయమునకు సంబంధించిన జ్ఞానము అతి స్వల్పమైనది. ఆ విషయమునుగూర్చి ఆలోచించిన కొలది, అది ఎంతో ముఖ్యమైనదని నేను తలపసాగితిని. రెండవ వివాహము కూడదను మతమును ప్రబోధించిన విట్సన్‌కంటె నే నొక యడుగు ముందుకు వేసితిని.

విట్సన్ తనభార్య సమాధిపై 'విలియం విట్సన్ ఏకైక భార్య' అని వ్రాయించి యుండెను. నేను నాభార్య జీవించి యుండగనే ఒకఫలకమును తయారుచేయించితిని. ఆఫలకములో నా ఏకైకభార్య జీవితాంతమువఱకు పొదుపుగను, జాగ్రత్తగను, వినయ విధేయతలతోను జీవించి యున్నట్లు వ్రాయించి యుంటిని. నేనా ఫలకమును పొగ గొట్టమువద్ద పెట్టితిని. అట్లు చేయుటవలన కొన్ని లాభములు కలిగెను. ఆ ఫలకము తన విధ్యుక్త ధర్మమును నెఱవేర్పవలసిన అవసరమును నాభార్యకు నొక్కి వక్కాణించుచుండెను. ఆ విషయము నదియామె కెప్పుడును జ్ఞప్తికి తెచ్చుచుండెను. ఆ విధముగ ప్రవర్తించి పేరు ప్రతిష్ఠలను సంపాదింప వలయునని ఆమె ఉత్సాహపడుచుండెను.

వివాహము యువకుల కత్యవసరమని నేను నొక్కి చెప్పు

ఉంటిని గదా, ఆ విషయమును గ్రహించియే కాబోలు నా జ్యేష్ఠ పుత్రుడు జార్జి ఆస్పత్రును వీడివచ్చిన తరువాత మాకు సమీప ప్రాంతముననే పనిచేయుచున్న మతోద్యోగి కొమార్తె నొక దానను ప్రేమింపసాగెను. అతడు గొప్ప ధనికుడు. కొమార్తె కతని వద్దనుండి కావలసినంత ధనము వచ్చును. ఆ అమ్మాయి పేరు అర శెల్లా విల్మెట్. ఆమె ధనమును చూచియే నా కొమరుడామెను ప్రేమించెనని చెప్పుటకు వీలులేదు. ఆమె అందమైనదికూడా. ఆ విషయమును నా కొమార్తెలిరువురు తప్ప మిగిలిన వారందఱు అంగీకరించెదరు. ఆమె చక్కని యువతి. మంచి ఆరోగ్యముకలది. ముగ్ధ; మంచి ఆకర్షణ కలది. నా కొమరునకు కొంత ధనము నొసగుదుననను విషయము ఆమె తండ్రి విల్మెట్‌కు తెలియును. అందువలన నతడు నాకుమారునకు తన కొమార్తెనిచ్చి వివాహము చేయుట కిష్టపడుచుండెను. అందువలన మా రెండు కుటుంబములవారము అన్యోన్యముగ కలసి జీవింప సాగితిమి.

యువతీ యువకులు వివాహము చేసికొనుటకు ముందు ఒకరి నొకరు చక్కగా అర్థముచేసుకో వలయుననియు, తరు వాతనే వివాహము జరుగ వలయుననియు నేను అభిప్రాయ పడు చుంటిని. అందువలన నేను నా కొమరుడు తన ప్రియురాలతో కలిసి తిరుగుటకు ఎక్కువ అవకాశమిచ్చితిని. అందువలన వారిరు వురి మధ్యగల ప్రేమ అంత కంతకు అధికము కాసాగెను. ఒకరి నొకరు విడచియుండలేని పరిస్థితి ఏర్పడసాగెను.

ఆ విధముగ కొన్ని నెలలు గడచిపోయెను. నాకొమరుడు, అతని ప్రియురాలు వివాహము చేసికొనుట కెంతయు ఆతుర పడసాగిరి. ఆ విషయమును గ్రహించిన నేను అమ్మాయి

తండ్రితో ఆలోచించి వివాహ సుముహూర్తమును నిర్ణయించితిని. వివాహ శుభకార్యమునకు కావలసిన ప్రయత్నము లన్నియు ప్రారంభమయ్యెను. ఈ కార్యక్రమమున ప్రధానపాత్ర ధారిణీ నా భార్య అనిగాని, ఆమె ప్రాముఖ్యమును గూర్చిగాని ప్రత్యేకముగ చెప్పవలసిన పనిలేదు. నా కొమార్తల చూపులను వర్ణింప వలసిన అవసరముగూడా లేదు.

ఇక నా సంగతి. రెండవ వివాహము కూడదను వాదమును సమర్థించుచు నేనొక పుస్తకము వ్రాయుటలో నిమగ్నుడనై యుంటిని. దానిని త్వరలోనే ప్రచురింపవలయునను సదుద్దేశ్యముతో తుది మెఱుగులు దిద్దసాగితిని. వాదనాపటిమలో నేమి, శైలిలోనేమి నా గ్రంథములలోకెల్ల నది యుత్తమోత్తమమైన గ్రంథమగునని నేను అభిప్రాయపడుచుంటిని. అందులకు నేనెంతయు గర్వించుచుంటిని.

నే నా గ్రంథమును తీసికొనిపోయి నా ప్రాత మిత్రుడగు విల్మట్‌కు చూపితిని. అతడు దాని నెంతయు ప్రశంసించునను నుద్దేశ్యముతోనే నేనట్లు చేసితిని. అతడు నా భావములకు విరుద్ధమైన భావములను వెలిబుచ్చునని నే నేమాత్రము సంశయింపలేదు. అతడు నా గ్రంథమును చదివెను. వెంటనే అతడు నన్ను కడుతీవ్రముగా విమర్శింపసాగెను. నా అభిప్రాయమును కూకటివేళ్ళతో పెళ్ళగింపసాగెను. అతడట్లు చేయుటకు గట్టి కారణము లేకపోలేదు. అతడు నాలుగవ వివాహము చేసికొన దలచుచుండెను. ఆయుద్దేశ్యముతో నతడొక యువతిని ప్రేమించుచుండెను. ఆ విషయమునుగూర్చి మా కిరువురికి చర్చజరిగెను.

మా సంబంధము చెడిపోవు ననుకొంటిమి గాని అటుల జరుగ లేదు. మేము మఱియొకసారి ఆ విషయమునుగూర్చి చర్చింప దలచు కొంటిమి.

పెండ్లి తేపవగా మేమా విషయమును గూర్చి చర్చ కుపక్రమించితిమి. "నీవు ప్రస్తుత మతసిద్ధాంతములకు విరుద్ధముగ నడచుచున్నా"వని అతడనెను. నేనా ఆరోపణను సంపూర్ణముగ తిరస్కరించితిని. అందుకతడు సమాధానము చెప్పెను నేను మరల సమాధానము చెప్పితిని. మా సంభాషణ మంచివేడిగా నుండెను కాని ఎవ్వరిలోను ద్వేషభావము మాత్రము లేకుం డెను. అంతలో మా బంధువొకడు నన్ను బయటకు పిలిచి ఇట్లు చెప్పెను. "అయ్యా! ప్రిమ్‌రోజ్! మీరు ఈ విషయమును గూర్చి వింకటితో వాదింపవలదని విన్నవించు చున్నాను. కనీసము మీ కుమారుని వివాహము పూర్తియగు నఱకైనను మానివేయుడు, లేనిచో సంబంధము చెడిపోవచ్చునని మేమం దఱ మెంతయు భయపడు చున్నాము, మా మాట వినుడు."

అప్పుడు నేనిట్లంటిని, "ఏమేమీ! నేను సరియైన విషయ మునుగూర్చి మాత్రమే మాట్లాడు చున్నాడ. అందువలన నేను భయపడవలసిన పని అణుమాత్రమైనను లేదని విశ్వసించు చున్నాను. నా వాదమును వదలుకో మనుచున్నారు! నా సంప దను కూడ వదలుకో మందురు!"

ఆ మాటలనువిని మా బంధువు ఇట్లనియెను, "అయ్యా! నేను మీకు అశనిపాతమువంటి వార్త చెప్పవలసి వచ్చి నందుల కెంతయు విచారించు చున్నాను, మీ సంపద నేడు

చెప్పుకో తగినంత ఏమియు లేదు. మీరు మీ ధనము నంతను పట్టణములోని ఒక ధనికవర్తకునివద్ద దాచియుంచినారు గదా. ఆ ధనికుడు పరారై పోయినాడు. మీ కింక చిల్లి గవ్వయైనరాదు. వివాహమగువఱకు ఈ వార్తను మీకుగాని మీ కుటుంబములోని ఇతరులకుగాని చెప్పకుండ నుండవలయునని నేను మొదట అనుకొన్నాను. కాని మీరు మొండిగ విల్మట్తో వాదించుచుండుటవలన మీ ధోరణిని తగ్గించుటకై ఇప్పుడే చెప్పవలసి వచ్చినది. మీ కుమారుని వివాహమైనచో మీకు కావలసినంత ధనమువచ్చును. అంతవఱకు మీరు జాగ్రత్తగా ప్రవర్తింపవలయునని హెచ్చరించుచున్నాను. లేనిచో కార్యము చెడును. తరువాత మీ యిష్టము."

అపుడు నేనిట్లంటిని: "నీవు చెప్పిన వార్త నిజమేయైనను, నా సంపద సర్వనాశనమైనను నేను బుద్ధిహీనుడను కాజాలను; నాకు ప్రియాతి ప్రియమైన సిద్ధాంతములను వదలుకొనజాలను. నే నిప్పుడే లోనికి పోయి నా ఆర్థిక పరిస్థితి సందఱకు వివరించి చెప్పుదును. విల్మట్ నాలుగవసారి వివాహము చేసికొనుటకు నేను అణుమాత్రమైనను అంగీకరింపను".

ఆర్థికముగ నేను సర్వనాశనమైనానను విషాదమగువార్త విల్మట్ కుటుంబము వారికిని, నాకుటుంబము వారికిని తెలిసెను. అప్పుడు వారు ఏ యే విధముగ భావించిరో చెప్పవలసిన పని లేదు. ముఖ్యముగా నా కుమారుడు, అతని ప్రియురాలు ఆ వార్తను ఎట్లు భరించిరో గదా! మాతో సంబంధము వదలుకోవలెనని విల్మట్ ఇదివఱకే తలచుచుండెను. మా ఆర్థిక పరిస్థితిని తెలిసికొనుటతో అతడింక ఆలోచింపవలసిన పని

ఏమియు లేకపోయెను. అతడు మాతో నింక సంబంధము చేసి కొనరాదని నిర్ణయించుకొనెను. ఆ నిర్ణయము నతడు స్పష్టముగ ప్రకటించెను.

# 3

నేను ధనము దాచి యుంచిన వర్తకుడు పాఱిపోయి నాడను వార్త అసత్యమై యుండవచ్చుననియు, కిట్టనివారెవ్వరో దానిని పుట్టించి యుందురనియు మా కుటుంబము వారము కొద్దిగా ఆశపెట్టుకొంటిమి. కాని అనతికాలములో ఆ ఆశ కూడ పటాపంచలయ్యెను. మేము విన్న విషయమంతయు సరి యైనదే యని ధ్రువపఱచుచు మాకు పట్టణమునుండి ఒక యుత్తరము వచ్చెను. నా ధనము పోవుటయన్నది నా కొకని కి చాలస్వల్పమైన విషయమే. కాని నా కుటుంబము వారిని ఏమిచేయను? వారి కొఱకు నేనెంతయు విచారింపసాగితిని. సరియైన విద్యాగంధము లేక వారు నికృష్టముగ కాలము గడప వలసినదేనా? ఆ విషయమును తలచుకొన్నంత మాత్రమున నా యెడలు గజగజ వణకిపోవుచున్నది.

ఆర్థికముగ సర్వనాశనమైనందుకు నా కుటుంబము వారెం తయు విచారింపసాగిరి. కాని నేను వారి విచారమును పోగొట్టు టకు ప్రయత్నింపకుంటిని. ఏలయన క్రొత్తలో నా ప్రయ త్నమువలన వారి విచారము అతిశయించునేగాని ఏ మాత్రము తగ్గదు. నేను నా కుటుంబమును భవిష్యత్తులో ఎట్లు పోషింప వలయునను విషయమును గూర్చి గాఢముగ నాలోచింప

సాగితిని. ఇక నేను వేక్ఫీల్డులో మతాధికారిగ నుండుట అసంభవము. కడకు నా కచ్చటకు దెబ్బది మైళ్ళదూరములోనున్న వేఱొక గ్రామములో మతాధికారిగ నుండ వలసినదని ఆహ్వానమువచ్చెను. సంవత్సరమునకు వేతనము పది నేనుపౌనులు. అచ్చట నేను నా సిద్ధాంతముల కేవిధమగు భంగము కలుగకుండ జీవింపవచ్చును. అందువలన నేను ఆ ఆహ్వానమున కంగీకారము తెలిపితిని. అచ్చట కొంత భూమిని వ్యవసాయము చేసికొనిగూడ నాఆర్థిక పరిస్థితిని చక్కబఱచుకో వచ్చునని నేను భావించితిని.

ఆ నిశ్చయమునకు వచ్చిన తరువాత నేను నాకు రావలసిన బాకీలను వసూలు చేసికొనుటలోను, ఈయవలసినవారికి ఇచ్చుటలోను నిమగ్నుడనైతిని. ఈపనిని పూర్తిచేయగా నా చేతిలో నాలుగువందల పౌనుల ధనముమాత్రము మిగిలెను.

అంతవఱకు నా కుటుంబమువారు ధనికులమని గర్వించుచుండిరి. ఇక వారి గర్వమును క్రొత్తపరిస్థితుల కనుగుణముగ తగ్గించి వేయవలసిన పరిస్థితి ఏర్పడెను. అందువలన నేను నా పిల్లలతో నిట్లంటిని: "అబ్బాయిలు! అమ్మాయిలు! మనము దురదృష్టవంతులము. మనకు ఆర్థికదుస్థితి సంప్రాప్తించినదను విషయము మీ కందకు తెలియును. మనము మితవ్యయముచేసి యుండినచో ఈఆపదనుండి తప్పించుకొనియుండెడివారము కాము. కాని ఈ ఆపద ఇంత కఠోరముగ నుండియుండెడిది కాదు. పిల్లలారా! మనమిప్పుడు బీదవారమను సంగతి మీ కందఱకు తెలియును. మనమిప్పుడు వివేకముతో ఈ క్రొత్తపరిస్థితి కనుగుణముగ నడచుకోవలయును. మనమిప్పుడు దుఃఖముతో వ్రుతింప

వలసినపని ఏమియులేదు. ధనమున్నప్పుడు మన మందఱము వైభవముగజీవించితిమి. ఇప్పుడు ధనములేదు కనుగ మనమందఱము నిరాడంబరముగ జీవితముగడపవచ్చును. నిరాడంబర జీవితము కడుప్రశాంతముగ నుండును. ఆజీవితములోని మాధుర్యము అపూర్వమైనది. ఈక్షణమునుండి మన మందఱము లేనిపోని ఆడంబర జీవితమును వదలివైచి నిరాడంబర జీవితమును ప్రారంభింతము. వివేకమున్నచో మన మింక ఇప్పుడున్న ధనముతో సుఖముగ జీవింపవచ్చును. ధనము ఎక్కువ లేకపోయినను నష్టములేదు. ధనములేని లోటును సంతృప్తియను సద్గుణము తీర్చును.

నా పెద్ద కుమారుడు ఆక్సుఫర్డులో చదువుకొని యున్నాడుగదా! అందువలన నతనిని నేను పట్టణమునకు పంప దలచితిని. అచ్చట నతడు తన శక్తిసామర్థ్యముల నుపయోగించి తన్ను పోషించుకొనుటకు, మిగిలినవారికి సాహాయ్యము చేయుటకు కావలసిన ధనమును సంపాదించుకోవచ్చును. దారిద్ర్యములో కుటుంబములు, స్నేహితులు విడిపోవలసివచ్చుచుండును. ఇది చాల బాధాకరమైన విషయములలో నొకటియనుటకు సందేహమేమియులేదు. కాని బీదవారు దాని ననుభవింపక తప్పదు.

మేము విడిపోవలసినరోజు వచ్చెను. నా పెద్దకుమారుడు జార్జి. తన తలివద్దను మిగిలినవారివద్దను సెలవుతీసికొనెను. అప్పుడు వారి ముద్దులు, కన్నీరు ఏకమైపోయెను. తరువాత జార్జి నావద్దకువచ్చి, "నాన్నా! నన్ను ఆశీర్వదించి పంపుడు!" అని అనెను. నే నతనిని హృదయ పూర్వకముగ ఆశీర్వదించితిని.

మఱియు నేనతనికి అయిదు గినీ నాణెముల నిచ్చితిని. నేనప్పుడతఁ డీయఁగల పితృధన మంతమాత్రమే. నేనింకను అతనితో నిట్లంటిని. "ఇదిగో ఈ పవిత్ర గ్రంథమునుగూడ తీసికొనుము. ఈ గ్రంథము నీ కన్ని వేళల మంచి మార్గమును చూపును. దేవుఁడు నీకు మేలు చేకూర్చును, నీకెట్టిలోటు ఉండదు. సంవత్సరమున కొకసారి నైనను వచ్చి నన్నుచూచు చుండుము ధైర్యముగ నుండుము. సత్ప్రవర్తనము కలిగి యుండుము." జార్జి ప్రపంచములో నెచ్చటకు పోయినను విజయమునుసాధించు ననుట ముమ్మాటికి నిజము, అందువలననే నేనతని నొంటరిగ విడిచి పుచ్చితిని.

జార్జి వెళ్ళిపోయిన కొన్ని దినములకు మిగిలిన వారము గూడ వేక్‌ఫీల్డును విడచి వెళ్ళవలసిన రోజు వచ్చెను. మేము ఆ గ్రామములో ఎంతోకాలము గడపి యుంటిమి. అచ్చట ఎన్నో సౌఖ్యముల ననుభవించి యుంటిమి. అట్టి ఆ ప్రదేశమును వీడిపోవఁయున్న కన్నీరు కార్చకుండ నుండుట కష్టమే. అదియుగాక మా కుటుంబమువారు అంతకు మునుపెన్నడును ఆ గ్రామమునుదాటి పదిమైళ్ళ దూరముకంటె ఎక్కువదూరము పోయియుండలేదు. కాని యిప్పుడు మేము డెబ్బదిమైళ్ళ దూరముగనున్న గ్రామమునకు పోవలసి యున్నది. అది మా కుటుంబమువారికి భయకారణముగ నుండెను.

మేము క్రొత్తగ్రామమునకు ప్రయాణము ప్రారంభించితిమి. బీదలు కొందఱు మా వెంటపడి గోలుగోలున నేడువ సాగిరి. వారి ప్రవర్తన మా విచారమును అతిశయింప జేసెను.

కొన్ని మైళ్ళ దూరము తరువాత వారందఱును వెనుకకు తిరిగి పోయిరి.

మా మొదటిరోజు ప్రయాణము ముగిసెను. అప్పటికి నేము మా గమ్యస్థానమునకు ముప్పదిమైళ్ళ లోపలనున్న గ్రామము నొకదానిని చేరుకొంటిమి. రాత్రి కాగ్రామములో నున్న ఒకపూటకూళ్ళ యింట బసచేసితిమి. ఆ యింటి యజమానుడు మమ్మొకగదిలోనికి తీసికొని పోయెను. అప్పుడు నేను అతనితో నిట్లు అంటిని "మీరు మాతో కలసి పానీయము తీసికోవలయును" యజమానుడంపు కంగీకరించెను. ఏలయన మఱునాడు నేమతనికి ఎక్కువడబ్బు నీయవలసి వచ్చునుగదా! నేనతనికి మా గమ్యస్థానమునుగూర్చి తెలిపితిని.

యజమానునకు నేను పోనున్న ప్రాంతమునకు సంబంధించిన విషయములన్నియు బాగుగ తెలియును. ముఖ్యముగా అతనికి నాకచ్చట యజమానుడు కానున్న పార్న్హిల్ బాగుగ తెలియును. ఆ మహానీయుడు నేను పోనున్న గ్రామమునకు కొన్నిమైళ్ళ దూరములోనే నివసించు చున్నాడట. అతనిని గూర్చి పూటకూళ్ళ యింటి యజమానుడు ఇట్లు చెప్పెను. "అతనికీ ప్రపంచములో సౌఖ్యములున్న చాలును. అతనికి మఱి యింక నేమియు అక్కఱలేదు. యువతులన్న అతనికి అపరిమిత మగుప్రీతి. అతడెప్పుడును యువతుల మధ్యనుండి ఆనంద సాగరమున నీదులాడుటకే ఇచ్ఛగించును. ఆ ప్రాంతములోని యువతులందఱును అతనికి లోబడినవారే. కాని అతడే యొక్కర్తతోను శాశ్వతముగ నుండడు. అతనికి పుష్పములలోని మకరందము

లను తెలిపితిని. అప్పుడతడిట్లనెను. "ఆహాహా! నేనెంత అదృష్టవంతుడను!" నేను సరిగా మీరుపోవు మార్గముననే పోవలసి యున్నది. వరదలమూలమున నేనిచ్చట రెండుదినములు ఆగిపోవలసి వచ్చినది. రేపటికి వరదలు తగ్గిపోవుననియు, మనము ప్రయాణమై పోవుటకు వీలగుననియు ఆశించుచున్నాను.

"మీతో కలసి ప్రయాణము చేయుట నాకెంతయు ఆనందకరమైన విషయము" అని నేనంటిని.

నాభార్య, కొమార్తెలుకూడ నిట్లనిరి: "మీవంటి వారితో కలిసి ప్రయాణముచేయు భాగ్యము కలుగనున్నందుకు మేమెంతయు నానందించుచున్నాము. మీరు మాతో కలసి భోజనము చేయవలయునని ప్రార్థించుచున్నాము."

గౌరవనీయుడు నా భార్యా బిడ్డల కోరికను మన్నించెను. మే మందఱము కలసియే భోజనముచేసితిమి. ఆసమయమున నతడు చక్కగా మాట్లాడసాగెను. అతని సంభాషణ వీనులకు విందుగనుండెను. నే నతనివద్దనుండి ఎన్నో క్రొత్తవిషయములను తెలిసికొనగలిగితిని. నేను మా సంభాషణము నింకను పొడిగింప దలచితినిగాని, అప్పటికే చాల ప్రొద్దుపోయెను. నడచి నడచి యున్న మాకు నిదుర అత్యావశ్యకమైయుండెను. అందువలన మే మింక సంభాషణకు స్వస్తివాక్యముపలికి నిదురింపబోతిమి. అనతికాలములో మేము గాఢ నిదుర మునిగితిమి.

మఱునాటి యుదయమున మే మందఱము నిదురనుండి లేచితిమి. కాలకృత్యములు తీర్చుకొని, అల్పాహారము సేవించితిమి. తదుపరి ప్రయాణము ప్రారంభించితిమి. మా కుటుంబము

వారము గుఱ్ఱములపై ప్రయాణము చేయుచుంటిమి. కడచిన రాత్రి మాకు పరిచయుడైన గౌరవనీయుడు - అతని పేరు బర్చెల్ - నడచి రాసాగెను. "మీ గుఱ్ఱములు మంచివికావు. మిమ్ము విడచి ముందుపోవుట నా కేమాత్రము సమ్మతముకాదు. అందు వలన నేను నడచియే మీతో పాటు వత్తును" అని అతడు మంద హాసముచేయుచు ననెను.

వరద లింకను తగ్గనందున మేము ఒక దారిచూపువానిని ఏర్పాటుచేసికొంటిమి. అతడు మా అందఱికంటె ముందు గుఱ్ఱముపై ప్రయాణము చేయసాగెను. నేను, మా మిత్రుడు బర్చెల్ అందరికంటె వెనుకనుంటిమి. ప్రయాణము అలసటగనే యుండెను. కాని నేను నా మిత్రుడు తాత్విక చర్చలలో మునిగి అలసట నేమాత్రము లెక్కచేయకుంటిమి. అతనికి తాత్విక విషయములు బాగుగ తెలియునని నేను అర్థముచేసికొంటిని. కాని ఒక్క విషయముమాత్రము నాకు అపరిమితమగు ఆశ్చర్య మును కలుగజేయసాగెను. అతడు నావద్దనుండి డబ్బు అప్పుగా తీసికొనెను. అనగా నే నతనికి ఋణదాతను. కాని అతడు తానే ఋణదాతవలె, నన్ను పోషించుచున్నవానివలె తన అభిప్రాయము లను గట్టిగా సమర్థించుకొనసాగెను. ఒక్క అంగుళమైనను వెనుకకు తగ్గకుండెను. అత డప్పుడప్పుడు ఆయా ప్రాంతమందలి భూములు, భవనములు ఎవ్వరికి చెందినవో కూడ చెప్పసాగెను.

కొంతదూరముననున్న ఒక మనోహర భవనమును జూపుచు అతడిట్లు చెప్పెను: "ఆ విశాలభవనము తార్న్‌హిల్ అను గౌరవనీయునకు చెందినదై యున్నది. అతడొక యువకుడు; మంచి భాగ్యవంతుడు. కాని అతని సిరిసంపదలన్నియు సంపూర్ణ

ముగ నతని పినతండ్రియగు సర్ విలియమ్ తార్న్‌హిల్ పై నాధారపడియున్నవి. ఆ మహనీయుడు తన స్వంత ముఖమును కొద్దిమొత్తముఖర్చుపెట్టుటతోనే సంతృప్తిచెందుచున్నాడు. మిగిలిన దానినంతయు సోదరుని కుమారునకే ఇచ్చుచున్నాడు. అతడు ఎక్కువకాలము పట్టణములోనే గడపును."

నా మిత్రుని మాటలను విని నే నిట్లంటిని: "ఏమేమి! నాకు యజమానుడు కాబోవుచున్న తార్న్‌హిల్ ప్రసిద్ధిగాంచిన సర్ విలియం తార్న్‌హిల్ సోదరుని కుమారుడేనా! ఆ మహనీయుడు సుగుణాలరాశియని ప్రఖ్యాతిగాంచియున్నాడు. ఆయన ఔదార్య మందఱకు బాగుగ తెలియును. ఆయన సాహాయ్యమును పొందనివా రెవ్వరును నుండరని అందఱును చెప్పుకొనుచుందురు."

"అవునవును" అని నా మిత్రుడు చెప్పసాగెను: "చిన్నప్పుడతడు గొప్ప సైనికుడనిపించుకొనవలయుననియు, గొప్ప పండితుడనిపించుకోవలయు ననియు ప్రయత్నించినాడు. సైనిక దళములో జేరి అనతికాలములో ప్రసిద్ధి గాంచెను. పలువురు పండితుల మెప్పును పొందెను. ముఖ స్తుతి చేయువారు పలువురతని చుట్టును జేరసాగిరి. అతనికి వారి నిజస్వరూపము అర్థముకాలేదు. అతడు వారి గుణగణములలోని ఒక వైపును మాత్రమే చూడగలుగు చుండెను. అతడు మానవజాతి నంతను ప్రేమింపసాగెను. మానవులలో మంచి వారితో బాటు దుర్మార్గులు గూడ నున్నారను నగ్నసత్యము నతడు గ్రహింపలేకపోయెను. అందుల కతని సంపదయే కారణము.

ఇతరుల బాధలు—అవి నిజమైనవైనను, కల్పితమైన

వైనను—అతని మనస్సును అపరిమితముగా బాధపెట్టుచుండె డివి. వెంటనే అతడు తనకు చేతనైనంతవఱకు సాహాయ్యము చేయుచుండెడివాడు. క్రమక్రమముగా అతని సాహాయ్యమును పొందువారి సంఖ్య వృద్ధిపొందసాగెను. వారి సంఖ్య హెచ్చు చున్న కొలది అతని సంపద తగ్గిపోసాగెను. కాని అతని మంచి స్వభావము మాత్రము తగ్గకుండెను. పైగా అతని సంపద తగ్గు చున్న కొలది మంచి స్వభావము హెచ్చుచుండెను. అతని మాటలు గొప్ప లోకజ్ఞానము కలవారి మాటలవలెనుండెడివి. కాని అతని చేతలు మాత్రమందుకు సంపూర్ణ వ్యతిరేకముగ నుండెడివి. సంపద తగ్గిపోయినను అతని సాహాయ్యమును కోరు వారి సంఖ్య మాత్రము ఏ మాత్రము తగ్గలేదు. అతడు వారి కదివఱకువలె సాహాయ్యము చేయలేకపోవుచుండెను. అతడు వారికి ధనము నిచ్చుటకు బదులుగా వాగ్దానములు చేయ సాగెను. ఇంక నతడీయ గలిగినవి వాగ్దానములు మాత్రమే. అవి శుష్క వాగ్దానములు. 'లేదు' అని యని ఇతరులకు బాధ కలిగించుట కతడు ఏ మాత్ర మిష్టపడకుండెను, ఆమాట యను టకు కావలసిన మనోబలము అతనికి లేకుండెను. దాని ఫలిత ముగ అతని చుట్టును సాహాయ్యము నర్థించువారు గుమిగూడు చుండిరి. వారి కాశాభంగము కలిగించుట అతని కేమాత్రము ఇష్టములేదు. కాని వారికి మిగులునది ఆశాభంగము మాత్రమే.

అందువలన నతని చుట్టును జేరినవారు క్రమక్రమముగ వెళ్ళిపోసాగిరి. వారు ప్రశాంతముగ వెడలిపోయెడి వారు కారు. వారతనిని సహస్ర విధముల ద్వేషించి, దూషించి నిష్క్రమించు చుండెడివారు. అప్పుడతనికి క్రమక్రమముగా అసలు విషయ

ములు అర్థము కాసాగెను. ఇక నతడు జాగ్రత్త పడనలచెను. పోయిన ధనము నంతను తిరిగి సంపాదించుకొనుట కతడొక చక్కని ప్రణాళికను వేసికొనెను. ఆ ప్రణాళిక నమలులో పెట్టుట కతడు పాదచారియై యూరపు ఖండములో సంచారము చేసెను. అతడు ఎప్పటివలె భాగ్యవంతుడయ్యెను. అతని కిప్పుడు సరిగా ముప్పది సంవత్సరములైనను నిండలేదు. అతడు ఇంకను దానధర్మములు చేయుచున్నాడు. కాని యిదివరకు వలెగాక మితముగను, మంచి చెడ్డలను గమనించియు చేయు చున్నాడు. ఒకసారి దెబ్బ తిన్నవాడు మరల పూర్వమువలె ప్రవర్తింపడు గదా!"

నేను అతడు చెప్పుచున్న విషయమును వినుటలో పూర్తిగా నిమగ్నుడనై యుంటిని. నేను ముందుపోవుచున్న నాకుటుంబము వారి వంకకు చూచుటయే లేదు. అంతలో నా కుటుంబము వారు అపరిమితమగు భయముతో పెట్టిన కేకలు వినబడెను. నేను అప్పుడు వారివంకకు చూచితిని. హృదయ విదారకమగు దృశ్యము నాకంట బడెను. గుఱ్ఱముపై ప్రయాణము చేయు చున్న నారెండవ కొమార్త సోఫియా గుఱ్ఱముపై లేదు. ఆమె వడిగా ప్రవహించుచున్న ప్రవాహముమధ్య పడిపోయెను. ప్రవాహముతో బాటు కొట్టుకొనిపోకుండ నుండుటకామె శతవిధముల ప్రయత్నించు చుండెను. ఆమె ప్రవాహములో రెండుసార్లు మునిగి తేలెను. ఆమెను రక్షింపవలెనను భావముకలిగెను కాని నాకు కాళ్ళాడకుండెను. నేను ఏమియు చేయలేని పరిస్థితిలో నుంటిని. ఆలోచనను ఆచరణలో పెట్టుట నా కణుమాత్రమైనను

సాధ్యము కాకుండెను. అటువంటి పరిస్థితిలో నాభార్య నీట మునిగి మరణించి యుండెడిదే.

కాని అదృష్టవశమున నామిత్రుడు వెంటనే పరుగెత్తుకొనిపోయి కడుధైర్య సాహసములతో ప్రవాహములోనికి దుమికెను. అతడెంతో కష్టముమీద నీటమునుగనున్న నాభార్యను పైకెత్తి పట్టుకొని సురక్షితముగ ఆవలిగట్టుకు తీసికొనిపోయెను. తరువాత మిగిలిన వారందఱము ప్రవాహమువడిగా లేని చోటుకు పోయి, దాటి, ఆవలిగట్టుకు చేరుకొంటిమి. అచ్చట మేము, నాభార్యతోబాటు, నామిత్రుడకు అపరిమితమగు కృతజ్ఞతను తెలిపితిమి.

నాభార్య కృతజ్ఞతను ఇచ్చట వర్ణింప బూనుటకంటె, ఊహించుటయే సులభము. ఆమె అతనికి తన కృతజ్ఞతను మాటలతోకంటె చూపులతో నెక్కువగా తెలియజేసెను; ఇంకను అతని సాహాయ్యమును స్వీకరించుట కిచ్ఛగించు చున్న దానివలె అతనిచేతిపై ఆనుకొనసాగెను. "అయ్యా! మీరు నాభార్యకు అపారమగు సాహాయ్యము చేసినారు. నాభార్యకు ప్రాణదానముచేసినారు. ఇంతకు మేము మీకెంతయు కృతజ్ఞులము. ఎప్పుడో ఒకప్పుడు మిమ్ము మాయింటివద్ద గౌరవించి సంతోషించు నవకాశము లభించునని మేమందఱము తలంచు చున్నాము" అని నాభార్య యనెను.

మఱికొంతదూరము పోయినతరువాత మేమందఱము ఒకపుంటకూళ్ళయింటివద్ద నాగితిమి. కొంచెముసేపు సేదతీర్చుకొన్న తరువాత అందఱముకలసి భోజనము చేసితిమి. అక్కడనుండి మామిత్రుడు మఱియొక వంకకు పోవలసి యుండెను.

అందువలన నతడు మాఅందఱివద్ద సెలవుతీసుకొని తన దారిని పోయెను. అటుపిమ్మట మేమందఱము మాదారిని పోసాగితిమి. త్రోవలో నాభార్య నాతో నిట్లన సాగెను: "మీ మిత్రుడు నాకు బాగుగ నచ్చినాడు. నా కతడనిన ఎంతయు నిష్టముగానున్నది. అతడు సద్వంశమున జనించి మంచి సంపదకలిగియున్నవాడైనచో మనతో సంబంధము చేసికొనుటకెట్టి యభ్యంతరమును నుండ రాదు. అతడు మన కుటుంబములో నొకడు కావచ్చును. నాకొమార్తె కింతకంటె మంచిభర్త మఱియొకడు దొరకడని నేను నిశ్చయముగ చెప్పగలను. ఆమె మాటలధోరణి ఇంకను నట్లే యుండెను. నే నా మాటలను వినుచు మందహాసముచేయుచు సాగితిని. ఆమె మాటలు నాకంతగా అయిష్టమును కలిగింపలేదు. అవి నిరపాయకరమైనవి. మాకుటుంబము వారికవి ఎక్కువ సంతోషమును కలుగజేయ గలిగినచో నాకుగూడ సంతోషము కలిగినట్లే.

4

ఎట్టకేలకు మేము మా గృహస్థానము చేరుకొంటిమి. ఆ ప్రాంతమున నివసించుచున్నవారందరును వ్యవసాయదారులే. వారు తమతమ భూములను దున్నుకొనుచు జీవించుచుండిరి. వారు బీదరికమననేమో ఎరుగరు; అట్లే సంపదలననేమోకూడ నెరుగరు. వారికి కావలసిన సౌఖ్యములన్నియు ఆ ప్రాంతము లోనే గలవు. వారి కోరికలసంఖ్య గూడ స్వల్పమే. అందువలన అవసరమగు కోరికలను తీర్చుకొనుటకు చిన్న పట్టణమునకు

గాని, పెద్దపట్టణమునకుగాని వెళ్ళవలసిన అవసరమేమియు యుండెడిది కాదు. వారు నిరాడంబర జీవనులు; సహజముగ పొదుపరులు. అందువలన నిగ్రహమొక సుగుణమను సంగతి వారికి తెలియనే తెలియదు. పనిదినములలో వారు అపరిమిత మగు సంతోషముతో కష్టపడి పనిచేయుచుండెడివారు. పండుగు దినములలో పని ఏమియు చేసెడివారుకారు; కులాసాగా కాలము గడుపుచుండెడివారు. క్రిస్మస్ వేడుకలలోను, తదితర వేడుకలలోను వారు మునిగి తేలుచుండెడివారు.

నేమచ్చుటకు వచ్చుచున్న విషయము వారికందరకు చాల ముందుగనే తెలిసెను. అందువలన నన్ను, నాకుటుంబము వారిని ఆహ్వానించుటకై వారందరును ఎదురువచ్చిరి. ఆ సందర్భమున వారు తమకున్న వస్త్రములలోకెల్ల శ్రేష్ఠమైన వానిని ధరించిరి; మంచి వాద్యములతో వారు మాకు స్వాగత మొసగి గ్రామంలోనికి తీసుకొనిపోయిరి. వారు మాకొరకొక విందునుగూడ ఏర్పాటుచేసియుండిరి నేము మితిలేని సంతోష ముతో ఆ విందులో కూర్చుంటిమి. ఆ సందర్భమున జరిగిన సంభా షణలో గ్రామస్థులు గొప్ప తెలివితేటలను ప్రదర్శింపలేదన్నమాట నిజమే. కాని ఆలోటు నవ్వులాటలతో తీరిపోయెను.

విందుముగిసిన తరువాత నేము మా కొరకు నిర్ణయింప బడిన గృహములో ప్రవేశించితిమి. అయ్యది ఒక చిన్న గృహము. అది ఏటవాలుగనున్న యొక కొండ దిగువభాగమున నుండెను. ఇంటికి వెనుకభాగమున చక్కని పొదలుండెను. ముందుభాగమున గలగలమని ధ్వనిచేయుచున్న ప్రవాహ మొకటియుండెను. ఒకవంక చక్కని పచ్చిక మైదానముండెను,

మఱియొకప్రక్క పచ్చని పొలములుండెను. నేను వ్యవసాయము చేసికొనుటకు ఇరువది ఎకరముల సారవంతమైన భూమియుండెను. దానిని నేను నా ముందు పనిచేసినవానికి నూఱురూపాయల ధనము నొసగి తీసికొంటిని.

మా యింటిచుట్టును ఖాళీస్థలముండెను. ఆ ఖాళీస్థలము చుట్టును చక్కని చెట్లుండెను. ఆ దృశ్యము చూచుట కెంతయు అందముగ నుండెను. ఆ ప్రదేశమంతయు చాల పరిశుభ్రముగ నుండెను. మా యింటి పైభాగము గడ్డితో కప్పబడియుండెను. అది చూచుట కెంతయు సొగసుగనుండెను. లోపలి గోడలు చక్కగా వెల్ల వేయబడియుండెను. నా కొమార్తెలా గోడలను తమకు నచ్చిన పటములతో కన్నులపండుగుగ నలంకరించిరి. ఆ పటముల మూలమున గోడలకు అపూర్వమగు అందమువచ్చెను. మే మొక గదిని వంటగదిగాను, చావడిగాను ఏర్పాటు చేసికొంటిమి. అందువలన నది వెచ్చగానుండుటకు వీలుకలిగెను. అదిగాక మఱి మూడుగదులుండెను. ఒకగదిని నాకు, నా భార్యకు ప్రత్యేకించుకొంటిమి. రెండవగదిని నా యిరువురు కొమార్తెలకు ఇచ్చితిమి. మూడవగదినిమిగిలిన పిల్లలకిచ్చితిమి.

ఆ గృహము మా స్వతంత్ర రాజ్యము. దానికి సంబంధించిన చట్టములను నేను నిర్ణయించితిని. సూర్యోదయ మగు నప్పటికి మేమందరము ఉమ్మడి గదిలో సమావేశ మగుదుము, నౌకరు అంతకు ముందే ఆగదిలో కుంపటివెలిగించి యుండును. మొట్టమొదలు కలసికోగానే మే మందఱము ఒకరి నొకరము మర్యాదపూర్వకముగ పలుకరించు కొందుము. తరువాత సకల లోకరక్షకుడగు భగవానునకు నమస్కరింతుము. ఆ పని పూర్తి

యైన పిదప నేను, నా కుమారుడు బయటకుపోయి పనులు చూచుకొందుము. నా భార్య, కొమార్తలు ఉదయకాలపు భోజనమును తయారు చేయుటలో నిమగ్నులై యుందురు. అందుకు సుమారొక అరగంట కాలము సరిపోవును. మధ్యాహ్నపు భోజనమును తయారు చేయుటకు సుమారొక గంట కాలము సరిపోవును.

మేము సూర్యునితో బాటు లేచెడివారము. కనుక సూర్యుడస్తమించిన తరువాత బయట ఏ పనులు చేసెడివారము కాము. బయట నున్నవారము ఇంటికి తిరిగివచ్చెడి వారము. మమ్ము ఇంటిలోనివారు సాదరముగ ఆహ్వానించెడివారు. మేము హెచ్చగా నుండుటకై కుంపటి మున్నగునవి అన్నియు సిద్ధముగా నుండెడివి. ఆ సందర్భమున మా యింటి అతిధులుకూడ నుండెడివారు. ఒక్కొక్కప్పుడు మా పొరుగుననే యున్న వ్యవసాయదారుడు స్లామ్‌బరో వచ్చెడివాడు; అతడు మాటలన్నా చెవికోసి కొనుచుండును. తఱచుగా గ్రుడ్డి పాటకుడొకడు వచ్చెడివాడు, వాడు మా యింటగల మంచిసారాయమును సేవించుచుండెడివాడు. ఆ సారాయమును తయారుచేయుటలో మాకుగల పేరు ప్రతిష్టను మేము పోగొట్టుకొని యుండలేదు. పరుండ బోవుటకుముందు మేమందఱము దేవుని ప్రార్ధించెడివారము.

ఇక ఆదివారమునాటి సంగతిని ప్రత్యేకముగ చెప్పవలసి యున్నది. డాంబికము పనికిరాదని నేనెంతగా బోధించినను అది మాయింబనేదో యొకవిధముగా ప్రత్యక్షమగుచునే యుండెడిది. గర్వము పనికి రాదను విషయమునుగూర్చి నేనిచ్చిన యుప

న్యాసములు నా కొమార్తెలపై పూర్తిగ పనిచేసినదని నేను అనుకొనుచుండెడివాడను. కానివారు రహస్యముగ డాంబికపు వస్తువులను ప్రేమించుచునే యుండిరని తెలిసికొంటిని. వారింకను లేసులు, రిబ్బన్లు మొదలగు వస్తువులను ప్రేమించుచునే యుండిరి. నా భార్య విషయము కూడ అదేవిధముగా నుండెను.

ముఖ్యముగా మొదటి ఆదివారమునాటి వారి ప్రవర్తన నాకు అవమానమును కలుగజేసెను. "రేపటి యుదయమున మీరు పెందలకడనేలేచి దుస్తులు వేసికొని చర్చికి పోవుటకు సిద్ధముగా నుండవలయును" అని శనివారమునాటి రాత్రి నేను నా కొమార్తెలకు చెప్పియుంటిని. గ్రామస్థు లందరికంటె ముందుగనే చర్చికి పోవుట యనిన నాకెంతయునిష్టము. ఆ యుద్దేశ్యముతోనే నేను వారికావిధముగ చెప్పితిని సరిగా అనుకొన్న వేళకు అందఱును సిద్ధముగ నుండిరి. కాని అప్పటికి వారి వేషమును ఏమని వర్ణించి చెప్పుదును? నా భార్య, కొమార్తెలు పూర్వమువలె వైభవముగ అలంకరించుకొనియుండిరి. జుట్టు, మొగము, దుస్తులు మున్నగునవి అన్నియు డాబుసరిగ నుండెను. వారిడాంబికమును చూచి నేను నవ్వకుండ నుండలేకపోతిని. ముఖ్యముగా నా భార్య డాంబికము నాకు అపరిమితమగు ఆశ్చర్యమును కలుగజేసెను. ఏలయన ఆమెయైనను కొంచెము విచక్షణా జ్ఞానము నుపయోగించునని నేను తలచి యుంటిని; ఆ విషయమున నాకు ఆశాభంగము కలిగెను. మఱి యింక నేనప్పుడు చేయవలసినది ఏమియున్నది? నేను సమయస్ఫూర్తితో నా కొమరుడు మోజెస్‌తో నిట్లంటిని: "అబ్బాయి! నీవు వెంటనేపోయి మన గుఱ్ఱపు బగ్గీని

తీసికొని రమ్ము." ఆ మాటలను విని నా కొమార్తె లిరువురును ఆశ్చర్య మగ్నమానసులైరి. కాని నేనిదివఱకు కంటె నెక్కువ గంభీరముగ మఱియొకసారి అంటిని.

అంతట నా భార్య ఇట్లనెను: "మీ రావిధముగ హాస్యము కనుచున్నారనుటలో సందేహమేమియు లేదు. మేము చర్చికి సులభముగా నడచి పోగలము. గుఱ్ఱపు బండిపై పోవలసిన పని ఏమియు లేదు."

కాని నేనిట్లంటిని: "నేను హాస్యమునకు మాట్లాడుట లేదు. నడచిపోగల మనుటలో నీవు పొరపడుచున్నావు. మన కెప్పుడును తప్పక గుఱ్ఱపు బండి కావలయును. ఏలయన మీరీ వేషముతో నడచి పోయినచో గ్రామములోని పిల్లలందఱును మీ వెంటపడి ఎగతాళి చేయుచు కేకలు పెట్టుదురు. ఆ అవమానమును తప్పించుకొనవలయు నన్నచో గుఱ్ఱపు బండిలో పోవుటయే శరణ్యము. నేను జరుగవలసిన విషయమునే చెప్పినాను."

"మీ పిల్లలు ఎప్పుడును పరిశుభ్రముగను, అందముగను నుండవలయునని మీరు కోరుకొనుచుందురని నేను ఎప్పుడును అనుకొను చుండెడి దానను. నేనటు లనుకొనుటలో పొరపడినానని తోచుచున్నది" అని నా భార్య అనెను.

"నీవు పొరపడలేదు. నీ అభిప్రాయము సరియైనదే. నా పిల్ల లెప్పుడును పరిశుభ్రముగ నుండవలెననియే నేను కోరుకొనుచుందును. మీరందఱును మీ యిచ్చవచ్చినంత పరిశుభ్రముగా నుండవచ్చును. అందుకు నేను మిమ్మెంతయు ప్రేమింతును. కాని యిది యంతయు పరిశుభ్రత కాదు; నిష్ప్రయోజన

మైన వేషధారణ. మీ యీ జుట్టు, కట్టు మున్నగువానిని చూచి ఇచ్చటి స్త్రీ లందఱును మిమ్ము తీవ్రముగ ద్వేషింప మొదలిడుదురు" అని నేనంటిని. ఆ విషయమును గూర్చి నే నింకను నా కొమార్తలకు వివరించి చెప్పితిని.

నా ఆక్షేపణము సత్ఫలితమునే కలుగజేసెను. నాభార్య, కొమార్తలు వెంటనే ఆ ప్రదేశమునుండి వెళ్ళిపోయిరి. అనతి కాలములో వారు నా వద్దకు తిరిగి వచ్చిరి. అప్పుడు వారు మామూలు వస్త్రములను ధరించి, సామాన్య వనితలవలె నుండిరి. అది నాకెంతయు సంతోషమును కలుగజేసెను. తరువాత మేము చర్చికిపోతిమి. మఱునాడు నా కొమార్తలు డాబుసరిగానున్న తమ గౌనులను కత్తిరించి బీదవాండ్రకు పనికి వచ్చునట్లు తయారుచేసి పంచిపెట్టిరి. ఆ పనికూడ నా కెంతయు సంతృప్తిని కలుగజేసెను.

## 5

నాకు ముందు పనిచేసిన మతోద్యోగి మా యింటికి కొలది దూరములో కూర్చుండుటకు వీలుగా నుండు పీఠమునొక దానిని ఏర్పాటుచేసియుండెను. ఆపీఠమ్ముపైకి చక్కని వృక్షముల నీడవచ్చుచుండెను. వాతావరణము అనుకూలముగా నున్నప్పుడు, పనియంతయు పూర్తిచేసికొన్న తరువాత, సాయంకాల సమయములందు మే మందఱ మచ్చట కలసి కూర్చుండెడి వారము. ఆ ప్రశాంత సమయములందు మేమచ్చటి ప్రకృతి దృశ్యములనుచూచి ఆనందించెడి వారము. అచ్చట కూర్చుండి

నేము తేనీటిని సేవించు చుండెడి వారము. ఇటీవల నేము తేనీటిని అరుదుగా సేవించుచున్నాము. అందువలన తేనీటిని సేవించుట చాల సంతోషకరమైన విషయముగా నుండెను. దానికి కావలసిన ఏర్పాట్లన్నిటిని నేము ఎంతో ఉత్సాహముతో చేయుచుండెడి వారము. పీఠమువద్ద కూర్చున్నపుడు మాపిల్లలు ఆటలు, పాటలు మున్నగు కార్యక్రమములలో పాల్గొనెడివారు. నేను, నాభార్య కలసి చక్కని పుష్పములతో నిండియున్న తోపులకు పోయెడి వారము. మాపిల్లలనుగూర్చి ఎంతో ఆనందముతో మాట్లాడుకొను చుండెడివారము. పూలమీదనుండి వచ్చెడిగాలి మాకు చక్కని ఆరోగ్యము నొసగెడిది.

జీవితములో మనము ఎన్నో ప్రత్యేక పరిస్థితులను ఎదుర్కొనుచుందుము. ప్రతి పరిస్థితియు మనకు ఆనందము చేకూర్చుచుండును. దానిని మనము అర్థముచేసికొని జీవితము ననుభవించుటలోనే సొగసంతయు నున్నది. నే మావిధముగానే సౌఖ్యముల ననుభవించెడివారము. ప్రతిదినము ఉదయమున నిదురనుండి లేవగనే నేము మామూలు పనులు చేసికోవలసి వచ్చెడిది; కాని సాయంకాలమైనతరువాత నేము సంపూర్ణమగు స్వేచ్ఛ ననుభవించెడి వారము.

ఆకురాలుకాలము ప్రారంభమయ్యెను. ఒకనాడు మా కుటుంబము వారమందఱము మామూలుగా నేముపోవుచుండెడి పీఠమువద్దకుపోయి కూర్చుంటిమి. అంతట నాకొమార్తె లిరువురును ఎప్పటి అలవాటు ప్రకారము పాటలుపాడుట ప్రారంభించిరి. మిగిలిన వారము ఆపాటలువిని ఆనందింపసాగితిమి.

అంతలో సచ్చాటకు జింకయొకటి వచ్చెను. అది మాకు

సుమారు ఇరువది అంగల దూరములో పోవుచుండెను. అది బాగుగ ఒగర్చుచుండెను. దానిని బట్టి వేటగాండ్రు కొందఱు దానిని తఱుముకొని వచ్చుచున్నారని మేము అరము చేసి కొంటిమి. దాని దుర్గతినిగూర్చి ఆలోచించుటకు మాకు ఎంతో కాలము లేకుండెను. ఏలయన అనతికాలములో జింక పరుగెత్తు కొని వచ్చినదారినే కొన్ని వేటకుక్కలుకూడ పరుగెత్తుకొని వచ్చుచున్న దృశ్యమును చూచితిమి. ఇంకను వెనుక కొందఱు గుఱ్ఱపురౌతులు వచ్చుచుండిరి. వెంటనే మేమందఱము ఇంటికి తిరిగిపోవుట శ్రేయస్కరమని నేను తలచితిని. కాని నాభార్య కొమార్తెలు ఆప్రదేశమును వీడిపోవుట కేమాత్రము ఇచ్చగింప కుండిరి. అందుకు వారిమనస్సులోని అభిప్రాయమేమో నాకే మాత్రము తెలియకుండెను. కొందఱు వేటగాండ్రు మాముందు నుండియే కడువేగముగా పోయిరి. తరువాత నలుగు రైదుగురు మనుజులుగూడ కడువేగముగ వెళ్ళిరి.

ఎట్టకేలకు ఒకగౌరవనీయుడు వచ్చెను. అతని ఆకారము వేషము ముందుపోయిన వారికంటె భిన్నముగ నుండెను. అతడు కొంచెముసేపు మమ్ము చూచెను. అతడు మిగిలినవారితో బాటు పోకుండ ఆగిపోయెను. తన గుఱ్ఱము నొకనౌకరుకిచ్చెను. పిమ్మట నతడు ఎంతో గొప్పవానివలె అడుగులు వేసికొనుచు మమ్ము సమీపించెను. అతని ముఖములో, "మీరందఱు నాకంటె చాల తక్కువవారు" అను అభిప్రాయము స్పష్టముగా గోచరించు చుండెను.

అతడు తా నెవ్వరో మాకు చెప్పలేదు. మే మతనిని తప్పక గౌరవభావముతో ఆదరింతుమని అతడు నమ్ముచుండెను

కాబోలు ! అందువలననే అతడు తానెవ్వరో చెప్పకుండగనే నా కొమార్తలకు నమస్కరింపబోయెను. కాని యితరుల ముఖము లోని అహంకారమును గుర్తించుట నా కొమార్తలకు బాగుగ తెలియును. ఆ విషయమును వారు తమ ముఖములలో ప్రస్ఫుటము చేసిరి. అందువలన నతడు ఇట్లనియెను : "నన్నందఱును తార్న్‌హిల్ అని పిలుచుచుందురు. ఈ ప్రాంతపు భూము లన్నియు నావే. నే నిచ్చట సర్వాధికారిని." పిమ్మట నతడు మరల నా కొమార్తలకు నమస్కరింపబోయెను. ఈసారి వారతని తిరస్కారభావముతో చూడలేదు. అతడు ధరించిన విలువైన దుస్తులు, అతడా ప్రాంతమునకంతకు స్వంతదారుడన్న వార్త వారిని సంపూర్ణముగా వశముచేసికొనెను. వారతనిని సాదరముగ నాహ్వానించిరి. అనతికాలములోనే మేమందఱము కూర్చుండి మాట్లాడుకోసాగితిమి.

తార్న్‌హిల్ మావద్దనున్న సంగీత సాధనములను చూచెను. అంతట నతడు నా కొమార్తలతో నిట్లనెను : "మీరొక పాటపాడి నన్ను సంతోషపెట్టవలయునని కోరుచున్నాను." నా కొమార్త లావిధముగ చేయుట నాకేమాత్ర మిష్టములేదు. తార్న్‌హిల్ పెద్ద భూస్వామి; మేము సామాన్యులము. అంత గొప్పవానితో నా కొమార్త లా విధముగ పరిచయముచేసికొనుటను నేను ఏమాత్రము హర్షింపలేకుంటిని. అందువలన నేను నా కొమార్తలవంక చూచి, "మీ రతని కోరికను మన్నింపవలదు"అను నర్థమువచ్చునటుల సంజ్ఞచేసితిని. కాని నా భార్య వారివంకకుచూచి, "మీ రతని కోరికను వెంటనే మన్నింపుడు" అను నర్థమువచ్చునట్లు సంజ్ఞచేసెను. నా

కొమార్తలకు తన తల్లి అభిప్రాయమును నచ్చెను. అందువలన వారు ఎంతో సంతోషముతో డ్రైడెన్ రచించిన చక్కని పాట నొకదానిని కడు మనోహరముగపాడిరి. ఆ పాట నెన్నుకొన్నందుకు, దానిని చెప్పుచు విందుగ పాడినందుకు తార్న్‌హిల్ నా కొమార్తెలను పరిపరివిధముల ప్రశంసించెను.

పిమ్మట తార్న్‌హిల్ ఒక సంగీత సాధనమును తీసికొని మీటసాగెను. అత డా పనిని ఉపేక్షాభావముతో కడు సామాన్యముగచేసెను. అయినను నా పెద్దకొమార్తె అతనిని వట్టిత సహా ప్రశంసించెను. "మా గురువుగారికంటెగూడ బాగుగ వాయించినారు" అనికూడ నామె అనెను. తార్న్‌హిల్ ఆ మాటలనువిని వినయ ముట్టిపడునట్లు తలవంచెను. నా పెద్ద కొమార్తె అందుకు మర్యాదపూర్వకముగ ప్రత్యుత్తర మిచ్చెను. ఒకరి నొకరు కడురమ్యముగ ప్రశంసించుకొనిరి. నా భార్యకది యెంతయు సంతోష కారణముగ నుండెను. "మీరు మాకు యజమానులు. మీ రొకసారి మా యింటికి విచ్చేసి పావనము చేయవలయును. ప్రసిద్ధిచెందిన మాయింటి సారాయమును రుచిచూడవలయును" అని నా భార్య తార్న్‌హిల్‌ను ఆహ్వానించెను.

ఇన్ని మాట లెందులకు ? నా కుటుంబములోని వారందరును తార్న్‌హిల్‌ను సంతోషపెట్టవలయునని ప్రయత్నించుచున్నట్లేయుండెను. తాము ఆధునికములనుకొన్న విషయములనుగూర్చి నా కొమార్తలు మాట్లాడిరి. మఱి నా కొమారుడు మోజెస్ మాత్రము ప్రాచీనులకు సంబంధించినవిషయము

లనుగూర్చి ఒకటిరెండు ప్రశ్నలువేసెను. అప్పు డందఱును నవ్విరి. ఆ నవ్వు మోజెస్‌కు ఎనలేని సంతృప్తినిచేకూర్చెను. నా చిన్న పిల్లలుకూడ ఊరకుండలేదు. వారు తార్న్‌హిల్‌కు దగ్గఱగా పోయిరి. వారి దూరముగా తొలగునట్లు చేయుటకు నేను విశ్వప్రయత్నము చేసితిని, కానీ లాభమేమియు లేక పోయెను. వారు తమ మురికి చేతులతో తార్న్‌హిల్ దుస్తులను పట్టుకొని చూడసాగిరి. మఱియు అతని జేబులలో నేమియున్నవో చూచుటకుగూడ ప్రయత్నింపసాగిరి. ఇంక కొంచెము సేపటికి చీకటి పడుననగా నతడు మావద్ద సెలవు తీసికొనెను. అంతకు ముందతడు నాతో నిట్లనియెను. "మిమ్ము మఱి యొకసారి దర్శించుటకు మీరు నాకు అనుమతి యొసగవలయును". మఱి యతడు మాకు యజమానుడు. అందువలన నేనతని కోరికకు అంగీకారమును దెలిపితిని. అంతట నతడా ప్రదేశమును వీడి పోయెను.

తార్న్‌హిల్ వెళ్ళిపోయిన తరువాత నాభార్య మా అందఱితో ఒక సమావేశము నేర్పాటుచేసెను. ఆనాడు జరిగిన విషయములను గూర్చి మేము చర్చింపబూనితిమి. ఆ సందర్భమున నా భార్య యిట్లనెను. "నేడు చాల సుదినము. మనము నిజముగా అదృష్టవంతులము. అందువలననే నేడు మనకు తార్న్‌హిల్‌తో పరిచయ భాగ్యము లభించినది. మనకు పూర్వపు గొప్ప దినములు తిరిగి రానున్నవని నేను గట్టిగా నమ్ముచున్నాను ఇందుకు సందేహ మేమియులేదు. నా కొమార్తెలుగూడ గొప్పవారినే వివాహమాడుదురు. రింకిల్ కొమార్తె లిరువురును గొప్పవారిని వివాహ మాడుటకును, నా కొమార్తె

లిరువురును గొప్ప వారిని వివాహమాడకుండుటకును కారణ మేమియు కనబడుట లేదు."

నాభార్య నన్నే విమర్శించుచున్నదను విషయము నాకు బాగుగ తెలియును. అందువలన నేనిట్లంటిని: "అవును, నాకు గూడ కారణ మేమియు కనబడుట లేదు. సిమ్కిన్సుకు లాటరీలో పదివేల పౌనుల బహుమానము వచ్చుటకును, మనము వెఱ్ఱి మొగము వేసికొని కూర్చుండవలసి వచ్చుటకునుగూడ కారణము కనబడుట లేదు."

"మీరెప్పుడును ఇదే విధముగ మాట్లాడుచుందురు. ఇందుకు నా తీవ్రమగు అసమ్మతిని తెలియజేయుచున్నాను. నేను నా కొమార్తెలు మంచి ఉత్సాహముగ నున్నప్పుడు మీరు మా యుత్సాహము నణచి వేయుచుందురు. ఇది ఏ మాత్రమును వాంఛనీయమైన విషయము కాదు" అని ఆమె నన్ను ప్రతిఘటించెను. పిమ్మట నామె మా రెండవ కూతురు సోఫియాతో నిట్లనెను: "అమ్మాయి, సోఫీ! నేడిచ్చటకు వచ్చిన గౌరవనీయుని గూర్చి నీ అభిప్రాయమేమి? అతడు మంచి స్వభావము కలవానివలె కనబడుట లేదా?"

అప్పుడు సోఫియా ఇట్లు సమాధానమిచ్చెను: "అమ్మా! అతనివద్ద కావలసినంత మంచి స్వభావమున్నది. అతడు ప్రతి విషయమును గూర్చి ఎంతో సేపు మాట్లాడును. అతనికి తెలియని విషయ మనునది యున్నట్లు లేదు. విషయము అల్పమైన కొలది అతడంకను ఎక్కువగా మాట్లాడగలడు."

"అవునవును. పురుషున కుండవలసిన లక్షణము లన్నియు నతనివద్ద నున్నవి" అని మా పెద్దకూతురు ఒలీవియా చెప్ప

సాగెను; కాని నాకు సంబంధించినంతవఱకు, అతడన్న నాకు ఏమంత ఇష్టముగా లేదు. అతని అధిక ప్రసంగమును నేను భరింపలేను. అతనివాచ్య నైపుణ్యము భరింపలేనంత అసహ్యముగా నున్నది."

నేను నా యిరువురు కొమార్తెల మాటలను వింటిని. నేను వారి మాటలను సరిగా అర్థము చేసికొంటిని. సోఫియా తార్న్‌హిల్‌ను రహస్యముగా ద్వేషించుచున్నదనియు, అసహ్యించుకొనుచున్నదనియు, ఒలీవియా అతనిని రహస్యముగా ప్రశంసించుచున్న దనియు, ప్రేమించుచున్నదనియు నేను తెలిసికొనగలిగితిని. నేను ప్రకాశముగ వారితో నిట్లంటిని. "అమ్మాయిలు! అతనిని గూర్చి మీ అభిప్రాయమేమైన కానిండు. నా మనస్సులోని అభిప్రాయమును చెప్పుచున్నాను వినుడు. అతడన నాకు సదభిప్రాయ మేర్పడుటలేదు. ఎవ్వరైనను సరే, తమతో సమానమైన అంతస్తు కలవారితోనే స్నేహము చేయవలయునుగాని, ఎక్కువ అంతస్తు కలవారితో స్నేహము చేయరాదు. ఎక్కువ అంతస్తు కలవారితో, తక్కువ అంతస్తుకలవారు స్నేహము చేసినచో అది తక్కువ అంతస్తు కలవారికే నష్టదాయకముగ పరిణమించును. అతడు మనతో చాల కలుపుగోలుగ ప్రవర్తించిన మాటనిజమే. కాని అతనిలో తాను పై అంతస్తుకు చెందిన వాడనన్న భావము ప్రస్ఫుటముగ గోచరించుచునే యున్నది. మనము మన అంతస్తుకు తగిన వారితోనే స్నేహము చేయుదము. నా కొమార్తెల గుణము మంచిదను విషయము నాకు బాగుగ తెలియును. కాని అతని గుణములో నాకు కొన్ని లోట్లు కనబడుచున్నవి."

నేను నా సలహా నింకను కొనసాగించి యుండెడివాడనే. కాని అంతలో నచ్చటకు భూస్వామి తార్న్‌హిల్ పంపిన నౌకరొకడు వచ్చెను. అతడు మాకు తార్న్‌హిల్ పంపిన జింక మాంసము నిచ్చెను. "మా దొరగారు మీకు తమ అభివందనములను తెలియజేయ మన్నారు. కొన్ని దినముల తరువాత మీతో కలసి భోజనము చేయుటకు వత్తురట," అని యా నౌకరు చెప్పి, ఆ ప్రదేశమును వీడిపోయెను.

తార్న్‌హిల్ సరిగా సమయమునకు పంపిన బహుమానము (జింక మాంసము) అతని తరఫున చాల గట్టిగా పని చేసెను. అతనికి వ్యతిరేకముగా నేనేమి చెప్పినను ఉపయోగ ముండదను విషయమును గ్రహించితిని. అందువలన నేనింక నేమియు మాట్లాడలేదు. రానున్న అపాయమును సూచన ప్రాయముగ చెప్పినందుకు సంతృప్తి చెందితిని. నా కుటుంబము వారు తమ విచక్షణా జ్ఞానము నుపయోగించి ఆయపాయము నుండి తప్పించుకొను బాధ్యతను వారికే వదలి వైచితిని.

# 6

భూస్వామి తార్న్‌హిల్ పంపిన జింక మాంసములో కొంత భాగమును రాత్రి భోజనమున కుపయోగింపవలయు నని నిశ్చయించుకొంటిమి. వెంటనే నా కొమార్తె లిరువురును ఆ పని కుపక్రమించిరి. అంతట నేనిట్లంటిని: "నేటి రాత్రి మనతో కలసి భోజనము చేయుటకు ఇరుగు పొరుగువారు కాని, క్రొత్తవారు కాని ఎవ్వరును లేరు. ఇందుకు నేనెంతయు

విచారించుచున్నాను. అతిథులున్నచో నేటి మన విందుకు అలంకార మేర్పడును."

అంతట నా భార్య ఇట్లనెను: "దేవుడు మనలను కను గొంచినాడు. మన మంచి మిత్రుడు బర్చెల్ సమయమునకు వచ్చినాడు. మన సోఫియాను రక్షించిన మహనీయుడతడే కదా! మిమ్ము వాదములో నోడించినవాడు కూడ అతడే కదా !"

"వాదములో నన్ను ఓడించుటయా! ప్రియా! నీవా విషయమున పొరపడుచున్నావని చెప్పకతప్పదు. నన్ను ఓడించు వారెవ్వరును లేరని నేను గట్టిగా విశ్వసించుచున్నాను. భోజన పదార్థములను తయారుచేయుటలో నీకుగల శక్తిసామ ర్థ్యముల నంగీకరింతును. దయయుంచి మిగిలిన విషయముల జోలికిరావలదని కోరుచున్నాను" అని నేను నాభార్యకు సమాధా నము చెప్పసాగితిని. అంతలో బర్చెల్ లోనికి వచ్చెను. మా కుటుంబము వారందరును అతనిని సాదరముగ నాహ్వానించి, హృదయపూర్వకముగ కరచాలనము చేసిరి. నాచిన్నకుమారుడు డిక్ అతనిని ఒక కుర్చీవద్దకు తీసికొనిపోయెను.

బర్చెల్ స్నేహము నాకు రెండువిధముల సంతోష కారణముగ నుండెను. బర్చెల్ నా స్నేహమును వాంఛించు చున్నాడను విషయము నాకు బాగుగ తెలియును. మరియు నతడు నాతో సంపూర్ణ స్నేహభావముతో ప్రవర్తించుచున్నా డను విషయము కూడ తెలియును. అత డప్పుడప్పుడు చాల బాగుగ మాట్లాడుచుండును. ముఖ్యముగ అతనికి చిన్నపిల్ల లనిన నెంతయు నిష్టము; వారికిగూడ నతడనిన నెంతయు నిష్టము. "నిరపాయమైన చిన్న మనుజులు" అని అతడు చిన్నపిల్లలను

పిలుచుచుండెడివాడు; వారి కతడు జానపద గీతములను పాడి వినిపించుచుండెడివాడు. చక్కని కథలను చెప్పుచుండెడివాడు; తినుట కేమైన పెట్టుచుండెడివాడు. అందువలన పిల్లలతని నెంతయు ప్రేమించు చుండెడివారు. అతడు సంవత్సరమున కొకసారి మా ప్రాంతమునకు వచ్చి కొన్ని దినము లుండెడివాడు. ఆ రోజులలో మా యిరుగు పొరుగువారు అతనికి కావలసిన సౌకర్యలను సమకూర్చుచుండెడి వారు.

నాటిరాత్రి బర్చెల్ మాతో బాటు భోజనమునకు కూర్చుండెను. నాభార్య అతనికి మాయింట ప్రసిద్ధి చెందిన సారాయమును విరివిగా పోసెను. భోజనమైన తరువాత బర్చెల్ ప్రాతపాట లెన్నో పాడెను. చిన్నపిల్లలకు ఎన్నో కథలు చెప్పెను. కాలము గడచిపోవుచుండెను. అంతలో మా కోడిపుంజు "కొక్కో-రొకో" అని అరచెను. మా కోడిపుంజు ప్రతిరాత్రి సరిగా పదునొకండు గంటల కట్లు అఱచుచుండును. దాని యఱపు మాకొక హెచ్చరిక. "మీరింక నిదురింపవలసిన సమయ మాసన్నమైనది" అని చెప్పుటయే దాని అర్థము.

మేమింక నిదురింపవలయునని నిశ్చయించు కొంటిమి. కాని ఆవిషయమును గూర్చి ఒక చిక్కు సమస్య ఏర్పడెను. నే మంతకు మునుపే మా యింటిలోని వారి కందఱకు పక్కలను సిద్ధముచేసి యుంటిమి. అందువలన బర్చెల్ నిదురించుటకు ప్రక్క లేకుండెను. ఆతని మఱియొక చోటుకు పంపుటకు చాల ఆలస్యమైపోయినది. అప్పుడు నా చిన్న కొమరులలో నొకడు డిక్ ఇట్లనెను: "నన్ను అన్నయ్య మోజెస్ పక్కలో పరుండనిచ్చినచో నాపక్కను బర్చెల్ కిచ్చుటకు సిద్ధముగా

నున్నాను." అంతట మఱియొక కుమారుడు బిల్ ఇట్లనెను: "నన్ను అక్కలు తమవద్ద పరుండనిచ్చినచో, నా పక్కను బర్చెల్ కిచ్చుటకు సిద్ధముగా నున్నాను."

అప్పుడు నేను ఇట్లంటిని: "అబ్బాయిలు, మీరు చాల మంచివారు. చాల చక్కగ మాట్లాడినారు. అతిథులకు సర్వ సౌకర్యములను సమకూర్చుట క్రైస్తవుల విధ్యుక్త ధర్మములలో నొకటి. జంతువులు తమ తమ నివాసములకుపోయి విశ్రాంతి తీసికొనును. పక్షులు తమ గూండ్లకుపోయి విశ్రాంతి తీసికొనును. నిస్సహాయుడగు మానవుడు తనతోడి మానవుల ఇండ్లకుబోయి ఆశ్రయము పొందవలయును. ఈ ప్రపంచములో అందఱికంటె నూతనుడగు భగవానుడు, దానిని రక్షించుటకు వచ్చినాడు. ఆ మహనీయునకు గృహమనునది లేదు. ఆయన మన గుణములను పరీక్షించుటకే వచ్చినట్లుగనబడి." "పిమ్మట నేను నాభార్యతో నిట్లంటిని:" మన ఇరువురు అబ్బాయిలకు తినుట కేదేని పెట్టుము. ముందు డిక్ మాట్లాడినాడు కనుక అతనికి ఎక్కువ పెట్టుము."

తెల్లవారిన తరువాత మేమందఱము గడ్డిని ప్రోగుచేయుటలో నిమగ్నులమైతిమి. మా అతిథి బర్చెల్‌కూడ మాకు సాహాయ్యము చేయసాగెను. మే మతని సాహాయ్యమును స్వీకరించితిమి. అతడు మాటి మాటికి తన పనినిముగించి సోఫియాకు సాహాయ్యము చేయసాగెను. నేనా విషయమును గ్రహించితిని. వారిరువురును మాట్లాడుకొను చుండెడివారు. కాని నేనందుల కేమాత్రము అభ్యంతర పెట్టలేదు. ఇతరుల మన స్తత్వమును సోఫియా సులభముగా గ్రహింపగలదని నేను గట్టిగా విశ్వసించు

చుంటిని. అదియుగాక ఆమె మనసులోని అభిప్రాయము నాకు తెలియును. ఆమెయొక భాగ్యవంతుని వివాహము చేసుకొనదలచు చుండెను. సంపదను పోగొట్టుకొన్న బర్చెల్‌వంటి వానిని వివాహము చేసికొనుటకామె ఏ మాత్ర మిచ్ఛగింపదని నేను తలచుచుంటిని.

రాత్రి భోజనమున కుండవలసినదని నేను బర్చెల్‌ను ఆహ్వానించితిని. కాని అతడందులకు అంగీకరింపలేదు. "నేనీ రాత్రికి మఱియొకరి యింటికి పోవలసియున్నది. నే నచ్చటనే భోజనముచేసి పరుండుదును. నేనాయింటివారి అబ్బాయికి ఒకఈల తీసికొని పోవుచున్నాను. దాని నతనికి ఈయవలసి యున్నది" అని యతఁడని వెళ్ళిపోయెను.

రాత్రి భోజనమువద్ద మేమందఱము కూర్చుంటిమి. అప్పుడునేను బర్చెల్‌గూర్చి ఇట్లంటిని; "ఆలోచనా రహితముగా ప్రవర్తించినచో మానవులెట్లు తయారగుదురో తెలిసికొనుటకు బర్చెల్ చక్కని ఉదాహరణము. దగ్గఱ ధనము ఉన్నపుడతడెంతో విచ్చలవిడిగా ఖర్చు పెట్టెడివాడు. అప్పుడతని చుట్టును ప్రతినిత్యమును ఎంతోమంది గుమిగూడుచుండెడివారు. వారతనిని ప్రశంసించు చుండెడివారు. అతడేపని చేయుమన్నను చేయు చుండెడివారు. ఆ వందిమాగధులు, ఆ ముఖస్తుతి పరాయణులు ఏమైపోయినారు! అతని అవివేకమువలన ధనవంతుడైన వేశ్యాగృహపు కుంటెనకాడు వారికిప్పుడు ప్రియమిత్రుడైనాడు. ఒకప్పుడు బర్చెల్‌ను ప్రశంసించిన వారిప్పుడా క్రొత్త ధనికుని ప్రశంసించుచున్నారు. పూర్వమువారు బర్చెల్ గొప్ప తెలివితేటలు కలవాడని ప్రశంసించు చుండెడివారు. ఇప్పుడు వారతని

మూర్ఖత్వమును హేళన చేయుచున్నారు. అతనిప్పుడు బీదవాడు. అట్లుండుట కతడెంతయు తగియున్నాడు. స్వతంత్రముగ నుండ వలెననువాంఛ అతని కేమాత్రము లేదు. ఇతరుల కుపయోగపడు టకు కావలసిన నైపుణ్య మతనికి లేదు."

కొంత వఱకు నేనామాటలను నా రెండవ కొమార్తె సోఫియా నుద్దేశించియే అంటిని. ఆమె బర్చెల్‌ను ద్వేషింప వలయుననియు, అతనిని గురించి తక్కువ అభిప్రాయము నేర్ప రచుకొన వలయుననియు నేను ఘట్టిగా అభిప్రాయపడుచుంటిని. సోఫియాకు నామాట లేమాత్రమును రుచింపలేదు. అందు వలన ఆమె నా మాటలను ఖండించెను.

ఆమె ఇట్లనెను: నాయనా! బర్చెల్ పూర్వపు ప్రవర్తన ఎట్టిదైననేమి? అతనిప్పుడున్న ప్రత్యేక పరిస్థితులనుబట్టి, మన మెవ్వరము అతనిని ఖండింపరాదని నేను నిశ్చయముగ నభిప్రాయ పడుచున్నాను. తన పూర్వపు తెలివితక్కువతనమునకు తగిన ప్రతి ఫలము నిప్పుడతడు అనుభవించుచునే యున్నాడు. చచ్చిన పామును చితుకగొట్టుటవలన కలుగు లాభమేమి? దోషులను భగవంతుడే శిక్షించుచుండును. అటువంటి వారిని మనము మరల అనవసరముగా శిక్షించుటకు ప్రయత్నింపరాదని ఒక ప్పుడు మీరే చెప్పియున్నారుగదా!"

అప్పుడు నా కుమారుడు మోజెస్ ఇట్లనెను: "సోఫియా! నీవు చాల చక్కగా చెప్పినావు. బర్చెల్‌కు సంబం ధించిన పూర్తివిషయములు సరిగా తెలియవు. కావున మన మతనిని గూర్చి తొందరగా ఒక చెడునిర్ణయమునకు వచ్చుట ఏమాత్రము సమంజసమైన పనికాదు. తన్ను గూర్చి అతనెట్లు

భావించుచున్నాడో కదా! అడవి ఎలుకల బొఱియలు ఎంతో చీకటిగా నున్నట్లు మనకు కనబడును. కాని వానికి కావలసినంత వెలుగు ఆ బొరియలలో నుండునుగదా. సత్యము చెప్పవల యున్న అతని మనస్సు అతని ఇప్పటి పరిస్థితి కెంతయు తగి యున్నది. అతడు నేడు నీతో ఎంతో ఉల్లాసముగ మాట్లాడి యున్నాడు గదా. అంత ఉల్లాసముగ మాట్లాడిన వానిని మఱి యొకనిని నేను ఇంతవఱకు చూచియుండలేదు. నామాట నమ్ముము."

మోజెస్ ఆ కపటపటి మాటలను మామూలుధోరణి లోనే అనెను గాని ఏదో యొక ప్రత్యేక ఉద్దేశ్యముతో సస లేదు. కాని ఆమె బుగ్గలు సిగ్గుతో ఎఱ్ఱబాఱెను. ఆమె దానిని కప్పిపుచ్చుకొనుటకై నవ్వ ప్రయత్నించెను. మఱియు నామె ఇట్లనెను: "అతడు నాతో ఏమన్నాడో నేనసలు గ్రహింపనే లేదు. నాకేమియు జ్ఞాపకములేదు. ఒకప్పుడతడు చాల చక్కని గౌరవనీయుడని మాత్రము నేను నమ్ముచున్నాను."

ఆమె బుగ్గలు సిగ్గుతో ఎఱ్ఱబాఱిన విషయము, తన్ను సమర్థించుకొనుటకామె అంత తొందరగా ప్రయత్నించిన విష యము నాకేమాత్రము రుచింపలేదు. అయినను నేను నా అనుమానమును లోపల అణచుకొనేయుంటిని గాని, పైకె వెలి పుచ్చలేదు.

మఱునాడు మా యజమానుడు తార్న్‌హిల్ వచ్చు నని మేమనుకొను చుంటిమి. అందువలన నాభార్య జింక మాంసమును చక్కగా తయారుచేయుటకు వెళ్ళెను. మోజెస్ ఏదో గ్రంథమును చదువుకొనుచు కూర్చుండెను. నేను చిన్న

పిల్లలకు పాఠములు చెప్పసాగితిని. నా కొమార్తె లిరువురును ఏదో విషయములో మునిగియుండిరి. వారు కుంపటిమీద ఏదో వండుచున్నట్లు కనబడెను. వారు తమ వంటలో తమతల్లికేదో సహాయము చేయుచున్నారని నేను మొదట భావించితిని. కాని నా చిన్న కుమారుడు డిక్ ఎంతో రహస్యముగా నాతో నిట్లనెను: "వారు ముఖమునకు మెఱుగు తెచ్చు పదార్థమును దేనినో తయారుచేయు చున్నారు" ముఖమునకు మెఱుగు తెచ్చు పదార్థములన్న నాకు మొదటినుండియు వ్యతిరేకభావము కలదు. అవి ముఖసౌందర్యము నతిశయింప జేయుటకు బదులు పాడుచేయును; అందువలననే నేను వానిని పూర్తిగా వ్యతిరేకింతును. నేను మెల్ల మెల్లన నాకుర్చీని కుంపటి దగ్గరకు జరుపుకొనపోసాగితిని. దగ్గరకు పోయినతరువాత ఏదోపరీక్షించుచున్నట్లు నటించుచు వారు తయారుచేయుచున్న పదార్థమును క్రింద పారబోసితిని. నేనాపనిని బుద్ధిపూర్వకముగగాక, పొరపాటున చేసినటు నటించితిని. అప్పటికి చాల ప్రొద్దుపోయి యుండుటవలన నాకొమార్తెలు మరల ఆ పదార్థమును తయారు చేయుటకు ప్రయత్నింపలేదు.

# 7

మేము మా యజమానుడు తార్న్‌హిల్‌ను స్వీకరించి ఆదరింపవలసిన దినము వచ్చెను. అతనిని తగిన విధముగ స్వీకరించుటకు కావలసిన ఏర్పాట్లన్నియు చేయబడెనని ప్రత్యేకముగ చెప్పవలసినపని లేదనుకొందును. ఆ యవకాశమును సద్వి

నియోగము చేసికొన వలయునను నుద్దేశ్యముతో నాభార్య ఇసువురు కొమార్తెలు చక్కగా అలంకరించుకొనిరని ఎవ్వరైనను సులభముగా నూహింపవచ్చును.

తార్న్‌హిల్ ఇసువురు స్నేహితులతో కలసి వచ్చెను. వారివెంట సేవకులెందఱో వచ్చిరి. ఆయూరిలోని పూటకూళ్ళ యింటికిపోయి, భోజనముచేసి, విశ్రాంతి తీసికోవలసినదని తార్న్‌హిల్ తన సేవకుల కాజ్ఞాపించెను. కాని నాభార్య తన గొప్పతనమును ప్రకటించుకొనవలయునను విజయగర్వముతో నిట్లనెను: "మీ సేవకులు మఱియొక యింటికి పోవలసిన అవసర మేమి వచ్చినది ? నేను అందఱకు కావలసిన ఏర్పాట్ల నన్నిటిని సిద్ధము చేసినాను. కావున దయయుంచి మీరందఱును మాయాతిథ్యమును స్వీకరింపవలయునని ప్రార్థించుచున్నాను." నాభార్య మాటలకు ఫలితముగా నే మందఱము మూడు వారములవఱకు ఆహార పదార్థముల కొఱతతో బాధ పడితిమి.

నా జ్యేష్ఠపుత్రుడు జార్జి, విల్మట్ కన్యను వివాహముచేసికొన దలచి యుండెనుగదా. కాని మా ఆర్థిక పరిస్థితి తారుమారగుటవలన ఆ సంబంధము చెడిపోయెను. ఆ విల్మట్ కన్యను తాను వివాహము చేసికొనదలచినట్లు బర్చెల్ కడచిన దినమున మాకు సూచన ప్రాయముగా చెప్పి యుండెను. ఆవిషయ మానాడు మమ్ము కొలదిగా బాధించుచుండెను. కాని అంతలో జరిగిన విషయ మొకటి మాబాధను కొలదిగా తగ్గించెను.

తార్న్‌హిల్‌తో వచ్చిన వారిలో నొకడు విల్మట్‌కన్య ప్రసక్తిని తెచ్చుట తటస్థించెను. ఆసందర్భమున తార్న్‌హిల్ ఇట్లనెను. "విల్మట్‌కన్య అందమైనదని కొందఱందురు. కాని

అంతకంటె సత్యదూరమైన విషయము మఱియొకటి యుండదని నేను గట్టిగా అభిప్రాయపడు చున్నాను. ఆమె అందమైనది యైనచో ఇంక ఈ ప్రపంచమున అంద చందములులేని యువతి ఎవ్వరు?" అట్లని అతడుగట్టిగా నవ్వెను. అతనితో బాటు మిగిలిన వార మందఱముకూడ నవ్వితిమి. ధనికులేమన్నను చుట్టు ప్రక్కల నున్నవారు సమర్థించుట సహజమైన విషయమే. తార్న్‌హిల్ అభిప్రాయమును ప్రశంసించుచు ఒలీవియా మెల్లన మాట్లాడెను. కాని ఆమె మాటలందఱకు వినబడెను. ఆ మాట లను తార్న్‌హిల్ వినవలయు ననియే ఆమె యుద్దేశించెను. ఆమె కోరిక నెఱవేఱెను.

భోజనములైపోయిన తరువాత నేను చర్చి ప్రసక్తిని తెచ్చితిని. ఆ సందర్భమున నా కుమారుడు మోజెస్‌కును, యజమానుడు తార్న్‌హిల్‌కును దీర్ఘకాలము చర్చజరిగెను. మోజెస్ చాల చక్కగనే మాట్లాడెను. కాని తార్న్‌హిల్ వాగాడంబరమువలన అతడోడి పోయినట్లాయెను. తార్న్‌హిల్ విజయ గర్వముతో నుల్లాసపడుచుండగా నా కుమారుడు తెల్ల మొగము వేసికొని కూర్చుండవలసివచ్చెను. మిగిలిన వారందఱు నుత్సాహముతో నుండిరి.

నాకు మాత్రము జరిగిన విషయ మేమాత్రము సంతృప్తి కరముగ లేకుండెను. నా జ్యేష్ఠ కొమార్త ఒలీవియా మాత్రము వేఱు విధముగ తలచెను. ఆమె తార్న్‌హిల్ చక్కగా మాట్లాడ గలడని, వాదింపగలడని తలచుచుండెను. అతడు పుస్తకముల లోని కొన్ని విషయములను జ్ఞప్తియందుంచుకొని వానిని యథా తథముగ నుపయోగించెనని ఆమె అర్థము చేసికొనలేకపోయెను.

తార్న్‌హిల్ మంచి సంస్కారముగల గౌరవనీయుడని ఆమె గట్టిగా అభిప్రాయపడుచుండెను. మంచి విగ్రహము, విలువైన వస్తువులు, ఐశ్వర్యముగల తార్న్‌హిల్ ఒలీవియాను ఆకర్షించుట లోను ఆశ్చర్యమేమియులేదు. తార్న్‌హిల్ గొప్ప పండితుడు కాని మాట నిజము. అతడేవో కొన్ని గ్రంథములను సూక్ష్మ దృష్టితోగాక స్థూలముగ మాత్రమే పరిశీలించి యుండెను. కాని అతనిలోనున్న గొప్ప విశేషమేమన ఏ సామాన్య విష యమును గూర్చియైన నతడు తడవు కొనకుండ అనర్గళముగా మాట్లాడగలడు. అందుల కణుమాత్రమైనను సందేహములేదు. ఆతని ఆ గొప్ప తనము నా కొమార్తె ఒలీవియాను సులభముగా ఆకర్షించుటలో ఆశ్చర్యమేమియు లేదు.

ఎట్టకేలకు మా యజమానుడు తార్న్‌హిల్ తన యను చరులతో కలసి మా గృహమును వీడిపోయెను. అతడు వెళ్ళి పోయిన తరువాత మా కుటుంబము నారమతని మంచి చెడ్డలను గూర్చి చర్చింపబూనితిమి. యజమానుని మాటలు, చూపులు నూటికి నూఱుపాళ్ళు ఒలీవియా నుద్దేశించియే యుండెను. అందువలన ఒలీవియాను చూడవలయునను నుద్దేశ్యముతోనే అతడు మా యింటికి వచ్చినాడని మేమనుకొంటిమి. ఆ విషయ ములో మా కింత నెట్టి సందేహమునులేదు. జరిగిన విషయము ఒలీవియా కెట్టి కష్టమును కలిగింపలేదు. పైగా ఆమె ఎంతయు సంతోషించుచుండెను. నాభార్య సంగతి ప్రత్యేకముగ పేర్కొన వలసిన పని ఏమి యున్నది? జరిగిన దానికి ఆమెకూడ ఎంతయు గర్వించుచుండెను. తన కొమార్తెకు కలిగిన విజయము నామె

తన స్వంత విజయముగా భావించుచుండెను. ఆమె మానసిక వికాసమట్టిది.

ఆమె నాతో నిట్లనెను: "ప్రియనాథా! నేడు నా కొమార్తె లిసువురును చక్కగా మాట్లాడినారు. ఆ విధముగా చేయవలసినదని వారిని నేనే ప్రోత్సహించి యుంటిని. ఆ విషయము నిప్పుడంగీకరించుటకు నేనెంతయు సంతసించుచున్నాను. నా ఆశయము లత్యున్నతమైనవి. అవి సరియైనవను విషయము మీ కిప్పుడు రుజువైనది కదా! దీని ముగింపు ఎట్లుండునో ఎవరికి తెలియును?"

అప్పుడు నేను అసమ్మతి సూచకముగ నిట్లంటిని: "అవు నవును! దీని పర్యవసాన మెట్లుండునో ఎవరికి తెలియును? నిజము చెప్పవలయునన్న నాకీవిషయము లేవియు రుచించుట లేదు. తార్న్‌హిల్ సంపద కలవాడన్నమాట నిజమే. కాని ఇతడు నమ్మదగినవాడు కాడు. చిత్త చాంచల్యము కలవారు విశ్వాస పాత్రులు కారనుట ముమ్మాటికిని నిజము. బీదవారైననేమి నిజాయితీ కలవారే శ్రేష్ఠమైనవారు. వారేఉత్తములు. అట్టివారే నాకు సంతృప్తి, సంతోషమును ఒసగుదురు. తార్న్‌హిల్‌వంటి స్వేచ్ఛా విహారి నాకేమాత్రము నచ్చడు. రక రకముల పూలపై వ్రాలి తేనెను త్రాగుచుండు సీతాకోక చిలుకను నమ్మవచ్చునా? తార్న్‌హిల్ అట్టివాడు కాడా? అట్టివారెప్పుడు కాని నాకొమార్తెలను పొందరాదని నేను నిశ్చయముగ నభిప్రాయపడు చున్నాను. మీరు తెలివి తేటలుపయోగించి నడచుకొందు రనియు, ఆశాభంగము పొందకుండ నుందురనియు నమ్ము చున్నాను."

అంతట నా రెండవ కుమారుడు మోజెస్ ఇట్లనెను. "నాన్నా! ఈ విషయమున మీరు చాల కఠినముగ మాట్లాడు చున్నారని తలచు చున్నాను. ఏలయన భగవంతుడు ఎవరినైనను వారు చేసినదానికి తప్పు పట్టునేకాని, అనుకొన్నదానికి తప్పు పట్టడు. ప్రతి మానవుని మనస్సులోను వేలకొలది విషపుటాలో చన లుండవచ్చును. వాని నణచి వేయుటకు వారికి సామర్థ్యము లేకపోవుటయే అందుకు కారణము. తార్న్ హిల్ పరిస్థితికూడ నిట్టిదనియే నే నభిప్రాయ పడుచున్నాను. ఇందుకొక చక్కని ఉదాహరణము చెప్పెదను. ఒక పట్టణము నొక ప్రభువు పరిపాలించు చున్నాడు. ఆ పట్టణమునకు చుట్టును కోటగోడలు లేవు. ఆ పట్టణము మీదికి శత్రువులు దండెత్తి వచ్చినారు. కోట గోడలు లేకపోవుటవలన ప్రభువు పట్టణవాసులకు రక్షణనొసగ లేక పోయినాడు. అందుకు మనము ప్రభువును తప్పు పట్టుదుమా?"

"కుమారా! నీవు చెప్పిన యుదాహరణము బాగుగనే యున్నది" అని నేను చెప్పసాగితిని. "కాని ప్రభువే శత్రువులను రెండుచేతులతో ఆహ్వానించి నప్పుడు అతనినిగూర్చి ఏమనుకో వలయును? అతడు నేరగాడేకదా! ఎవ్వరు తెలిసి తప్పులను చేయుచుందురో చెడ్డగా తలచు చుందురో వారిగతికూడ అంతియే. మనకు తెలియకుండగనే మన మనస్సులో కొన్ని చెడ్డ అభిప్రాయములు ప్రవేశింప వచ్చును. మఱి మనమువానిని త్రోసిరాజని బయటకు వెళ్ళగొట్టవలసిన అవసరములేదా? అందుకు తగిన విధముగ ప్రయత్నింపవలదా? మనమట్లు చేయ నిచో నేరగాండ్రమే యగుదుము. కావున మన మందుకు తగిన

ఫలితమునుననుభవింపవలసి వచ్చును. తెలిసి ముట్టుకొన్నను, తెలియక ముట్టుకొన్నను నిప్పు కాలును గదా."

నామాటలకు మోజెస్ సమాధానము చెప్పుటకు ప్రయత్నింపలేదు. కాని నాభార్య మాత్రమిట్లనెను. "మనకు తెలిసిన పలువురుస్వేచ్ఛగాఆలోచించువారే. కానివారు చక్కని భర్తలుగ నుండుటలేదా! వారిభార్యలు సంతృప్తిని ప్రకటించు చుండుట లేదా? వారికాపురములు సక్రమముగ జరిగిపోవుచుండుట లేదా? అదియుగాక తమభర్తల ఆలోచనలను, మార్గములను పనులను పూర్తిగా మార్చివేసిన అమ్మాయిలను పలువురను నే నెఱుగుదును. ప్రియనాథా! మన అమ్మాయి ఒలీవియా ఏ యే ఘన కార్యములను సాధించగలదో ఎవరికి తెలియును? మన అమ్మాయి ఏ విషయమును గుఱించియైనను చక్కగా మాట్లాడగలదు. ఆమెకు తెలియని విషయ మనునదిలేదని నేను గాఢముగ విశ్వసించుచున్నాను. మన అమ్మాయి వాదనా నైపుణ్యము కడుంగడు ప్రశంసనీయమైనది. ఇతరులను తన అభిప్రాయములోనికి మార్చుటలో గణనీయమైన శక్తి సామర్థ్యములు గలది. తర్కశాస్త్రమున నీమె అందెవేసిన చేయి."

అంతట నేనిట్లంటిని: "ఏమేమీ! అటులనా! మన అమ్మాయి ఏ తర్కశాస్త్ర గ్రంథములను చదివినది? ఆమెకు నేనెప్పుడును తర్కశాస్త్ర గ్రంథముల నిచ్చి యుండలేదే! నిజముగ నీవు ఆమెను గూర్చి గోరంతలు కొండంతలుచేసి చెప్పుచున్నావు."

"నాయనా! మీరీ విషయమున పొరపడుచున్నారు. అమ్మ నన్ను గూర్చి గోరంతలు కొండంతలుచేసి చెప్పుటలేదని

సవినయముగ మనవి చేసికొనుచున్నాను. మీకు తెలియకుండ నేను తర్కశాస్త్ర గ్రంథముల నెన్నిటినో చదివినాను. ఇప్పు డింకను చదువు చున్నాను." అని ఒలీవియా అనెను.

"మంచిది, మంచిది. నీవు చాల మంచి పిల్లవు. ఇతను లను మంచి మార్గమున పెట్టుటకు తగిన శక్తి సామర్థ్యములు నీకు కలవని అంగీకరించుచున్నాను. నేనెంతయు సంతసించు చున్నాను. ముందు నీవు పోయి వంట ప్రయత్నములో మీ అమ్మకు సాహాయ్యము చేయుము" అని నేనంటిని.

# 8

మఱునాటి యుదయమున బర్చెల్ మరల మా యింటికి వచ్చెను. అత డా విధముగ మా యింటికి తఱచుగా వచ్చు చుండుటను నేను హర్షింపలేకుంటిని. అందుకు కొన్ని కారణ ములు కలవు. అయినను అతనిని మా యింటికి రావలదని ఎట్లు చెప్పగలను ? వచ్చిన వానిని లోనికి ఆహ్వానింపకుండ నెట్లుండ గలను ? భోజనము పెట్టకుండ నెట్లుండగలను ? అతనికి మేము పెట్టిన దానికంటె, అతడు మాకు చేసి పెట్టెడి పని ఎక్కువ యన్న మాట నిజము. ఏలయన అతడు మా అంపజీతో బాటు కష్టపడి పనిచేసెడివాడు. అందఱి కంటె ముందుండెడివాడు.

అదియుగాక నతడు ఎప్పుడును ఉల్లాసము కలిగించు మాటలు చెప్పుచుండెడివాడు. ఆ మాటలను వినుచున్నప్పుడు మా కష్టము, శ్రమ తగ్గుచున్నట్లుండెడివి. ఒకొక్కప్పుడతడు ఎంతో తెలివిగా మాట్లాడు చుండెడివాడు; ఒకొక్కప్పుడు

దారి తప్పి మాట్లాడెడివాడు. నేనతనిని ప్రేమించెడివాడను; అతనిని చూచి నవ్వెడివాడను; జాలిపడెడివాడను. అతడు నా రెండవ కొమార్తె సోఫియాతో పరిచయము హెచ్చుచేసి కొనుచున్న విషయము మాత్రము నాకేమాత్ర మిష్టముగ నుండెడిదికాదు.

బర్చెల్ సోఫియాను 'నా చిన్నారి రాణి' అని తమాషాగా పిలుచుచుండెడివాడు. అతడు నా ఇద్దఱు కొమార్తెలకును రిబ్బనులను తెచ్చి యిచ్చుచుండెడివాడు. కాని సోఫియాకిచ్చెడి రిబ్బనులు ఒలీవియా కిచ్చెడి వానికంటె శ్రేష్ఠమైనవిగనుండెడివి. రోజులు గడచుచున్న కొలది అతడెంతో ప్రేమింపదగిన వానిగ కనబడసాగెను. అతని తెలివి తేటలు హెచ్చుచున్నట్లుండెను. అతడు నిరాడంబర జీవనము గడపుచున్న మహనీయునివలె నుండెను.

నేము పొలములలోనికిపోయి భోజనముచేయ సాగితిమి. గడ్డిమీద గుడ్డపఱచి దానిమీద భోజనపాత్రలు పెట్టుకొంటిమి. నేమందరము చుట్టును కూర్చుంటిమి. భోజనము ముగించితిమి. బర్చెల్ తన మాటలతో మాకు అపరిమితమగు ఆనందమును చేకూర్చసాగెను. మా సంతృప్తిని, ఆనందమును వృద్ధిపరచుటకోయన్న ఎదురెదురుగానున్న పొదలపై కూర్చుండియున్న రెండు నల్లని పక్షులు ఒకదానినొకటి చూచుకొనుచు కూయసాగెను. అంతలో మావద్ద కెప్పుడును వచ్చుచుండెడి రాబిన్ రెడ్ బ్రెస్ట్ పక్షి యొకటి వచ్చిమిగిలిన ఆహార పదార్థములను మా చేతులలోనుండి తీసికొని తినసాగెను.

ఆ సందర్భమున సోఫియా యిట్లనెను: ప్రసిద్ధిచెందిన కవిపుంగవుడు గ్రే తన పద్యములలో యిరువురు ప్రేమికులను

చక్కగా వర్ణించినాడు వారి నల్లనిపక్షులవలె దూరముగా కూర్చుండలేదు. వారొకరి కౌగిలిలో నొకరుండి మరణమును పొందినారు. ఆవర్ణన ఎట్టి కఠినహృదయుల మనస్సునైనను సులభముగా కరగించి వేయును. దానిని నేను నూర్లకొలది సార్లు చదివినాను. అందు నాకెప్పటి కప్పుడు ఏదో క్రొత్త విషయము కనబడుచుండును."

అంతట మోజెస్ ఇట్లనియెను: "గ్రే కవిపుంగవుని వర్ణన చాల బాగుగనున్నమాట నిజమే. కాని ఆ వర్ణన ప్రఖ్యాత కవిసార్వభౌముడగు ఓవిడ్ వర్ణనలకు తీసికట్టని నేను గట్టిగా నమ్ముచున్నాను. తారతమ్యమును ఆ రోమనుకవిశ్రేష్ఠు డర్థము చేసికొన్నంతగా గ్రే కవిపుంగవుడు అర్థము చేసికొన లేదు."

అప్పుడు బర్చెల్ జోక్యము కలిగించుకొని ఇరువురు కవు లనుసరించిన విధానమును తీవ్రముగ విమర్శించెను. అతడు వారి పద్యములలోని లోపములను ఎత్తి చూపెను. "ఆ లోపములు లేని జానపద గీతము మీకు పాడి వినిపింతును." అని అతడనెను. పిమ్మట నతడొక చక్కని గీతమును పాడి వినిపింప సాగెను. సోఫియా కా గీతమెంతయు నచ్చినట్లు ఆమె ముఖ కవళిక స్పష్టముగా ప్రకటించుచుండెను.

అంతలో మాకు ఎవ్వరో వేటగాడు తుపాకి పేల్చిన సవ్వడి వినవచ్చెను. తాను చంపిన పక్షిని తీసుకొనుటకై పొదలలోనుండి యొక మనుజుడు బయటకు వచ్చెను. అతడెవ్వరు? పూర్వము తార్న్‌హిల్‌తో కలసి మా యింటికివచ్చిన వారిలో నతడొకడు. పొదలమీద

కూర్చుండి చక్కగా అఱచుచు మాకు సంతోషమును చేకూర్చుచున్న రెండు పల్లనిపక్షులలో నొకదానిని నతడు తుపాకితో కాల్చి చంపియుండెను.

అంత దగ్గరగా వినబడిన పెద్ద ధ్వనినివిని నా కొమార్తెలు ఉలికిపడిరి. సోఫియా అపరిమితమగు భయముతో రక్షణకొరకై బర్చెల్ చేతులలోని కొరిగిపోయెను. నేనా దృశ్యమును జూచితిని. పక్షినిచంపిన తార్న్‌హిల్ పురోహితుడు ఆ పక్షితోబాటు మావద్దకు వచ్చి, అయ్యలారా! అమ్మలారా! తుపాకి ప్రేల్చి మిమ్ముల కలతపెట్టి నందుకు నేనెంతయు విచారించుచున్నాను. ఇందుకు మీరు నన్ను క్షమింపవలయును. మీరింత దగ్గరలో కూర్చుండియున్నారను విషయము నాకు తెలియదు" అని యనెను.

పిమ్మటనతడు నారెండవ కొమార్తెకు దగ్గరగా కూర్చుండి తాను చంపిన పక్షినామె కీయబోయెను. సోఫియా దానిని తీసికొనుటకు నిరాకరింప బోవుచుండెను. కాని అంతలో నాభార్య ఆమెవంకకు చూచెను. "నిరాకరింపకుము. తీసికొనుము" అని నాభార్య చెప్పినట్లుండెను. అందువలన సోఫియా ఇష్టము లేకున్నను ఆపక్షి నతని వద్దనుండి తీసికొనెను.

సోఫియా కతడాపక్షినిచ్చినందుకు నాభార్య ఎంతయు గర్వపడు చుండెను. "నాపెద్ద కొమార్తె ఒలీవియా భూస్వామి తార్న్‌హిల్ హృదయమును కైవసము చేసికొన్నది. చిన్న కూతురు సోఫియా తార్న్‌హిల్ పురోహితుని హృదయమును జయించినది" అని ఆమె యభిప్రాయపడుచుండెను. ఆ యభిప్రాయము నామె మెల్లన నాచెవిలో వేసెను. సోఫియా తార్న్

హిల్ పురోహితుని ప్రేమించుట లేదనియు, మఱియొకనిని ప్రేమించు చున్నదనియు నే ననుమానింపసాగితిని. కాని ఆవిషయమును నామనస్సులోనే ఉంచుకొంటిని గాని నాభార్యకు మాత్రము చెప్పలేదు.

తార్న్‌హిల్ పురోహితుడు తన యజమానుని పనుపున మావద్దకు వచ్చెను. అతడు మాకిట్లు చెప్పెను. "మా యజమానుడు నేటిరాత్రి వెన్నెల సమయమున మీయింటియందు చక్కని విందు నొకదానినీయనున్నాడు. అది ముఖ్యముగా ఇరువుర యువతీ రత్నముల కొఱకుద్దేశింప బడినది. ఆ సందర్భమున పాటలు, నాట్యము మున్నగునవన్నియునుండును. ఈ వార్తను ముందుగా మీకు తెలియజేయుటకు నేనే ఎందుకు వచ్చినానో తెలియునా? ఇందులో నా స్వార్థముకూడ నున్నది. నేటిరాత్రి సోఫియా తన హస్తమును నాకొసగి నాతో కలసి నాట్యము చేయుట కంగీకరింప వలయును. ఆవిధముగ నన్ను గౌరవించ వలయును. ఇదియే నాకు కావలసిన బహుమానము".

అందుకు సమాధానముగ సోఫియా ఇట్లనెను. "ఆపనిని మర్యాద పూర్వకముగ చేయగలిగినచో నాకెట్టి అభ్యంతరమును లేదు. (బర్చెల్ వంకకు చూచుచు) కాని యిచ్చట నొక గౌరవనీయుడు కూర్చుండి యున్నాడు. ఇతడు ప్రొద్దుటనుండి నాతో కలిసి పనిచేసినాడు. నా కష్టమును పంచుకొన్న ఇతడు నా ఆనందములోగూడ పాలు పంచుకొనుట భావ్యముగ నుండును."

అపుడు బర్చెల్ ఇట్లనెను; "నీ అభిప్రాయమునకు నేనెంతయు సంతసించు చున్నాను. నీకు నాపట్ల ఇట్టి సదభిప్రాయము

కలదని తెలిసికొనుట కెంతయు గర్వించు చున్నాను. కాని నేనీ రాత్రికచ్చటకు అయిదుమైళ్ళ దూరముననున్న ఒక గ్రామమునకు పోవలసియున్నది. అచ్చటి వారొకరు నన్నీ రాత్రికి తమ యింటికి భోజనమునకు రావలసినదని ఆహ్వానించి యున్నారు. కావున నీవు నేటిరాత్రి యీ గౌరవనీయునితో కలిసి నాట్యము చేయుము; నేనేమియు అనుకొనను."

బర్చెల్ మాటలునాకు కొంచెము అసాధారణముగ కనబడెను. మంచి తెలివి తేటలుగల నారెండవ కొమార్తె సోఫియా ధనికుడగుట కవకాశమున్న పురోహితునివదలి ఐశ్వర్యమును పోగొట్టుకొన్న బర్చెల్‌ను ఎందుకు ప్రేమించు చున్నదో కూడ నాకు అర్థముకాకుండెను. పురుషులు స్త్రీలలోని యోగ్యతను గుర్తింప సమర్థులు. అట్లే స్త్రీలుకూడ పురుషుల యోగ్యతను గుర్తింప సమర్థులు. ఈరెండు జాతులవారును ఒకరి నొకరు నిశితముగ పరీక్షించు కొందురు; తమ తమ విధానముల ననుసరించి అభిప్రాయముల నేర్పఱచు కొందురు. సోఫియా అటులనే బర్చెల్‌నుగూర్చి సదభిప్రాయము నేర్పఱచు కొన్నది కాబోలు.

## 9

బర్చెల్ మావద్ద సెలవుతీసుకొని వెళ్ళిపోయెను సోఫియా తార్న్‌హిల్ పురోహితునితో కలసి నాట్యము చేయుటకు అంగీకరించెను. అంతలో మాచిన్న పిల్లలు పరుగెత్తుకొనివచ్చి తార్న్‌హిల్ పలువురితో కలసి మా యింటికి వచ్చినాడని చెప్పిరి. అంతట నచ్చటనున్న వారమందఱము ఇంటికి తిరిగి వెళ్ళితిమి.

మా యజమానుడు తార్న్‌హిల్, ఇద్దఱు సామాన్యపు పెద్ద మనుష్యులు, మంచివిలువైన దుస్తులుధరించిన ఇద్దఱు యువతులు మాకు కనబడిరి.

"ఈ యిద్దఱు యువతులును పట్టణమునుండి వచ్చిన నవ నాగరికులు. మంచి కుటుంబములకు చెందినవారు. గౌరవనీయులు. చాల విషయములలో నేర్పరులు." అని తార్న్‌హిల్ ఇరువురు యువతులను మాకు పరిచయము చేసెను.

అందఱకు సరిపడునన్ని కుర్చీలు మా యింట లేకుండెను. అందువలన ఏమి చేయవలయునా యని నేను విచారింపసాగితిని. అపుడు తార్న్‌హిల్ వెంటనే ఇట్లనెను. "ఒక్కొక్క గౌరవ నీయుడు ఒక్కొక్క యువతిఒడిలో కూర్చుండుటమేలు. అప్పుడు కావలసినన్ని కుర్చీలులేవను సమస్య యుండదు."

"దానికి నేను పూర్తి అభ్యంతరము తెలుపుచున్నాను." అని నేనంటిని. నే నటుల మాటలాడుచుండగా నాభార్య, "మీరాయన చెప్పినదానికి ఏమాత్రము అభ్యంతరము తెలుప వలదు." అనునర్థము వచ్చునటుల నావంకకు చూచెను. కాని నేనామె చూపును లెక్కచేయకుండ వాక్యమును పూర్తిచేసితిని.

మఱియింక నేమి చేయవలయును? ఇరుగు పొరుగువారి వద్దనుండి రెండు కుర్చీలు ఎరవుతీసికొని రావలసినదని మోజెస్‌ను పంపితిమి. సమూహ గ్రామీణ నాట్యములలో పాల్గొనుటకు ఇరువురు యువతులు తక్కువగా నుండిరి. అందువలన ఇరువురు యువతుల నెవ్వరినైన తీసికొని వచ్చుటకై తార్న్‌హిల్ వెంట వచ్చిన గౌరవనీయులిరువురును మోజెస్ వెంట వెళ్ళిరి. అనతి కాలములో వారుముగ్గురును ఇద్దఱు యువతులతోను, కొన్ని

కుర్చీలతోను తిరిగివచ్చిరి. ఆ వచ్చిన ఇద్దఱు యువతులును మా పొరుగుననేయున్న ఫ్లాన్‌బరో కొమార్తెలు. వారుచక్కగా అలంకరించుకొని వచ్చియుండిరి.

కావలసిన ఇద్దఱు యువతులును వచ్చిరన్నమాటయేగాని ఒక చిక్కుసమస్య ఉత్పన్నమాయెను. వారు ఆప్రాంతములోకెల్ల గొప్ప నాట్యకత్తెలని ప్రసిద్ధిగాంచి యుండిరి. నాట్యములోని నేర్పులన్నియు వారికి చక్కగా తెలియును. కాని దురదృష్టవశమున వారికి గ్రామీణ నాట్యములకు సంబంధించిన విషయమును మాత్రమైనను తెలియదు. ఆవిషయము మొదట మాకు బాధను కలిగించెను. కాని నాట్యము ప్రారంభించిన కొంచెముసేపటికి అంతయు చక్కగా జరిగిపోయెను.

నాట్య సందర్భమున మేము రెండు ఫిడేళ్ళు, మఱిరెండు వేర్వేఱు సంగీత సాధనములను ఉపయోగించితిమి. అప్పుడు మాఇంటిబయట చంద్రుడు కడు మనోహరముగ ప్రకాశించుచుండెను. తార్న్‌హిల్ నా పెద్దకొమార్తె ఒలీవియాతోకలసి నాట్యమునకు నాందీ ప్రస్తావనచేసెను. అప్పుడచ్చటనున్న వారందఱును హర్షధ్వానములు చేసిరి. వారెవ్వరందురేమో? మాయింటి ముంగలి సందడిని గమనించి చుట్టు ప్రక్కలనున్న వారందఱును గుంపులు గుంపులుగా వచ్చిరి. హర్షధ్వానములు చేసినవారు వారే. నాపెద్ద కొమార్తె అత్యద్భుతముగ నాట్యము చేయ సాగెను. ఆమె పాదముల కదలిక కడు మనోహరముగ నుండెను. అందుకు నాభార్య ఎంతయు గర్వింపసాగెను.

"మన అమ్మాయి కన్నులపండుగుగ నాట్యముచేయుచున్నది. ఆమె గమనము నొక్కసారి పరికింపుడు. ఆమె కదలిక

లెట్లున్నవో చూడుడు. వానినన్నిటిని ఆమె నావద్దనుండియే నేర్చుకొన్నది. ఈ విషయము మీకు తెలియును. అయినను మీకు మఱియొకసారి నమ్మబలుకుచున్నాను." అని నాభార్య నాతో అనెను.

పట్టణమునుండివచ్చిన నాగరకయువతులు నాపెద్దకొమార్తె నాట్యము చేసినట్లు చేయవలయునని ప్రయత్నించిరి. కాని అణుమాత్రమైనను విజయమును సాధింపలేక పోయిరి. వారెంతో ప్రయత్నించిరి. రకరకములుగ ప్రయత్నించిరి. కాని సత్ఫలితము మాత్రముశూన్యముగ నుండెను.

నాట్యము సుమారొక గంటకాలమువఱకు జరిగెను. ఇంకను నాట్యము చేసినచో పరీసెము పట్టునను భయముతో పట్టణమునుండి వచ్చిన యువతులు మానివైచిరి. వారిలో నొకర్తె మర్యాద హీనముగగూడ మాట్లాడెను. సహజముగు ప్రజ్ఞలేనివారు తమ సాధనములను తప్పు పట్టుదురుగదా. వారు మానివేయుటతో నాట్యప్రదర్శనముగూడ ముగిసెను.

తరువాత మేమందఱము ఇంటిలోనికి పోతిమి. అప్పు డచ్చట భోజనము సిద్ధముగనుండెను. దానికి కావలసిన ఏర్పాట్ల న్నిటిని తార్న్‌హిల్ ఇదివఱకే చేసియుండెను. భోజనము చాల బాగుగనుండెను. భోజనముతో బాటు మాటలుగూడ సాగెను. కాని సంభాషణ ఇదివఱకువలె స్వేచ్ఛగా జరుగకుండెను. పట్టణ యువతులిరువురును నా కొమార్తెలను పూర్తిగా వెనుకకునెట్టి వైచిరి. వారెంత సేపటికిని తమజీవిత విధానమును గూర్చియే చెప్పసాగిరి. తమ జీవితము ఆదర్శప్రాయమైనదని వారు గట్టిగా నమ్ముచుండిరి. వారిదృష్టిలో పల్లెటూరివారు మనుజులేకారు!

పల్లెటూరివారికి నాగరకతయే తెలియదు! షేక్స్పియర్ నాటకములు చదువనివారు మనుజులే కారు! వారిసంభాషణ ఆధోరణిలోనే సాగిపోవుచుండెను.

ఎట్టకేలకు వారిలోనొకర్తె నాపెద్దకూతురు ఒలీవియాను గూర్చి ఇట్లనెను. "ఒలీవియా అభివృద్ధి చెందుటకు తగిన అవకాశములేక ఇచ్చట క్రగ్గి మాడిపోవుచున్నది. విశాల ప్రపంచము నీమె కొలదిగా చూచుట తటస్థించినచో ఈమెలో అత్యద్భుతమైన మార్పు వచ్చును."

అప్పుడు రెండవయువతి ఇట్లనెను. "సోఫియా పట్టణములో ఒక్క శీతాకాలమున్న చాలును. ఆమెలోపూర్తి మార్పు వచ్చును. ప్రాత సోఫియాకును, క్రొత్త సోఫియాకును ఏవిధమగు పోలికయు నుండదు."

నాభార్య వారిరువురి మాటలకును అపరిమితమగు సంతోషముతో సమ్మతి తెలిపెను. "నా యిరువురు కొమార్తెలను పట్టణములో ఒక శీతాకాలము గడపుటకు నాకెట్టి అభ్యంతరమునులేదు. నాకు వారి అభివృద్ధియే కావలయును. అంతకంటె సంతోషకరమైన విషయము నాకు మఱియొకటిలేదు."

ఆమెమాటలను విన్నతరువాత నేను మాట్లాడకుండ నుండలేకపోతిని. నేనునాఅభిప్రాయమును ప్రస్ఫుటముగ ప్రకటించుచు నిట్లంటిని: "నా కుమార్తెలకు దురదృష్టవశమున సంపదలేదన్న మాటయేగాని మంచి తర్ఫీదుకు లోటేమియులేదు. వా రిదివఱకే చక్కని శిక్షణమును పొందియున్నారు. నాగరికత ఎక్కువైన కొలది వారి బీదరిక మింకను పరిహాసాస్పదముగ కనబడును. తాము అనుభవించుటకు అర్హతలేని సుఖములనుగూడ అనుభ

వింపవలయుననుకోరిక కలుగును. ఇది ఏమాత్రమును వాంఛనీయముకాదు."

"నేను మీ అభిప్రాయముతో ఏమాత్రమును ఏకీభవింపనని చెప్పుటకెంతయు విచారించుచున్నాను" అని తార్న్‌హిల్ చెప్పసాగెను. "మీకోమార్తలు అన్నిరకముల సౌఖ్యములను అనుభవించుటకు అర్హులు. వారు ఏసౌఖ్యము ననుభవించుటకు అర్హులుకారో చెప్పుడు! మీకోమార్తెలు ఇతరులకు ఆనందము నొసగగలరు. అట్టివారు సౌఖ్యముల ననుభవించుట కర్హులు కారనుట కడుంగడు హాస్యాస్పదముగ నుండును. ఇక నా విషయము చెప్పుమందురా? నాకు కావలసినంతఐశ్వర్యమున్నది. ఈ విషయము మీకు బాగుగ తెలియును. ప్రేమ, స్వేచ్ఛ, ఆనందము – ఈమూడును నా జీవిత ధ్యేయములు. నా ఐశ్వర్యములో సగభాగము నా అందాల ఒలీవియాకు ఆనందము నొసగగలిగినచో దాని నామెకిచ్చుటకు నేను సిద్ధముగనున్నాను. ఇందుకు నే నేమాత్రము వెనుదీయను. నేనిందుకు ప్రతిఫలమేమియు ఆశింపను. నాకామె స్నేహము చాలును."

నేను ఇట్టి ప్రపంచవ్యవహారముల కేమియు క్రొత్తవాడను గాను. తార్న్‌హిల్ మాటలలోని అంతరార్థమును గ్రహింపలేని మూర్ఖుడనుకాను. 'గౌరవనీయులు' అను ముసుగులోనున్న దురాత్ములందఱును తమ నికృష్టకోరికలను ఈ విధముగనే వెలిపుచ్చుచుందురు. తమ హీనాతిహీనమైన కోరికల నీవిధముగనే సరళమగు భాషలో బయల్పఱచుచుందురు. తార్న్‌హిల్ మాటలు నాకు అపరిమితమగు అసహ్యమును కలిగించెను. కాని నేను దాని నేమాత్రము బయల్పఱచక అణచుకొంటిని.

"అయ్యా! మీరు మా కుటుంబమువారితో స్నేహము చేయవలెనని వాంఛించుచున్నారు. మీరు ఎంత మర్యాదగ బ్రతుకుచున్నారో మేముగూడ అంతే మర్యాదగ బ్రతుకుచున్నాము. మా మానమర్యాదలను గాయపఱచుట కెవ్వరెట్టి ప్రయత్నములు చేసినను తీవ్రమగు దుష్ఫలితములు కలుగును. మా, కిప్పుడున్నవి మానమర్యాదలే. కావున మేము వానిని ఎంతో జాగ్రత్తగ కాపాడుకోవలసియున్నది" అని నేనంటిని.

కాని నేనంత ఘాటుగా మాట్లాడినందుకు తరువాత విచారించితిని. ఏలయన తార్న్‌హిల్ నా రెండుచేతులు పట్టుకొని ఇట్లనెను: "మీ ఉద్దేశ్యమును నే నెంతయు ప్రశంసించుచున్నాను. కాని మీ అనుమానములు నిరాధారమైనవని చెప్పకతప్పదు. వానిని నే నేమాత్రము అంగీకరింపజాలను. మీ మాటలలోని అంతరార్థమును గ్రహించినాను. అటువంటి తలపునకు నా హృదయములో నెట్టి స్థానమును లేదని నేను స్పష్టముగ ప్రకాశించుచున్నాను. మిక్కిలి తీవ్రముగ ప్రతిఘటించు సౌశీల్యము నా కేమాత్రము రుచింపదు."

అంతవఱకు మాట్లాడకుండనున్న పట్టణ యువతులిరువురును సౌశీల్యమునుగూర్చి మాట్లాడసాగిరి. ఆ విషయమునకు సంబంధించిన చర్చలలో నాభార్య, తార్న్‌హిల్ పురోహితుడు, నేనుకూడాపాల్గొంటిమి. ఎట్టకేలకు తార్న్‌హిల్ తానుపూర్వము మితిమీరిన ప్రవర్తించినందుకు అపరిమితముగు విచారమును ప్రకటించెను.

మేము నిగ్రహమువలని లాభములను గూర్చియు, పాప శంకిలము కాని మనస్సు చక్కగా ప్రకాశించునను విషయమును

గూర్చియు చాలసేపు మాట్లాడుకొంటిమి. ఆ సంభాషణ నాకు ఎంతయు బాగుండెను. మామూలుకాలము అతిక్రమించినను మా చిన్నపిల్లలు ఆ సంభాషణమునంతను చక్కగా నాలకించిరి. అది నాకెంతయు సంతోషకారణముగనుండెను. తార్న్‌హిల్ నాకంటె మఱియొక అడుగు ముందుకువేసెను.

"మనమందఱము కలసి ప్రార్థనచేయుదుము. ఇందుకు మీకెట్టి అభ్యంతరమును లేదనుకొందును" అని అతడనెను.

"నా కభ్యంతరమా ? పరుండుటకు ముందు దయామయుడగు భగవానునకు కృతజ్ఞతాంజలి సర్పించుట మాకు అలవాటు. మీరు చెప్పినదానికి నేను సంతోషముతో నంగీకరించుచున్నాను" అని నేనంటిని.

ఆవిధముగా మేమందఱ మారాత్రికాలమును ఆనందకరముగ గడపితిమి. ఎట్టకేలకు ఎవరియిండ్లకు వారు పోవలసిన సమయ మాసన్నమాయెను. పట్టణమునుండి వచ్చిన ఇరువురు యువతులు మాకొమార్తల నిరువురను వేసిపోవుటకు ఏమాత్రము ఇష్టపడకుండిరి. వారికి మాకొమార్తలపట్ల ప్రత్యేకమైన ప్రేమ ఏర్పడెను.

"మీకొమార్తె లిరువురను మాతోబాటు మాయింటికి పంపిన ఎంతయు సంతసింతుము" అని ఆ యువతు లిరువురును మమ్ము దీనముగ ప్రార్థించిరి.

"మీకోరిక ఎంతయు సమంజసముగనున్నది. మీమాట తప్పక నెఱవేఱునని నేను ఆశించుచున్నాను" అని తార్న్‌హిల్ అనెను.

"అవును. మన కొమార్తలీ నాగరక యువతులతో కలసిపోవుట కనుమతింపుడు. అందువలన మనవారికి ఎనలేని లాభము చేకూరును" అని నాభార్య నన్ను ప్రార్థించెను.

నా కొమార్తల అభిప్రాయమేమో తెలిసికొనదలచినేను వారి వంకకు చూచితిని. వారు నావంకే చూచుచుండిరి.

"నాన్నా ! వారి కోరికకు అంగీకరింపుము. మేమువారితో కలసిపోవలయునని ఎంతయు ఉత్సాహపడుచున్నాము. నాన్నా ! నాన్నా ! మాకోరికను అంగీకరింపుము. ఇందువలన మాకు మంచి భవిష్యత్తు చేకూరును" అను నర్థము వచ్చునట్లు వారి చూపులుండెను.

నాకుమాత్రము మాకొమార్తెలను పట్టణయువతులతో పంపుట కేమాత్రము ఇష్టములేకుండెను. నాకంతయు అయోమయముగనుండెను. ఏమిచేయవలయునో తోచకుండెను. ఎట్టకేలకు నేను వారిని పంపుటకు వీలులేదని చెప్పితిని. అందుకు నేను ఏవో రెండు మూడు కారణములను చెప్పితిని. కాని నాకొమార్తలు వానినిసులభముగా పూర్వపక్షముచేసిరి. అప్పుడు నేను నిస్సహాయుడనైతిని. విధిలేక నా కొమార్తలను పంపుట కేమాత్రమును వీలులేదని ఖండితముగా చెప్పితిని. అంతట ఎవరి దారినివారు పోయిరి. మఱునాడు నాభార్య, కొమార్తలు నన్ను మ్రింగివేయునట్టుల చూడసాగిరి. నేనేమి అడిగినను ముక్తసరిగా మాత్రమే సమాధానము చెప్పసాగిరి.

# 10

నేను నాకుటుంబమువారికి నిగ్రహము, నిరాడంబరత్వము, ఉన్నదానితో సంతృప్తిచెంది జీవించుట మున్నగు ఎన్నో విషయములనుగూర్చి పలుమార్లు చక్కగాచెప్పితిని. కాని వారు నా మాటలను పాటించుట లేదనియు, వారు వానికి భిన్నముగ నడచుకొనుటకు సిద్ధపడుచున్నారనియు స్పష్టపడసాగెను. మాకు ధనమున్నప్పుడు మావారెంతయు గర్వించుచుండిరి. ధనముపోయిన తరువాత ఆగర్వము నిద్రావస్థను బొందెను. దానిని వారినుండి పూర్తిగ తొలగించుటకు నాకేమాత్రమును శక్యముకాకపోయెను. ఇటీవల మాయింటికి తార్న్‌హీల్ మున్నగు ధనికులు వచ్చుచున్నారు. మావారిని ప్రశంసించు చున్నారు. అందువలన వారిలో అణగియున్న గర్వము మరల విశృంఖలముగా విజృంభింపసాగెను.

మాయింటి కిటికీలన్నియు మరల మెడ, ముఖమున్నగు అవయవములకు కృత్రిమపు మెఱుగును తెచ్చు పదార్థములతో నిండిపోసాగెను. బయటకు పోయినచో ఎండవేడిమికి చర్మము పూర్తిగా పాడైపోవునని నాకొమార్తెలు తలంచుచుండిరి. వారు సూర్యుని తమ విరోధిగా భావించుచుండిరి. ఇంటిలోపల కుంపటి వద్దకూర్చున్నచో శరీర లావణ్యము చెడిపోవుననిగూడ వారు తలప సాగిరి.

“పెందలకడ నిదురనుండి లేచినచో మన అమ్మాయిల కన్నులు చెడిపోవును. కన్నులందముగా నుండవలయునన్న వారు చాలసేపు నిదురింపవలసి యున్నది. మధ్యాహ్నపు భోజనమైన

తరువాత పనిచేసినచో వారి ముక్కులు కందిపోవును. పనులు చేసినచో చేతులు నల్లబడి పోవును. పనులు చేయకుండనున్నచో చేతులు చాల తెల్లగ నుండును." అని నాభార్య నాకు పలుమార్లు చెప్పసాగెను. ఆమె ధోరణి కనుగుణముగ మాకొమార్తెలు ప్రవర్తింపసాగిరి.

మా పొరుగుననున్న ఫ్లామ్బరో కొమార్తెలు అంతవఱకు నా కొమార్తెలకు ముఖ్య స్నేహితురాండ్రు. వారెప్పుడును కలసి మెలసి యుండెడివారు. కాని వారిప్పుడు నాకొమార్తెల స్నేహము చేయుటకు అర్హురాండ్రు కాకపోయినారు. వారు చాల తక్కువ హోదాలోనివారట! కడునీచమైనవారట! అట్టివారితో స్నేహము చేయుట ఏ మాత్రమును వాంఛనీయము కాదట! ఫ్లామ్బరో కొమార్తెలనుగూర్చి నా కొమార్తెల అభిప్రాయములట్లున్నవి! నా కొమార్తె లెప్పుడును పెద్దవారికి సంబంధించిన కబుర్లనే చెప్పుకొన సాగిరి. వారిజీవిత విధానమునే వేర్వేఱు రకములుగా వర్ణించి చెప్పుకొనసాగిరి. వారిమాటలలో షేక్స్పియరు నామము తఱచుగా దొర్లసాగినది.

అంతలో ఒకనాడు మాయింటికి భూత వర్తమాన భవిష్యత్కాలములకు సంబంధించిన విషయములను స్పష్టముగా చెప్పగల జిప్సీ ఒకర్తె వచ్చెను. ఆమె రాకతో మావారి ఆశలు ఆకసమునంటెను. ఆమెను చూడగానే నా కొమార్తె లిరువురును నావద్దకు పరుగెత్తుకొనివచ్చి, "నాన్నా! మేము జోస్యము చెప్పించుకొన వలయును; మాకు చెఱియొక పిల్లింగు నాణెమును ఈయుము. ఆమెచేతిలో వెండినాణెము పెట్టవలసి యున్నది" అని అనిరి.

నిజము చెప్పవలయునన్న నేను ఎప్పుడును తెలివిగా ప్రవర్తించుటకు ప్రయత్నించుచు విసుగెత్తి పోవుచుంటిని. నా కొమార్తెల కోరికలను తీర్చకుండ నుండలేక పోవుచుంటిని. అందుకు కారణము వారెప్పుడును ఆనందముగ నుండవలయునని నేను వాంఛించుటయే. అందువలననే నేను వారికి జోస్యము చెప్పించుకొనుటకు చెరియొక షిల్లింగు నాణెమును ఇచ్చితిని. ఈ సందర్భమున మా కుటుంబ గౌరవమును నిలబెట్టుటకై నే నొక ముఖ్యవిషయమును చెప్పవలసి యున్నది. నా కొమార్తెలు నన్ను డబ్బునడిగినారుగనుక వారివద్ద వేఱు ధనములేదని ఎవ్వరును భావింపరాదు. ఏలయన నాభార్య ఔదార్యమువలన వారివద్ద నెప్పుడును చెరియొక గినీ నాణెము ఉండును. వారెచ్చటకు బోయినను ఆ నాణెములను తమతోబాటు తీసికొని పోవుదురు. "ఈ నాణెములను మీరెప్పుడును మీ జేబులలో నుంచుకొన వలయును. కాని వీని నే సందర్భములోను మార్చరాదు" అని నాభార్య వారికి ఖండితముగా చెప్పియుండెను.

నా కొమార్తెలిరువురును జిప్సీ యువతివద్ద ఒకగంట కాలముండిరి. తరువాత వారిరువురును నావద్దకు తిరిగివచ్చిరి. వారి చూపులనుబట్టి జిప్సీ యువతి వారి ఆశల కనుకూలముగ జోస్యము చెప్పియుండెనని గ్రహించితిని.

"అమ్మాయిలు! ఏమి జరిగినది? జిప్సీ యువతి మీ కనుకూలముగ చెప్పినదా? మీభవిష్యత్తు ఆశాజనకముగ నున్నదా? మీ రామెకు రెండు షిల్లింగు నాణెములు నిచ్చినారు. మీరామె వద్దనుండి కనీసము పెన్నీ విలువగల ప్రతి ఫలమునైన పొందినారా?" అనినేను నా కొమార్తెలను ప్రశ్నించితిని.

అప్పుడు నా పెద్దకొమార్తె ఒలీవియా ఇట్లుసమాధానము చెప్పెను. "నానా! ఆమె బాగుగనే చెప్పినది. పండ్రెండు నెలల లోపలనే నాకు, ఒక భూస్వామికి వివాహము జరుగునట. ఆవిష యము నామె సుస్పష్టముగ చెప్పినది."

అంతట నేను నా రెండవ కొమరిత సోఫియాతో నిట్లం టిని. "అమ్మాయి! సోఫీ! ఇక నీసంగతి చెప్పుము. నీకెట్టిభర్తవచ్చు నని జిప్సీ యువతి చెప్పినది?"

అప్పుడు సోఫియా ఇట్లు జవాబిచ్చెను. "నాన్నా! నాఅక్క భూస్వామిని వివాహమాడిన అనతికాలములోనే నేనొక ప్రభువు (లార్డు)ను వివాహ మాడుదునట!"

"బాగు బాగు! మీవద్దనుండి రెండు షిల్లింగు నాణెము లను తీసికొని ఆమె ఇంత తక్కువగా చెప్పినదా? రెండు షిల్లింగు లకు ఒక ప్రభువు ఒక భూస్వామి మాత్రమేనా? మీరువట్టి తెలివి తక్కువవారు. నేను ఒక షిల్లింగు నాణెమునకే ఒకరాజును, ఒక నవాబును వాగ్దానము చేసియుండెడి వాడను!"

జిప్సీ యువతి జోస్యముతో మావారి ఆశలు ఆకసము నంటెను. దానిఫలితముగ అనేక విషమ పరిస్థితులు లేర్పడెను. గ్రహములు మా కనుకూలముగ నున్నవనియు, అవి మమ్మ అత్యుచ్ఛస్థితికి తీసికొనిపోవు ననియు మేము భావింపసాగితిమి. మాభవిష్యత్కాలపు వైభవమునుగూర్చి కలలు గన సాగితిమి.

నేనిదివరకొక విషయమును వేలకొలదిసార్లు చెప్పితిని. ఆ విషయమును నేనిప్పుడు మఱియొకసారి చెప్పుచున్నాను. అది యేమన; భవిష్యత్కాలపు వైభవమునుగూర్చి కలలు గాంచుచు గడపు కాలము, కలలు ఫలించు కాలముకంటె సంతోష

కరమైనది. ఏలయన మనము గాంచు కలలు మన యిష్టానుసార ముండును. అవి మనకోరికల కనుకూలముగనుండును. కలలు ఫలించుటయన్నది మన చేతిలో నుండదు. అది ఏవిధముగనైన జరుగవచ్చును. మనకు పూర్తి అనుకూలముగ నుండవచ్చును. ఉండకపోవచ్చును.

మేము గాంచిన కలల నన్నిటిని ఇచ్చట వర్ణింపబూనుట చాల అసాధ్యమగువిషయము. అదృష్టదేవత మమ్ము చల్లగా చూచుచున్నదనియు, మాకు తిరిగి అదృష్టదశ పట్టనున్నదనియు మేము భావింపసాగితిమి. గ్రామములోనివారందఱును భూస్వామి తార్న్‌హిల్ నా పెద్దకొమార్తె ఒలీవియాను గాఢముగా ప్రేమించుచున్నాడని నొక్కి వక్కాణింపసాగిరి. ఆ సంగతి ఎంత వఱకు నిజమో తెలియదుకాని ఒలీవియా అతని ప్రేమించు చుండెనన్నమాట మాత్రము ముమ్మాటికిని నిజము.

నా భార్యకు ప్రతిరాత్రి చక్కని కలలు రాసాగెను. అవి మాకెంతయు అనుకూలముగనుండెను. మాకు భవిష్యత్కాల ములో పట్టనున్న అదృష్టము నా కలలు ప్రస్ఫుటముగా ప్రక టించుచుండెను. అంతటి గొప్పకలలు నా భార్యకు తక్క మఱి యింకెవ్వరికిని రావనుట తథ్యము. తెల్లవాఱగానే నా భార్య ఆ కలలన్నిటిని మిగిలిన వారందఱకు 'తు.చ' తప్పకుండ వివర ముగా వర్ణించి చెప్పుచుండెడిది. ఒకనాటిరాత్రి ఆమెకు శవపేటిక, ఒకదానిపై నొకటి అడ్డుగానుండు రెండు తొడ ఎముకలు కలలో గానవచ్చెను. త్వరలో మాయింట వివాహము జరుగ నున్నదను విషయము నా దృశ్యము సూచించుచుండెను. మఱి యొకనాటిరాత్రి ఆమెకు కలలో నా కొమార్తల జేబులనిండ

ఫా_ర్రింగు నాణెములున్న దృశ్యము కనబడెను. దాని అర్థము అనతికాలములో వారి జేబులు బంగారంతో నిండిపోవునని!

నాకొమార్తలకు కూడ మంచిసూచనలుకనబడుచుండెను. వారి పెదవులపై నెవ్వరో అద్భుతముగ ముద్దుపెట్టుకొనుచున్నట్లుండసాగెను. నిప్పులోనుండి డబ్బుసంచులు పైకెగిరి వచ్చుచుండెను. అట్టి సూచనలన్నియును వారికి త్వరలో మంచి అదృష్టము పట్టునను విషయమును సుస్పష్టముగా తెలియజేయుచుండెను.

పట్టణయువతులు మమ్ము వీడిపోయి ఒకవారమురోజులు గడచెను. అంతలో వారివద్దనుండి మా కొక యుత్తరము వచ్చెను. వా రా యుత్తరములో మా కుటుంబమువారికి తమ అభివందనములను తెలిపిరి. "రాబోవు ఆదివారమునాడు మీ కుటుంబమువారి నందఱను చర్చిలో కలసికోవలయునని మే మెంతయు ఆతురపడుచున్నాము" అని వా రా యుత్తరములో వ్రాసియుండిరి.

పట్టణయువతులువ్రాసిన యుత్తరఫలితముగా శనివారము నాటి యుదయమున నా కొమార్తెలు, భార్య సమావేశము జరుపుకొనిరి. వా రప్పుడప్పుడు నావంకకు చూడసాగిరి. వారేదో విషయమునుగూర్చి గాఢముగ నాలోచించుచున్నట్లు వారిచూపులనుబట్టి స్పష్టపడుచుండెను. మఱునాడు చర్చికి గొప్పవైభవముతో పోవుటకు వారేదో ప్రణాళికను వేసికొనుచున్నారని నాకు అర్థమగుచుండెను.

సాయంకాల సమయమున వారు తమ ప్రణాళికను అమలులో పెట్టసాగిరి. నాభార్య మొట్టమొదట ముట్టడిని సాగింప

ప్రయత్నించెను. తేనీరు సేవించిన తరువాత నేను ఉత్సాహముగ నున్న సమయముచూచి ఆమె యిట్లనెను: "ప్రియనాథా! రేపు చర్చికి గొప్పవారు పలువురు వత్తురని ఊహించుచున్నాను."

అపుడు నేను ఇట్లంటిని: "ప్రియురాలా! నీవు ఊహించుచున్న ప్రకారము గొప్పవారు పలువురు రావచ్చును. కాని నీవా విషయమును గుఱించి బాధపడవలసినపని ఏమియు లేదు. ఏలయన వారు వచ్చినను రాకపోయినను కార్యక్రమము మామూలుగ జరిగిపోవును."

"అవునవును" అని నాభార్య అనసాగెను. "అచ్చట మనము సాధ్యమైనంతవఱకు యుక్తముగా కనబడవలయునుగదా. ఏలయన ఎప్పుడేమి జరుగునో ఎవరికి తెలియును?"

"నిజమే. మీరు తీసికొనుచున్న ముందు జాగ్రత్తలు కడుంగడు ప్రశంసనీయమైనవి. యుక్తమైన ప్రవర్తన, యుక్తముగ కనబడుట చర్చివద్ద చాల అవసరమనుటకు ఎట్టి సందేహమును లేదు. నాకవి యెంతయు ఆనందదాయకములుగ నుండును. వినయము, భక్తి, నైర్మల్యము, ఉల్లాసము చర్చివద్ద ఎంతయు నుపయోగకరముగ నుండును."

"ఆ విషయమునాకు బాగుగ తెలియును. కాని నేనిప్పుడు వానినిగూర్చి మాట్లాడుటలేదు. మనమచ్చటకు తగిన విధముగా వెళ్ళవలయునుగదా. మనమచ్చటకు నీచులవలె ముఱికిగాపోవుట తగదు. ఇందులకేమందురు?" అని నాభార్య అనెను.

"నీవు చాలచక్కగా చెప్పినావు. నేనుగూడ ఆ విషయమునే చెప్పవలయుననుకొనుచున్నాను" అని నేనంటిని. "మిగిలినవారందఱికంటె ముందుచర్చికి పోవలయుననుటయే నేను చెప్ప

దలచుకొన్న విషయము. అందువలన మనము దేవుని ప్రార్థించుట కింకను ఎక్కువకాలము లభించును."

"ఆమాట నిజమే. కాని నేను చెప్పదలచుకొన్నది ఆవిషయమునుగూర్చి కాదు. మనము చర్చికి పెద్దమనుష్యులవలె పోవలయును. చర్చి ఇచ్చటకు రెండుమైళ్ళదూరమున నున్నదను విషయము మీకు తెలియును. అచ్చటకిప్పుడు మన కొమార్తెలు నడచిపోవుట ఏ మాత్రమును వాంఛనీయముకాదు. నడచుటవలన వారు పూర్తిగా అలసి పోదురు. శరీరమంతయు ధూళితోనిండి పోవును. వారు అప్పుడే ఏదో పరుగుపందెములో పాల్గొని విజయమును సాధించినవారివలె కనబడుదురు. కావున ఈ సందర్భమున నేను మీకొక చిన్న విషయమును చెప్పదలచుకొన్నాను.

మనవద్ద రెండు గుఱ్ఱములున్నవికదా. అందొకటి మన యింట సుమారు తొమ్మిది సంవత్సరములనుండి యున్నది. మఱియొక గుఱ్ఱము బ్లాక్ బెరీ నెలరోజులనుండి చేసినపని యేమియు కనబడుటలేదు. రెండును బాగుగామెక్కి బలియుచున్నవి. పనిలేక సోమరులుగా నున్నవి. మనము కష్టపడి పనిచేయుచున్నప్పుడు అవిగూడ ఎందుకు కష్టపడి పనిచేయరాదు? మన మోజెస్ వానిని కొంచెము అలంకరించినచో అవి చూచుటకు బాగుగనే యుండుననుటకు సందేహమేమియులేదు." అని నాభార్య అనెను.

కాని నే నామె చెప్పినదానికి అంగీకరింపలేదు. నే నా విషయమును ప్రతిఘటించుచు నిట్లంటిని; "ఆ రెండు గుఱ్ఱములపై నెక్కి ప్రయాణముచేయుటకంటె నడచి పోవుటయే వేయిరెట్లు మేలుగనుండునని నేనుగట్టిగా అభిప్రాయ పడుచున్నాను. ఏలయన మనయింటిగుఱ్ఱమునకు తోకలేదు. బ్లాక్ బెరీకన్నులు తెల్లకన్నులు.

మనకు అపాయమును కలిగించు ఉపాయము లెన్నో ఆ రెండు గుజ్జములకు తెలియును. అదియుగాక మనయింటిలో ఒక పెద్ద జీను, ఒక చిన్న జీను మాత్రమే యున్నవి."

ఆవిధముగ నేను ఎన్నో అభ్యంతరములను తెలిపితిని. కాని నాభార్య ఆ అభ్యంతరముల నన్నింటిని తన సహజధోరణితో ఖండించివైచెను అందువలన నేను వారి కోరికకు తప్పక అంగీకరింపవలసిన పరిస్థితి ఏర్పడెను.

మఱునాటి యుదయమున నాభార్యా కొమార్తలు ఏచ్చటికో దండయాత్రకు పోవుచున్నట్లు సకలసన్నాహములు చేసికొనసాగిరి. కాని నేను వారి ప్రయత్నములలో ఎట్టిజోక్యము కలుగజేసికొనలేదు.

"నేను చర్చికి నడచిపోవుచున్నాను" అని మాత్రమే నేను వారితో అంటిని.

"మంచిది. మీరు ముందుపొండు. మీ వెనుక మేము బయలు దేఱుదుము. మీరు చర్చివద్దకు పోవునప్పటికి మేము కూడ అచ్చటకు రాగలము" అని వారు చెప్పిరి.

నేను నడచిపోయి చర్చిని చేరుకొంటిని. మావా రింకను రాలేదు. నేను వారికొఱకొక గంటకాలము వేచియుంటిని అప్పటికిని వారు రాలేదు. వారు రాసందుకు కారణమేమో తెలియకుండెను. ఇంక వేచియుండుటకు వీలులేక నేను చర్చిలో చేయవలసిన ప్రార్థన మున్నగు పనులు చేసికొని పోసాగితిని. కాని మావారు రాసందుకు మనస్సులో బాధపడుచునేయుంటిని. నాపని పూర్తిఅయ్యెను. మావారింకనురాలేదు. నేనెంతయు ఆందోళన పడసాగితిని.

ఇంక నే నప్పుడు చేయవలసినది ఏమియున్నది? ఇంటికి తిరిగి పోసాగితిని. కాలిదారిని పోయినచో నచ్చటకు మా యిల్లు రెండుమైళ్ళదూరముననున్నది. కాని గుఱ్ఱముల ప్రయాణము చేయుదారి అయిదుమైళ్ళ పొడవున్నది. మావారు గుఱ్ఱముల మీాద వత్తునన్నారు. కనుక నే నవి ప్రయాణముచేయుదారినే నడచిపోసాగితిని. సుమారు సగముదూరము పోవునప్పటికి మెల్లన గుఱ్ఱములమీాద వచ్చుచున్న మావారు కనబడిరి. అంత ఆలస్యమైనను వారు చర్చి ప్రయాణమునుమాత్రము విరమించుకొనలేదు.

నాభార్య, రెండవకుమారుడు మోజెస్, చిన్నకుమారులు ఇద్దఱు ఒక గుఱ్ఱము నధిరోహించియుండిరి. నా కొమార్తె లిద్దఱును మఱియొకగుఱ్ఱమును అధిష్ఠించియుండిరి. నేను వారిఆలస్యమునకు కారణము తెలిసికొనగోరితిని. వారి చూపులనుబట్టి దారిలో వారెన్నో కష్టముల ననుభవించియుండిరను విషయము స్పష్టపడుచుండెను. మొట్టమొదట గుఱ్ఱములు ఇల్లువదలి ప్రయాణమై పోవుటకు నిరాకరించియుండెను. అంతట నచ్చటకువచ్చిన బర్చెల్ అపరిమితమగు దయతో ఆ గుఱ్ఱములను రెండువందల గజముల దూరమువఱకు తన కొరడాతో కొట్టి నడిపించెను. కొంతదూరము పోయినతరువాత జీను పటకాలు తెగిపోయెను. అందువలన వానిని బాగుచేయుటకు వారొకచోట ఆగవలసి వచ్చెను మఱికొంచెముదూరము పోయినతరువాత గుఱ్ఱములలో నొకటి ఆగిపోయెను. ఎన్నిదెబ్బలుకొట్టినను, ఎంతగా ప్రార్థించినను అది ఒక్క అడుగైనను ముందుకు వేయలేకపోయెను.

నేను వారిని చూచుటకు కొన్ని నిమిషములకు ముందే

వారా దుర్దశనుండి బయల్పడి ప్రయాణము సాగించిరి. అందఱును సురక్షితముగ నున్నందుకు నే నెంతయు సంతసించితిని. నాకు పడిన కష్టములు, పొందిన అవమానము నాకు అణుమాత్రమైనను విచారమును కలిగించలేదని చెప్పకతప్పదు. ఏలయన నేను ముందు ముందు విజయదుందుభిని మ్రోగించుటకు నాకు చక్కని అవకాశము లభించినది. ఎక్కువ వినయముగ నుండవలసిన ఆవశ్యకతనుగూర్చి నా కొమార్తెలకు చక్కగా, గట్టిగా బోధించుటకుగూడ అవకాశము లభించినది.

# 11

మైకల్‌మస్ పండుగకు ముందాదినమున మేమందఱము మా పొరుగుననేయున్న ఫ్లామ్‌బరో గృహమున కాహ్వానింపబడితిమి. ఇటీవల చర్చి ప్రయాణసందర్భమున జరిగిన అవమానము వలన మా యింటిలోనివారు కొంచెము వినయముతో అంగీకరించిరి. లేనిచో వారా యాహ్వానమును తృణప్రాయముగా తిరస్కరించియుండెడివారని నే ననుకొనుచున్నాను.

మేమందఱము ఫ్లామ్‌బరో గృహమున కేగితిమి. అచ్చటి పదార్థములన్నియు చాల బాగుండెను. సాధారణముగా నాభార్య ఇతరుల గృహములలోని వేనినిగాని ప్రశంసింపదు. అట్టి యామె కొన్నిటిని చాల బాగుగ నున్నవని ప్రశంసించెను. ఫ్లామ్‌బరోకు కథలు చెప్పుటయనిన నెంతయు నిష్టము. అతడు చెప్పిన కథలనే మాటిమాటికి చెప్పుచుండును. ఆనాడుకూడ నతడట్లే చెప్పెను. అతడు వానిని చెప్పినవిధానము ఏమాత్రము బాగుండలేదని

స్పష్టముగ చెప్పక తప్పదు. ఆ కథలు చాలపెద్దవి; ఏమాత్రము ఉత్సాహమును కలిగింపనవి. అవి యన్నియు అతనికి సంబంధించి నవే. వానిని విని మే మిదివఱకు ఎన్నోసార్లు నవ్వియుంటిమి. అయినను మేము ఎంతోదయతో ఓపికవహించి విని మఱియొక సారి నవ్వితిమి. అది ఫామ్‌బరోకెంతయు సంతృప్తిని చేకూర్చెను.

నాడు ఫామ్‌బరో ఇంటికి వచ్చినవారిలో బర్చెల్‌గూడ నుండెను. అతడెప్పుడును ఏదో ఉత్సాహకరమైన కార్యములను చేయుచునేయుండును. "ఈ మంచి సమయమున బాల బాలిక లందఱును కలసి దాగుడుమూత లాడుట ఎంతయు బాగుండును" అని అత డనెను. అందు కచ్చటనున్నవారు పలువురు అంగీక రించిరి. "ఈఆటలో మీరుకూడ పాల్గొనినఎంతయుబాగుండును" అని యతడు నా భార్యనుగూడ ప్రోత్సహించెను. అందువలన నామెకూడ నా యాటలో పాల్గొనెను. నాభార్య అంతముదుసలి కాదను నభిప్రాయము నాకు అపరిమితమగు సంతోషమును కలిగించెను.

నేను, ఫామ్‌బరో ఇతరులు ఆడుకొనుచుండగా చూడ సాగితిమి. వారి ఆటనుచూచి నవ్వుకొననసాగితిమి. చిన్నప్పటి మా యాటనుగూర్చి ముచ్చటించుకొని ప్రశంసించుకొన సాగి తిమి. దాగుడుమూతలాట తరువాత మఱికొన్ని ఆటలు జరిగెను. చిటచివఱకు చెప్పుల ఆట ప్రారంభమయ్యెను. ఈ ఆట చాల అనాగరికమైనది. పూర్వకాలమునకు సంబంధించినది. ఈ ఆటలో పలువురు వృత్తాకారముగా కూర్చుండియుందురు. మధ్యలో ఒకరు నిలబడియుందురు. వృత్తాకారముగ కూర్చున్నవారు మధ్య నిలబడియున్న వారిమీదికి చెప్పును విసరుచుందురు. మధ్యనున్న

వారు చెప్పుదెబ్బ తగులకుండ రక్షించు కొనుచుండవలయును.

ఆట ప్రారంభమైన కొంచెముసేపటికి వృత్తాకారము మధ్య నిలపడవలసిన వంతు నా పెద్దకొమార్తె ఒలీవియాకు వచ్చెను. ఆమె తన్ను చెప్పుదెబ్బనుండి రక్షించుకొనలేక పోవు చుండెను. అందువలన నామె ఘోరముగ అఱవసాగెను. కాని ఆమె అఱపును లక్ష్యపెట్టు వారెవ్వరును లేకుండిరి. ఆమె ఆ యవ మానమును ఏ మాత్రము భరింపలేని స్థితిలోనుండెను. సరిగా ఆ సమయమునకు గోరుచుట్టుపై రోకటిపోటువలె పట్టణయువతు లిరువురును అచ్చటకు వచ్చిరి. వారు నాకొమార్తె దుస్థితిని చూచిరి. అప్పుడు నా కొమార్తెలకు, భార్యకు కలిగిన క్రొత్త అవమానమును వర్ణింప నెవరితరము! ఆ యవమానమును కెవ్వరికిని వర్ణించుట మాటలు చాలవనుట తథ్యము. నిజముగానది మరణసదృశ్యమైనది. మరణమైనను మేలేమో! నాకొమార్తెలు అనాగరికపు ఆటను ఆడుచుండగా నాగరిక యువతులిర్వురును చూచినారు. ఎంతఘోర మెంతఘోరము! ఎంత అవమానము! ఆ ఆటఆడిన బాగుండునని సలహాఇచ్చినవాడు ఫ్లాంబరో అతనిసల హాను పాటించుటవలన ఇంతఘోరము జరిగినది. ఆ సమయమున మాకు నోటమాటరాలేదు. మేము పాతాళలోకములోనికి క్రుంగి పోవు చున్నట్లయ్యెను.

పట్టణ యువతు లిరువురును ఫ్లాంబరో గృహమునకు వచ్చుట ఎట్లు తటస్థించినది? ఆదివారమునాడు మాకుటుంబము వారు చర్చికి రాలేదుగదా. వారికేట్టి అపాయము సంభవించినదో తెలిసికొనవలయునని పట్టణ యువతు లిరువురును మా యింటికి వచ్చియుండిరి. కాని మేము ఇంటివద్ద లేము. నే మెక్కడికిపోయి

యుంటిమో తెలిసికొనదలచివారు షామ్బరో గృహమునకు వచ్చి యుండిరి, అచ్చటనున్న మమ్ము వారు చూచిరి.

"ఆదివారమునాడు మీరు చర్చికి రాకపోవుటకు కారణ మేమి? మీ క్షేమమునుగూర్చి మేమెంతయు ఆతురత చెంది నాము" అని పట్టణ యువతులు నా కొమార్తెను, భార్యను ప్రశ్నించిరి.

మువ్వురి తరఫున నా పెద్దకొమార్తె సమాధానము చెప్ప బూనెను. ఆమె జరిగిన విషయమునంతను వివరముగా చెప్పక ఒక్క వాక్యములో మాత్రమే చెప్పెను. "మేము గుఱ్ఱములపై నుండి క్రిందపడి పోయినాము" అని మాత్రమే ఆమె అనెను.

ఆవాక్యమును విన్నంతనే పట్టణ యువతులకు అపరిమిత మగు భయము కలిగెను. "మీకేమియు గాయములు తగుల లేదుగదా!" అనివారు ఆతురతతో ప్రశ్నించిరి.

"మా కెవ్వరికిని చీమకుట్టినంత గాయమైనను తగులలేదు" అని ఒలీవియా సమాధాన మొసగెను. ఆ జవాబు పట్టణ యువ తులకెంతయు సంతోషమును కలుగజేసెను.

"గాయములు తగులనిమాట నిజమే. కాని అప్పుడుమాకు కలిగిన భయమువలన చచ్చినంత పనియైనది." అని యనెను. అప్పుడు పట్టణ యువతులు ఎంతయు విచారమును ప్రకటించిరి.

"రాత్రి నిదుర సరిగానే పట్టినది" అని ఒలీవియా అనెను. ఆవార్త పట్టణ యువతులకు మరల ఆనందము కలుగ జేసెను.

పట్టణ యువతులు నా కొమార్తెలపట్ల అపరిమితమగు అభిమానమును ప్రకటింప సాగిరి. వారానాడు లోగడ కంటె నెక్కువగా అభిమానమును చూపసాగిరి. "మీతో

మేము శాశ్వతముగా స్నేహము చేయదలచుకొన్నాము" అను తీవ్రమగు ఆకాంక్షను వారు నా కొమార్తెలముందు ప్రకటించిరి.

పట్టణయువతులలో నొకర్త (ఆమెపేరు బ్లార్నీ) నా పెద్ద కొమార్తె ఒలీవియాపట్ల గాఢానురాగమును కలిగియుండెను. మఱియొకర్త (ఆమెపేరు కరలినావిల్హెల్మినా అమీలియా) నా రెండవ కొమరిత సోఫియాను గాఢముగ ప్రేమించుచుండెను. వారియువ్రుసను మాట్లాడుకొనుచుండగా నాకొమార్తలు నిశ్శబ్దముగ కూర్చుండి వారి మాటలను ఆలకింపసాగిరి; పట్టణ యువతుల గొప్పతనమును మనస్సులో ప్రశంసించుకొనసాగిరి.

పట్టణయువతుల సంభాషణలోని కొంచెము భాగ మిట్లున్నది.

కరలినా ఇట్లనెను: "ఆవిషయమునుగూర్చి నాకు తెలిసిన దిది ఇది నిజము కావచ్చును; కాకపోవచ్చును. కాని ఒక్క విషయమును మాత్రము నేనుమీకు గట్టిగా చెప్పగలను. అచ్చటి వారందఱును దిగ్భ్రమ చెందినారు. ప్రభువుగారిభార్య మూర్ఛ మునిగినది. కాని సర్ టామ్కిన్‌మాత్రము కత్తితీసి, 'నాశరీరములో కడపటి రక్తపుచుక్క ఉండువఱకు నీవు నాదానవే' అని అన్నాడు. తెలిసినదా?

అంతట బ్లార్నీ ఇట్లనెను: "నీవు చెప్పినదానినిగూర్చి నేను చెప్పగలిగినదిది. ప్రభువుగారిభార్య దానినిగూర్చి నాకు ఒక్క అక్షరమునైనను చెప్పియుండలేదు. ఆమె నాకు చెప్పకుండ ఏ విషయమునుగాని రహస్యముగా నుంచదను విషయమందఱకు తెలియును."

అన్నట్లు నా రావిధముగ మాట్లాడుచుండగా బర్చెల్ చాల అమర్యాదగ ప్రవర్తించుచుండిన విషయమును నేను ఇది వఱకే చెప్పియుండవలసినది. పట్టణయువతులు ఒక్కవాక్యమును పూర్తిచేయగనే బర్చెల్, 'బూటకము!' అని అఱవసాగెను. అత డట్లనుచుండుట మా కెవ్వరికిని రుచింపలేదు. అది పట్టణ యువతుల ఉత్సాహమును కొంతవఱకు తగ్గించెనుగూడ.

బ్లార్నీ:- నావద్ద నింతవఱకు పనిచేయుచుండిన అమ్మాయి ఒక క్లెర్కును వివాహమాడి వెళ్ళిపోయినది. నాకన్నులుఎక్కువ శ్రమ నేమాత్రము ఓర్చలేవు. మఱి నేనిప్పుడు పత్రికా వ్యాసములను స్వయముగా వ్రాసికొనుటకు చాల కష్టముగానున్నది. నేను చెప్పుచుండగా చక్కగా వ్రాయు అమ్మాయి లెవ్వరైన దొరకుదురేమోయని నేను కంటిలో వత్తిపెట్టుకొని వెదకుచున్నాను. అమ్మాయిలు చాలమందికలరు. కాని ఏమిలాభము? మనకు సరియైన అమ్మాయిలు కావలయునుకదా. సరియైన అమ్మాయిలు లభించుట సామాన్యమైన విషయముకాదు మఱి! మంచి నైతిక ప్రవర్తన కలిగియుండవలెను; చక్కగా వ్రాయను, చదవను తెలిసియుండవలెను; పనిమంచిలో మెలగువిధానము తెలిసియుండవలెను. మఱి ఇన్ని గుణగణములుగల అమ్మాయికి సంవత్సరమునకు ముప్పదిపౌనుల జీతము తక్కువేమఱి!

కరలినా:- ఆవిషయము నాకు అనుభవపూర్వకముగ తెలియును. ఈ సంవత్సర సగభాగములో ముగ్గురు అమ్మాయిలు నావద్ద పనిచేసినారు. అందొక అమ్మాయి రోజుకు ఒక గంట పనిచేయుటకు నిరాకరించినది. రెండవఅమ్మాయి సంవత్సర

మునకు ఇరువదియైదు గినీలజీతము చాలతక్కువ యనిభావించిరి.
మూడవ అమ్మాయిని నేనే ఉద్యోగమునుండి తొలగించి వైచి
నాను. ఏలయన ఆమె పురోహితునితో అక్రమ సంబంధము
కలిగి యున్నట్లు నాకు అనుమానము తగిలినది. మంచి నైతిక
ప్రవర్తనమునకు నేను అత్యధికమగు ప్రాధాన్యము నొసగుదును
కాని అది ఎక్కడనున్నది?"

నాభార్య వారి సంభాషణమును 'తుచ' తప్పకుండ
వీనులకు విందుగ వినుచుండెను. ముఖ్యముగా ఆమెకు వారి కడ
పటి మాటలు నచ్చెను. సంవత్సరమునకు ముప్పది పౌనులు, ఇరు
వదియైదు గినీలు అనగా మొత్తము ఏబది ఆఱు పౌనుల అయిదు
షిల్లింగులన్నమాట! ఆ సొమ్మును తన కుటుంబములోనివారికే
సులభము సమకూర్చ వచ్చును! తన కొమార్తెల నిరువురను
పట్టణ యువతులు తమయొద్దయుద్యోగమునకు కుదుర్చుకొన్నచో
నది సాధ్యమే అగును. ఆమెయా విషయమున నొక నిశ్చయము
నకు వచ్చెను.

నాభార్య ఒక్క క్షణకాలము నా అంగీకారమును తెలిసి
కొనుటకై నావంకకు చూచెను. నిజము చెప్పవలయునన్న పట్టణ
యువతులవద్ద ఖాళీగానున్న రెండు ఉద్యోగములను నాకొమార్తె
లిరువురకు చక్కగా సరిపోవును. అదియుగాక యజమానుడు
తార్న్‌హిల్ నా పెద్దకొమార్తెను నిజముగా ప్రేమించుచున్నచో
ఆతని పొందుట కామెకిదియొక చక్కని మార్గము. నాభార్య
కూడ అందువలననే పట్టణ యువతులవద్ద తన కొమార్తెల
నుద్యోగమునకు కుదుర్ప దలచెను.

ఆమె పట్టణయువతులతో నిట్లనెను: "గౌరవనీయులారా! నేను చనవు తీసికొని మీ సంభాషణములో జోక్యము కలుగ జేసికొనుచున్నందులకు నన్ను క్షమింపవలయునని ప్రార్థించు చున్నాను. మీ యుపకారమును పొందుటకు మాకు హక్కేదియు లేదన్నమాట నిజమే. కాని ఈ విశాల ప్రపంచములో నాకొమార్తెలు ముందుకుపోవుటకు తమకర్హమైన గొప్పస్థానమును పొందవలయునని నేను ఆశించుట సహజము, సమంజసము. నాకొమార్తెలు చక్కని విద్యాబుద్ధులు కలవారనియు, శక్తి సామర్థ్యములు కలవారనియు చెప్పగలుగుటకు నేనెంతయు సాహసించు చున్నాను. ఇటువంటివారీ ప్రాంతములో మఱి యితరులు లేరనుటలో అతిశయోక్తి అణుమాత్రమైనను లేదు. వారుచక్కగా చదువగలరు; వ్రాయగలరు; పద్యములు వ్రాయగలరు. వారికికుట్టు పని మున్నగు వారిలో మంచినేర్పు కలదు. వారికి సంగీతము నందు కూడ కొలదిగా నేర్పుగలదు. వారింకను అనేక విషయము లలో నేర్పరులు. వానినన్నిటిని మేకిప్పుడుచెప్పి విసుగు కలిగింపను".

నాభార్య యుపన్యాసమును విన్నతరువాత పట్టణయువతులిరువురును ఒకరివంక నొకరు కొన్ని నిమిషములు ప్రశాంతముగ చూచుకొనిరి. వారేదో సందేహించు చున్నట్లు కనబడెను.

ఎట్టకేలకు కరలినా అపారమగు సానుభూతితో నిట్లనెను; "మీ అమ్మాయిలతో నాకుగల కొద్దిపరిచయమునుబట్టి వారా యుద్యోగముల కెంతయు తగి యున్నారని నేను అభిప్రాయపడు చున్నాను. కాని ఇంక నొక్క విషయమున్నది. వారి గుణ గణములను మేమింకను వివరముగా పరీక్షింపవలసి యున్నది. మీ

అమ్మాయిలనుగూర్చి సంపూర్ణముగా తెలిసి కోవలసియున్నది. మీ అమ్మాయిల సత్ప్రవర్తనమును నేను శంకించుచున్నానని మీరేమాత్రము అర్థము చేసికోరాదు. మేము ఒకవిధానము ననుసరించి మా వద్ద పనిచేయు అమ్మాయిల నెన్ను కొనవలసి యున్నది."

నా భార్య వారి మాటల కేమాత్రము అభ్యంతరము తెలుపలేదు. ఆమె వారితో నిట్లనెను. "మీరు వివరముగ పరీక్షింపగోరుట సహజముగను సమంజసముగను నున్నదనుట కెట్టి సందేహమునులేదు. మా అమ్మాయిల సత్ప్రవర్తనమునుగూర్చి తెలిసికొనదలచినచో మీరు మా చుట్టుప్రక్కలవారినందఱను అడిగి తెలిసికొనవచ్చును. నాకొమార్తలవంటివారు మఱి యితరు లుండరని వారు తప్పక చెప్పెదరు."

అపుడు బ్లార్నీ ఇట్లనెను: "మీ చుట్టుప్రక్కలవారిని అడుగవలసిన అవసరమేమివచ్చినది? మీ అమ్మాయిలనుగూర్చి మా బంధువు తార్న్‌హిల్ సిఫారసుచేసిన చాలును. మఱియింక అవసరమేమియులేదు."

తార్న్‌హిల్ మా అమ్మాయిలను తప్పక సిఫారసుచేయునని మేము తలచితిమి. ఆ యుద్దేశ్యముతోనే మేము పట్టణ యువతులవద్దగల ఉద్యోగములకు మా అమ్మాయిలచే దరఖాస్తులు పెట్టించితిమి.

# 12

ఫ్లామ్‌బరో గృహమునుండి మా కుటుంబము వారమంద అము ఇంటికి తిరిగివచ్చితిమి. భవిష్యత్కాలములో విజయ ములను సాధించు విషయమునుగూర్చి నాటిరాత్రి మేము దీర్ఘ ముగా చర్చించుకొంటిమి. ఇప్పుడు పట్టణయువతులవద్ద రెండు ఉద్యోగములు ఖాళీగానున్నవి. వానిలో నుత్తమమైన యుద్యోగ మునకు మా కొమార్తలలో నెవరు తగుదురాయను విషయ మునుగూర్చి నా భార్య డిబోరా మంచి తీక్ష్ణబుద్ధి నుపయోగించి మాట్లాడెను. ఇంక మాకొక అడ్డుఉన్నది. అది తార్న్‌హిల్ వద్దనుండి తెచ్చుకొనవలసిన సిఫారసు. తార్న్‌హిల్ మా అమ్మాయిలను సిఫారసుచేయడని మేము సందేహింపవలసిన అవసరమేమియు లేకుండెను. ఏలయన అతడిదివఱ కెన్నో సందర్భ ములలో మాపట్ల సద్భావమును ప్రకటించెను. మఱి యిప్పుడు అతనిని సందేహించుట ఎందులకు ?

పరుండబోయిన తరువాతగూడ నా భార్య ఆవిషయ మునకు సంబంధించిన చర్చను మానలేదు.

"ప్రియనాథా ! చార్లెస్ ! మనలో మనమాట మన మీా రోజును సద్వినియోగము చేసికొన్నామని చెప్పవచ్చును" అని ఆమె ప్రారంభించెను.

ఏమి సమాధానము చెప్పవలెనో తోచక, "బాగుగ వినియోగించినాము" అని మాత్రమంటిని.

"ఏమిబాగు ! వట్టిబాగేనా ? చాలబాగుగా వినియోగించి నాము. పట్టణములో మనవారికి గొప్ప గొప్పవారితోను, గొప్ప

గొప్ప విషయములతోను పరిచయమగును. ఇందుకు సందేహము లేదు. లండనునగరములో ఎన్నో ఘనకార్యములు జరుగుచుండును. ప్రియనాథా! పట్టణములో ప్రతిదినమును ఎన్నో వింతవిషయములు జరుగుచుండును. ప్రసిద్ధిచెందిన పట్టణయువతులే మన కొమార్తలన్న పడిచచ్చుచున్నారనగా ఇంక యువకులసంగతి ప్రత్యేకముగ చెప్పవలయునా? పట్టణయువతు లిరుపురిలోను బ్లార్ని అన్న నాకు ఎక్కువఇష్టము; ఆమె చాల ఉపకారబుద్ధిగలది. కరలినాకుగూడ నా హృదయములో స్థానము కలదు. అయినను సమయమువచ్చినపుడు ఎట్లు మాట్లాడవలయునో అట్లు మాట్లాడినాను. మన అమ్మాయిల భవిష్యత్తును గూర్చి మీరేమందురు?"

ఏమి చెప్పవలయునో తోచక నేనిట్లంటిని: "మూడు నెలలు గడచునప్పటికి వారు సరియైన స్థితిలో నుండునట్లు భగవంతుడు ఆశీర్వదించునుగాక." నా సునిశితబుద్ధిని నాభార్యకు తెలియజేయుటకై నేను తఱచుగా వాడుచుండెడి వాక్యములలో నది యొకటి. నా కొమార్తెలు విజయమును సాధించినచో, నా కోరిక ఫలించినట్లగును. వారు విజయమును సాధింపలేక పోయినచో నేనా విషయమును ముందుగనే జోస్యము చెప్పినట్లగును.

ఈ సంభాషణయంతయు మఱియొక ప్రణాళికకు నాందీ ప్రస్తావన మాత్రమే. ఆ ప్రణాళిక ఏమైయుండునాయని నేనెంతయు భయపడసాగితిని ఎట్టకేలకా ప్రణాళిక బయల్పడెను. మేమిప్పుడీ విశాల ప్రపంచములో తలెత్తుకొని గొప్పవారివలె కనబడవలయునుగదా. అందువలన నేమందుకు తగిన ఏర్పాట్లను చేసుకొనవలసి యున్నది. మాయింట తొమ్మిది వత్సరములనుండి యున్న

గుఱ్ఱము ముసలిదై పోయినది. అది యిప్పుడెందుకును పనికిరా కుండ నున్నది. దాని నమ్మివైచి ఒకరుగాని, ఇరువురుగాని ఎక్కి ప్రయాణము చేయుట కనుకూలమైన క్రొత్త గుఱ్ఱమును కొన్నచో ఎంతయు శ్రేయస్కరముగ నుండును. ఆ గుఱ్ఱముపై నెక్కి చర్చికిగాని, మఱియే యితర ప్రదేశమునకుగాని హాయిగా పోవచ్చును. ఇది యంతయు నాభార్య వాదము.

నాభార్య వాదమును నేను మొదట కడుతీవ్రముగా ప్రతి ఘటించితిని. నాభార్య కడుతీవ్రముగా సమర్థించుకొనెను. క్రమ క్రమముగా నేను బలహీనపడ సాగితిని. నాభార్య క్రమ క్రమ ముగా బలపడ సాగెను. ఎట్టకేలకు నేను నాభార్యకు పూర్తిగా లొంగిపోతిని. ప్రాతగుఱ్ఱమును అమ్మివేయుటకును, క్రొత్తగుఱ్ఱ మును కొనుటకును విధిలేక అనుమతి నొసగితిని.

మఱునాడే ప్రక్కయూరిలో పెద్దసంత జరుగును. అందు వలన నేనే ఆసంతకు ప్రాతగుఱ్ఱమును తీసికొనిపోయి అమ్మివేయ వలయునని నిశ్చయించు కొంటిని.

కాని నాభార్య ఇట్లనెను: "మీకు పడిసెముగానున్నది. కావున మీరిప్పుడు ప్రక్కయూరికి ప్రయాణమైపోవుట ఏమా త్రము వాంఛనీయముకాదు. ఆరోగ్యము పూర్తిగా చెడిపోయిన నెట్లు?"

"నాకు నీ వనుకొనుచున్నంత పడిసెభారములేదు. ప్రక్క యూరికి పోవుటవలన నా ఆరోగ్యము ఏమాత్రము చెడిపోదు. ఈ విషయమునుగూర్చి నీవేమియు సందేహింపవలదు" అనినేను ఉద్ఘాటించితిని.

నా మాటలు నాభార్యకు అణుమాత్రమైనను రుచింప

కుండెను. ఆమె యింకను నిట్లనెను; "ప్రియనాథా! చార్లెస్! మీరుపోవుటకు నే నే మాత్రము అనుమతింపను. మీ కుమారు లలో సమర్థులు లేకపోయినగదా మీరు వెళ్ళవలసిన అవసర మేర్పడుట. మన రెండవ కుమారుడు చాల తెలివైనవాడు, బేర సారములు బాగుగ తెలిసిన అఖండుడు. వస్తువులను చవుకగా కొనుటలోను, ప్రియముగా అమ్ముటలోను అతనికి మంచి నేర్పు కలదు. మనకు కావలసిన వస్తువుల నన్నిటిని అతడే చవుకగాకొని మనకెంతో లాభము చేకూర్చుచున్నాడను విషయము మీకు బాగుగ తెలియును. అతడు వర్తకులవద్ద విసుగు లేకుండ నిలబడి బేరము చేయును. కడకు ఆవలి వారే విసిగి మన కుమారుడు చెప్పినట్లే చేయుటకు సిద్ధపడుదురు."

మా కుమారుడు మోజెస్ తెలివైనవాడని, మంచి జాగ్రతకలవాడని నాకుగూడ అభిప్రాయముగలదు. అందువలన నా భార్యమాటల నామోదించి ప్రాతగుఱ్ఱమును అమ్ము భార మును, క్రొత్తగుఱ్ఱమును కొను భారమును, నా కుమారునిపై నిడుటకు నేను అంగీకరించితిని.

మఱునాటి యుదయమున నా కొమార్తెలిద్దరును మోజెస్‌ను సంతకు పంపు ప్రయత్నములో మునిగియుండిరి. వారికి ఒక్క నిమిషముగూడ తీఱిక లేకుండెను. వారతని జుట్టును చక్కగా దువ్విరి; చొక్కా, టోపీ, లాగూ మున్నగువాని నన్ని టిని చక్కగా అలంకరించిరి. అలంకరణ పూర్తియైన తరువాత మోజెస్ ప్రాతగుఱ్ఱము నధిరోహించెను. అతడు తనతో బాటు కొన్ని వస్తువులను తెచ్చుటకై ఒక చెక్కపెట్టెనుగూడ తీసికొని పోవుచుండెను. అతని దుస్తులంత విలువైనవి కానిమాట నిజమే

కాని అతని సోదరీమణులు ఓపికతో వానిని చక్కగా అలంకరించి యుంచిరి.

మోజెస్ ప్రయాణము ప్రారంభించెను. మిగిలినవారమందఱము అతని వెనుకనే కొంతదూరము పోతిమి. "నీకు అదృష్టము కలుగుగాక! విజయలక్ష్మి నిన్ను వరించుగాక!" అని అఱచితిమి. మే మొకచో ఆగిపోతిమి. మోజెస్ ఇంకను ముందుకు సాగిపోవుచుండెను. కొంచెంసేపైనతరువాత అతడింక మాకు కనబడలేదు. అంతట మేము వెనుకకు తిరిగివచ్చి ఇంటిలో ప్రవేశించితిమి.

మేము ఇంటిలో ప్రవేశించిన కొంచెముసేపటికి తార్న్హిల్ బట్లరువచ్చెను. అతడు మా యదృష్టమునకు మమ్ముల నెంతయు అభినందింపసాగెను.

"మాకు కలిగిన అదృష్టమేమి? ఇప్పుడు నీవు మమ్ము అభినందింపవలసిన అవసరమేమివచ్చినది?" అని నేను బట్లరును ప్రశ్నించితిని. అతడేమి సమాధానముచెప్పునోయని నా భార్య అత్యాతురముతో నెదురు చూడసాగెను.

బట్లరు నా ప్రశ్నల కిట్లు సమాధానముచెప్పెను. "మీ అదృష్టమునకు నేను మిమ్ములనుఅభినందింపకుండ నెట్లుండగలను? మీ అమ్మాయిలనుగూర్చి మా యజమానుడు తార్న్హిల్ కొందఱు పెద్దమనుష్యులతో ముచ్చటించుచుండగా వేఱొక గదిలోనున్న నేను వినుట తటస్థించినది. అతడు మీ అమ్మాయిలను పరిపరివిధముల ప్రశంసించినాడు. మీ అమ్మాయిలవంటి వారు మఱి యితరు లీ ప్రపంచమున లేనేలేరట! తార్న్హిల్ నంటి పెద్ద భూస్వామి మీ అమ్మాయిల నావిధముగ ప్రశం

సించుట నిజముగా మీ అదృష్టముకాదా? మీకంటె అదృష్ట వంతు లింక నీ ప్రపంచంలో నెవ్వరున్నారు?"

ఆ మాటలు నా కొమార్తలకు, భార్యకు మితిలేని సంతోషమును కలుగజేసెను. నాకుగూడ సంతోషము కలిగెనని చెప్పకతప్పదు. నా కొమార్తల మంచినే నేను కోరుచుంటిని.

మా యింటికి అదృష్టము ఒంటరిగా రాకూడదని నిశ్చయించుకొన్నది కాబోలును ఏలయన బట్టను వచ్చిన మరి కొంచెము సేపటికే తార్న్‌హిల్ సేవకు డొకడు మా యింటికి వచ్చెను. అతడు పట్టణయువతులు వ్రాసిన యుత్తరము నొక దానిని నా కొమార్తలకు తెచ్చియిచ్చెను. ఆ యుత్తరములో నిట్లు వ్రాయబడియుండెను: "మీ కందఱకు సంబంధించిన విషయములను గూర్చి మేము గొప్ప భూస్వామియగు తార్న్‌హిల్‌తో దీర్ఘముగ చర్చించినాము. ఆ మహనీయుడు మిమ్మందఱను గూర్చి ప్రశంసా పూర్వకమగు నభిప్రాయములను వెలపుచ్చినాడు. మీ కారనిన మాకు సంతృప్తి కలిగినది. మేము మఱి కొన్ని విషయములను తెలిసికొన్న తరువాత మీకు ఉద్యోగముల నిచ్చు విషయమున ఒక నిర్ణయమునకు వత్తుము మీకు మేలు కలుగవలయునని ఆశించుచున్నాము. మీరందఱు క్షేమముగనున్నారని తలంతుము."

ఆ యుత్తరములోని విషయమును తెలిసికొన్న తరువాత నా భార్య యిట్లనెను: "గొప్పవారి యిండ్లలోనికి ప్రవేశము లభించుట సామాన్యమైన విషయము కాదను సంగతి నాకిప్పుడు అర్థమగుచున్నది. కాని ఒకసారి ప్రవేశించిన పిమ్మట,

మన కుమారుడు మోజెస్ చెప్పినట్లు, నిశ్చింతగా నిదుర పోవచ్చును."

నా భార్య అట్లు మాట్లాడి ఎంతో తెలివి తేటలతో మాట్లాడితి ననుకొనెను. అందలి చమత్కారమును గ్రహించి అందఱును నవ్వవలయునని ఆమె యుద్దేశ్యము. ఆమె యుద్దేశ్యమున కనుగుణముగ నా కొమార్తలు అపరిమితమగు ఆనందమును ప్రకటించుచు గట్టిగా నవ్విరి.

తార్న్‌హిల్ సేవకుడు తెచ్చిన ఉత్తరము నా భార్య కెంతయు సంతృప్తిని కలుగజేసెను. ఆ సంతృప్తితో నామె తన జేబులో చేయిపెట్టి ఏడున్నర పెన్నీలను బయటకు తీసెను. ఆధనము నామె సేవకునకు బహూకరించెను.

ఆనాడు మా యింటికి వచ్చువారి సంఖ్య అంతటితో ఆగిపోలేదు. బర్చెల్‌కూడ మఱి కొంత సేపటికి మా యింటికి వచ్చెను. అతడు సంత జరిగిన ఊరునుండి వచ్చెను. అతడు నా చిన్న కుమారు లిరువురకు రెండు రొట్టెలను తెచ్చెను. నా భార్య ఆ రొట్టెలను తీసికొనిదాచెను. వానిని కొద్దికొద్దిగా తన కొమరుల కిత్తునని ఆమె యనెను. అతడు నా కొమార్త లిరువురకు రెండు పెట్టెలనుకూడ తీసికొనివచ్చి యిచ్చెను. వారా పెట్టెలలో చిన్న చిన్న వస్తువులను పెట్టుకోవచ్చును; లభించినపుడు ధనమునుగూడ వానిలో దాచుకొనవచ్చును.

ఇటీవల పట్టణ యువతులు మాతో మాట్లాడుచున్నప్పుడు బర్చెల్ అమర్యాదకరముగ ప్రవర్తించిన మాటనిజమే. అప్పుడతని నడవడిని మేము అసహ్యించుకొంటిమి. కాని అతడనిన మా కింకను అభిమానముండెను. అందువలన మా కంతకు

ముందే తెలిసిన మంచి వార్తల నతనికి తెలియజేయుచుండ లేకపోతిమి. ఆ విషయమున నతని సలహానుగూడ తెలిసికోదల చితిమి. అతని సలహాను మేమెప్పుడును అనుసరించినది లేదు; కాని ఈసారికూడ అతని సలహాను తీసికోవలయునని అను కొంటిమి.

బర్చెల్ పట్టణ యువతులిరువురును వ్రాసిన యుత్తర మును చదివెను. తరువాత నతడు తలపంకించెను. కడకతడు ఇట్లనెను: "ఇది చాల ముఖ్యమైన విషయము. ఇటువంటి విష యములలో తొందరపడి ఏపనియు చేయరాదు. తొందరపడి పనిచేయుటవలన దుష్ఫలితములు కలుగును. కావున ఈ విషయ మున జాగ్రత్తగా ఆలోచించి ఒక నిర్ణయమునకు రావలయునని హెచ్చరించుచున్నాను."

బర్చెల్ మాటలు నా భార్యకేమాత్రము రుచింపలేదని ప్రత్యేకముగ చెప్పనక్కఱలేదు. ఆమెకు చాలకోపము గూడ వచ్చెను. ఆమె బర్చెల్‌తో నిట్లనెను: "నీ సంగతి మాకు బాగుగ తెలియును. నీ వెప్పుడును నాకు, నా కొమార్తలకు వ్యతిరేకముగ మాట్లాడుచుందువు. అది నీ కలవాటైపోయినది. నీవు అవసరమును మించి జాగ్రత్తపడుచుందువు. కాని ఒక్క విషయము మాత్రము చెప్పవలసియున్నది. ఇతరులకు సలహా లను ఇచ్చువారు ముందు తామా సలహాలను ఆచరణలో పెట్టి యుండినచో చాల బాగుండెడిది."

అంతట బర్చెల్ ఇట్లనెను: "అమ్మా! నా పూర్వ ప్రవర్తన ఎట్టిదను విషయము ప్రస్తుత సమస్య ఏ మాత్రమును కాదు. నేను నా సలహాలను నాప్పట్లు ఆచరణలో పెట్టియుండక

పోవచ్చును. అంత మాత్రాన నేను ఇతరులకు సలహాల నొసగు టకు అర్హుడను కానని భావింపరాదు. నా మంచి సలహాలను ఆచరణలో పెట్టువారికి తప్పక వానిని ఇచ్చుచునే యుందును. ఇతరు లెవ్వరేమనుకొన్నను నా కర్తవ్య నిర్వహణమునందు వెను కంజవేయను."

బర్చెల్ చెప్పిన దానికి నా భార్య అమర్యాదకరముగ సమాధాన మిచ్చునని నేను భయపడసాగితిని. సరియైన సమా ధానము చెప్పలేక నా భార్య మొఱటుగా సమాధానమీయ ప్రయత్నింపవచ్చును. అందువలన నేను విషయమును మార్చ దలచితిని.

"మన కొమరుడు మోజెస్ సంతకుపోయి చాలసేపైనది. అతనింకను తిరిగిరాలేదు. ఇంత ఆలస్యమగుటకు కారణమేమై యుండును?" అని నేను ఆశ్చర్యమును ప్రకటించితిని.

అంతట నా భార్య ఇట్లనెను: "మనకుమారుని గుఱించి మీరేమియు బాధపడవలదు. ఏలయన అతని కెప్పుడే పనిచేయ వలయునో బాగుగ తెలియును. అతడు చేయవలసిన పనిని బాగుగ అర్థము చేసికొనును. తరువాత నతడా పనిని విజయ వంతముగా నెఱవేర్చును. వర్షము కురియుచున్నప్పుడు మన కుమారుడెప్పుడును కోడిపెట్టల నమ్మడని నేను మీకు స్పష్టము చేయగోరుచున్నాను. అతడు వస్తువులను ఎంత చవుకగాకొనునో మీకు తెలియదా? పలువురతని బేరమును చూచి ఆశ్చర్య సముద్రమున మునిగిపోవుచుందురు. ఆ విషయమును గూర్చి నేను మీకు ఒక చక్కని కథను చెప్పెదను వినుడు. ఆ కథను వినుచున్నంత సేపు మీరు పొట్ట చెక్కలగునట్లు నవ్వెదరు.

అష్టట్లు మన మోజెస్‌కు వేయి సంవత్సరముల ఆయుస్సు! అడుగో వచ్చుచున్నాడు. వెంట గుఱ్ఱము లేదు. వీపుమీద పెట్టె వేసికొనివచ్చుచున్నాడు. నా ఆయుస్సుకూడ అతడు పోసికొన వలయును"

ఆమె యట్లు మాట్లాడుచుండగా మోజెస్ లోనికివచ్చెను. పెట్టె బరువుకు కాబోలు అతని శరీరమంతటినుండి స్వేదము స్రవించుచుండెను. అతడా పెట్టెను వీధులలో తిరుగుచు సరకులను అమ్ముకొనువారివలె భుజములకు తగిలించుకొని యుండెను.

"స్వాగతము! సుస్వాగతము! మోజెస్! నాయనా! అబ్బాయి! సంతనుండి మా కందఱకు ఏమితీసికొనివచ్చినావు?" అని నా భార్య అనెను.

"మీ కందఱకు నేను సన్నే తీసికొనివచ్చినాను!" అని యని మోజెస్ పెట్టెను క్రింద పెట్టెను. ఏదో గొప్ప పని చేసికొనివచ్చి నట్లతని చూపులు తెలియజేయుచుండెను.

అపుడు మోజెస్ ఇట్లనెను: "ఆవిషయము మాకు బాగుగ తెలియుచునే యున్నది. మోజెస్! గుఱ్ఱమేమై పోయినది?"

"దానిని అమ్మివైచినాను. మూడుపౌనుల అయిదు షిల్లింగుల రెండు పెన్నీల కమ్మివైచినాను" అని మోజెస్ సమాధానమిచ్చెను.

"చాల మంచిపని చేసినావు నాయనా! నీవు గుఱ్ఱమును మంచివెలకు అమ్మివేయుదువను సంగతి నాకు ముందుగనే తెలియును. మనలో మనమాట. మూడు పౌనుల అయిదుషిల్లింగుల రెండు పెన్నీలసొమ్ము తక్కువ మొత్తమేమియుకాదు. ఆ సొమ్మేది? ఇటు తెమ్ము, నాయనా!" అని నాభార్య అనెను.

అంతట మోజెస్ ఇట్లనెను: "అమ్మా! నేను సొమ్మేమియు ఇంటికి తిరిగి తీసికొనిరాలేదు. నే నా సొమ్ముతో మఱియొక మంచిబేరము చేసినాను. ఇదిగోచూడుము" పిమ్మట నతడొక మూటను నాభార్యముందు పెట్టెను. అతడింకను నిట్లనెను: "ఇవిగో పండ్రెండు డజనుల ఆకుపచ్చని కళ్ళజోళ్ళు! కళ్ళజోళ్ళు పెట్టు కొనుటకు మంచిపెట్టెలుగూడ నున్నవి. ఈ కళ్ళజోళ్ళ ఫ్రేములు వెండితో చేయబడినవి."

ఆ మాటలను వినగానే నాభార్యగొంతు తడిఆఱిపోయెను. ఆమె ఎంతో ప్రయత్నించి హీనస్వరమున నిట్లనెను: "పండ్రెండు డజనుల ఆకుపచ్చని కళ్ళజోళ్ళు! ఎంతపని చేసినావు! గుఱ్ఱమును అమ్మివైచినావు. ఇంటికి విలువైన వస్తువులనుగాని, సొమ్మును గాని తీసికొని వచ్చుటకు బదులు పనికిరాని కళ్ళజోళ్ళు పండ్రెండు డజనులు తెచ్చినావా? ఎంతఘోర మెంతఘోరము!"

అపుడు నా కుమారుడు మోజెస్ ఇట్లనెను; "అమ్మా! విషయమునంతను పూర్తిగా తెలిసికొనకుండ విచారించెద వెందులకు? నేను ఈ విలువైన కళ్ళజోళ్ళను చాలచవుకగా కొన్నాను. లేనిచో నేను వీనినికొని యుండెడివాడను కాను. కళ్ళ జోళ్ళనున్న వెండిఫ్రేములను విడిగా అమ్మినచో నేను ఇచ్చిన సొమ్ముకన్న రెట్టింపుసొమ్ము మనకు వచ్చుననుటకు ఎటువంటి సందేహమును లేదు."

అంతట నాభార్య ఉద్వేగముతో నిట్లనెను: నీవెండి ఫ్రేములు పాడుగాను! వెండి ఫ్రేములను పగులగొట్టి ఔన్సునకు షిల్లింగుల చొప్పున అమ్మినచో నీవు ఖర్చుపెట్టిన సొమ్ములో

సగభాగముగూడ రాదని నేనుగట్టిగా చెప్పగలను. ఇందుకు సందేహమేమియు లేదు."

అప్పుడు నేను జోక్యము కలిగించుకొని ఇట్లంటిని: "ఖర్చు పెట్టిన సొమ్ములో సగభాగముమాత్రమే వచ్చునని నీవు అనవసరముగా బాధపడవలదు. వెండి ఫ్రేములను అమ్ముటనుగూర్చి నీవు బాధపడ వలదు. ఏలయన వాని అన్నిటికిని ఆరుపెన్నీలు కూడ రావనుట తథ్యము. అవి వెండిఫ్రేములుకావు! రాగి ఫ్రేములు మాత్రమే! వానిమీద తెల్లపూత పూసినారు."

నాభార్య అపుడు నిరాశతో నిట్లనుచెను: "ఏమేమి! వెండి కాదా! ఫ్రేములు వెండివికావా?"

"కావు! ఏ మాత్రముకావు! మనయింటిలోని పాత్రలు ఎంత వెండివో, ఆ ఫ్రేములుకూడ అంత వెండివి!" అని నే నంటిని.

అపుడు నాభార్య ఇట్లనెను: అనగా జరిగిన దిది! మన గుఱ్ఱమును అమ్మకొన్నాము! రాగిఫ్రేములుకల పనికిరాని కళ్ళ జోళ్ళను పండ్రెండు డజనులను తెచ్చుకొన్నాము! ఎంత మోసము జరిగినది! ఈ మోసముచేసినవారికి తగురు వేయి వ్రక్కలుకాను! మన మొద్దు మోజెస్‌ను ఎవరో మోసముచేసినారన్న మాట తథ్యము. అతడు మోసగాండ్రెవ్వరో, మంచివారెవ్వరో తెలిసి కొని యుండవలసినది. ఆమాత్రము తెలివితేటలు లేకపోయిన తరువాత ఇంక నెందుకు? సర్వనాశనమై పోయినది."

"నీవచ్చట పొరబడినావు. అత డెవ్వరితో సంబంధము లేకుండ బేరముచేసి యుండవలసినది. అప్పుడు మోసము జరిగి యుండెడిది కాదు." అని నే నంటిని.

"మన మోజెస్ వట్టి బుద్ధిహీనుడని స్పష్టపడినది. నాకిట్టు

వంటి పనికిమాలిన వస్తువులను తెచ్చియిచ్చిన అతని నేమన వల యును? ఈ పనికిమాలిన కళ్ళజోళ్ళను అగ్నిలో బడవైచి నాశ నము చేయుదును" అని నా భార్య అనెను.

అపుడు నేను ఇట్లంటిని: "ప్రియురాలా! నీవీ విషయమున గూడ పొరపడుచున్నావని చెప్పకతప్పదు. మన మోజెస్ తెచ్చిన కళ్ళజోళ్ళకు రాగి ఫ్రేములు ఉన్నమాట నిజమే. అయినను మనము వానిని మనవద్దనే ఉంచుకొందము. ఏలయన ఏమియు లేకుండనుండుటకంటె రాగి ఫ్రేము కళ్ళజోళ్ళయిన నుండుట మేలుగదా!"

అప్పటికి మోజెస్‌కు తాను మోసగింపబడిన విషయము చక్కగా అర్థమయ్యెను. సంతలో అత నొక మోసగాడు చూచెను. మోజెస్ వేషభాషలనుబట్టి అతనిని సులభముగా మోసగింపవచ్చునని ఆ మోసగాడు అర్థము చేసికొనెను.

మోజెస్ ప్రాతగుఱ్ఱమును నమ్మివైచి క్రొత్తగుఱ్ఱమును కొనవలయునను తలంపుతో సంతలో అటునిటు తిరుగసాగెను. అప్పుడతనిని ఎంతో పవిత్రునివలె కనబడుచున్న యొకడు కలసి కొనుట తటస్థించెను. తనవద్ద అమ్మకమునకు ఒక క్రొత్త గుఱ్ఱము సిద్ధముగా నున్నదను మిషతో నతడు మోజెస్‌ను ఒక గుడారము లోనికి తీసికొనిపోయెను.

ఆ గుడారములో మఱియొక మనుజుడుండెను. అతడు చాల విలువైన దుస్తులను ధరించియుండెను. అతనివద్ద రెండు గ్రోసుల కళ్ళజోళ్ళుండెను. అత డా కళ్ళజోళ్ళను మోజెస్‌కు చూపి ఇట్లనియుండెను: "ఈ కళ్ళజోళ్ళను కుదువబెట్టుకొని ఎవ్వరైన నాకు ఇరువది పౌనుల సొమ్మును అప్పుగా నిచ్చినచో

నే నెంతయు సంతసించెను. వీనిని అమ్ముటకుగూడ నేను సిద్ధముగానున్నాను. వీని అసలు విలువలో మూడవవంతు సొమ్ము నిచ్చినచో నేను అమ్మివేయుదును."

అప్పుడు మోజెస్‌ను గుడారములోనికి తీసికొనివచ్చిన మోసగాడు మోజెస్ చెవిలో నిట్లు రహస్యముగా చెప్పెను. "నేను నీకు స్నేహితుడను. కావున నీమంచికి చెప్పుచున్నాను. నీవద్దనున్న ధనముతో నీకళ్ళజోళ్ళను కొనివేయుము. నీకు మంచి లాభమువచ్చును. ఇంత చవుక బేరమును పోనీయవలదని నిన్ను గట్టిగ హెచ్చరించుచున్నాను."

అంతట మోజెస్ ఆ సంతలోనేయున్న ఫ్లామ్‌బరో కొరకు కబురంపెను. అనతికాలములో ఫ్లామ్‌బరో గుడారములోనికివచ్చెను. గుడారములోని మోసగాండ్రిరువురును మోజెస్‌కు మంచికబుర్లు చెప్పినట్లే, ఫ్లామ్‌బరోకుగూడ మంచి కబుర్లు చెప్పిరి. ఫ్లామ్‌బరో వారు పన్నినవలలో పడిపోయెను. అతనితో బాటు మోజెస్‌కూడ వారి వలలోపడెను. వారిరువురును కలసి గుడారములోనున్న రెండుగ్రోసుల కళ్ళజోళ్ళనుకొనిరి. మోజెస్ తనవంతు పండ్రెండుడజనుల కళ్ళజోళ్ళను ఇంటికి తెచ్చియుండెను

## 13

ఈ విశాలప్రపంచములో తలయెత్తుకొని తిరుగుటకు మా కుటుంబమువారు విశ్వప్రయత్నము చేయసాగిరి. కాని ఎప్పటి కప్పుడు ఎవ్వరును అనుకొనని సంఘటన ఏదో యొకటి తటస్థించి వారి ప్రయత్నములను సమూలముగ నాశనము చేయసాగెను.

వారి ఓటమిని ఎప్పటికప్పుడు నేను ఉపయోగించుకొనుచుంటిని. వారి ప్రయత్నములు వృథాయగుచున్న సమయమున వారికి జ్ఞానోదయము కలుగజేయవలయునని నేను ప్రయత్నము చేయ సాగితిని.

నేను నా పిల్లలతో నిట్లంటిని: "మనకంటె ఎక్కువ వారితో స్నేహముచేయవలెనను తలంపులు అస్వాభావికమైనవి. అవి పేకమేడలవలె కూలిపోవునను విషయమును మీరు గ్రహింప వలయును. కొందఱు బీదవారు ధనికులతో తప్ప మఱి యితరు లెవ్వరితోను స్నేహముచేయుట కిచ్ఛగింపరు. అట్టివారిని ధని కులు అసహ్యించుకొందురు; మిగిలినవారు ద్వేషింతురు. అనగా వా రనిన ఇష్టపడు వా రెవ్వరును నుండరు. బలహీనులు, బల వంతులు సహవాసముచేసినచో అది ఎప్పుడును బలహీనులకే నష్టదాయకముగ పరిణమించును. ఈ సహవాసమువలనివచ్చు ఆనందమును బలవంతు లనుభవింతురు. దుఃఖములను బలహీను లనుభవింతురు. ఇది అనుభవపూర్వకముగ తెలిసిన నగ్నసత్యము. ఈ సత్యమును గుర్తించుటకు నిరాకరించువారు బాధలపాలగు దురు. అబ్బాయి, డిక్! నీ వింతకుముందు చదివిన కథను అందఱి ఉపయోగముకొఱకు ఒకసారి చెప్పుము."

అంతట డిక్ కథ నిట్లు చెప్పసాగెను.

పూర్వ మొకప్పు డొకచోట ఒక రాక్షసుడు, ఒక మఱుగుజ్జు ఉండెడివారు. వా రిరువురును స్నేహితులు. ఇద్దఱును ఎప్పుడును ఒకరినొకరు విడువక కలిసియుండెడివారు. ఆవిధముగ నుందుమని వారు ప్రమాణముచేసికొనిరిగూడ. కొంతకాలమైన

తరువాత వా రిరువురును కలసి కొన్ని సాహసకృత్యములలో పాల్గొనవలయునని నిశ్చయించుకొనిరి.

ఒకనాడు స్నేహితు లిరువురును బయలుదేఱిపోయిరి. త్రోవలో నొకచోట వా రిరువురును ఇద్దఱు అరబ్బీదేశస్థులను కలసికొనిరి. అప్పుడు రెండుపక్షములవారికిని పోరాటము జరిగెను. ధైర్యసాహసములుగల మఱుగుజ్జు అపరిమితమగు కోపముతో అరబ్బీ దేశస్థులలో నొకనిని గట్టిగాకొట్టెను. ఆ దెబ్బవలన అరబ్బీ దేశస్థునకు అణుమాత్రమైనను బాధకలుగలేదు.

అరబ్బీదేశస్థుడుమాత్రము తన కత్తిని పైకెత్తి మఱుగుజ్జు చేతి నొకదానిని పూర్తిగా ఖండించివైచెను. అప్పటి మఱుగుజ్జు దురవస్థను ఏమని వర్ణింపవచ్చును! కాని అంతలో రాక్షసు డతనికి సహాయముచేయవచ్చెను. అతడు తృటికాలములో ఇరువురు అరబ్బీదేశస్థులను చంపివైచెను. వారి శరీరములు రుధిరములో తేలసాగెను. అప్పుడు మఱుగుజ్జు ద్వేషాగ్నితో తన హస్తమును ఖండించిన వాని తలను వేరుచేసెను. తరువాత స్నేహితు లిరువురును మఱియొక సాహసకృత్యములో పాల్గొన ముందునకు పోయిరి.

పోగాపోగా వారిని మఱియిరువురు శత్రువు లెదుర్కొనిరి. మఱుగుజ్జునకు పూర్వపు ధైర్యసాహసములులేవు. అయినను అతడు శత్రువులలో నొకనిని గట్టిగాకొట్టెను. ఆదెబ్బ శత్రువునకు చీమకుట్టి నట్లయినను లేకుండెను. కాని అతడు మాత్రము మఱుగుజ్జు కన్ను నొకదానిని లాగివైచెను. అంతలో నచ్చటకు రాక్షసుడువచ్చి శత్రువుల నెదుర్కొనెను. అంతట శత్రువులు ఎంతయు భయపడి వెన్నిచ్చి పాఱిపోయిరి. వారు పాఱిపోయి యుండక

పోయినచో రాక్షసుడు వారిని తృటికాలములో సంహరించి యుండెడివాడే.

పాటిపోయిన శత్రువులు ఎక్కడనుండియో ఒకమంచి అందమైన అమ్మాయిని దొంగిలించి తీసికొని వచ్చుచుండిరి. వారు ఆ అమ్మాయిని వదలియే పాటిపోయి యుండిరి. ఆ అమ్మాయి రాక్షసుని ప్రేమింప సాగెను. అందువలన రాక్షసుడామెను ఆనందముతో వివాహము చేసికొనెను. అనగా అప్పటికి రాక్షసునకు ఒక అందమైన అమ్మాయి దక్కెను. మఱుగుజ్జు ఒకచెయ్యి, ఒక కన్ను పోగొట్టుకొని యుండెను.

తరువాత వారు ముగ్గురును కలసి చాలదూరము ప్రయాణము చేసిరి. ఎట్టకేలకు వారొక దొంగలగుంపును ఎదుర్కొనిరి. కడచిన రెండు పోరాటములలోను మఱుగుజ్జు మొదట ఉండెను. కాని యీనాటి రాక్షసుడే ముందుకు పోయెను. కాని మఱుగుజ్జు ఎంతో వెనుక లేడు. ఇరువురు స్నేహితులకు, దొంగల గుంపుకు పోరాటము చాల తీవ్రముగా చాలసేపు జరిగెను. రాక్షసుడు దొంగలను సంహరించివేయ సాగెను. మఱుగుజ్జు రెండుసార్లు ప్రాణాపాయమునుండి తప్పించుకొనెను. ఎట్టకేలకు ఇద్దఱుస్నేహితులే విజయ దుందుభిని మ్రోగించిరి. కాని ఆ పోరాటములో మఱుగుజ్జు తనకాలు నొకదానిని పోగొట్టుకొని యుండెను.

అప్పటికే మూడు పోరాటములు జరిగి యుండెను. ఆ మూడు పోరాటములలోను రాక్షసునకు ఒకచిన్న గాయమైనను తగిలి యుండలేదు. మఱుగుజ్జు మాత్రము ఒకచేయి, కన్నొకటి, కాలొకటి పోగొట్టుకొని యుండెను. రాక్షసుడు విజయగర్వముతో మఱుగుజ్జుతో నిట్లనెను: "నా చిన్నారి వీరుడా! మన

మిప్పటికి మూడు ఘన విజయములను సాధించినాము. మనము మఱియొక ఘనవిజయమును సాధించి అంతటితో సంతృప్తి చెందుదము. ఇక మనము శాశ్వత గౌరవ జీవనము చేయ వచ్చును."

అప్పటికి మఱుగుజ్జు తెలివితేటలు తెచ్చుకొని యుండెను. అందువలన నతడిట్లనెను: 'వలదు, వలదు! మిత్రమా! నేనువదలు కొనుచున్నాను. నే నింక ఏ పోరాటములోను పాల్గొనను. ఏల యన నే నిప్పటికి ఒక నగ్న సత్యమును గ్రహించినాను. ప్రతి పోరాటములోను నీవు గౌరవమును, బహుమానములను పొందు చున్నావు. కాని నేనుమాత్రము ఒక అవయవమును పోగొట్టు కొనుచున్నాను.'

"నాన్నా! ఇంక కథ పూర్తియైనది."

కథ పూర్తిఅయ్యెను. దానినుండి నేర్చుకోవలసిన నీతిని వివరించి చెప్పవలయునని అనుకొంటిని. కాని అంతలో నా భార్యకు, బర్చెల్‌కుజరుగుచున్న సంభాషణ నాదృష్టి నాకర్షించెను. వారిరువురును నా కొమార్తెను పట్టణమునకు పంపుటనుగూర్చి వాదులాడు చుండిరి. తన కొమార్తెలు పట్టణమునకు పోవుట వలన గలుగు లాభములనుగూర్చి నాభార్య గట్టిగానొక్కి వక్కాణింప సాగెను. పట్టణమునకు వారిని పంపుటవలన చాల నష్టములు సంప్రాప్తించునని బర్చెల్ గట్టిపట్టుదలతో వాదించుచుండెను. నేను తటస్థముగా నుంటిని.

బర్చెల్ ఆ విషయమునుగూర్చి నాటి యుదయముననే నా భార్యతో వాదించియుండెను. ఇప్పుడతడా విషయమును సకారణముగా వివరింపసాగెను. అతనికి నాభార్యకు మధ్య తగవు

చాల ఎక్కువ కాసాగెను నాభార్య తనవాదమును సకారణముగ నిరూపించుకొన లేకుండెను. అందువలన నామె గొంతు హెచ్చించి గట్టిగా మాట్లాడసాగెను. ఎట్టకేల కామె ఇష్టమున్నను లేక పోయినను ఓటమిని అంగీకరింపవలసివచ్చెను. ఆమె కడపట మాట్లాడిన మాటలు మాకెవ్వరికిని ఏమాత్రమును రుచింప లేదు.

నా భార్య కడపట నిట్లనియుండెను. "కొందఱు తమ యిష్టమువచ్చినట్లు సలహా లిచ్చుచుందురు. వారట్లు సలహా ఇచ్చుటకు కొన్ని రహస్యకారణము లుండునను విషయము నాకు బాగుగా తెలియును. అట్టివా రికముందు మాయింటికి రాకుండ నుందురుగాకయని కోరుచున్నాను."

ఆమాటలను విన్న బర్చెల్ ఏమాత్రము ఉద్వేగము చెందక కడు ప్రశాంతముగ నిట్లనెను. "అమ్మా! రహస్యకారణ ములమాట మీరెత్తినారు. మీరా విషయమున సరిగానే మాట్లాడినారు. అవును, నాకు కొన్ని రహస్యకారణములున్నవి. వాని నిప్పుడు నేను చెప్పను. ఎందుచేతనో తెలియునా? రహ స్యముకాని విషయములను మీకు కొన్నింటిని చెప్పియున్నాను గదా! వానికే మీకుసరియైన సమాధానము నొసగియుండలేదు. నేను మీయింటికి తఱచుగా వచ్చుచుండుట మీకు కష్టము కలిగించుచున్నదని గ్రహించుచున్నాను. అందువలన నేనిప్పుడు మీవద్దనుండి సెలవు తీసికొనుచున్నాను. నేను బహుశా మఱి యొకసారి మిమ్ము కలిసికొని సెలవు తీసికొందును. తరువాత నింక మఱి మీకు కనబడను."

అట్లని యతడు క్రిందనున్న టోపీని తీసికొని నెత్తిమీద

పెట్టుకొనెను. "వెళ్ళవలదు. అనవసరముగా తొందఱపడుచున్నా రెందులకు?" అను నర్థము వచ్చునట్లు సోఫియా అతని వంకకు చూచెను. కాని సోఫియా చూపులు అతనిని అడ్డుకొనలేక పోయెను. బర్చెల్ మమ్ము వీడిపోయెను.

బర్చెల్ వెళ్ళిపోయినతరువాత మేమందఱము ఒకరి నొకరము కలవరముతో కొన్ని నిమిషములపాటు చూచుకొంటిమి. జరిగినదానికంతకు కారణము తానేయని నాభార్యకు తెలియును. అందువలన నామె తెచ్చిపెట్టుకొన్న మందహాసముతో దానిని దాచుటకు ప్రయత్నింపసాగెను. కాని నే నామె ప్రవర్తనము నేమాత్రము సహింపలేకుంటిని.

నే నామెతో నిట్లంటిని: "ఏమి ప్రవర్తన! మనయింటికి స్నేహపూర్వకముగ వచ్చిన అతిధులతో మాట్లాడవలసిన విధాన మదియేనా? మనలను దయతో చూచినవారిని చూడ వలసిన విధమిదియేనా? నీవు ఎంతో కఠినముగ మాట్లాడి నావను విషయమును గ్రహింపుము. నీమాటలు నాకేమాత్రము రుచింపలేదని స్పష్టముగ తెలియజేయుచున్నాను. ఇటువంటి మాటలు నీ పెదవుల మధ్యనుండి ఇదివఱకెన్నడును వెలువడి యుండలేదు."

"మఱి అతడున న్నెందుకు రెచ్చగొట్టినాడు? అని నాభార్య అనసాగెను. అతడెందుకట్లు సహా చెప్పుచున్నాడో, అతని ఉద్దేశ్యము లేవో నాకు బాగుగ తెలియును. నా కొమార్తలు పట్టణమునకు పోరాదని అతడు గట్టిగా వాంఛించుచున్నాడు. అత డెందులకట్లు కోరుకొనుచున్నాడో తెలియునా? ఇచ్చట నా చిన్నారికూతురు సోఫియాతో కలసియుండవచ్చునని అతడు

కలలు గనుచున్నాడు. నే నామాత్రము తెలియని వెఱ్ఱివాడను కాను. ఏమి జరిగినను సరే, నా కొమార్తెలు గొప్పయింటికి పోదురుగాని, ఇటువంటి నీచుల యింటికిమాత్రము పోరని విస్పష్టముగ చెప్పగలను. ఇట్లనుటకు నే నేమాత్రము వెనుదీయను."

"ఏమనుచున్నావు ? అతడు నీచుడని అనుచున్నావా ? మన మితనినిగూర్చి పొరపాటుపడుచున్నామని నేను అభిప్రాయపడుచున్నాను. ఏలయన ఒక్కొకప్పు డతడు ఎంతో కులీనుని వలె కనబడును అటువంటివారి పితరులను నే నింతవఱకు చూచి యుండలేను. నా మాట నమ్ముము. అమ్మాయి! సోఫియా! నా కొక్కమాట చెప్పుము. అతడు నీస్నేహమును వాంఛించుచున్నాడనుటకు రహస్యసంఘటన లేవైన నున్నవా!" అని నే నంటిని.

అపుడు సోఫియా ఇట్లనెను : "నాన్నా! అతని సంభాషణ ఎప్పుడును వినయముగను, ఆనందముగను వివేకముగను నుండును. ఇక ఇతర విషయము లేవియు లేవు. ఒకసారి మాత్ర మతడు నాతో ఇట్లనియుండెను : 'భీరువానివలెనున్న మగవాని అర్హతను, మంచితనమును, గొప్పతనమును గుర్తించిన స్త్రీని నే నింతవఱకు చూచియుండలేను. ఆ విషయ మింకను నాకు జ్ఞాపకమున్నది."

అంతట నేను ఇట్లంటిని: "అమ్మాయి! మనకృష్ణవంతులు. పోనిమ్ము. ఎప్పుడును అదేవిధముగ మాటాడుచుందురు. అటువంటివారి విషయము సరియైన నిర్ణయమునకు వచ్చుటకు తగిన శిక్షణమును నీ వింతవఱకు పొందియున్నావు. అతడు తన సొమ్మును సద్వినియోగము చేయువిధానము తెలియక వృథాగా

ఖర్చుపెట్టి బికారియైనాడు. అటువంటివానివద్దనుండి సౌఖ్యమును పొందవచ్చునని పిచ్చివారుమాత్రమే తలంతురు. నేను, మా యమ్మ నీకు మంచి భవిష్యత్తుండవలయునని ఆశించుచున్నాము. అందుకు కావలసిన ప్రయత్నములను ఏర్పాట్లను చేయుచున్నాము. రాబోవు శీతాకాలములో నీకు పట్టణమున నివసించు నవకాశము లభించును. అప్పుడు నీవు నీ తెలివితేటల నన్నిటి నుపయోగించి అర్హుడైనవానిని నీ సహచరునిగా ఎన్నుకొనవచ్చును."

నా మాటలను విన్న సోఫియా ఏమి అభిప్రాయపడెనో, ఆమె ఆలోచనలేమో, నిర్ణయమేమో నాకు తెలియుననుట సాహసమే యగును. ఏలయన ఆమె మనోగతాభిప్రాయములను తెలిసికొనుట సామాన్యమైన విషయముకాదు.

బర్చెల్‌నుగూర్చి నేను కొలదిగా భయపడుచుంటిని. అట్టి అతిథి మమ్ము వదలిపోయినందుకు నేను విచారించుటలేదు. కాని, అతిథిని సరిగా ఆదరింపలేదేమోయని నా అంతరాత్మ కొలదిగా బాధపడసాగెను. కాని నా అంతరాత్మకు రెండు మూడు కారణములు చెప్పి శాంతింపజేసితిని! ఎట్లకేలకు నన్ను నేను సమన్వయించుకొని సంతృప్తిచెందితిని. ఇక నా అంతరాత్మ ఏమాత్రము బాధపడకుండెను. అంతరాత్మ పట్టి పిఱికిది. ఏలోపములు నది అరికట్టలేదో, ఆ లోపము లున్నవని ఆరోపించుట అన్యాయమే అగును.

# 14

తార్న్‌హిల్ మా కొమార్తెల గుణగణములను స్వయముగా పరీక్షింపదలచెను. పరీక్ష పూర్తియైన తరువాత వారి గుణగణములనుగూర్చి మాకు ఉత్తరముమూలమున తెలియజేయుదునని అతడనెను. అందువలన మా కొమార్తల నిపుడే వెంటనే పట్టణమునకు పంపవలయునని మేము నిశ్చయమునకువచ్చితిమి.

మఱి మా కొమార్తలు పట్టణమునకు ఏమియులేని సామాన్యులవలె పోవుట ఏమాత్రమును సమంజసముకాదు. వారి ఆశయములు, ఆశలుగొప్పవి. వారు మహోన్నతమగు భవిష్యత్తును ఆశించుచున్నారు. కావున వారందుకు తగినట్లు కనబడుట అత్యవసరమైయుండెను. వారు తగినట్లు కనబడవలయునన్నచో డబ్బు ఖర్చుపెట్టవలసియుండెను. మావద్ద డబ్బులేదు. డబ్బు నేదోవిధముగ సమకూర్చుకొనవలసియున్నది.

డబ్బును సులభతరముగా సమకూర్చుకొనుటకు తగిన యుపాయములను సంపూర్ణముగ చర్చించుటకుగాను మా కుటుంబము వారమందఱము ఒకచోటసమావేశమైతిమి. మాకు ఎవ్వరును డబ్బు అప్పుగా నీయరను విషయము తెలియును. అనగా మా ఇంటిలోని ఏవస్తువునమ్మిడబ్బుసమకూర్చుకోవలయునను విషయమును చర్చించుటకు మేము సమావేశమైతి మన్నమాట.

మేము ఆ విషయములనుగూర్చి ఎంతోకాలము చర్చింపవలసినపని లేకపోయెను. అనతికాలములోనే మేము మాచర్చను ముగించి ఒక నిర్ణయమునకు వచ్చితిమి. మావద్దనున్న రెండు

గుఱ్ఱములలోను ఒక గుఱ్ఱమును లోగడ మోజెస్ అమ్మివైచి మోసపోయియుండెను ఇంక మాయొద్ద నొక గుఱ్ఱము మాత్రము మిగిలియుండెను. అది యింక నాగలికి పనికిరాదు. ఏలయన నాగలికి రెండు గుఱ్ఱము లుండవలయునుగదా! అవి రోడ్డుమీఁద ప్రయాణము చేయుటకుగూడ నిరుపయోగముగనుండెను. అందు వలన దాని నమ్మివైచి ఆ వచ్చినసొమ్ముతో మా కొమార్తె లకు కావలసిన వస్తువు లను కొనవలయునని నిశ్చయించుకొంటిమి. దానిని మాకు దగ్గఱలోనేయున్న సంతలో అమ్మివేయవలయు ననుకొంటిమి. దీనిని అమ్మివేయుటకు మోజెస్‌ను పంపినచో అతని నెవ్వరైన మోసగింపవచ్చును. అందువలన నేనే సంతకు పోయి గుఱ్ఱము నమ్మివేయవలయునని నిశ్చయింపబడెను.

నేను అంతవఱకు వ్యాపారసంబంధమగు విషయములలో దేనిలోగాని పాల్గొనియుండలేదు. మొట్టమొదటిసారిగా గుఱ్ఱ మును అమ్మబోవుచుంటిని. అయినను నే నాపనిని విజయవంత ముగ పూర్తిచేయగలనని గట్టిగా నమ్ముచుంటిని. మనజాగ్రత్త తెలివితేటలు మన సహచరులనుబట్టి ఆధారపడియుండును. నా సహచరులందఱును చక్కగా కుటుంబభారమును మోయుచున్న వారే. అందువలన నాకుగల లోకజ్ఞానమును గుఱించి నాకు తక్కువ అభిప్రాయ మేదియు లేదు.

మఱునాటి యుదయమున నేను గుఱ్ఱమును తీసికొని సంతకు బయలుదేఱితిని. కొన్నిగజములదూరము పోయిన తరు వాత నాకేదో సలహానిచ్చుటకై నాభార్య నన్ను వెనుకకు పిలిచెను. ఆమె నాచెవిలో మెల్లన నిట్లు చెప్పెను. "సంతలో మోసగాండ్రుందురు. మీరు చాల జాగ్రత్తగ నుండవలయు

యును. మీరు తెలివితక్కువ వారని నేను చెప్పుటలేదు. చాల జాగ్రత్తగా నుండవలయునని హెచ్చరించుచున్నాను. ఇకపోయి కార్యమును విజయవంతముగ సాధించుకొనిరండు."

అంతట నేను మరల ప్రయాణము సాగించితిని. నేను పోయి పోయి సంతజరుగుచున్న ప్రదేశమును చేరుకొంటిని. నా గుఱ్ఱమునొకచో నిలబెట్టితిని. నేనుదాని నమ్ముటకు సిద్ధముగా నున్నాననువిషయమును బయల్పఱచితిని. చాలసేపటివఱకు గుఱ్ఱమును కొనుట కెవ్వరును రాలేదు.

ఎట్టకేలకొక మనుజుడువచ్చి గుఱ్ఱమును సమీపించెను. అతడు గుఱ్ఱముచుట్టును చాలసార్లు తిరిగి ప్రతి అవయవమును నిశితముగ పరిశీలించెను. అటులచేయుటకతనికి చాలసేపు పట్టెను. ఆ పరీక్షవలన గుఱ్ఱము కన్నొకటి గ్రుడ్డిదనువిషయ మతనికి తెలిసెను. అందువలన నతడు గుఱ్ఱమును కొనదలచుకోలేదు. "గుఱ్ఱమును ఎంతకు అమ్మదలచు కొన్నారు?" అనికూడ ప్రశ్నింపకుండ నతడు వెళ్ళిపోసాగెను.

"వెళ్ళిపోవు చున్నా రేమి? వెలతెలిసికొని వెళ్ళుడు" అని నే నంటిని. అతడు వెనుకకు తిరిగి చూడకుండ వెళ్ళిపోయెను.

మఱికొంచెము సేపటికింకొకడు వచ్చి చాలసేపు గుఱ్ఱమును జాగ్రత్తగ పరీక్షించెను. అతడొక ఎముకలోని లోపమును గమనించెను. "ఈ గుఱ్ఱమును ఉచితముగ ఇచ్చినను నేను యింటికి తోలుకొనిపోను" అని అతడు వెళ్ళిపోయెను.

కొన్ని నిముషములకు మూడవవాడు వచ్చెను, అతడు కూడ గుఱ్ఱమును జాగ్రత్తగ పరిశీలించెను. అందువలన నతనికి

గుణ్ణములోని మఱియొకలోటు కనబడెను. అతడుకూడ గుణ్ణము వెలను తెలిసికొనకుండగనే వెళ్ళిపోయెను.

నాలుగవ వానికి మఱియొక లోపము కనబడెను. అందు వలన నతడుగూడ ధరను తెలిసికొనకుండగనే వెళ్ళిపోయెను.

అయిదవవాడువచ్చి గుణ్ణములోని లోపములన్నిటిని పేరు పేరున ఏకరువుపెట్టెను. "ఈగుణ్ణమెందులకు పనికివచ్చును? ముక్కలు ముక్కలుగాకోసి కాకులకు గ్రద్దలకు ఎగురవేయుటకు తప్ప మఱియింకెందుకును పనికిరాదు" అని యతడని వెళ్ళిపోయెను.

అంతవఱకు ఇతరులు మాత్రమే నా గుణ్ణమును అస హ్యించుకొనుచుండిరి. కాని కడకు నేనుకూడ ఆ గుణ్ణమును అసహ్యించుకొన సాగితిని. నా కదియెడల నొక విధమగు ద్వేష భావ మేర్పడెను. ఎవ్వరైన నా గుణ్ణమును సమీపించుచున్న ప్పుడు నేను అవమాన భారముతో క్రుంగిపోసాగితిని. నా గుణ్ణ ములో ఇతరులు చెప్పిన లోపములన్నియు నున్నవని నేను అంగీ కరించుటలేదు. కాని అందఱుమనుజులు గుణ్ణములోని లోపము లను ఏకరువు పెట్టుచున్నప్పుడు నమ్మకతప్పదు. సెంట్ గ్రిగరీ తన గ్రంథరాజములలో నిదే విధమగు అభిప్రాయమును వెలిపుచ్చి యున్నారు.

ఏమైననేమి? నేను అవమాన భారముతో క్రుంగిపోవు చుంటిని. నేను అటువంటి పరిస్థితిలో నుండగా నాతోడి మతో ద్యోగి యొకడు వచ్చెను. అతనికి నాకును కొంచెము పరిచయము గలదు. అతడుగూడ సంతకు ఏదో పనిమీద వచ్చెను. మే మిరు వురము హృదయపూర్వకముగ కరచాలనము చేసికొంటిమి.

పిమ్మట నత డిట్లనెను: "మనము ఏదేని పానీయ గృహ

మునకుపోయి అచ్చటనున్న ఏదో ఒక పానీయమును తీసి కొందము."

"అటులనే చేయుదము" అని నేను సమ్మతిని తెలిపితిని.

నేమిరుపురముపోయి ఒకపానీయ గృహములో ప్రవే శించితిమి. అచ్చటివారు మమ్ము వెనుకనున్న ఒక చిన్న గదిలో ప్రవేశపెట్టిరి. అచ్చట టేబిలువద్ద గడ్డము బాగుగా పెంచుకొని యున్న పవిత్రుడొకడు కూర్చుండి యుండెను. అతడేదో పెద్ద గ్రంథమును చదువుకొనుటలో నిమగ్నుడై యుండెను. అందు వలన నతడు మా రాకను గమనించినట్లు లేకుండెను.

ఆ మహనీయుని చూడగనే నాకెంతో సదభిప్రాయము గలిగెను. అంతటి సదభిప్రాయమిదివరకెవ్వరిని చూచినను కలిగియుండలేదు. అతని తలపైనున్న తెల్లని గిరజాల జుట్టు అతనికి పవిత్రతను చేకూర్చుచుండెను. అతడు గొప్ప ఆరోగ్యము కలిగియున్న వానివలె కనబడుచుండెను.

మేము ఏదో పానీయమును సేవించుచు మాట్లాడుకొన సాగితిమి. మా జీవితములలో వచ్చిన మార్పుల నన్నిటిని మేము ఏకరువు పెట్టుకొంటిమి. నేను వ్రాసిన గ్రంథములనుగూర్చియు, వానిపై వచ్చిన విమర్శనలను గూర్చియు, అందువలన నాకు కలిగిన నష్టములను గూర్చియు చర్చించుకొంటిమి.

అంతలో నా గదిలోని కొక యువకుడు వచ్చెను. అతని రాక మా సంభాషణమున కంతరాయమును కలిగించెను. ఆ యువకుడు పవిత్రునివలె నున్న ముసలివానివద్దకుపోయి కడు వినయ పూర్వకముగ నమస్కరించి మెల్లన నేమో చెప్పెను.

అప్పుడు ముసలివాడు దయారసము చిప్పిలు చుండ నిట్లు

నేను: "నాయనా! నీవట్లు మాట్లాడవలసిన పనిఏమియు లేదు. మనతోడివారికి అవసర సమయములందు సాహాయ్యముచేయుట మన యందఱి విధ్యుక్త ధర్మములై యున్నవి. దీనిని తీసికొనుము బిడియ పడకుము. నీ కింకను ఎక్కువ ఇచ్చుటకు వీలుండిన బాగుండునని తలచుచున్నాను. యీ అయిదు పౌనుల ధనమును నీ బాధలను తీర్చగలదని నేను నమ్ముచున్నాను. నీ కింకను అవసరమైనచో నావద్దకు రమ్ము."

అంతట యువకుడు అపరిమితముగు కృతజ్ఞతా భావముతో ఆనంద బాష్పములు కార్చెను. ముసలివాడు చేసిన సాహాయ్యమునకు నేనైనచో ఇంకను ఎక్కువ కృతజ్ఞతా భావమును ప్రకటించి యుండెడివాడను. నేనుపోయి అతనిని గట్టిగా గ్రుచ్చిగ్రుచ్చి కౌగిలించుకొని యుండెడివాడను. అతనిమాటలు చేతలు నాకంతటి ఆనందమును కలిగించెను.

ముసలివాడు ఎప్పటివలె పెద్ద గ్రంథమును చదువుటలో నిమగ్నుడై పోయెను. మేమిరువురము మరల సంభాషణలో నిమగ్నులమైపోతిమి. చాలసేపటికి తనకు సంతలో పనియున్నదను విషయము నా సహచరునకు జ్ఞప్తికి వచ్చెను. వెంటనే అతడు నాతో నిట్లనెను: "నేనుపోయి నా పనిని ముగించుకొని వత్తును. అనతికాలములోనే వచ్చి నిన్ను కలసికొందును. నే నెప్పుడును నీతో మాట్లాడుచుండవలయునని వాంచించుచుందును. మఱి డాక్టర్ ప్రిమ్‌రోజ్ సామాన్యుడు కాడు గదా!"

ఉద్గ్రంథమును చదువుచున్న ముసలివాడు నాపేరును వినగానే తలపైకెత్తి కొంచెముసేపు నా వంక పరిశీలనగా చూచెను. నా సహచరుడు వెళ్ళిపోగానే అతడు నాతో ఇట్ల

నేను : "అయ్యా ! చర్చిలో చాల ప్రసిద్ధి చెందినవాడును, కడు ధైర్యసాహసములతో రెండవ వివాహము కూడదని గట్టిగా ప్రచారము చేయుచున్నట్టి మహనీయుడును నగు ప్రిమ్‌రోజ్ మీకేమైన బంధువా ?" అతడా ప్రశ్నను ఎంతో గౌరవ భావముతో అడిగెను.

ఆ మాటలను వినగానే నా హృదయము ఆనంద రసముతో నిండిపోయెను. అటువంటి భావము నా కంతకు ముం దెన్నడును కలిగియుండ లేదు. నేనతని ప్రశ్నకు సమాధానముగా నిట్లంటిని : "అయ్యా ! మీరు గొప్ప సత్పురుషులనుటకు ఎటువంటి సందేహమును లేదు. మీరు ఇంతకు ముందు వచ్చిన యువకునకు చేసిన సాహాయ్యము నా హృదయమును ద్రవీభవింప జేసినది. ఇప్పుడు మీరు ప్రశంసా పూర్వకముగ నాడిన మాటలు నా ఆనందమును ద్విగుణీకృతము చేసినవి. అయ్యా ! ద్వితీయ వివాహము కూడదని గట్టిగా వాదించిన డాక్టర్ ప్రిమ్‌రోజ్‌ను మీరిప్పుడు మీయెదుటనే చూచుచున్నారు. 'మహనీయుడు' అని పిలిచినందుకు నేను మీకెంతయు కృతజ్ఞుడను. నేను వయస్సు మీరుచున్నను నా వాదమును వదలుకోలేదు. శత్రువును నేను విజయవంతముగ ప్రతిఘటించుచునే వచ్చుచున్నాను."

అప్పుడు ముసలివాడు ఎంతో గౌరవ భావముతో నిట్లనియెను : "అయ్యా ! మీరెవ్వరో తెలిసికొనవలయునని నేను ఎక్కువ కుతూహలమును ప్రకటించినాను. నేను మీ దర్శనము నిదివరకు చేసియుండ లేదు. నా అజ్ఞానమునకు క్షమింపవలయునని ప్రార్థించుచున్నాను."

అప్పుడు నేను లేచిపోయి అతని రెండు చేతులను గట్టిగా పట్టుకొని ఇట్లంటిని: "అయ్యా! మీ రంత మాట అనకుడు. నే నెవ్వరో తెలిసికోవలయునని మీరు కుతూహలము ప్రకటించి నందుకు నే నేమాత్రము బాధపడుటలేదు. నేను మీపట్ల సదభి ప్రాయము కలిగి యున్నాను. మీతో స్నేహము చేయవలయు నని నేను గాఢముగ వాంఛించుచున్నాను. మీరు నా స్నేహము నంగీకరింపవలయునని భక్తి భావముతో ప్రార్థించుచున్నాను."

అంతట ముసలి వాడిట్లనెను: "నేను కృతజ్ఞతా భావ ముతో మీ స్నేహము నంగీకరించుచున్నాను. మన స్నేహ మునకెట్టి అంతరాయము కలుగరాదని భగవంతుని కడు వినయ పూర్వకముగ ప్రార్థించుచున్నాను." పిమ్మట నతడు నన్ను పరి పరి విధముల పొగడసాగెను కాని మధ్యలో నేనతనికి అంత రాయము కలిగించితిని. గ్రంథకర్తగా పొగడ్తల నందుకొనుట నా కిష్టమే; ఎందరెన్ని విధములుగా పొగడినను జీర్ణించుకోగల శక్తి నాయందుగలదు. కాని ఆ ప్రత్యేక సందర్భమున మాత్రము నేను ఎంతో వినయ భావముతోనుంటిని. అందువలననే ముసలి వాని పొగడ్త ను వినుటకు ఏ మాత్రము ఇచ్ఛగింపకుంటిని.

సాధారణముగా కాల్పనిక (ప్రేమ) గ్రంథములలోని ప్రేమికులు ప్రథమ దర్శనముననే ఒకరి నొకరు గాఢముగ ప్రేమించుకొను చుందురు. నాకు ముసలివానికి మధ్య స్నేహము అంతకంటే త్వరగానే కుదిరెను.

క్రొత్త స్నేహితుల మిరువురము అనేక విషయములను గూర్చి చర్చించుకొన సాగితిమి. అతడనిన నాకు క్రమక్రమముగా గౌరవభావము హెచ్చిపోసాగెను. వాదములో విజయము పొంద

వలయుననుకాంక్ష అతని కేమాత్రము లేనట్లు నేను గ్రహించితిని. అప్పుడప్పుడు నేను అభిప్రాయ భేదములకు తావిచ్చు విషయములను గట్టిగా చెప్పసాగితిని. గొప్ప జ్ఞానియగు ముసలివాడేమి చెప్పునో తెలిసి కొనవలయునను కుతూహలముతో నే నేనట్లు చేయసాగితిని. కాని అట్టి సందర్భములందతడు మందహాసము చేసి తలపంకించు చుండెడివాడు. ఏమియు సమాధానమిచ్చెడివాడుకాడు. దాని అర్థమిది. "ఈ విషయమునుగూర్చి చెప్పవలయునన్నచో నేను ఎంతైనను చెప్పగలను. కాని భేదాభిప్రాయములకు తావిచ్చు ఈ విషయమునుగూర్చి నేను మాట్లాడుట ఉచితముగ నుండదు." నేనుగూడ అట్లే అభిప్రాయపడసాగితిని.

క్రమ క్రమముగా నేను పూర్వవిషయములను చర్చించుట మానివైచి ప్రస్తుతాంశమునకు వచ్చితిని.

"మీరీదినమున సంతకెందుకు వచ్చినారు?" అని ముసలివాడు ప్రశ్నించెను.

"గుఱ్ఱమునొకదాని నమ్ముటకు వచ్చినాను" అనినేను సమాధానము చెప్పితిని.

"ఏమి అదృష్టము! నేను మా రైతులలో నొకనికి గుఱ్ఱమును కొనవలసి యున్నది. మీరు గుఱ్ఱమును అమ్ముటకు సిద్ధముగనున్నారు. నేను కొనుటకు సిద్ధముగానున్నాను. ఇంకేమి? మీరు వెంటనేపోయి మీ గుఱ్ఱము నిచ్చుటకు తీసికొనిరండు" అని అతడనెను.

నేను వెంటనే ఆ ప్రదేశమును వీడిపోయి గుఱ్ఱమును తీసి

కొని వచ్చితిని. అంతకు మునుపు ఎవ్వరికినివచ్చని ఆ గుఱ్ఱము ముసలివానికి నచ్చెను.

"ఇంత మంచిగుఱ్ఱమును ఎందుకు అమ్మివేయుచున్నావు?" అని అతడు ప్రశ్నించెను.

"మాకిప్పుడు గుఱ్ఱము అనవసరము. అందువలన నేను అమ్మివేయుచున్నాను" అని నేను సమాధాన మిచ్చితిని.

తరువాత మేమిరువురము కలసి గుఱ్ఱపుధరను నిర్ణయించితిమి. ఇకనతడు నాకు సొమ్మియ్యవలసి యుండెను. అతడు జేబులోనుండి ముప్పది పౌనులనోటు నొకదానిని బయటకుతీసి, "దీనిని తీసికొని మీకురావలసిన డబ్బుపోను మిగిలిన డబ్బునిండు" అని అనెను.

"నాదగ్గఱ చిల్లరలేదు" అని అంటిని.

"పోనీ, సంతలోనికిపోయి మార్చుకొనివచ్చి ఇండు" అని అతడనెను.

"నాకు మార్చుట చేతకాదు. అంత పెద్దనోటు తీసికొని పోయినచో నన్నెవ్వరైన మోసము చేయవచ్చును" అని నేనంటిని.

అంతట నతడు తన సేవకునికొఱకు కబురు పంపించెను. అనతికాలములో సేవకుడు అచ్చటకు వచ్చెను. ముసలివాడు ఆ సేవకునితో ఇట్లనెను: "అబ్రహామ్! ఈముప్పదిపౌనుల నోటును తీసికొనిపోయి చిల్లర మార్చుకొనిరమ్ము. జాక్సన్ వద్దగాని మఱి యింక నితరులెవ్వరి వద్దనైనగాని మార్చుకొనిరమ్ము."

సేవకుడు ముప్పదిపౌనుల నోటును తీసికొని వెళ్ళిపోయెను. అతడు వెళ్ళిపోయిన తరువాత ముసలివాడు వెండి నాణెములు సరిగా దొరకుటలేదను విషయమునుగూర్చి దీర్ఘోపన్యాస

మొసగెను. బంగారు నాణెములుగూడ సరిగా దొరకుటలేదను విషయమునుగూర్చి నేను ఉపన్యసించితిని. కడకు మేమిరువురము బంగారు నాణెములు, వెండినాణెములు సరిగా దొరకుటలేదను విషయమున ఒక నిర్ణయమునకువచ్చితిమి. అప్పటికి చాలకాలమై పోయెను.

అంతలో నచ్చటకు చిల్లరమార్చుటకై ముప్పదిపౌనుల నోటును తీసికొనిపోయిన అబ్రహామ్ తిరిగివచ్చెను. అతని మొగములో చిల్లర దొరికిన సూచనలేమియు కనబడకుండెను. అతడు హీనస్వరమున నిట్లనెను: "అయ్యా! చిల్లరకొఱకు నేను మొత్తము సంతఅంతయు తిరిగినాను. కాని నాకెచ్చటను చిల్లర లభింపలేదు. ఒక క్రౌను నాణెము నిత్తునని ఆశపెట్టిననుగూడ ఎవ్వరునుచిల్లరనీయలేదు. ఎవ్వరినడిగిననుచిల్లర లేదన్నారు. నేను పూర్తిగ అలసిపోయినాను. పనిమాత్రము జరుగలేదు. ఇందుకు నేనెంతయు సిగ్గుపడుచున్నాను."

అబ్రహామ్ మాటలు మాకు ఎంతో ఆశాభంగమును కలిగించెను. ముసలివాడు ఆవిషయమునుగూర్చి కొంచెముసేపు ఆలోచించెను. ఎట్టకేల కతడు ఇట్లనెను: "మంచిది. నాకొక ఉపాయము తట్టినది. మీప్రాంతమున నొక గౌరవనీయుడు నివసించుచున్నాడు. అతనిపేరు సోలమన్ ఫ్లాంబరో అతనిని మీ రెఱుగుదురా?"

"అతనిని ఎఱుగకపోవుటయేమి? అతడు మాయింటి ప్రక్కనే నివసించుచున్నాడు. అతడు చాల మంచివాడు" అని నేను అంటిని.

"ఓహో! అటులనా? అయిన నింక ఆలస్యమెందులకు?

మన మా విషయమున ఒక నిర్ణయమునకు వత్తము. నేను గౌరవ నీయుడు ఫ్రామ్బరో పేరిట నేనొక పత్రము వ్రాసి సంతకము పెట్టి యిత్తును. ఆ పత్రమును చూడగనే మీకు నే నీయవలసిన ధనము సతడు మీకు ఇచ్చును. మీ ప్రాంతములో అంతమంచి వాడు, నమ్మకస్థుడు మఱియొకడు లేడని నేను నిశ్చయముగ చెప్ప గలను. గౌరవనీయుడు ఫ్రామ్బరో, నేను ప్రాతమిత్రులము. మే మిరువురము చాలకాలము కలసి నివసించినాము. చిన్నప్పుడు మే మిరువురము కలసి ఆడుకొనుచుండెడివారము. కొన్ని ఆటలలో అతనికి ప్రావీణ్యముండెడిది. మఱికొన్ని ఆటలలో నాకు ప్రావీణ్య ముండెడిది ”

నాకు సొమ్మునిచ్చిన నెంతయో, సోలమన్ ఫ్రామ్బరో పేరిట వ్రాసియిచ్చిన పత్రముగూడనంతియే. ఏలయన సతడు సొమ్మునిచ్చుటకు తగిన శక్తి సామర్థ్యములు కలవాడని నాకు గట్టి నమ్మకముకలదు. ముసలివాడు ఫ్రామ్బరో పేరిట వ్రాసి యిచ్చిన పత్రమును నాకిచ్చెను. పిమ్మట ముసలివాడు (అతని పేరు జెంకిన్సన్) అతని సేవకుడు అబ్రహామ్ కలసి బ్లాక్ బెరీ (గుఱ్ఱము)ని తీసికొనివెళ్ళిపోయిరి.

కొంచెముసేపైన తరువాత జరిగిన విషయమునుగూర్చి నేను కొంచెము లోతుగా ఆలోచింపసాగితిని. క్రొత్తవాడు వ్రాసి యిచ్చిన పత్రమును తీసికొనుటలో నేను పొరపాటు పనిచేసితినని తలంపసాగితిని. ఫ్రామ్బరో నాకు తెలిసినవాడే; కాని జెంకిన్సన్‌కు సంబంధించిన విషయములేవియు నాకు బాగుగ తెలియవు. అందువలన నేను జెంకిన్సన్‌ను అనుసరించిపోవలయుననియు, నా గుఱ్ఱమును తిరిగి తెచ్చుకోవలయుననియు నిశ్చయించుకొంటిని.

కాని నేను ఆ నిర్ణయమునకు వచ్చునప్పటికి చాల ఆల స్యమైపోయెను. అందువలన నేను ఇంటి వంకకు బయలుదేఱి పోసాగితిని. సాధ్యమైనంత త్వరలో ఇంటికిపోయి ఫ్లాంబరోను కలిసికొని పత్రము నతనికిచ్చి డబ్బుతీసికొనవలయునని నేను అభి ప్రాయపడుచుంటిని.

నేను తిన్నగాపోయి ఫ్లాంబరో ఇల్లు చేరుకొంటిని. ఫ్లాంబరో తన యింటి గుమ్మమువద్దనే కూర్చుండి తాపీగా చుట్ట కాల్చుకొనుచుండెను.

"నీపేరిట పత్రము నొకదానిని తీసికొని వచ్చినాను. ఇదిగో ఆ పత్రము. దీనిని చదువుకొని నా కీయవలసిన సొమ్ము నిమ్ము" అని నేనంటిని.

ఫ్లాంబరో నావద్దనుండి పత్రమును తీసికొని రెండుసార్లు చదువుకొనెను.

ఆలస్యమును సహింపలేక నేనిట్లంటిని: "నీకు సంతకము చక్కగా తెలియుచున్నదనుకొందును. ఎఫ్రాయిమ్ జెంకిన్సన్."

అంతట నతడిట్లు సమాధాన మిచ్చెను. "సంతకమున కేమి? సంతకము చక్కగనే తెలియుచున్నది. ఈ సంతకము పెట్టిన వానిని గూడ నెఱుగుదును. అంతటి దుర్మార్గుడు మఱి యొకడు ఈ విశాల ప్రపంచములో నుండడని నిస్సంశయ ముగ చెప్పగలను. కళ్ళజోళ్ళ నమ్మిన దుర్మార్గుడు, ఈ పత్ర మును వ్రాసియిచ్చిన దుర్మార్గుడు ఒకడే. అతని జుట్టు బాగుగ నెఱసియుండును. ఎంతో పవిత్రునివలె కనబడుచుండును. గొప్ప జ్ఞానివలె నటించుచుండును."

"అవును. అతడే!" అను నర్థము వచ్చునట్లు నేను మూలితిని.

ఫ్లామ్‌బరో ఇంకను ఇటుల చెప్పసాగెను: "ఆ దుర్మార్గున కొక్క విషయమున మాత్రము గొప్ప జ్ఞానమున్నది. ఇతరులను మోసగించుటయే ఆ దుర్మార్గునకు గల గొప్ప జ్ఞానము! ఆ దుర్మార్గుని నేను బాగుగా నెఱుగుదును. అతని నెప్పటికైన పట్టుకొని శిక్షించి తీఱుదును."

అప్పటికే నేను బాగుగ అవమానము పొందితిని. కాని మా యింటికి బోయిన తరువాత అంతకంటె ఎక్కువ అవమానమును పొందవలసి యుండెను. నేను ఇంటికిపోయి నా భార్యను, కొమార్తెల నిరువురను ఎదుర్కొనవలసియుండెను. సాధారణముగ బడికి సరిగా పోని పిల్లలు ఉపాధ్యాయునివద్దకు పోవుట కెంతయు భయపడుచుందురు. నా పరిస్థితి అంతకంటే నికృష్టముగనుండెను. నా భార్య బిడ్డలను కలసికొనుటకు నేనెంతయు భయపడసాగితిని. వారు నాపై కోపము ప్రకటింపక ముందే నేను ఉద్వేగము ప్రకటింపదలచితిని.

నేను మా యింటిలో కాలుపెట్టితిని. అయ్యో! మా కుటుంబమువారు నాతో తగవులాడుటకు సిద్ధముగ లేరు. నా భార్య, కొమార్తెలు సంతతధారగా కన్నీరు కార్చుచుండిరి.

జరిగిన విషయ మిట్లున్నది. ఆనాడు నేను సంతకుపోయిన తరువాత థార్న్‌హిల్ మా యింటికివచ్చి యుండెను. అతడు మా వారితో నిట్లనెను: "మీరింక పట్టణమునకు ప్రయాణమై రావలసిన పనిలేదు. మీ పట్టణ ప్రయాణము ముగిసినట్లే భావింప వచ్చును. మిమ్ము బాగుగ నెఱిగిన దుర్మార్గుడెవ్వరో

మిమ్ముగూర్చి పట్టణ యువతులకు వ్యతిరేక వార్తలను తెలిపి నాడు. అందువలన వారింక మిమ్ము తమతో పట్టణమునకు తీసి కొనిపోదలచ లేదు. వారీ దినముననే లండను మహానగరమునకు ప్రయాణమై పోయినారు. మిమ్ముగురించి వ్యతిరేక వార్తలను తెలిపిన వాడెవ్వడో, అతడెందులకట్లు చేసెనో నాకేమియు తెలి యదు. అతడు చెప్పిన విషయములేవైననేమి? అతడెందులకట్లు చెప్పియుండిననేమి? అతడెవ్వరైననేమి? నేనుమాత్రము మీతో ఇదివఱకువలెనే స్నేహముగా నుందును. నారక్షణ మీ కెప్పు డును నుండును."

సంతలో నాకు జరిగిన పరాభవమును మావారికి వర్ణించి చెప్పితిని. కాని వారందుల కేమియు బాధపడలేదు. ఏలయన వారంతకుముందే గొప్పపరాభవముపొంది యుండిరి. వారి పరాభ వము ముందు నాపరాభవ మొక లెక్కలోనిదికాదు.

మమ్ము గురించి వ్యతిరేక ప్రచారముచేసిన దుర్మార్గు డెవడు? మేము ఎవరికిని ఎట్టి అపకారమును చేసియుండలేదే! అట్టిమాకు అపకారము తలపెట్టిన నికృష్టుడెవడు? మేము బీద వారమే! అట్టిమమ్ము ద్వేషించి అసూయతో అపకారము తల పెట్టిన వారెవరు? మేము ఎవ్వరిని ఒక్కపల్లెత్తుమాటయైన అని యుండలేదే! అట్టిమాకు వ్యతిరేకముగ విషప్రచారము చేసిన దుర్మార్గులెవ్వరు? మాకుటుంబమువార మందఱు మా విషయము లనుగూర్చి దీర్ఘముగ నాలోచింప సాగితిమి.

# 15

నాటి సాయంకాలమంతయు దుర్మార్గుడెవరాయని తెలిసికొనుటలోనే గడచి పోయెను. మఱునాడుగూడ నేమే మా విషయమునుగూర్చియే దీర్ఘముగ నాలోచింపసాగితిమి. మేము మా చుట్టుప్రక్కలనున్న ప్రతియొక్క కుటుంబమువారిని అనుమానింపసాగితిమి. మేము వారిని ఎందుకు అనుమానించు చుంటిమో మాకే తెలియదు. వారిని అనుమానించుటకు మాకు వేర్వేఱు కారణము లుండెను.

మేమా విషయమునుగూర్చిన ఆలోచనలో మునిగియుండగా మాచిన్న కుమారులలో నొకడు ఉత్తరములపెట్టె నొకదానిని తెచ్చి నాకిచ్చెను. "నేను ఇచ్చటకు సమీపముననే యున్న మైదానములో ఆడుకొను చుంటిని. నాకచ్చట నిది దొరకినది. నేనుదానిని తీసికొని మీకిచ్చుటకై వెంటనే ఇచ్చటకు వచ్చినాను" అని అతడనెను.

ఆపెట్టె బర్చెల్‌కు సంబంధించినదని నేము వెంటనే గ్రహించితిమి. ఏలయన దాని నిదివఱకతనివద్ద పలుమార్లుచూచి యుంటిమి. మేము దానిని నిశితముగ పరీక్షించితిమి. అప్పుడు మాకు అనేకవిషయములకు సంబంధించిన సూచనలు లభించెను. కాని ముఖ్యముగా మా దృష్టి నాకర్షించిన ఉత్తరమొకటి అందుండెను. అది సీలువేయబడిన యుత్తరము. దానిమీదనిట్లు వ్రాయబడి యుండెను. "తార్న్‌హిల్ భవనమున నివశించుచున్న పట్టణ యువతుల కిరువురకును పంపవలసిన ఉత్తరపు నకలు."

పట్టణయువతులకు మా కొామార్తలనుగూర్చి వ్యతిరేక వార్తలనుపంపిన నికృష్టుడు బర్చెల్ అనువిషయము మాకు వెంటనే తట్టెను. "సీలు బ్రద్దలుకొట్టి ఉత్తరములో నేమిర్వాయ బడియున్నదో చూతము" అని నాభార్య అనెను. ఆమె అభి ప్రాయమును కొందఱు సమర్థించిరి. సీలు బ్రద్దలుకొట్టవలయునా, వలదా అను విషయమునుగూర్చి మేము దీర్ఘముగా చర్చించి తిమి.

"బ్రద్దలుకొట్టరాదు" అని నేను గట్టిగావాదించితిని. కాని బర్చెల్ అన్న సదభిప్రాయముకల నా రెండవ కూతురుసోఫియా ఇట్లనెను: "బర్చెల్ అంతటి నీచమైనపని చేసియుండునని నేను కలలోనైన నూహింపజాలను. అంత నికృష్టమైనపని చేయుటకు సాహసించువారిలో బర్చెల్ కడపటివాడై యుండుననుటకు కొట్టి సందియమును లేదు. "అతడు నిర్దోషియను విషయ మిప్పుడు తేలవలసియున్నది. కావున సీలు బ్రద్దలుకొట్టి ఉతరమును చదువుట శ్రేయస్కరమని నేను గట్టిగాఅభిప్రాయపడుచున్నాను" ఆమె యటులన్నతరువాత నేనుతప్ప మిలిగినవారందఱును ఆమెను సమర్థించిరి.

ఇక విధిలేక నేను సీలు బ్రద్దలుకొట్టి ఉత్తరమునందఱకు చదివి వినిపించితిని. అందిట్లువ్రాయబడియుండెను."పట్టణయువతు లారా! ఈ యుత్తరమును తీసికొనివచ్చువాడు, ఇది ఎవ్వరి నుండి వచ్చినదను విషయమున మీకు సంపూర్ణమగు తృప్తిని కలుగజేయును. ఆ విషయమున మీకెట్టి అపోహకును లోను గావలసినపని లేదు. మీరీ ప్రాంతపు యువతుల నిర్వురను మీతోబాటు పట్టణమునకు తీసికొనిపోవలయునని గటిగా

వాంఛించుచున్నారని నాకు తెలియవచ్చినది. ఆ యువపురుష యువతులను నేను బాగుగా ఎఱుగుదును. వారు నాకు సహచరులు. మీరు చేయుచున్న పనివలన చాలదుష్ఫలితము గలుగునని గట్టిగా హెచ్చరించుచున్నాను. మీరు చేయఁబోవుచున్న పని ఏమాత్రమును సమంజసమైనదికాదు. మీకు నేను మిత్రుఁడనుగా ఈ హెచ్చరిక చేయుచున్నాను. ప్రశాంతము, నిర్దోషిత్వము ఇంతవఱకునున్న ప్రదేశములలోనికి అల్లరి, దోషము ప్రవేశపెట్టి పాడుచేయఁకుడు."

ఆ యుత్తరమును చూడఁగనే మా సందేహము లెక్కకుమిక్కుడ పటాపంచలైపోయెను. అయితే ఆ యుత్తరము రెండు విధములుగా అర్థము నొసగుచుండెను. పాడైపోవువారెవ్వరు? పట్టణయువతులా? నా కొమార్తెలా? ఒకవంక పట్టణయువతులు నా కొమార్తెలను పాడుచేయుదురను నర్థము వచ్చుచుండెను. మఱియొకవంక నా కొమార్తెలు పట్టణయువతులను పాడుచేయుదురను నర్థము వచ్చుచుండెను. ఏమైననేమి? అది ద్వేషభావముతో వ్రాయఁబడినట్లు స్పష్టపడుచుండెను. మేమంతకుమించి లోతుకు పోవుట కిచ్చగింపకుంటిమి.

నామాటలను చివరవఱకు వినుటకు నాభార్యకు ఏమాత్రము సహనములేకుండెను. ఆమె యా ఉత్తరమువ్రాసినవానిని విశృంఖలముగ నోటికివచ్చినట్లెల్ల దూషించుచుండెను. ఆమె నోటికి హద్దుపద్దు లేకుండెను. నా మొదటి కూతురు ఒలీవియాకూడ అంతే కఠినముగ ప్రవర్తింపసాగెను. ఆ యుత్తరము వ్రాసిన వాని నీచత్వము నా రెండవ కూతురు సోఫీయాను ఆశ్చర్య సాగరమున ముంచెను. ఇక నా సంగతి చెప్పవలెనురా?

ఆ యుత్తరము వ్రాసిన వాని వంటి కృతఘ్నుడు, నీచుడు మరి యొక డీ విశాల ప్రపంచమున నుండడని నేను భావింపసాగితిని.

బర్చెల్ ఆ విధముగ ఎందుకు వ్రాసినాడు? నాకు ఏమియు తోచకుండెను. నాకు ఒక్క కారణము మాత్రమే కన బడుచుండెను. బర్చెల్ నా రెండవ కూతురు సోఫియా సాహ చర్యమును గాఢముగా వాంఛించుచుండెను. మఱి ఆమె పట్టణ మునకు పోయినచో ఆమెను కలసికొనుట ఎట్లు? ఆమె మా యింటివద్ద నున్నచో కలసికొనుటకు అవకాశము కలుగును. ఆ యుద్దేశ్యముతోనే అతడా ఉత్తరమును వ్రాసియుండును.

దుష్టుడగు బర్చెల్‌పై ప్రతీకారమును తీర్చుకొనుట ఎట్లా యను విషయమును గూర్చి మేము లోతుగ ఆలోచింప సాగితిమి. ఆ సమయమున మా వద్దకు బయట నింకను ఆడు కొనుచున్న మఱియొక కుఱ్ఱవాడువచ్చి బర్చెల్ వచ్చుచున్న విషయమును మాకు తెలిపెను. అప్పుడు మా మనస్సులలో విజృంభించిన అభిప్రాయములను, భావములను ఏమని వర్ణింప వచ్చును? అతడు మమ్ము గాయపఱచెనని మేమంతవఱకు భావించుచుంటిమి. ఇప్పుడతడు మా యింటికి వచ్చుచున్నాడు గనుక అతనిపై పగతీర్చుకొనుటకు మంచి అవకాశము లభింప నున్నది. మా భావములు వానికి సంబంధించియుండెను. వానిని పేర్కొనుటకంటె ఊహించుటయే సులభముగ నుండును.

బర్చెల్‌ను కొట్టి పగతీర్చుకొనుట మా యుద్దేశ్య మే మాత్రమునుగాదు. కృతఘ్నతా భావముతో ప్రవర్తించి నందు కతనిని గట్టిగా చీవాట్లుపెట్టుటయే మా ముఖ్యోద్దేశ్యము. అట్లుచేసినచో అతని మనస్సు తీవ్రముగ గాయపడునని మేము భావించుచుంటిమి. అందుకుగాను మేము ఎప్పటి అలవాటు

ప్రకారమతనిని మందహాసముతో ఇంటిలోని కాహ్వానింపదలచి తిమి. మొదట పూర్వము కంటె ఎక్కువ అభిమానముతో మాట్లాడదలచితిమి. పూర్వముకంటె ఎక్కువగ అతనిని సంతోష పెట్టదలచితిమి. ఆవిధముగ నతనితో మంచిగనుండుచు ఒక్కసారిగ భూకంపమువలె నతనిపై విరుచుకు పడదలచితిమి. అతని నీచత్వ మతని కొక్కసారిగ కొట్టవచ్చినట్లు కనబడునట్లు చేయదలచితిమి.

ఆ విధముగ నిశ్చయమునకు వచ్చిన తరువాత, "ఈపనిని మొదటినుండి నేను చేయుదును" అని నా భార్య అనెను. అటువంటి పనినిచేయుట కామెకు నిజముగ తెలివి తేటలు కలవనుట నిశ్చయము. అందువలన మేమందఱ మామెకోరికకు అంగీకరించితిమి.

బర్చెల్ మా యిల్లు సమీపించెను; లోనికివచ్చెను; అంతఱము అతనిని మందహాసముతో లోని కాహ్వానించితిమి. అతడొక కుర్చీని దగ్గఱకులాగుకొని కూర్చుండెను.

"చాల మంచి దినము, బర్చెల్ !"

"చాల మంచి దినము డాక్టర్! కాని నేడు వర్షమువచ్చునని తోచుచున్నది" అని బర్చెల్ అనెను.

అపుడు నాభార్య జోక్యము కలిగించుకొని గట్టిగానవ్వుచు నిట్లనియెను: "వర్షమా! ఏమి వర్షము? ఆళ్ళవర్షమా? తిట్ల వర్షమా? తమాషా కీవిధముగనన్నాను. ఏమియు అనుకొనకుడు. దయయుంచి క్షమింపుడు."

అంతట బర్చెల్ ఇట్లనెను: "అమ్మా! తమాషాకన్నారా? మీరావిధముగ చెప్పియుండకపోయినచో మీరు తమాషాగా

మాట్లాడినట్లు ఏ మాత్రము అర్థమై యుండెడిదికాదు. నేను మిమ్ము హృదయపూర్వకముగ క్షమించు చున్నాను."

అపుడు నాభార్య మా అంచటివంక చూచుచు నిట్లనెను: "ఎన్నిసార్లు తమాషాగా మాట్లాడిన ఒకజోన్సు బరువుండునో తెలిసికొన గోరుచున్నాను."

"మీరీ యుదయమున దానికి సంబంధించిన పుస్తకమును దేనినో చదివి యున్నారని నేననుకొను చున్నాను. తమాషాగా మాట్లాడుటకంటె, అర్థముచేసికొని మాట్లాడుట మేలని నేను అభిప్రాయపడు చున్నాను" అని బర్చెల్ అనెను.

నాభార్య ఇంకను మందహాసము చేయుచు నిట్లనెను "మీరు చెప్పినదానితో నేను సంపూర్ణముగ ఏకీభవించు చున్నాను. కాని కొందఱు ఏమో అర్థమైనట్లు నటింతురు. కాని నిజముగా వారికేమియు అర్థముకాదు."

"అవునవును. కొందఱుస్త్రీలు ఎంతో చమత్కారముగా మాట్లాడు చున్నామని అనుకొందురు కాని వారిమాటలలో చమత్కార మిసుమంతయు నుండదు." అని బర్చెల్ అనెను.

ఆవిధముగ సంభాషణమును కొనసాగించుచు పోయిన: యెడల నాభార్యకు కలుగు లాభ మిసుమంతయు నుండదనినేను గ్రహించితిని. వృథా వాగ్వివాదము జరుగునుగాని, అసలువిషయ మునకు వచ్చుట తటస్థింపదు. అందువలన నేనే జోక్యము కల్పించుకొని అతనిని కఠినముగ మందలింప దలచితిని.

నే నిట్లంటిని. "చమత్కారముగ మాట్లాడుట, విషయ మును చక్కగా అర్థముచేసుకొని మాట్లాడుట తెలిసినంత మాత్రమున లాభమేమి యున్నది? అవిచాల స్వల్పములు

మాత్రమే. నీతిలేనిచో నవి నిష్ప్రయోజనములు. ఎవ్వరిగుణములు కైనను వన్నెతెచ్చునది నీతిమాత్రమే. ఏలోపములు లేని అమాయకుడగు రైతు ఎన్నో లోపములుగల తత్వశాస్త్రజ్ఞునికంటే మేలైనవాడు. హృదయము లేనిచో ధైర్యసాహసములు, తెలివితేటలు ఉండి మాత్రము లాభమేమి యున్నది? భగవంతుని సృష్టిలోకెల్ల నిజాయితీ పరుడే అత్యుత్తమమైనవాడు."

"పోప్‌వంటి మేధావి ఆమాటలని యుండవలసినది కాదని నేను మొదటినుండియు అభిప్రాయ పడుచున్నాను. అతడు తన ఆధిక్యతను నిరూపించుకొనుటకు ఆవిధముగ నన్నాడు. ఒక పుస్తకములో ఏలోపములు లేనంతమాత్రమున అది ఉద్గ్రంథమని ఎవ్వరును అనరు. ఒకగ్రంథముయొక్క గొప్పతనము దానిలోని సొబగులపై నాధారపడి యుండును. అట్లే లోపములు లేని మనజుని గొప్పమనుజుడని అనము. అతనిలో గల సుగుణములనుబట్టియే ఆవిషయమును నిర్ణయింతుము. పండితునకు జాగ్రత్త లేకపోవచ్చును. రాజకార్య దురంధరునకు గర్వముండవచ్చును. వీరుడు క్రౌర్యము కలిగియుండవచ్చును. కాని అంత మాత్రమున మనము వారిని త్రోసిరాజని ఎవ్వరిచేత ఖండింపబడని, ప్రశంసింపబడని సామాన్యపు పనివానిని మేలైనవాడని అందుమా? లోపములున్నను గంభీరమైన రోమను చిత్రములను మనము ప్రశంసింపవలయునేగాని, లోపరహితమైన సామాన్యపు ఫ్లెమిష్ చిత్రములను ప్రశంసింపరాదు" అని బర్చెల్ అనెను.

"అయ్యా, మీరు చెప్పినదంతయు న్యాయముగనే యున్నది" అని నేను అంటిని; "కాని ఎప్పుడు? లోపములుచాల స్వల్పమైనపుడు, సుగుణములు ఉత్కృష్టమైనవైనపుడు, కానికొంది

టిలో లోపములు, సుగుణములు కొట్టవచ్చినట్లు కనబడు చుండును. అటువంటివారిని చీడపురుగును ద్వేషించినట్లు ద్వేషింప వలయును".

అంతట బర్చెల్ ఇట్లనెను: "మీరన్నట్లు గొప్పలోపములు, గొప్ప సుగుణములు రెండును కల వికృతపురుషులు కొందటీ విశాల ప్రపంచములోనుండిన నుండవచ్చును. కాని నాకు తెలిసి నంతవఱకు నా జీవితములో నట్టివాని నొక్కనినైనను చూచి యుండలేదని బల్లగ్రుద్ది చెప్పగలను. నాకు తెలిసినంతవఱకు విశాలమైనమనస్సు కలవారు ఎక్కువప్రేమను చూపుచుందురు. భగవంతునిదయవలన ఉత్తమగుణములుకలవారు, వానినే ఎక్కువగా ప్రదర్శించుచుందురు. వారిలో కొన్ని లోపములున్నను అవి అంతగా బయటకురావు. బయటకువచ్చుటకు వానికి శక్తి చాలదు. ఈ సత్యము జంతులోకమునకుగూడ వర్తించును."

"మీరు చెప్పినవన్నియు బాగుగనేయున్నవి" అని నేను అనసాగితిని, "కాని నేను ఈ క్షణముననే ఒకమనుజును వ్రేలెత్తి చూపగలను" అట్లనుచు అతనివంక తీక్ష్ణముగ చూచితిని.

"అతని మెదడుకును, హృదయమునకును తీవ్రముగ అసహ్యించుకోదగినంత తేడాకలదు." నేనింకను గొంతెత్తి ఇట్లంటిని : "అయ్యో! అతడు తాను సురక్షితస్థానమున నున్నా నని భ్రమించుచున్నాడు. అతని నిప్పుడే బయల్పఱచు సదవ కాశము లభించినందులకు నే నెంతయు సంతసించుచున్నాను. అయ్యో! మీ రీపెట్టె నెఱుగుదురా?"

బర్చెల్ ఏమాత్రము కలవరపడని వానివలె నిట్లనెను: "ఎఱుగకేమి? ఆ ఉత్తరములపెట్టె నాదే. నేను దీనిని పోగొట్టు

కొన్నాను. మీ కిది లభించినందులకు నే నెంతయు సంతసించు చున్నాను."

తరువాత నే నిట్లంటిని: "అయ్యా! మీ రీ యుత్తరము నెఱుగుదురా? అయ్యా! ఏమాత్రము తొట్రుపడకుడు సరిగా నా ముఖమువంకకు చూడుడు. అయ్యా! మఱియొకసారి అడుగు చున్నాను. ఈ యుత్తరమును మీరు ఎఱుగుదురా?"

"ఆ యుత్తరమా? ఆ యుత్తరమును నేనే వ్రాసి యుంటిని" అని అతడు నిర్భయముగ సమాధానము చెప్పెను.

అప్పుడు నేను కోపముతో నిట్లంటిని: మీ రీ యుత్తర మును నీచాతి నీచముగ వ్రాసియున్నారు. మీరు కృతఘ్నతతో ప్రవర్తించినారు. మీ రీవిధముగ నెట్లు చేయకలిగినారు? మీ దోషము ఘోరమైనదని చెప్పుటకు సందేహ మేమాత్రమును లేదు.

అంతట బర్చెల్ ఇట్లనెను: "మీరు సీలువేసియున్న యుత్తరమును బ్రద్దలుకొట్టి చదివినారు. ఇంతకంటె నీచమైన పని మఱియొకటి యుండబోదు. మీరు ఇంతటి నీచమునకెట్లు దిగ గలిగినారో నాకు ఆశ్చర్యముగ నున్నది. ఈ నేరము చాల ఘోరమైనది. ఇందుకుగాను మిమ్ములనందఱ నిప్పుడు ఉరి తీయించగలను. ఈ విషయము మీకు తెలియదా? మిమ్ము లను శిక్షించుట ఏమంత కష్టమైనపనికాదు. నేనిప్పుడే న్యాయాధి కారివద్దకుపోయి మీరు చేసిన నేరమును ప్రమాణముచేసి చెప్పినచో మీ పనియగును. మిమ్ములను మీ గుమ్మమువద్ద నే ఉరి తీయుదురు!"

బర్చెల్ ఆ విధముగ మాట్లాడు నని నేను అనుకొని

యుండలేదు. అందువలన నాకు ఎంతో కోపము వచ్చెను. నేను నాలోని ఉద్రేకమును అణచుకొనలేకపోతిని, ఆయుద్రేకముతో నేను ఇట్లంటిని: "దుర్మార్గుడా! కృతఘ్నుడా! నీవు వెంటనే మా యిల్లు వీడిపొమ్ము! నీవు తిన్నయింటి వాసములు లెక్కపెట్టిన విధమున ప్రవర్తించినావు! ఇక నెన్నడును నీపాడు మొగమును నాకు చూపకుము! నీ నీచత్వముతో ఇక ముందెన్నడును నా గృహమును అపవిత్రముచేయకుము! పోపొమ్ము! ఇక నెన్నడును రాకుము! నీ అంతరాత్మ ఎన్నడును నిన్ను బాధించుచునే యుండును! అదియే నీకు తగిన శిక్ష!"

అట్లనుచు అతని ఉత్తరముల పెట్టె నతని మొగముపైకి విసరివైచితిని. అతడు మందహాసము చేయుచు దానిని స్వీకరించెను. అతని మొగములో అణుమాత్రమైనను కోపము కనబడలేదు. అనతికాలములో నతడు మా గృహమును వీడిపోయెను.

అతడట్లు పోవుటవలన నాభార్యకు అపరిమితమగు కోపము వచ్చెను: "మనమాటల కతనికి అణుమాత్రమైనను కోపము రాలేదు. మఱియు నతడు తానుచేసిన చెడ్డ పనికి సిగ్గుపడుచున్నట్లుగాని, పశ్చాత్తాప పడుచున్నట్లుగాని కనబడదు. ఇది యెంతయు ఘోరముగ నున్నది. ఇందుమూలమున నాకోపమతిశయించిపోవుచున్నది" అని ఆమెవాపోయెను.

అప్పుడు నేను అందఱి ఉద్రేకమును అణచి వేయదలచి ఇట్లంటిని: "ప్రియురాలా! ఇందు ఆశ్చర్యపడవలసిన విషయమేదియులేదు. దుర్మార్గు లెవ్వరుగాని తాముచేసిన చెడ్డ పనులకు సిగ్గుపడరు. పశ్చాత్తాపపడరు. పైగా వారు తాము చేసిన

చెడ్డ పనులను గొప్పగా చెప్పుకొందురు. దేవుడు వారికి సిగ్గు పెట్టకపోవుటయే అత్యాశ్చర్యకరమైన విషయము.

మొట్టమొదట పాపము, సిగ్గు అనునవి రెండును సహచరులు. అవి రెండును, ఒకదానినొకటి విడువకుండకలసి ప్రయాణము చేయసాగెను. కాని అనతికాలములోనే వాని స్నేహము రెంటికిని నచ్చలేదు; రెంటిని పీడగా పరిణమించెను. పాపము తఱచుగా సిగ్గును బాధపెట్టసాగెను. సిగ్గు తఱచుగా పాపముయొక్క రహస్య కుట్రలను బయల్పఱచసాగెను. పాపముకడు ధైర్యసాహసములతో ముందు పోవుచున్న విధినిదాటిపోవుటకు ఒంటరిగపోసాగెను. అప్పుడు విధి ఉరితీయు తలవరి రూపమున పోవుచుండెను.

కాని సహజముగ పిఱికిదైన సిగ్గు వెనుకకు తిరిగివచ్చి సుగుణముతో స్నేహము చేయసాగెను. మొట్టమొదట సిగ్గు పాపము కలసి ఈసుగుణమునే విడిచిపుచ్చి వెళ్ళిపోయియుండెను. అట్లే మానవులు దుర్గుణములలో కొన్ని అంచెలుదాటి వెళ్ళిన తరువాత సిగ్గువారిని పూర్తిగా వదలివేయును. వెనుకకు తిరిగివచ్చి వారిలోనింకను మిగిలియున్న కొలది సుగుణములతో కలసి పోవును."

# 16

బర్చెల్ మాయిల్లువిడి వెళ్ళిపోయి యుండెను. అతడింక మాయింటికి రాకుండెను. అందువలన నారెండవ కూతురు సోఫియా భావము లెట్లుండెనో! ఆమె భావములు ఎట్లున్ననేమి? మిగిలినవారు మాత్రము బర్చెల్ రాకపోకలు లేకున్నను ఓదా

ర్పును పొందగలిగిరి. అందుకు కారణము మా యజమానుడు థార్న్‌హిల్. అతడు మాయింటికి ఇదివఱకుకంటె ఎక్కువ తఱచుగా రాసాగెను. మఱియు ఎక్కువసేపు గడపసాగెను. పాప మతడు నా కొమార్తెను పట్టణమునకు పంపి వారికి చక్కని శిక్షణము నొసగవలయునని అతడెంతయు ప్రయత్నించెను. కాని దురదృష్టవశమున నతడా విషయమందు సఫలీకృత మనోరథుడు కాలేకపోయెను. అతడంతటితో నిరాశచెందలేదు. పట్టణమునకు సంబంధించిన విషయములన్నిటి నతడు నాకొమార్తెలకు విపులముగాచెప్పి సంతృప్తిపఱచ సాగెను.

థార్న్‌హిల్ మాయింటికి మామూలుగా ఉదయకాలమున నే వచ్చుచుండెడివాడు. నేను నాకుమారుడు మోజెస్ బయటకుపోయి మామా పనులలోమునిగి యుండెడివారము. అతడు మాత్రము మిగిలినవారితో కలసి ఇంటిలోనే కూర్చుండెడివాడు. పట్టణముసంతను చక్కగా వర్ణించుచు నతడు వారికి మితిలేని ఆనందమును చేకూర్చు చుండెడివాడు. పట్టణములో ప్రతి భాగమునకు సంబంధించిన పూర్తివిషయములు అతనికి బాగుగా తెలిసినట్లుండెను. నాటక శాలలకు సంబంధించిన అంశముల నన్నిటిని అతడు వారికి చెప్పుచుండెండివాడు. అచ్చటి వాతావరణము నతడు వారికి కన్నులకు కట్టినట్లు వర్ణించి చెప్పెడివాడు. పెద్దల సుద్దుల నతడు వారికి చెప్పుచుండెడివాడు. మహామహుల చమత్కారముల నతడు వారికి సోదాహరణముగ వివరించి చెప్పెడివాడు. సంభాషణ ముగిసినపుడు అతడు నా కొమార్తెలకు, చిన్న పిల్లలకు కొన్ని విషయములను నేర్పుచుండెడివాడు.

భూస్వామి తార్న్‌హిల్‌లో కొన్ని గొప్ప లోపములు కలవు. కాని మేము మా లోపములను ఏ మాత్రము లెక్క చేయకుంటిమి. అందుకు కారణము అతడు మాకు అల్లుడగునని ఆశించుటయే. ఆ ఆశ అతని లోపములకు సంబంధించి సంతవరకు మమ్ము గ్రుడ్డివారిని చేసెను.

ఇచ్చట నేను నా భార్యనుగూర్చి ఒక విషయమును చెప్పవలయును. ఆమె తార్న్‌హిల్‌ను వలలో వేసికొనుటకు తన శక్తిని తెలివి తేటలను ఉపయోగించి కొన్ని వందల ప్రణాళికలను అమలులో పెట్టసాగెను. ఈ విషయమును మఱియొక విధముగా మృదువైన భాషలో చెప్పవచ్చును. తన కొమార్తె ఒలీవియా గొప్ప తనమును వేయింతలుచేసి చూపుటకామె తన సర్వశక్తిని వినియోగింపసాగెను. మేము తార్న్‌హిల్ కొసగిన రొట్టెలు బాగుగనున్నవని అతడానాడను కొనును. "ఈరొట్టెలను మా అమ్మాయి ఒలీవియా తయారుచేసినది" అని నా భార్య అనెడిది గూస్‌బెరీ సారాయము బాగుగనున్నదన్నచో," మంచి గూస్‌బెరీలను ప్రోగుచేసికొని వచ్చినది మా అందాల రాణి ఒలీవియాయే" అని ఆమె అనెడిది. వేయేల? ఏ వస్తువు బాగున్నను, దానిని ఒలీవియా తయారుచేసినట్లుగా ఆమె చిలవలు పలవలు కల్పించి నొక్కి వక్కాణించుచుండెడిది.

పాపము, నా భార్య అప్పుడప్పుడు తార్న్‌హిల్‌తో నిట్లనుచుండెడిది: "మీరు, నా కూతురు ఒలీవియా ఒకే పరిమాణము కలిగి యున్నారు. మీ రిరువురును ఒకసారి లేచి నిలబడుడు. మీ యిరువురిలో ఎవ్వరు పొడవో చూతును." ఆ విధముగా నామె తన జిత్తులను భూస్వామి తార్న్‌హిల్‌పై ప్రయో

గించుచుండెడిది. తన జిత్తు లెవ్వరికిని తెలియవనియు, వాని నెవ్వరును భేదింప లేరనియు ఆమె తలచుచుండెడిది. కాని అవి యందఱకు సులభముగా నర్థమగు చుండెడివి. మిగిలిన వారి మాట కేమిగాని, తార్న్‌హిల్ మాత్రము వానిని చక్కగా అర్థము చేసికొనుచుండెడివాడు. కాని అతని కవి అపరిమితమగు ఆనందమును చేకూర్చుచుండెడివి. అతడు రోజురోజుకు తనకు గల అనురాగమును క్రొత్తగా రుజువు చేసికొనుటకు ప్రయత్నించుచుండెను.

"మీ అమ్మాయిని నేను గాఢముగ ప్రేమించుచున్నాను. ఆమెను వివాహము చేసికొనవలయునని నేను హృదయ పూర్వకముగ వాంఛించుచున్నాను. కావున మా యిరువురి వివాహమునకు దయతో అంగీకరింపుడు!" అని అతడెన్నడును స్పష్టముగ మాతో అని యుండ లేదన్న మాట నిజమే. కాని అతని యుద్దేశ్యమదియే యని మేము భావించుచుంటిమి. ఆ విషయమున మా కేమి మాత్రమైనను సందేహము కలుగకుండెను. మఱి అతడెందుల కా విధముగ స్పష్టముగ ప్రకటించుట లేదు? అతడు సహజముగ సిగ్గుపడు స్వభావము కలవాడని మేము సరిపెట్టుకొనసాగితిమి. "ఒకవేళ తన పినతండ్రికి కోపము వచ్చునని అతడు భయపడుచున్నాడు కాబోలు!" అనికూడ మేము అనుకొనుచుండెడివారము.

కాని తరువాత జరిగిన ఒక సంఘటనవలన అతడు మా కుటుంబములో నొకడు కాదలచుకొన్నాడను విషయము నిస్సందేహముగ స్పష్టమయ్యెను. నా భార్య దానిని సుస్పష్ట వాగ్దానముగ తీసికొనెను గూడ.

ఒకనాడు నా భార్య, కొమార్తలు కలసి పొరుగుననే యున్న ఫ్లామ్‌బరో ఇంటికి వెళ్ళిరి. వారచ్చట కొన్ని చిత్తరువులను చూచిరి. ఆ చిత్తరువుల నటీవలనే ఒక చిత్రకారుడు వ్రాసి యుండెను. అవి ఆ కుటుంబములోని వారి చిత్తరువులే. చిత్రకారుడు ఒక్కొక్క చిత్తరువు వ్రాయుటకు పదునేను షిల్లింగులు తీసికొనియుండెను. ప్రతి విషయములోను మా కుటుంబమువారు, ఆ కుటుంబమువారు చాలకాలమునుండి పోటీ పడుచుండిరిగదా. మఱి వారేమో మా కుటుంబమువారి కంటె ముందుగా తమ చిత్తరువులను వ్రాయించు కొనియుండిరి. దీనిని మావారు ఓటమిగా భావించి ఏ మాత్రము సహింప లేకుండిరి. మావారుకూడ తమ చిత్తరువులను వ్రాయించు కొనవలయునని నిశ్చయించుకొనిరి.

నేను మావారి అభిప్రాయమునకు వ్యతిరేకమగు అభిప్రాయమును వెలిపుచ్చితిని. చిత్తరువులను వ్రాయించుకొనుట వలన లాభమేమియు నుండదనియు, డబ్బుఖర్చుమాత్ర మగు ననియు నేను గట్టిగా చెప్పితిని. ఇంకను అనేక కారణములను చెప్పితిని. కాని నేను చెప్పినమాట లెవ్వియు మావారికి రుచింపలేదు. చిత్తరువులను వ్రాయించుకొనవలయునను వారి నిశ్చయము అణుమాత్రమైనను సడలలేదు. అందువలన నేను వారి అభిప్రాయముతో నేకీభవింపవలసివచ్చెను.

మేము చిత్రకారుని పిలిపించితిమి. మా చిత్తరువులను వ్రాయించుకొనుటలో ఫ్లామ్‌బరో కుటుంబమువారికంటె గొప్ప తనమును చూపింపదలచితిమి. ఫ్లామ్‌బరో కుటుంబములో ఏడుగు రుండిరి. వారు తమ చిత్తరువులను వేర్వేఱుగా ఒకేరంగులో

వ్రాయించుకొనియుండిరి. అసగా వారికి సరియైన అభిరుచులు తెలియవన్నమాట. ప్రపంచములో ఎవ్వరును ఆవిధముగా చేయరు. అందఱును మార్పును కోరుచుండుటగాని వారు మార్పును కోరరు.

మేము చిత్తరువులను వ్రాయించుకొనవలసిన విధమును గూర్చి దీర్ఘముగా చర్చలుసలిపితిమి. ఎట్టకేలకు మేమందఱము ఒక ఏకగ్రీవ నిర్ణయమునకువచ్చితిమి. మేము విడివిడిగా చిత్తరువులను వ్రాయించుకొనుటకు ఏమాత్రము అంగీకరింపకుంటిమి. అందఱముకలిసి ఒకేకుటుంబముగా ఒకేచిత్తరువును వ్రాయించుకొనవలయునని నిర్ణయించుకొంటిమి. మఱియు చారిత్రకవీరుల, పౌరాణికవీరుల వేషములు వేసికొనవలయు.. అనుకొంటిమి.

మా నిర్ణయమువలన డబ్బు ఎక్కువఖర్చుకాదు; మఱియు ఎంతో మర్యాదగను, నవీనపు అభిరుచులకు అనుగుణముగను నుండును. ఏలయన ఈకాలమున మంచి అభిరుచులుకల వారందఱును ఒకే కుటుంబముగా చిత్తరువులను వ్రాయించుకొనుచున్నారు.

ఇక మా వేషములనుగూర్చి కొన్నినిర్ణయములకు వచ్చితిమి. నాభార్య, 'నన్ను చిత్తరువులో సౌందర్యదేవత (వీనస్)గా చిత్రింపవలెను. శిరస్సుమీదను, ఱొమ్ముభాగముమీదను ఉండు ఆభరణములలో ఎన్నో విలువైన వజ్రములున్నట్లు చిత్రింపవలయును" అనికోరెను. ఆమె చిన్నకుమారులిరువురనుమన్మథులవలె ఆమెకు చెఱియొకప్రక్క నుండవలయును. నేను గౌను మున్నగు దుస్తులను ధరించి నేను వ్రాసిన గ్రంథముల నామెకు బహూకరించుచున్నట్లు ఉండవలయును. ఒలీవియా వీరురాలివేషము

వేసికొని పూలగట్టుపై కూర్చుండవలయును. ఆమె బంగారు జరీ గల పచ్చని దుస్తులను ధరించియుండును. ఆమెచేతిలో నొక కొరడా యుండును. సోఫియా గొల్లదానివేషము వేసికొనును. ఆమె చుట్టును పిల్లైనన్ని గొఱ్ఱెలుండును. మోజెస్ టోపీ, తెల్లని ఈక యొకటి ధరించి యుండవలయును.

మాఅభిరుచులు భూస్వామి తార్న్‌హిల్‌కు ఎంతయు నచ్చెను. అప్పుడతడు మమ్మిట్లు బ్రతిమాలుకొనెను: "నన్ను గూడ మీ కుటుంబ చిత్రమువులో చేర్చుకొనవలయును నేను మహామహుడగు అలెగ్జాండరురూపముతో మీ ఒలీవియా పాదములవద్ద నుండును. మీరు నా యీ కోరికకు అంగీకరింప వలయునని ప్రార్థించుచున్నాను".

ఆ మాటలనుబట్టి తార్న్‌హిల్ మా కుటుంబములో నొకడుగా, అనగా మా అల్లుడుగా, చేరదలచుకొన్నాడని, మే మందఱము అనుకొంటిమి. మే మాతనికోరికకు అంగీకరింపకుండ నుండలేకపోతిమి.

మా సూచనలప్రకారము చిత్రకారుడు చిత్రపువును వ్రాయ ప్రారంభించెను. అతడు ఎంతో పట్టుదలతో రోజు పదునదినాలుగు గంటలు కష్టపడి చిత్రమువు వ్రాయసాగెను. నాలుగురోజులకు లోపుననే అతడు చిత్రమువును పూర్తిచేయగలిగెను.

చిత్రకారుడు రచించిన చిత్రమువు చాలపెద్దది. దానిని చిత్రించుటలో అతడు ఎన్నోరంగుల నుపయోగించెను. ఆవిషయ మున నతడు ఏమాత్రము వెనుకంజవేయ లేదు. అందులకునాభార్య అతనిని పరిపరివిధముల ప్రశంసించెను. చిత్రకారుడు రచించిన చిత్రమువు మాకు అపరిమితమగు సంతృప్తిచేకూర్చెను. కాని

చిత్రపు పూర్తియగుటకు మాకొక దురదృష్టమగు విషయము తట్టనేలేదు. అంతయు పూర్తియైనతరువాత నది మా మనస్సునకు తట్టెను. ఆచిత్రపు ఎంతపెద్దది అనగా దానిని తగిలించుటకు మా ఇంటనెచ్చటను సరియైనచోటు లేనంతపెద్దది! ఆ విషయమును గ్రహింపగనే మాకు ఏమియు తోచకుండెను.

అంతముఖ్యమైన విషయమును మేము మఱచిపోవుట ఎట్లు తటస్థించెనో మాకు ఊహింపశక్యముగాకుండెను. దురదృష్ట దేవత మమ్ము ఆవహించి ఆవిషయమును మేము గ్రహింపకుండ జేసెను. ఆ చిత్రప నందువలన మా గొప్పతనమును ప్రదర్శించుటకుబదులు, మా కుటుంబగౌరవమును ఇనుమడింప జేయుటకు బదులు మాకు అవమానమును కలుగజేసెను. మేము దానిని వంటయింటిగోడకు వ్రేలాడగట్టితిమి. దాని నెచ్చటకు తీసికొని పోవుటకును వీలు లేకుండెను. దానినిగూర్చి మా యిరుగుపొరుగు వారందఱును పరిహాసముగా చెప్పుకొనసాగిరి. వారికందఱకు నది తమాషాగా నుండెను. "దానిని బయటకుతీసికొనివచ్చుట ఎట్లు?" అని కొందఱు ఆశ్చర్యమను ప్రకటించిరి. "అసలది లోనికెట్లు పోయినది?" అని మఱికొందఱు అంతకంటె ఎక్కువ ఆశ్చర్యమును ప్రకటించిరి. "ఇది రాబిన్సన్ క్రూసోకు చెందిన పెద్ద పడవ వలెనున్నది" అని కొంద ఱనిరి.

ఆవిధముగా కొందఱు మమ్ము ఎగతాళి చేయసాగిరి. పలువురు ద్వేషబుద్ధితో కొన్నిమాట లనసాగిరి. మఱి మా కుటుంబ చిత్రపులో గొప్పవాడగు తార్న్‌హిల్ బొమ్మకూడ నున్నదికదా. అది మాకు ఎనలేని గౌరవమును చేకూర్చెను. అది చూచి పలువురు అసూయపడసాగిరి. వారు మాకుటుంబము

వారినిగూర్చి అపవాదులు పుట్టించసాగిరి. ఆ దుర్మార్గులకదియే వృత్తి. వారు మా పరువుప్రతిష్టలను మంటగలుప ప్రయత్నింప సాగిరి. కొందఱు మిత్రులవలెమావద్దకువచ్చి శత్రువులు మాపై వేయుచున్న అపవాదములను వివరించి చెప్పసాగిరి. అవి మా ప్రశాంతిని భగ్నముచేయసాగెను. మేము ఆ అపవాదములను మా శక్తియంతయు నుపయోగించి తీవ్రముగా ఖండింపసాగితిమి. కాని ఖండించుటవలన అపవాదములు హెచ్చునేగాని ఏమాత్రము తగ్గవు.

మా శత్రువుల అసూయను అణచివేయుట ఎట్లా? అను విషయమునుగూర్చి మాకుటుంబము వారందఱము చర్చించు కొంటిమి. ఎట్టకేలకు నే మొక నిర్ణయమునకు వచ్చితిమి. ఆనిర్ణ యము మంచి గూఢముగ నుండెను. ఆనిర్ణయ మిట్లున్నది: నా కొమార్తె ఒలీవియాపట్ల తార్న్‌హిల్‌కుగల నిజమైన అభిప్రాయ మేమో మేము ముందుగా తెలిసికొన దలచితిమి. అందుకుగాను తార్న్‌హిల్‌రాగానే నాభార్య అతని నిట్లడుగును: "అయ్యా! మా కొమార్తె ఒలీవియాకు వివాహము చేయవలయునని అను కొనుచున్నాము. నా కొమార్తెకు భర్తగానుండుట కెవ్వరు తగి యున్నారు?" అప్పుడు తార్న్‌హిల్ తన మనస్సులోని అభిప్రాయ మును బయల్పఱచును. "ఎవ్వరో ఎందుకు? నేనే మీ అమ్మా యిని వివాహముచేసికొన వలయునని అనుకొను చున్నాను." అని యనవచ్చును. తార్న్‌హిల్ ఆవిధముగ అననిచో ఒలీవియాను వివాహమాడుట కెవ్వరో సిద్ధముగ నున్నారనిచెప్పి అతనిని భయ పెట్టవలయును.

మొదట నేను ఆ కడపటి ప్రణాళికా భాగమునకు అంగీక రింపలేదు. అంతట ఒలీవియా నాతో నిట్లనెను: "నాన్నా! మీ

కావిషయమున భయపడవలసిన అవసరములేదు. నన్ను తార్న్ హిల్ వివాహము చేసికొనిన చేసికొనును. లేదా మీ రతనిని భయపెట్టుటకు పేరొక్కను యువకుని వివాహ మాడుటకు సిద్ధముగా నున్నాను. మీరీ విషయమున సందేహ పడవలసిన పని లేదు." అప్పుడు నేను ఆ ప్రణాళికా భాగమునకుగూడ అంగీకారము తెలిపితిని. మొత్తముమీద నేనా ప్రణాళికకంతకుపూర్తి అంగీకారమును తెలిపితి ననుటకంటె, దానిని పూర్తిగ ప్రతిఘటింప లేదనుట ఎంతయు సమంజసముగ నుండును.

ఒకనాడు తార్న్ హిల్ ఎప్పటివలె మాయింటికి వచ్చెను. అతనిని చూడగానే నాకొమార్తె లిరువురును ప్రక్కకు తప్పుకొని పోయిరి. మా ప్రణాళికను సంపూర్ణముగ అమలులో పెట్టుటకు నాభార్యకు చక్కని అవకాశము నొసగుటకే వారట్లు చేసి యుండిరి. వారు పొరుగువారి యింటికి మాత్రముపోయి యుండ లేదు. తార్న్ హిల్ కూర్చుండియున్న గదికి ప్రక్కగదిలోనే కూర్చుండి యుండిరి. అచ్చటినుండి వారు నాభార్యకు, తార్న్ హిల్ కు జరుగు సంభాషణమునంతను పూర్తిగ ఆలకింపవచ్చును.

"మా పొరుగుననే యున్న ఛాంబరో కొమార్తెలలో నొకొర్తెకు మంచివివాహ సంబంధము వచ్చినది. ఆమె స్పెంకర్ అను యువకు నొకనిని వివాహము చేసికొన నున్నది" అని నా భార్య అనెను.

"అవును, అది మంచి సంబంధమే" అని తార్న్ హిల్ అంగీకారమును తెలిపెను.

అంతట నాభార్య ఇట్లనెను: "ఈకాలములో విశ్వాసమున్న అమ్మాయిలకేమంచిభర్తలు లభించుచుందురు. అందుచేసందేహ

నేమియు నుండదు. కాని ఓయి భగవానుడా! ఐశ్వర్యమేమాత్ర మునులేని అమ్మాయిలమాట! తార్న్‌హిల్! అందమున్నంత మాత్రమున నేమి లాభమున్నది? ఐశ్వర్యమునే కోరు ఈస్వలాభ పరాయణుల ప్రపంచములో అమ్మాయిలకెన్ని సుగుణములున్నను ఏమిలాభము? ప్రతియొక్కరును, 'ఆమెకెంత ఐశ్వర్యమున్నది?' అని ప్రశ్నించెదరుగాని, 'ఆమె గుణగణము లెట్టివి? ఆమె అంద చందము లెట్టివి?' అని ప్రశ్నింపరు.

అపుడు తార్న్‌హిల్ ఇట్లనెను: "అమ్మా! మీ మాటలు క్రొత్త పంథాలోనున్నవి; చాల న్యాయముగనున్నవి. మీ అభిప్రాయములతో నేను సంపూర్ణముగ నేకీభవించు చున్నాను. నేను రాజునై యుండినచో మీరు వెలిపుచ్చిన అభిప్రాయములను ఆచరణలో పెట్టి యుండెడివాడను. ఐశ్వర్యము లేని అమ్మాయిలకే నా రాజ్యములో మంచి విలువయుండు నట్లుచేసి యుండెడివాడను. మన ఇరువురు అమ్మాయిలకు మొట్టమొదలుగా తగిన ఏర్పాట్లనుచేసి యుండెడివాడను."

"అయ్యా! మీరు కారుణ్యమూర్తులు. మీరు దయతో సరసముగ మాట్లాడుచున్నారు. నేను రాణినై యుండవలసిన దనికోరుకొనుచున్నాను. అప్పుడు నా జ్యేష్ఠ పుత్రిక తన భర్త కొఱకెక్కడ వెదక వలయునో తెలియును. మీరు ఇప్పుడు నా పుత్రికల మాట నెత్తినారు కనుక అడుగుచున్నాను. మేము మొట్టమొదట మా ప్రథమ పుత్రిక ఒలీవియాకు వివాహము చేయవలయునని నిశ్చయించుకొన్నాము. ఆమెకు తగిన భర్తను మీరు దయతో సిఫారసు చేయుదురా? ఆ అందాల రాణి కిప్పుడు పందొమ్మిది వత్సరముల ప్రాయమున్నది. చక్కగా

నెదిగిన యువతి ఆమె. చక్కగా చదువుకొన్నది. నా వినయ పూర్వకమగు అభిప్రాయములో ఆమెకెట్టి లోటునులేదు” అని నా భార్య అనెను.

అంతట తార్న్‌హిల్ ఇట్లు వ్రాకుచ్చెను: “అమ్మా! నేనే ఎన్నవలసి వచ్చినచో సర్వతోముఖమైన ప్రజ్ఞకలవానినే సిఫారసు చేయుదును. అట్టివాడు మాత్రమే మీ చిన్నారి దేవతను సుఖపెట్టగలడు. మంచి జాగ్రత్త, ఐశ్వర్యము మంచి అభిరుచులు, చిత్తశుద్ధి మున్నగునవన్నియు కలవాడు మాత్రమే ఆదర్శప్రాయమైన భర్తయగును.”

“అవునవును. అట్టి వారెవ్వరైన మీ దృష్టిలోనున్నారా? మీ కెవ్వరినైన నెఱుగుదురా?” అని నా భార్య ప్రశ్నించెను.

“అమ్మా! ఎఱుగను. మీ కొమార్తెకు తగియుండు భర్త నెఱిగియుండుట సామాన్యమగు విషయము కాదు. అది అసాధ్యమగు విషయము. మీ అమ్మాయి ఒక పెద్దనిధివంటిది. ఆమెను పొందుటకు ఏ యొక్క పురుషునకును సాధ్యముకాదు ఆమె దేవత! నేను అనుకొన్న విషయమును, నా మనస్సులోని విషయమును సుస్పష్టముగ చెప్పుచున్నాను. ఆమె దేవత!” అని తార్న్‌హిల్ అనెను.

అంతట నా భార్య ఇట్లనెను: “తార్న్‌హిల్! మీరు నా కొమార్తను ఎక్కువగా పొగడుచున్నారని అభిప్రాయపడుచున్నాను. మీ స్నేహితులలో నొకనికి మా కొమార్త నిచ్చి వివాహము చేయవలయునని అనుకొనుచున్నాము. నేను ఎవరిని గూర్చి మాట్లాడుచున్నానో మీకు తెలియునను కొందును. అతని పేరు విలియమ్సు. చాల మంచివాడు. భార్యను చక్కగా

పోషించుకోగలడు. మా అమ్మాయిని వివాహము చేసికొందునని అతడు మాతో పలుసార్లు అన్నాడు. కాని ఈ విషయమున ముందుగా మీ అభిప్రాయము తెలిసికోవలయునని వాంఛించు చున్నాము. మీ అభిప్రాయ మేమి ? ఈ సంబంధము బాగున్న దందురా ?"

అంతట తార్న్‌హిల్ ఉద్వేగముతో నిట్లనెను: "ఏమి! ఏమి సంబంధము! ఆ సంబంధమునకు నేను ఏమాత్రము అంగీక రింపజాలను. ఏ మాత్రము అంగీకరింపజాలను! కాకి ముక్కుకు దొండపండు కట్టుటయా! ఎంతఘోర మెంతఘోరము! అంద చందములు, బుద్ధి కౌశల్యము, మంచి లోక జ్ఞానము, ఎన్నో సుగుణములుకల దేవతను ఒక సామాన్యునకిచ్చి వివాహము చేయుటయా! ఇటువంటి అన్యాయము జరుగు చుండగా నేను చూచి సహించి యూరకుండ జాలను! నేను సహింప లేకుండు టకు కారణము లున్నవి."

అప్పుడు నాభార్య డిబోరా ఇట్లనెను: "మీరు సమ్మతింప కుండుటకు కొన్ని కారణములున్నచో వానిని నాకు తెలియ జేయుడు. వానిని తెలిసికోవలయునని నేనెంతయు ఆతురతపడు చున్నాను."

అపుడు తార్న్‌హిల్ ఆమెపై చేయిపెట్టుకొని ఇట్ల నెను: "అమ్మా! నన్ను క్షమింపుడు! అవి నాహృదయంలో లోతున పాతుకొని యున్నవి. అవిఅచ్చట బంధింపబడి యున్నవి. అవి ఎట్టి సందర్భములోను బయటకురావు."

పిమ్మట తార్న్‌హిల్ మాయిల్లువీడి పోయెను. తార్న్ హిల్ మాటలనుబట్టి అతని ఉద్దేశ్యమేమో తెలిసికొనుటకై నే

మందలము సమావేశమైతిమి. కూలంకషముగ చర్చించితిమి. కాని అందరముకలసి ఏకాభిప్రాయమునకు రాలేకపోతిమి.

"తార్న్‌హిల్ నన్ను గాఢముగ ప్రేమించు చున్నాడు. అతడే నన్ను వివాహము చేసికొన గోరుచున్నాడని స్పష్టముగ తెలియుచున్నది" అని ఒలీవియాయనెను. కాని నాకంతధైర్యము, నమ్మకము లేకుండెను. తార్న్‌హిల్ నాకొమార్తెను ప్రేమించు చున్నాడుగాని ఆమెను వివాహము చేసికొనగోరుట లేదని నేను గట్టిగా నమ్మసాగితిని. అతని మాటల అర్థమేమైననేమి? మా ఒలీవియాను తనకిచ్చి వివాహము చేయవలసినదని వ్యవసాయ దారుడు విలియమ్సు ఎన్నోసార్లు కోరియుండెను. ఒలీవియాతో గూడ అతడెన్నోసార్లు మాట్లాడి ఆ యభిప్రాయమును వెలి పుచ్చెను. అందువలన మే మా విషయమునుగూర్చి ఇంకను ముందుకుసాగి పోవలయునని నిశ్చయించు కొంటిమి.

# 17

నేను నా మొదటికూతురు ఒలీవియా నిజమైన సౌఖ్యము ననుభవింప వలయునని గాఢముగ వాంఛించుచుంటిని. విలియమ్సు కిచ్చి వివాహము చేసినచో ఆమె కా సౌఖ్యము లభించునని నేను భావింపసాగితిని. విలియమ్సుకు గల శ్రద్ధ, ఓపిక, ఆసక్తి నన్నెంతయు ఆకర్షించెను. అతడు చిత్తశుద్ధి, మంచిజాగ్రత్త కలవాడు. భార్యను చక్కగా పోషించుకో గలిగిన శక్తికలవాడు. కొంచెము ప్రోత్సాహ మీయగానే అతడు మాయింటికి రాసాగెను.

ఒకటి రెండుసార్లు విలియమ్సు మాయింటివద్ద నుండగా

తార్న్‌హిల్‌కూడ వచ్చుట తటస్థించెను. అప్పుడు వారొకరి నొకరు కొంచెము సేపు కోపదృష్టితో చూచుకొనిరి. విలియమ్సు భూస్వామి తార్న్‌హిల్‌కు శిస్తునిదివరకే చెల్లించివైచియుండెను. అందువలన నతడు తార్న్‌హిల్ కోపదృష్టి నేమాత్రము లెక్క-చేయకుండెను.

ఆసమయమున ఒలీవియా తాను నటింపవలసినవిధముగా చక్క-గా నటింపసాగెను. అది నటనకాదు. ఆమె సహజ స్వభావము. తార్న్‌హిల్ చూచుచుండగా నామె తనప్రేమ నంతను విలియమ్సుపట్ల ప్రదర్శింపసాగెను. ఆమె యావిధముగా చేయుచుండుటకు తార్న్‌హిల్ ఏమాత్రము హర్షింపలేక పోయెను. అతడెంతయు నిరుత్సాహముచెందెను. ఆ నిరుత్సాహముతో నతడా ప్రదేశమును వదలిపోయెను.

తార్న్‌హిల్ ప్రవర్తన నాకేమియు అర్థముకాకుండెను. అతడెందుకట్లు బాధపడుచున్నట్లు కనబడుచున్నాడు? అతడు బాధపడవలసిన అవసరమేమివచ్చినది? అతడు నిజముగ బాధపడు చున్నచో దానిని తొలగించుకొను నుపాయము మతనిచేతిలోనే యున్నదిగదా! "నేను మీ కొమార్తను గాఢముగ ప్రేమించు చున్నాను. అంతియకాదు. నే నామెను వివాహము చేసికొన వలయునని నిశ్చయించుకొన్నాను" అని చెప్పినచో సరిపోవును గదా, ఇక అతనికిగాని, మాకుగాని ఏవిధమగుబాధయు నుండదు కదా? అత డట్లు ఎందుకుచేయడు? అంతయు అయోమయముగ నున్నది.

తార్న్‌హిల్ బాధపడుచున్నట్లు కనబడుచున్నాడు. అది నిజమైనబాధయో, నటనయో నిశ్చయముగ తెలియదు. కాని

నా కూతురు ఒలీవియా నిజముగ బాధపడుచున్న మాటమాత్రము నిశ్చయము. ఇరువురు ప్రేమికులు ఉండగా ఒలీవియా ఎన్నోసార్లు విలియమ్సుపట్ల ప్రేమను ప్రకటించుచుండెడిది. తరువాత నామె గదిలోనికిపోయి ఒంటరిగకూర్చుండి గోలుగోలున నేడ్చు చుండెడిది.

ఒకనాటి సాయంకాలము ఒలీవియా ఎప్పటివలె తార్న్ హిల్ ముందే విలియమ్సుపట్ల ప్రేమను ప్రదర్శించెను. ప్రేమికు లిరువురును వెళ్ళిపోయినతరువాత ఆమె యొంటరిగ గదిలోనికి పోయి కూర్చుండి ఏడువసాగెను. అంతలో నే నాగదిలోనికిపోవుట తటస్థించెను.

నేను ఏడ్చుచున్న ఒలీవియాతో నిట్లంటిని: "అమ్మాయి! నీవు తార్న్ హిల్‌ను నమ్మినావు. అతడు నిన్ను తప్పకవివాహము చేసికొనునని విశ్వసించినావు. అదియంతయుచెడ్డకలయని ఇప్పుడు స్పష్టముగ రుజువగుచున్నది. విలియమ్సుకంటె తార్న్ హిల్ ఎన్నోరెట్లు ఎక్కువవాడు. అట్టి తార్న్ హిల్ ముందే నీవు విలియమ్సుపట్ల ప్రేమను ప్రదర్శించుచున్నావు. కాని అతడు దానిని నివారించుట కణుమాత్రమైనను ప్రయత్నించుటలేదు. అది అతని చేతులలోనేయున్నదికదా! నిన్ను వివాహము చేసి కొందునని అతడు స్పష్టముగ ప్రకటింపవచ్చునుగదా? అత డెందులకట్లు చేయుటలేదు? ఇదియంతయు అర్థముకాని వ్యూహామువలె నున్నది."

అప్పుడు ఒలీవియా ఇట్లనెను: "అవును, నాన్నా! అంతయు నతని చేతిలోనున్నమాటనిజమే! కాని అత డట్లుచేయకుండుటకు ఏవో కొన్ని కారణము లుండి యుండును. ఏవో కొన్ని కార

ణము లుంచియుండుటవలననే అత డాలస్యము చేయుచున్నా డని నేను విశ్వసించుచున్నాను. అతడు నాపట్ల సదభిప్రాయము కలిగియున్నాడని చిత్తశుద్ధితో కూడిన అతని మాటలనుబట్టియు, చూపులనుబట్టియు సులభముగా గ్రహింపవచ్చును. అనతికాలములోనే అతనిభావముల ఔదార్యము బయల్పడునని నేను గట్టిగా నమ్ముచున్నాను. అతనిపట్ల మీకుగల అభిప్రాయము సరియైనది కాదనియు, నాకుగల అభిప్రాయము సరియైనదనియు రుజువగును.

"ప్రియమైనఅమ్మాయి! ఒలివియా! తార్న్‌హిల్ నిన్ను వివాహము చేసికొను నభిప్రాయము స్పష్టముగా ప్రకటించునట్లు చేయుటకై మనమెన్నో ప్రణాళికలు వేసినాము. వీనికన్నిటికి గ్రంథకర్త్రి నీవేకదా. అందఱము నీవుచెప్పినట్లే వినుచున్నాము. ఈ విషయమున నీకు సంపూర్ణమగు స్వేచ్ఛ నొసగినాము. నేను నీకెప్పుడును అడ్డురాలేదను విషయము నీకు బాగుగ తెలియును. కాని విలియమ్స్‌ను ఎంతకాలమని ఆశింతువు? నీవు నిజముగా అతనిని ప్రేమించుటలేదు. కాని తార్న్‌హిల్‌ను ఉడికించి ఉద్రేకపఱచుటకై అతనిని ప్రేమించుచున్నట్లు నటించుచున్నావు. అమాయకుడగు విలియమ్స్ ఎంతకాలమిట్లుండవలయును? ఇది హద్దులేకుండ కొనసాగుటను నేనేమాత్రము హర్షింపజాలను.

తార్న్‌హిల్ మాట్లాడునట్లు చేయుట కెంతకాలము కావలయునో కోరుకొనుము. నీకు అంత వ్యవధినొసగుటకు నేను సిద్ధముగనున్నాను. కాని ఒక్కవిషయమునుమాత్రము గుర్తించుకొనుము. ఈ వ్యవధిలోపల తార్న్‌హిల్ నిన్నువివాహము చేసి

కొనుట సంగీకరించినసరి, లేనిచో తరువాత సహృదయుడగు విలియమ్సును సముచితముగ బహూకరింపవలయును. నీవతనిని వివాహము చేసికొనుటకు అంగీకరింపవలయును. అతడు నిన్ను నిజముగ ప్రేమించి వివాహము చేసికొనగోరుచున్నాడు. నేను ఇంతవఱకు సద్గుణములను ప్రశంసించుచు వచ్చినాను. నా జీవిత ధ్యేయము ప్రకారము నీవు విలియమ్సును వివాహము చేసికోవలసియుండును. నీవు నా కౌమార్త్వవని మితిలేకుండ కారుణ్యమును ప్రదర్శించినచో నాజీవితధ్యేయము సర్వనాశనమై పోవును.

మఱియింక ఆలస్యమువలదు. ఏదేని ఒకతేదీని పేర్కొనుము. నీ యిచ్ఛవచ్చినంత దూరపుతేదీని పేర్కొనుము. నే నేమాత్రము అభ్యంతరముపెట్టను. ఈలోపల ఆ తేదీని తార్న్ హిల్ కు తెలియజేయుటనిని మఱచిపోకుము. ఆ తేదీదాటిపోయినచో నీవింక అతనిదానివగుటకు వీలులేదని స్పష్టముగ తెలియజేయుము. నీవు పరాయిదానవు కాకుండ నుండవలెనన్నచో అందుల కొక్కటే మార్గమున్నది. అతడు నిన్ను వివాహముచేసి కొందునని ఆ తేదీలోపలనే స్పష్టముగ ప్రకటింపవలయును. అతడు నిన్ను నిజముగాప్రేమించుచున్నచో ఆవిధముగచేయును."

నేను చెప్పినవిషయము న్యాయమైనదని అందఱునుఅంగీకరింతురు. మఱి ఒలీవియామాత్ర మది న్యాయమైనదికాదని ఎట్లు అనగలదు? అందువలన నామె నేను చెప్పినట్లు చేయుటకు అంగీకరించెను. నిర్ణీతదినములోపల తార్న్ హిల్ తన అభిప్రాయమును స్పష్టీకరింపకపోయినచో విలియమ్సును వివాహముచేసికొందునని

ఒలీవియా నమ్మబలికెను. తార్న్‌హిల్ ఎదుటనే విలియమ్సు ఒలీవియాల వివాహము చేయవలయుననికూడనిశ్చయింపబడెను.

నాటినుండి ఒలీవియా నేను చెప్పినట్లు చేయసాగెను. తార్న్‌హిల్ ఇంకను ఎక్కువబాధ పడుచున్నట్లు నటింపసాగెను. కాని ఒలీవియాను వివాహము చేసికొందునను మాటమాత్ర మతని నోటినుండి రాకుండెను. నేనందుల కేమాత్రము విచారించుటలేదు. కాని ఒలీవియా పరిస్థితిమాత్రము చాల ఆందోళనకరముగ నుండెను. ఈ పోరాటముమధ్య ఆమె నలిగిపోవుచుండెను. అవకాశము లభించినపుడెల్ల ఆమె గదిలోనికిబోయి ఒంటరిగ కూర్చుండి కంటికి మంటికి నేకధారగ నేడవసాగెను.

ఒక వారము దినములు గడచిపోయెను. విలియమ్సు ఒలీవియాల వివాహమును ఆపుచేయుటకు తార్న్‌హిల్ ఎట్టి ప్రయత్నమును చేయకుండెను. మఱుసటి వారమతడింకను బాధపడినట్లు ప్రకటించెను. గాని మనస్సులోని అభిప్రాయమును మాత్రము బయల్పఱచలేదు. మూడవవార మతడింక మాయింటికి రాకుండెను ఒలీవియా అతను రానందుకు ఆందోళనమును వ్యక్తపఱచుటకు బదులు ప్రశాంతముగ నుండసాగెను. నేనామె సహన శీలము నెంతయు ప్రశంసింపసాగితిని. నేనామె ధైర్య సాహసమును కూడ ఎంతయు ప్రశంసింప సాగితిని. "నీవిప్పుడు ఆడంబరమునువదలి నిజమైన సౌఖ్యమును కోరుకొనుచున్నావు. ఇందుకు నిన్ను నే నెంతయు అభినందించు చున్నాను" అని నే నంటిని.

ఇంక మా ఒలీవియా వివాహము నాలుగు రోజులకు జరుగును. ఆనాటిరాత్రి మా కుటుంబములోని వారము కుంపటి చుట్టు కూర్చుండి కడచిన కాలమునకు సంబంధించిన కథలను

చెప్పుకొన సాగితిమి. భవిష్యత్కాలమునకు చెందిన ప్రణాళికలను వేసికొన సాగితిమి. నా మనస్సులో వేలకొలది ప్రణాళికలు తిరుగాడ సాగెను. నాకు నవ్వు పుట్టించు సంఘటనలు జ్ఞప్తికి రాసాగెను. ఆసందర్భమున నేను మోజెస్‌తో నిట్లంటిని: "నాయనా! మోజెస్! అనతి కాలములో మనయింట నొక వివాహము జరుగును. ఈ విషయమున నీ అభిప్రాయమేమి? వివాహమెట్లు కొనసాగును?"

అంతట మోజెస్ ఇట్లనెను: "నానా! అన్ని విషయములను సక్రమముగ జరిగిపోవుననియే నేను అభిప్రాయ పడుచున్నాను. నే నిప్పుడే ఒక ముఖ్యమైన విషయమునుగూర్చి ఆలోచించుచున్నాను. నా సోదరి లివీ విలియమ్సును వివాహము చేసికొన్న తరువాత మనకెన్నో లాభములు చేకూరును. అప్పుడు అతని వద్దనుండి మనకు కావలసిన వస్తువుల నన్నిటిని ఎరవు తెచ్చుకొన వచ్చును."

"అవునవును. మనకు కావలసిన వస్తువులను ఎరవు తెచ్చుకొన వచ్చును. మనకు ఉత్సాహమును కలిగించుటకై అతడు 'మరణము - యువతి' అను గీతమునుకూడ పాడి వినిపించును" అని నేను అంటిని.

"ఆ గీతము నతడప్పుడే మన డిక్‌కు నేర్పినాడు. మనడిక్ దానిని చక్కగా పాడగలుగు చున్నాడు" అని మోజెస్ అనెను.

"అటులనా?" అని నే నంటిని: "అయినచో మన మతడు పాడుచుండగా ఆ గీతమును విందము. ఏదీ, మనడిక్ ఎక్కడ నున్నాడు? అతడా గీతమును ధైర్యముతో పాడునుగాక"

అప్పుడు నాకడసారి కుమారుడు బిల్ ఇట్లనెను: "సోదరుడు

డిక్, సోదరి లిపీతో కలసి ఇంతకుముందే బయటకు వెళ్ళినాడు. నాన్నా! విలియమ్సు నాకుగూడ రెండు పాటలను నేర్పినాడు. నే నాపాటలను చక్కగా పాడి వినిపింతును. పిచ్చికుక్క మరణము, హంసగానము అను రెండు పాటలను నేర్పినాడు. ఈ రెండింటిలో దేనిని పాడుమందురు ?"

"పిచ్చి కుక్క మరణ గీతమునే పాడుము. నేనా గీతము నింతవఱకు ఎన్నడును వినియుండలేను. డిబోరా! మనము విషాద గీతమును వినబోవుచున్నాము. కనుక గూస్ బెరీ సారాయమును సిద్ధముగా నుంచుము. నే నిటీవల అనేక విషాద గీతములను వినియున్నాను. కనుక ఇప్పుడీ విషాద గీతమును గూస్ బెరీ సారాయము లేకుండ విన్నచో నేను విచార సముద్రమున మునిగి పోవచ్చును. సోఫీ! ఏదీ, నీ సంగీత సాధనమును తీసికొని వాయింపుము. మన బిల్ పాడు చుండును" అని నేనంటిని.

అంతట బిల్ 'పిచ్చికుక్క మరణము' అను గీతమును చక్కగా పాడి వినిపించెను.

పాట పూర్తియైన తరువాత నే నిట్లంటిని: "మనబిల్ చాల మంచివాడనుటకు ఎట్టి సందేహమును లేదు. ఇది నిజమైన విషాద గీతము. రండు, రండు. మన మందఱము బిల్ ఆరోగ్యముకొఱకు పానీయమును సేవింతము. ఇతడెప్పటికైనను పెద్ద మతాధికారి కాగలడు."

"నేనందుకు హృదయ పూర్వకముగ నంగీకరించుచున్నాను. అని నా భార్య అనెను: "అతడు ఇప్పుడు పాడినట్లు గనే, మతబోధకూడ చేయగలిగినచో నిస్సంశయముగ గొప్ప మతాధికారి అగును. అతని తల్లి వలె వారందఱును పాటలు

చక్కగా పాడగలరు. బ్లెంకిన్ సాపు కుటుంబమువారు తమ ముందు తిన్నగా చూడలేరనియు, హగ్గిన్సన్ కుటుంబమువారు క్రొన్ని వస్తువుల నార్పరనియు, గ్రోగ్రామ్ కుటుంబము వారందఱు చక్కగా పాటలు పాడగలరనియు, మార్జోరామ్ కుటుంబము వారందఱు కథలు చక్కగా చెప్పగలరనియు మా ప్రాంతమున అనుకొనుచుందురు."

"నవీన గీతములకంటె పూర్వపు జానపద గీతములన్న నే నాకు ఇష్టము. ఇటీవలి గీతములలో విషయ ప్రాధాన్యముండుట లేదు. ఒక యువతి తన విసన కఱ్ఱనో; చిన్న కుక్కనో పోగొట్టు కొని ప్రపంచ మంతయు మునిగిపోయినట్లు విచారించును. కవులీ స్వల్ప విషయమును తీసికొని గీతములు వ్రాయుదురు. ఇంత కంటె అపహాస్యమైన విషయము మఱి యొకటి యుండదు" అని నేనంటిని.

"ఇంకొక రకపు గీతములున్నవి. ఈ గీతములలోని విషయ మంతయు నొక్కటే. కొలిన్, డాలీని కలసికొనును. వారిరువురకు మధ్య సంభాషణ జరుగును. కొలిన్ ఆమెకు తలలో పెట్టుకొనుటకు ఒక వస్తువు నొసగును. డాలీ అతనికొక పూ గుత్తినొసగును. తరువాత వారిరువురును కలసి చర్చికి పోవు దురు; వివాహము చేసికొందురు. యువతీ యువకులందఱును సాధ్యమైనంత త్వరలో వివాహము చేసికొనవలెనని సలహా ఇత్తురు" అని మోజెస్ అనెను.

అపుడు నేనిట్లంటిని: "అది చాల చక్కని సలహా. అటు వంటి మంచి సలహా నొసగుటకు చర్చికంటె సరియైన ప్రదేశ మింకొకటి లేదని నేను అభిప్రాయపడుచున్నాను. ఏలయన

చర్చిలో మన కనువైన భార్యలు గూడ దొరుకుదురు. అది మంచి మార్కెటు. అచ్చట ముందు మనకవసరమేమో చెప్పుదురు. తరువాత మన కవసరమైన వానిని సరఫరాచేయును."

"అట్టువంటి మార్కెట్లు ఐరోపాఖండములో రెండుచోట్లనున్న విషయమును నే నెఱుగుదును. అవి ఇంగ్లండులో నొకచోటను, స్పెయినులో నొకచోటను నున్నవి. స్పెయినులోని మార్కెటు సంవత్సరమున కొకదినమున మాత్రమే తెఱచియుండును. కాని మన ఇంగ్లీషు భార్యలను ప్రతిరాత్రి అమ్ముదురు" అని మోజెస్ అనెను.

అంతట నాభార్య ఇట్లనెను: "అబ్బాయి! నీవు చాల చక్కగా చెప్పినావు. భర్తలు భార్యలను తెచ్చుకొనుటకు తగిన ప్రవేశము ప్రాత ఇంగ్లండు ఒక్కటి మాత్రమే."

"భార్యలు భర్తలను తమ చెప్పుచేతలలో పెట్టుకొని నడిపించుటకుగూడ" అని నేను మధ్యలో జోక్యము కలిగించుకొని అంటిని." ఖండములలో నొకసామెత గలదు. సముద్రముమీద ఒక వంతెన కట్టినచో ఖండములోని భార్యలందరు ఇచ్చటకు వచ్చి ఇంగ్లీషుభార్యలవద్దనుండి అనేక విషయములు నేర్చుకొందురట. ఏలయన ఇచ్చటి భార్యలవంటివారు ఖండములో లేరు. డిబోరా! మోజెస్! మీరిరువురును కలసి ఒకచక్కని పాటను పాడుడు. భగవంతుడు మనకు ఆరోగ్యమును, శక్తిసామర్థ్యములను, ప్రశాంతిని ఒసగి యున్నాడు. ఇందులకు మన మాయన కెంతయు కృతజ్ఞులము. నే నిప్పుడు మహా మహులగు చక్రవర్తుల కంటె సుఖముగ నున్నానని అనుకొను చున్నాను. ఏలయన చక్రవర్తులకిట్టి కుంపట్లుండవు. కుంపట్లచుట్టును ఇట్లు విఖశించిన

ముఖము లుండవు. రిబోరా! మనము ముసలివారమైపోవు చున్నాము. కాని మన జీవితములోని సాయం సమయమే సుఖ ముగ నుండునని నేను ఆశించుచున్నాను.

మన పూర్వులు చాల గొప్పవారు. వారి కేటువంటి మచ్చలును లేవు. మన సంతానముకూడ అట్లే యుండవలయు నని నేను ఆశించు చున్నాను. మనము జీవించి యున్నంత వఱకు వారు మనకు సహాయము చేయుచుందురు; ఆనందము నొసగు చుందురు. మనము మరణించిన తరువాత మన గౌరవ ప్రతిష్ఠలను తమ తరువాతి తరమువారికి అందజేయు చుందురు. అబ్బాయి, ఎదీ, ఒకపాట ప్రారంభించుము. మన మందఱము కలసి పాడు దము. అన్నట్లు మఱచినాను, మన ఒలీవియా ఎదీ? ఇంకను రాలేదేమి? మన అందఱిలో ఆమెగొంతు మధురాతి మధుర మైనది."

నేనట్లు మాట్లాడు చుండగా డిక్ అచ్చటకు పరుగెత్తు కొని వచ్చెను. "నానా! ఆమె మనలను వీడి వెళ్ళిపోయినది! ఆమె మనను వీడి వెళ్ళిపోయినది! శాశ్వతముగ మనలనువీడి పోయినది సోదరి లివీ!" అని అతడనెను.

"వెళ్ళిపోయినదా? అబ్బాయీ!" అని నేనంటిని.

"అవును, వెళ్ళిపోయినది. ఆమె ఇరువురు మనుజులతో కలసి ఒకబండిలో వెళ్ళిపోయినది. వారిలో నొకడామెను ముద్దు పెట్టుకొని, 'నీ కొఱకు నేను మరణింతును' అని యన్నాడు. ఆమె గోలు గోలున నేడ్చుచు వెనుకకు తిరిగి వచ్చుటకు సిద్ధ పడినది. కాని అతడామెను మఱియొకసారి బతిమాలుకొనినాడు. బండిలోనుండి క్రిందకు దిగివచ్చిన ఆమె మరల బండిలో ప్రవే-

శించినది. 'నే నీ విధముగ నైపోయినానని తెలిసినచో మా నాన్న ఏమి చేయునోకదా!' అని ఆమె అన్నది" అని జీక్ అనెను.

అపుడు నేను ఇట్లంటిని: "అబ్బాయిలు! అమ్మాయిలు సర్వనాశనమైపోయినది! ఇక మీరుపోయి విచార సముద్రమున మునుగుడు! మన మింక ఆనందముగ కాలము గడపుట కేమాత్రమును వీలులేదు! భగవానుని ఆగ్రహ మా దుర్మార్గుని నిలువున కాల్చివేయును గాక! ఆ విధముగ నా కొమార్త నాకు లేకుండ దొంగిలించుకొని పోవుటయా? ఎంత ఘోరము! నేను నా కొమార్తను సత్పథమున తీసికొని పోవుచుంటిని. అటువంటి ఆ దుర్మార్గుని భగవంతుని ఆగ్రహము సర్వనాశనము చేయుననుట తథ్యము. నా కొమార్త అంత చిత్త శుద్ధిగలది! మనకింకను ఇహలోక సౌఖ్యములు లేవు. మీరుపోయి అపకీర్తి జీవితములను గడపుడు! నా హృదయము నాలో వేయి వ్రక్కలై పోయినది!"

"నాన్నా! ఇదియేనా మీ మనస్థైర్యము!" అని మోజెస్ ఆక్షేపించెను.

"మనస్థైర్యమా! అవును, నాయనా! నాకు మనస్థైర్యము కలదను విషయము సతము అనతికాలములోనే తెలిసికొనును. నా పిస్తోళ్ళ నటు తీసికొని రమ్ము. ఆ ద్రోహిని నేను వెంబడించి పోదును. అతడీ భూమిమీద నున్నంతవఱకు నేనతనిని వెంబడించి పోదును. నేను ముసలివాడనైనను తీవ్రముగా గాయపఱచగల

సని అతడు అనతికాలములోనే తెలిసికొనును. ఖలుడు! విశ్వాస ఘాతకుడగు దురాత్ముడు!" అని నేనంటిని.

అప్పటికి నేను పిస్తోళ్ళనుచేత బుచ్చుకొంటిని. కాని నేను ఉద్రేకపడినంతగా నా భార్య ఉద్రేకపడియుండ లేదు. అందువలన నామె నన్ను తన చేతులతో గట్టిగా పట్టుకొని యిట్లనెను: "ప్రియాతిప్రియుడైన నాథా! ఇప్పుడు మీ చేతులు పట్టుకొనుటకు తగిన ఆయుధము బైబిలు మహాగ్రంథము మాత్రమే. మీ చేతులు పిస్తోళ్ళను పట్టుకొనుటకు ముమ్మాటికిని పనికిరావు. ప్రియనాథా! ఇప్పుడా ఉద్గ్రంథమును చదువుడు. కోపమును పోగొట్టుకొని శాంతిని సంపాదింపుడు. ఆమె మనలను కడు నీచముగ, నికృష్టముగ మోసగించినది."

కొంచెము సేపు గడచిన తరువాత మోజెస్ ఇట్లనెను; "నాన్నా! మీ కింత కోపము ఏ మాత్రము పనికిరాదు. ఇది మీ కేమాత్రము తగియుండ లేదు. ఈ కష్ట సమయమున మీరు మా తల్లిని ఓదార్చవలయును. మీరట్లు చేయుటకు బదులు ఆమె బాధను హెచ్చించుచున్నారు. ఇది ఏ మాత్రము సమంజసముగ లేదు. మీ వృత్తి ఏమి? మీరిప్పుడు చేయుచున్న పని ఏమి? మీ శత్రువును నీ విధముగ దూషించుట మీకు తగునా? అతడు దురాత్ముడే. కాని అతనిని మీరు శపించుట ఏ మాత్రము సమంజసముగ లేదు."

"అతనిని నేను శపించినానా? లేదే!" అని నేనంటిని.

"శపించినారు. రెండుసార్లు శపించినారు. నిజముగా మీరు శపించినారు" అని మోజెస్ అనెను.

"నిజముగా శపించి యుండినచో భగవంతుడతనిని నన్ను

క్షమించును గాక, అబ్బాయి! మన శత్రువులనుగూడ క్షమింప వలయునని కారుణ్యమూర్తియగు భగవానుడు సెలవిచ్చి యున్నాడు. శత్రువులను క్షమింప గలిగినవాడే మానవుడు దైవాంశ సంభూతుడనిపించుకొనును. భగవానుడు మనకు ఎన్నిటినో ఒసగినాడు! ఎన్నిటినో మనవద్దనుండి తొలగించినాడు. ఆయన నామమును మనమెల్లప్పుడును స్మరించుకొందుముగాక. ఆయన నామము మహిమాన్వితమగుగాక! నా కిప్పుడు కలిగిన కష్టము సామాన్యమైనదికాదు. అనేకసంవత్సముల ఈమధ్య నేనెన్నడును కన్నీరు కార్చియుండలేదు. ఇప్పుడు కన్నీరుకార్చుచున్నాను. నా కొమార్తను సర్వనాశనము చేయుటయా! ఆ దుర్మార్గుని—భగవానుడు నన్ను క్షమించుగాక! నేనేమి అనబోయినాను?

డిబోరా! ఆమె ఎంతమంచిదో, ఎంత ఉల్లాసముగలదో నీకు తెలియును. ఈక్షణమున వఱకు నామె మనలను సుఖపెట్టుటకే ప్రయత్నించినది. ఆమె మరణించియుండినచో బాగుండెడిదేమో! కాని ఆమె వెళ్ళిపోయినది! మన కుటుంబగౌరవము మంటగలసినది. నాకింక ఈ లోకములో సౌఖ్యము లేదు. నేను ఇతర లోకములలో నే సౌఖ్యమును వెదకుకొనవలయును.

. అబ్బాయి! డిక్ వారిగుర్రమును పోవుచుండగా నీవుచూచి నావు! బహుశా అత డామెను బలప్రయోగముచేసి తీసికొని పోయియుండును! నిజముగా అట్లు జరిగియుండినచో ఆమె ఇంకను అమాయకురాలని చెప్పవచ్చును” అని నేను అంటిని.

“లేదులేదు, అత డామెను బలప్రయోగముచేసి తీసికొని పోయియుండలేదు. అత డామెను ముద్దుపెట్టుకొనెను. ‘నీవు

నా దేవతవు' అని యనెను. ఆమె గోలుగోలున నేడ్చుచు అతని భుజముపై నానుకొనెను. బండి శరవేగమున పోయెను."

అపరిమితముగ ఏడ్చుచుండుటవలన నాభార్యకు సరిగా నోట మాట రాకుండెను. అయినను ఆమె గట్టిగా ప్రయత్నించి ఇట్లనెను: "ఆమె విశ్వాసఘాతుకురాలు! మనల నామె ఈవిధముగా నుపయోగించుకొన్నది. ఆమె తన ప్రేమ కెప్పుడును ఎట్టి అడ్డంకును పొందియుండలేదు. ఆమెను ఎవ్వరును ఏమియు అని యుండలేదు. అయినను ఆమె తన్ను ప్రేమించిన తల్లిదండ్రులను వదలి కడు నీచముగ పాఱిపోయినది. మన కీ దెబ్బ మరణసదృశ్యమైనది. ఈ దెబ్బనుండి మీరు కోలుకొనలేరు. అనతికాలములోనే నేను మిమ్ము ననుసరించి వత్తును."

మాకు నిజమైన దురదృష్టము ఆ దినముననే ప్రారంభమయ్యెను. ఆరాత్రియంతయు నే మావిధముగనే కాలము గడిపితిమి. నా కొమార్తను మోసముచేసి తీసికొనిపోయినవారెవ్వరో తెలిసికొనవలయునని నేను నిశ్చయించుకొంటిని. ఎక్కడడున్నను సరే, అతనిని కలిసికొని అంత నీచముగా ప్రవర్తించినందు కతనిని చివాట్లు పెట్టవలయు ననుకొంటిని.

మఱునాటి యుదయమున నే మందఱము భోజనమువద్ద కూర్చుంటిమి. అప్పుడు మాకు ఒలీవియా లేనిలోటు కనబడెను. ఆమె అటువంటి సమయములందు మాకుజీవమును, ఉల్లాసమును ఒసగుచుండెడిది. అట్టి యామె ఇప్పుడులేదు. నాభార్య ఇదివఱకువలెనే తిట్లు తిట్టి తన హృదయభారమును తగ్గించుకొనుటకు ప్రయత్నించెను. "ఆమె మన కుటుంబమునకు మచ్చవంటిది. ఆమె యింకెన్నడును మనయింటికి రాకుండనుండునుగాక ఆమె

ఈయింటిని కలుషము చేయకుండునుగాక. నే నింక నెన్నడును ఆమెను నాకూతురని పిలువను. ఆమె యిక నెప్పుడును ఆ దుర్మార్గునితోనే కలిసి జీవించునుగాక. ఆమె మనయింటికి అవమానము తెచ్చిన తెచ్చుగాక. ఆమె యిక నెన్నడు మనలను మోసగింప జాలదు" అని ఆమె యనెను.

అంతట నేను ఇట్లంటిని: "ప్రియ సతీమణీ! నీవంతకఠిన ముగ మాట్లాడకుము. ఆమెచేసిన నేరమును నీ వెంతగా అసహ్యించుకొనుచున్నావో నేనును అంత అసహ్యించుకొనుచున్నాను. ఈ యిల్లు, ఈ హృదయము పశ్చాత్తాపపడి తిరిగి వచ్చు పాపి కెప్పుడును తెఱచియే యుండును. ఆమె ఎంత త్వరగా పశ్చాత్తాపపడి తిరిగి వచ్చిన అంత గొప్పగా నే నామె నాహ్వానింతును. ఎటువంటి ఘనులైనను, జ్ఞానులైనను మొట్ట మొదటిసారిగా తప్పుచేయవచ్చును. వారావిధముగ తప్పుచేయుటకు ప్రోత్సహింపబడి యుండవచ్చును. ఇతరుల దుర్బోధనలకు వారు లొంగిపోయి యుండవచ్చును. మొదటచేసిన తప్పు తప్పు కాదు. తరువాత చేసినవే తప్పులు. నా కొమార్త లక్షతప్పులు చేసినను నా యీ హృదయము, ఇల్లు ఆమె కొఱకెప్పుడును తెఱచి యుండును. ఆమె మధురమైన గొంతును నేను మరల విని ఆనందమును పొందుదును; మధురానుభూతులను పొందుదును. ఆమె హృదయము పశ్చాత్తాప పడినచో నే నామెను తిరిగి కౌగలించుకొందును.

అబ్బాయి, మోజెస్! నా బైబిలు మహాగ్రంథమును, చేతి కఱ్ఱను తీసికొనివచ్చి యిమ్ము. ఆమె ఎక్కడనున్నను సరే, వెంబడించిపోదును. ఆమెను నేను అవమాన భారమునుండి

రక్షింపక లేకపోవచ్చును. కాని దుష్కృత్యము ఎక్కువకాలము కొనసాగకుండ ఆమెను రక్షింతును. నేను చేయగలిగిన దింతియే. భగవానుడీ విషయమున నాకు సాహాయ్యపడును గాక!"

# 18

నా కొమార్తెను బండిలోని కెక్కించి తీసికొనిపోయిన మనుజుని నా కుమారుడు డిక్ వర్ణించి చెప్పలేదనుట నిజమే. కాని నా అనుమానము పూర్తిగా మా యజమానుడు తార్న్‌హిల్ పైపడెను. ఇటువంటి విషయములలో తార్న్‌హిల్ అందెవేసిన చేయి యని మాకు ముందుగనే తెలిసియుండెను. కాని ఆవిషయమును మేమంతగా లెక్కింపలేదు. యువతులను మభ్యపెట్టి, అనుభవించ, మోసగించుటలో తార్న్‌హిల్‌కుగల శక్తి సామర్థ్యము లందఱకు తెలిసియే యుండెను.

అందువలన నేను తార్న్‌హిల్ భవనము వంకకు నడచి పోసాగితిని. తార్న్‌హిల్‌ను గట్టిగా చివాట్లు పెట్టవలయుననియు, వీలైనచో నా కొమార్తను వెనుకకు తిరిగి తీసికొని రావలయుననియు తలంచుచుంటిని.

నేను తార్న్‌హిల్‌ను కలసికొనుటకు ముందు మాప్రాంతమునకు చెందిన వాడొకడు కలసికొనెను. అతడు నాతో నిట్లు చెప్పెను: "బండిలో పోవుచున్న యువతి నొకర్తను చూచినాను. ఆమె మీ కూతురువలెనే యున్నది. ఆమెతో బాటొక గౌరవనీయుడున్నాడు."

"ఆ గౌరవనీయు డెట్లున్నాడు?" అని నేను ప్రశ్నించితిని.

అంతట నతడా గౌరవనీయుని వివరముగా వర్ణించి చెప్పెను. ఆ వర్ణన అచ్చముగా బర్చెల్‌కు సరిపోయియుండెను. కాని నాకతడు చెప్పిన మాటలు సంతృప్తినికలిగింపలేదు. అందువలన నేను తిన్నగాపోయి తార్న్‌హిల్ భవనములో ప్రవేశించితిని. అప్పటికెంతో ప్రొద్దు ఎక్కలేదు. అయినను నేను తార్న్‌హిల్‌ను చూడవలయునని పట్టుపట్టితిని.

నా కోరిక ప్రకారము తార్న్‌హిల్ నన్ను చూడ వచ్చెను. అతడు ఏమియు ఎఱుగని అమాయకునివలె నుండెను. "ఎందుకు వచ్చినారు?" అని అతడు ప్రశ్నించెను. నేను జరిగిన విషయము నతనికి వివరించి చెప్పితిని. అతనిపై నాకుగల అనుమానమును కూడ దెలిపితిని.

అంతట తార్న్‌హిల్ ఒలీవియావంటి యువతిరత్నము ఎవ్వరో మగవానితో కలసి వెళ్ళిపోవుట అత్యాశ్చర్యకరముగ నున్నదనియెను. అందులకతడువిషాదమును ప్రకటించెను. "దీనితో నాకే సంబంధమను లేదని ప్రమాణముచేసి చెప్పుచున్నాను. నా మాట నమ్ముడు. మీకు కలిగిన కష్టమునకు నే నెంతయు విచారించు చున్నాను" అని అతడు లోనికి వెళ్ళిపోయెను.

అంతవఱకు నేను తార్న్‌హిల్‌ను అనుమానించి నందుల కెంతయు విచారించితిని; నన్ను నేను నిందించు కొంటిని. నా యనుమాన మీసారి బర్చెల్‌పై నుండెను. అందుకు కారణ మతడంతకు మునుపు ఒలీవియాతో ఎన్నోసార్లు రహస్య సమావేశములను జరిపి యుండుటయే. మఱికొంచెము సేపటి కింకొ

కడు కనబడి నాతో నిట్లనెను: "అయ్యా! మీ అమ్మాయి ఒలీవియా బర్చెల్‌తో కలసి ఇచ్చటకు ముప్పదిమైళ్ళదూరమున నున్న వెల్సు నగరము వంకకు పోవుచున్నది. నేను స్వయముగా ఈ కన్నులతో చూచినాను."

ఆ మాటలను వినగానే నాకు బర్చెల్‌పైగల అనుమానము పూర్తి అయ్యెను. ఒక్కొక్కప్పుడు ఎవ్వరే విషయమును చెప్పినను నమ్మజాలము. వారట్లు చెప్పుటకు కొన్ని కారణము లుండియుండ వచ్చునని తలంతుము. వారు చెప్పినది సరికాక పోవచ్చునను అభిప్రాయముగూడ మన మనస్సుకు తట్టును. నా పరిస్థితి సరిగా నట్లుండెను. కొందఱు బర్చెల్‌పై నేరారోపణ చేసిరి. వెంటనే నేను వారి మాటలను నమ్మితిని. తార్న్‌హిల్‌చే నియమింపబడిన ప్రతినిధులు నన్ను తప్పుదారిని పట్టించుటకట్లు చెప్పియుండిరేమోయను సందేహము నాకు కలుగనే లేదు. నా కొమార్తె ఒలీవియాను, ఆమెను తీసుకొనిపోయినాడని ఆరోపింప బడుచున్న బర్చెల్‌ను వెంబడింప వలయుననియే నేను నిశ్చయించు కొంటిని.

నేను ఎంతో పట్టుదలతోను, కార్యమును నెఱవేర్చు కొన వలయునను తలంపుతోను వెల్సు నగరము వంకకు నడచి పోసాగితిని. త్రోవలో కనబడిన వారినెల్ల నా కొమార్తెనుగూర్చి ప్రశ్నించితిని. కాని ఎవ్వరును ఎట్టి సమాధానమును చెప్పలేదు. ఎట్టకేలకు నేను వెల్సునగరములో ప్రవేశించితిని, పట్టణములో గుఱ్ఱముపైనున్న మనుజుడొకడు కనబడెను. అతనిని నేను తార్న్‌హిల్ ఇంటివద్ద చూచినట్లు జ్ఞాపకము.

అతడు నాతో ఇట్లనెను: "అయ్యా! ఇచ్చటకు ముప్పది

మైళ్ళదూరమున గుఱ్ఱపు పందెములు జరుగుచున్నవి. మీరచ్చ టకు పయనమైపోయినచో మీ కొమార్తెను, ఆమెను తీసుకొని పోవుచున్న వానిని పట్టుకొనగలరు. ఏలయన కడచిన రాత్రి వారచ్చట నాట్యముచేయు చుండగా నేను చూచినాను. అచ్చటి వారందఱును మీ అమ్మాయి నాట్యకళా నైపుణ్యమును పరి పరి విధముల ప్రశంసించి యున్నారు. నేనుగూడ ముగ్ధుఁడనై పోయినాను.

మఱునాడు పెందలకడనే గుఱ్ఱపు పందెములు జరుగుస్థల మునకు బయలుదేరి పోతిని. సాయంకాలము నాలుగు గంటలగు నప్పటికి నే నా ప్రదేశమును చేరుకొంటిని. అచ్చటి వారందఱును సంతోషసాగరమున మునిగి యున్నవారే. వారికెట్టి బాధ్యతలను కష్టములును లేనట్లుండెను. ఆటపాటలతో కాలము గడుపుటయే వారి ధ్యేయము కాబోలును! వారికి నాకు ఎంత వ్యత్యాస మున్నది! తప్పుదారిని పట్టిన కొమార్తెను పట్టుకొన వలెనని నేను వచ్చినాను! ఆనంద సాగరమున నీదులాడుటకు వారు వచ్చి నారు! చూడగా చూడగా నాకు కొంతదూరమున బర్చెల్ కన బడినట్లయ్యెను నే నతనిని సమీపింపబోతిని. నన్నుకనిపెట్టుట కెంతో భయపడుచున్న వానివలె నతడు గుంపులో కలసి పోయెను. అతడింక నాకు కనబడలేదు. నా కొమార్తెకూడ నా కెచ్చటను కనబడలేదు.

అంతట నే నిట్లనుకొంటిని: "నే నీ విధముగనడచిపోవు చుండుటవలన లాభమేమి యున్నది? ఎంతదూరమని నే నిట్లు తిరుగ గలను? ఇంటివద్దవారు ఎంతయు విచారించు చుందురు. ఏపాప మెఱుగని వారిప్పుడు గొప్ప ఆపదలో నున్నారు.

ఏపాప మెఱుగనివారిని ఓదార్చుటయే ఇప్పటి నా కర్తవ్యము. ఇకనైన నా కర్తవ్యమును నెఱవేర్చు కొందునుగాక. వెంటనే ఇంటికి తిరిగిపోదును."

నా మనస్సు అంతవఱకు ఎంతో ఆందోళనకులోనై యుండెను. ఎంతో దూరము నడచి యుండుటవలన బాగుగ అలసి పోతిని. తత్ఫలితముగ నాకు జ్వరము వచ్చెను. ఆ చిహ్నములు నేను గుఱ్ఱపు పందెములు జరుగుచున్న ప్రదేశమును చేరుకొను టకుముందే గోచరించి యుండెను. ఇది నేను అనుకొనని క్రొత్త దెబ్బ. ఇల్లు చేరుకొనుటకు నేను డెబ్బదిమైళ్ళ దూరమునకు పైగా నడవవలసి యుండెను.

జ్వరముతోనున్న నేను రాజబాటకు ప్రక్కగానున్న ఒక చిన్న పానీయ గృహములో ప్రవేశించితిని. జ్వరము తగ్గువఱకు నే నచ్చట విశ్రాంతి తీసికో దలచితిని. ఆ గృహమున నేను సుమారు మూడు వారములుంటిని. ఆ మూడువారములు నేను ఎంతో బాధపడితిని. ఎట్టకేలకు జ్వరము తగ్గిపోయెను.

మూడు వారములున్నందుకుగాను నేను గృహాయజమానికి కొంతడబ్బు నీయవలసి యుండెను. కాని నావద్ద డబ్బు లేదు. మఱి ఆ సందర్భమున నేనేమి చేయవలయును? ఆ పరిస్థితినిగూర్చి నేను ఆందోళనపడినచో నాకు తిరిగి జ్వరమువచ్చును.

కాని అంతలో నా యదృష్టవశమున నేనున్న పానీయ గృహమునకు ఒక ఉదారుడు వచ్చెను. అతడు పిల్లలకొఱకు ఎన్నో పుస్తకములను వ్రాసియుండెను. అతనికొక పుస్తకవిక్రయ శాలగూడనుండెను. అతడుధర్మదాతయని ప్రసిద్ధిగాంచియుండెను. "నేను పిల్లలకు మిత్రుడను" అని అతడు చెప్పుకొనుచుండెడివాడు.

నిజముగా నతడు మానవజాతికంతకు మిత్రుడని చెప్పవలసి యున్నది.

ఆమహనీయుడు పానీయ గృహములో ప్రవేశించి ఏదో పానీయమును త్రాగి తొందఱగా వెళ్ళిపోవుటకు సిద్ధపడు చుండెను. ఏలయన అతడెప్పుడును ఏదో యొక తొందఱ పని మీద తిరుగుచుండును. తామస్ట్రిప్ అనువాని చరిత్రను వ్రాయుటకు కావలసిన సామగ్రిని సేకరించుటకై అతడా సందర్భమున తిరుగుచుండెను నేనతని ఎఱ్ఱని మొటిమల మొగమును చూడగనే గుర్తుపట్టితిని. అతడు నా గ్రంథము నొకదానిని ప్రకటించి యుండెను. నేనతనికి నా పరిసితిని చెప్పి కొంత డబ్బును బదులుగా నీయవలసినదని అడిగితిని. అతడు నాకోరికను మన్నించెను. నే నా డబ్బును తీసికొని గృహయజమానికి చెల్లించితిని.

నాకెప్పటి ఆరోగ్యము చేకూర్చెను. నేను ఇంటి వంకకు బయలుదేఱిపోసాగితిని. నేను సుమారు రెండు గంటల సేపు ప్రయాణము చేసితిని. అప్పుడు నాకు దూరముగా నేదో పెద్ద బండిపోవు చున్నట్లు కనబడెను. వేగముగ ప్రయాణముచేసి దానిని కలసికొనవలయునని నేను అనుకొంటిని. వెంటనే నేను ఆ ఆలోచనను ఆచరణలో పెట్టితిని. అనతికాలములో నేనా బండిని కలసికొంటిని. అది ఊరూర తిరుగు ఆటగాండ్ర బండి. అందులో వారి ఆటలకు కావలసిన సామగ్రియుండెను. ఆ బండి సమీపములోనున్న ఒక గ్రామమునకు పోవుచుండెను. దానితో బాటు ఇరువురు మనుజులు మాత్రమే యుండిరి. వారిలో నొకడు బండి త్రోలువాడు. రెండవవాడు ఆటగాండ్రలో నొకడు. మిగిలిన ఆటగాండ్రు మఱునాడు మాత్రమే వత్తురు.

దూరప్రయాణము చేయుచున్నప్పుడు మంచివారుతోడు దొరికినచో దూరము మాయమైపోవునను సామెతగలదు. అందు వలన నేను మాట్లాడుట కిరువురు దొరకినందుల కెంతయు సంత సింపసాగితిని. నేను ఆటగానితో కబుర్లకు దిగితిని. నాకు నాటక కళకు సంబంధించిన విషయములుకూడ బాగుగ తెలియును. అందువలన నేను స్వేచ్ఛగా దానికి సంబంధించిన విషయములను గూర్చి మాట్లాడసాగితిని. ఇటీవలి విషయములు మాత్రము నాకు సరిగా తెలియవు.

ఇటీవలి విషయములను గూర్చి తెలిసికొనదలచి నేను ఆటగానితో నిట్లంటిని: "ఈ కాలమున ప్రసిద్ధి చెందిన నాటక రచయిత లెవరు? మహామహుడగు డ్రైడెన్‌తో పోల్చదగిన రచయిత లెవ్వరైన నున్నారా?"

అంతట ఆటగాడిట్లనెను: "అయ్యా! మీరు డ్రైడెన్ పేరు ఎత్తినారు. ఈకాలపు నాటక రచయిత లెవ్వరును తమ్మ అతనితో పోల్చుకొనుటకు అంగీకరింపరు. తమ కది గౌరవము చేకూర్పదని వారు భావింతురు. అతని నాటకము లిప్పటివారి అభిరుచులకే మాత్రము సరిపడవు. ఫ్లెచర్, బెన్‌జాన్సన్, షేక్స్పి యర్ మున్నగు మహామహుల నాటకములే ఇప్పుడు ప్రసిద్ధి చెందియున్నవి. మన వారిప్పుడు ఒక శతాబ్దము వెనుకకు పోయినారు."

అప్పుడు నేను ఆశ్చర్యముతో నిట్లంటిని: "ఏమేమీ! ఈకాలపువారికివారి భాషనచ్చుచున్నదా? అందలి పాత్రలీకాలపు వారికి నచ్చుచున్నవా? అందలి చమత్కారము నొక చమ త్కారముగ భావించుచున్నారా?"

"అయ్యో! అంచలిభాష, పాత్రలు మున్నగువనియు ప్రేక్షకులకు అనవసరమైనవిషయములు. వానినిగూర్చి వారు విసివిసిగా ఆలోచింపరు. నాటకము మొత్తముమీద వారికి ఆనందము కలిగిన చాలును. తమ కష్టములను మఱచిపోవుటకు వారు నాటకమును చూతురు. ఆ కోరిక తీఱినచో వారు సంతృప్తిచెందెదరు. అంతకంటె వారికింక కావలసినదిఏమి యున్నది? బెన్ జాన్సన్, షేక్స్పియర్ మున్నగువారి నాటకములు వారికాసంతృప్తినొసగుచున్నవి" అని ఆటగాడనెను.

"అనగా ఈకాలపు నాటక రచయిత లందఱు ప్రకృతిని అనుకరించుటకు బదులు షేక్స్పియరును అనుకరించుచున్నారన్నమాట! ఇది యెంతయు శోచనీయమైన విషయము" అని నేను ఉద్వేగముతో నంటిని.

అపుడు ఆటగాడు ఇట్లనెను: "నిజము చెప్పవలయునన్న వారు షేక్స్పియరును అనుకరించుచున్నారో, ప్రకృతిని అనుకరించుచున్నారో నాకు తెలియదు. ప్రేక్షకుల కాసంగతితో ప్రమేయ మెంతమాత్రమును లేదు." అతడింకను నేనేమోఅనెను.

ఆవిధముగా మేముసంభాషణలను కొనసాగించుచుంటిమి. అంతలో బండి ఆగిపోవలసిన గ్రామమువచ్చెను. బండి వచ్చుచున్న సంగతి ముందే గ్రామస్థులకు తెలిసెనుకాబోలు పలువురు మా కెదురువచ్చి వింత చూడసాగిరి. "గ్రామస్థు లెక్కువగా మమ్ము నాటకశాలలో చూచుటకు బదులు, నాటకశాల బయట చూచుచుందురు" అని ఆ సందర్భమున ఆటగాడు నాతోననెను. గ్రామస్థులు కొందఱు నన్నుగూడ ఒక ఆటగానిగా భావించి నా చుట్టునుమూగిరి. అప్పుడు నేనున్న పరిహాసాస్పద పరిస్థితి నా

కర్థమయ్యెను. అందువలన నింక నచ్చట ఒక్కక్షణకాలమైన నుండుట ఉచితముకాదని భావించితిని. వెంటనే ఆ ప్రదేశమును వేగముగ వీడిపోతిని.

నేనుపోయి ఒక పానీయగృహములో ప్రవేశించితిని. అచ్చట సేవకుడొకడు నన్ను అందఱును కలసి కూర్చుండు ఉమ్మడి గదిలోనికి తీసికొనిపోయెను. అచ్చట మంచి దుస్తులు ధరించిన గౌరవనీయుడొకడు నన్ను పలుకరించెను. "మీరు నాటక సంఘమువారికి నిజమైన పురోహితులా? లేక నాటకములో మీదొక వేషమా?" అని అతడు నన్ను ప్రశ్నించెను. అందుకు కారణము నాతోబాటు ఆటగాడుకూడ వచ్చుటయే.

నేను నాటకసంఘమువారికేవిధముగ చెందనివిషయము నా గౌరవనీయునకు తెలిపితిని. నే నెవ్వరినోగూడ వివరముగ చెప్పితిని అంతట నా గౌరవనీయుడు. "మీ రిరువురును నాతోబాటు పానీయమును సేవింపవలయును" అని కోరెను. అందుకు మే మిరువురము అంగీకరించితిమి.

మేము ముగ్గురము పానీయమును సేవింపసాగితిమి. ఆ సమయమున నా గౌరవనీయుడు అత్యుత్సాహముతో రాజకీయములనుగూర్చి మాట్లాడసాగెను. రాజకీయము లనిన నతని కెంతయు నిష్టమని గ్రహించితిని. "ఇతని మాటలనుబట్టి చూడగా నితడు కనీసము పార్లమెంటు సభ్యుడైన నైయుండును" అని నేను మనస్సులో అనుకొంటిని. అనతికాలములో నేనా విషయమున నిశ్చయమునకుగూడ వచ్చితిని.

"భోజనమున కేమియున్నవి?"అనినేను గృహయజమానిని ప్రశ్నింపగా నత డేమో చెప్పబోవుచుండెను, అంతలో గౌరవ

నీయుడు జోక్యము కలిగించుకొని, "మీరిచ్చట భోజనముచేయుటకు వీలు లేదు. మీ రిరువురును మా యింటికివచ్చి భోజనము చేయవలయును" అని మమ్ము తన యింటికి ఆహ్వానించెను అప్పుడు నేను, "ఇతడు తప్పక పార్లమెంటు సభ్యుడై యుండును" అని అనుకొంటిని.

"అయ్యా! మమ్ము క్షమింపుడు. మేమిచ్చటనే భోజనము చేయుదుము. మీ యింటికి వచ్చి మిమ్ములను ఇబ్బందిపెట్టుట మా కేమాత్రము ఇష్టమైన పని కాదు. క్షమింపుడు" అని నే నంటిని.

కాని గౌరవనీయుడు మమ్ము పలుమార్లు బతిమాలసాగెను. ఎట్టకేలకు మే మతని కోరికకు అంగీకారము తెలిపితిమి.

# 19

గౌరవనీయుడు నివసించుచున్న గృహము ఆ గ్రామమునకు బయట కొంచెము దూరములో నుండెను. అందువలన నతడు మాతో నిట్లనెను: "అయ్యా! ప్రస్తుతము మా యింటికి పోవుటకు కోచి సిద్ధముగా లేదు. అందువలన మనము అచ్చటకు నడచిపోదము".

మేము గౌరవనీయుని గృహమునకు నడచిపోసాగితిమి. అనతికాలములో మే మా గృహమును చేరుకొంటిమి. అయ్యది సామాన్యమైన గృహముకాదు. అదియొక మనోహర భవనము. అది ఎంతో పెద్దదిగనుండెను. అటువంటి భవనమును మఱియొక దానిని నే నంతవరకు చూచియుండలేదు. దానినిచూచి నే నెంతయు ఆశ్చర్యపడితిని.

గౌరవనీయుడు మమ్మొక గదిలోనికి ప్రవేశపెట్టెను. ఆ గది సౌందర్యము నేమని వర్ణించి చెప్పగలను? అది ఎంతో అద్భుతముగనుండెను. నవీనకాలపు అభిరుచులకది అనుగుణముగ నుండెను. గౌరవనీయుడు మమ్మాగదిలో కూర్చుండచేసెను. "నేను భోజనపు ఏర్పాట్లు చేసివత్తును. అంతవఱకు మీరిచ్చట నుండుడు" అని ఆ గౌరవనీయుడు లోనికిపోయెను. గౌరవనీయుడు వెళ్ళిపోయిన తరువాత ఆటగాడు, "మనము చాల అదృష్టవంతులము. వచ్చివచ్చి ఈ యింటిలో పడినాము" అని యని తన సంతోషమును వెలిపుచ్చెను.

గౌరవనీయుడు అనతికాలములో తిరిగి వచ్చెను. కొందఱు సేవకులు భోజనము తీసికొనివచ్చిరి. ఇద్దఱు ముగ్గురు యువతులుగూడ వచ్చిరి. గౌరవనీయుడు వారిని మాకు పరిచయముచేసెను. మేమందఱము కూర్చుండి భోజనము చేయసాగితిమి. భోజనముచేయుచు ఎన్నో విషయములను గూర్చి మాట్లాడుకొనసాగితిమి. ముఖ్యముగా మేము రాజకీయములను గూర్చియే మాట్లాడితిమి. గౌరవనీయునకు రాజకీయములనిన ఎక్కువ ఇష్టముకదా! అంత డెంత ఏప్రను స్వేచ్ఛా స్వాతంత్ర్యములను గూర్చి మాట్లాడసాగెను.

భోజనము పూర్తియైనతరువాత గౌరవనీయుడు నన్ను, "ఇటీవలి మానిటర్ పత్రికను చదివియున్నారా?" అని ప్రశ్నించెను.

"లేదు" అని నేను సమాధానము చెప్పితిని.

"ఆడిటర్ పత్రికనుగూడ చదువలేదనుకొందును"

"అవును, దానినిగూడ చదువలేదు."

"మీరు వానిని చదువకుండుట ఎంతయు ఆశ్చర్యముగ నున్నది. నేను ఎన్నో రాజకీయపత్రికలను చదువుచుందును. డెయిల్, పబ్లిక్, లెడ్జర్, క్రానికిల్, లండన్ ఈవెనింగ్, వైట్ హాల్ ఈవెనింగ్ మున్నగు పత్రికల నన్నిటిని చదువుచుందును. అవి ఒకదానినొకటి తీవ్రముగా ద్వేషించుకొనుచుండును. విమర్శించుకొనుచుండును. అయినను అవియనిన నాకెంతయుఇష్టము. స్వేచ్ఛా స్వాతంత్ర్యములు బ్రిటన్ గర్వింపదగిన విషయములు. వానిని రక్షించుచున్నవారిని నేను ప్రశంసింతును" అని మాగృహపతి అనెను.

"అయిన మీరు మన రాజుగారిన్కూడ ప్రశంసించుచున్న మాట!" అని నే నంటిని.

అప్పుడు మా గేస్టు ఇట్లు అనెను: "అవును, ఆయన ఏమి చేయవలయునని మేము కోరుచుందుమో, దాని నాయనచేసి నప్పుడు తప్పక ప్రశంసింతుము. కాని ఇటీవల ఆయన చేయుచున్నట్లు మా అభీష్టమునకు వ్యతిరేకముగ నడచినచో, ఆయన సంగతి మా కసలు అక్కఱలేదు. నేనేమియు చెప్పను; ఆలోచించుటమాత్రమే చేయుదును. కొన్ని విషయములను నేను బాగుగ నడపియుండవలసినది. కాని అట్లు జరుగలేదు. ఉండవలసినంతమంది సహోదారులున్నారని నేను అనుకోను. బ్రి. సత్త్వమును సమర్థించు వార లెవ్వరైన ఈకాలమున నున్నారా? బ్రిటను లిప్పుడు అనుభవించుచున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యములను కడు నీచముగ విడిచిపుచ్చు వార లెవ్వరైన నిప్పుడున్నారా? అంతటి నీచు లెవ్వరైన నున్నారా?"

అంతట నే నిట్లంటిని: "ఎవ్వరును ఉండరనియే నేను

అనుకొనుచున్నాను. నా మట్టుకు నాకు స్వేచ్ఛా స్వాతంత్ర్యములు అతి పవిత్రమైనవి; ప్రియమైనవి. అవి దైవలక్షణములు. మానవులందఱును రాజులుగా నుండవలయునని నేను అభిప్రాయపడుచున్నాను. నేనుగూడ ఒకరాజుగా నుందును. మనకందఱకు సింహాసనము నధిష్ఠించుటకు సహజముగ సమానమైనహక్కు ఉన్నది. ఇది నా అభిప్రాయము. పూర్వము సమతావాదులను కొందఱుగూడ నిదే అభిప్రాయమును కలిగియుండెడివారు. వారు అందఱును సమముగానుండు సంఘము నొకదానిని ఏర్పఱచిరి.

కాని అయ్యో! సమతావాదుల మనోరథము నెఱవేఱలేదు. ఏలయన వారిలో కొందఱు ఎక్కువ బలవంతులు, కొందఱు ఎక్కువజిత్తులు కలవారు. వారు మిగిలిన వారికంటె ఎక్కువ యజమానులైరి. గుఱ్ఱపురౌతు గుఱ్ఱముకంటె ఎక్కువ జిత్తులమారి వాడగుట మూలముననే అతడు దాని నధిష్ఠించుట తటస్థించుచున్నది. అట్లే అతనికంటె ఎక్కువ జిత్తులుకలవాడు, బలవంతుడు అతని భుజములపై కూర్చుండుట తటస్థించుచుండును.

అందువలననే ఈ మానవలోకములో కొందఱు పరిపాలించుట, చాలమంది పరిపాలింపబడుట తటస్థించుచున్నది. క్రూరప్రభువులుండుట అనివార్యమగుచున్నది. వారు మనతో బాటు మనయింటిలో నుండవలయునా? మన గ్రామములో నుండవలయునా? రాజధానీనగరములో నుండవలయునా? నాకు సంబంధించినంతవఱకు నేను క్రూరప్రభువును తీవ్రముగా ద్వేషించుచుందును. నేను వారి మొగమును చూచుట కేమాత్రము

ఇచ్ఛగింపను. వారు నాకు దూరముగనుండవలయుననియే నేను వాంఛించుచుందును. వారు దూరముగానున్నకొలది నాకు సంతోష మతిశయించుచుండును.

మానవులు సర్వసాధారణముగా నా అభిప్రాయమునే సమర్థించుచున్నారు. అందువలనే మానవులందరును ఏకగ్రీవముగ ఒకరోజును ఏర్పాటుచేసికొన్నారు. ఒకరోజు నేర్పాటుచేసికొనుటవలన క్రూరప్రభువులసంఖ్య ఒకటికి తగ్గిపోయినది. అతడు ఎక్కువమంది జనులను చాలదూరమునందుండుట తటస్థించుచున్నది.

ఒకరాజు నెన్నుకొనకపూర్వము ప్రజలలో కొందఱు క్రూరులుండిరిగదా. ఒకరాజు నెన్నుకొనుటవలన ఆ క్రూరుల అధికారము తగ్గిపోయినది. సహజముగ వారు రాజుగారిని ద్వేషింపసాగినారు. రాజుగారి ఆజ్ఞను పాలించుట వారి కేమాత్రము ఇష్టములేదు. అందువలన రాజుగారి అధికారమును తగ్గించుటకు వారు ప్రయత్నింపసాగినారు. రాజుగారి అధికారము తగ్గినకొలది వారి అధికారము హెచ్చెను. వారు చేయవలసినది రాజుగారి అధికారమునకు నీళ్ళుత్రోడుటయే. రాజ్యపరిస్థితులు, రాజ్యములోని చట్టములు, ధనికుల మనస్సులు మున్నగువానిపై రాజుగారియొక్క అధికారము ఆధారపడియుండును. ఇవి యన్నియు కలసి కుట్రచేసి రాజుగారి అధికారమును తగ్గించుటకు ప్రయత్నింపవచ్చును. ఉదాహరణకు రాజ్యములోనే పరిస్థితులు ధనము ప్రోగుచేసికొనుటకు అనుకూలముగ నున్నవనుకొనుడు. ధనికులు ఆ పరిస్థితుల నవకాశముగాతీసికొని ధనమును ప్రోగుచేసికొనుచుందురు. కాని వారికి సంతృప్తి అనునది యుండదు.

వారి ఆశలు ఇంకను హెచ్చిపోవుచుండును. దేశీయపరిశ్రమల వలనగాక విదేశవ్యాపారమువలన దేశములోనికి ధనరాసులు ప్రవహించుచున్నప్పుడే ఇట్లుజరుగుట సాధ్యమగును. ధనికులే విదేశవ్యాపారమును తమ కనుకూలముగ మార్చుకొనగలరు. అదేసమయమున వారికి స్వదేశ పరిశ్రమలవలనగూడ లాభములు చేకూరుచుండును. ఆవిధముగా ధనము ప్రోగుచేసికొనుటకు రెండు మార్గములున్నవి, బీదవారికి మాత్ర మొకటే మార్గమున్నది.

విదేశ వ్యాపారముచేయు దేశములలో అందువలననే ధన మెక్కువగనున్నది. ఆ ధనమును కొద్దిమంది చేతులలో మాత్రమే ఉన్నది.

దేశములోని చట్టములు ధనము కొందఱి చేతులలోనే నిలువయుండుటకు తోడ్పడవచ్చును. ఆ చట్టములు ధనికులకు బీదవారికి మధ్య సహజముగానుండు సంబంధము చెడగొట్టునవై యుండవచ్చును. ఉదహరణకు ధనికులు ధనికులతోనే వివాహ సంబంధములు చేసికొనవలయుననియు, బీదవారితో చేసికో రాదనియు చట్టములు నిర్దేశింపవచ్చును. అట్లే ధనికులైనవారు మాత్రమే సలహాదారులుగా తమ దేశమునకు సేవచేయ నర్హులనియు పాండిత్యమున్నంతమాత్రమున అర్హులుకారనియు చట్టములు నిర్దేశింపవచ్చును. అపుడు పండితులుగూడ ధనము సంపాదించుటకే ప్రయత్నింతురు. ఆయా పద్ధతులవలన ధనమును సంపాదించుట, ప్రోగుచేయుట హెచ్చిపోవును.

ధనికులవద్ద కావలసినంత ధనమున్నది. వారికి జీవిత సౌఖ్యము లన్నియు నున్నవి. వారి ఆనందమునకు మితిలేదు. ఎంత ఖర్చుపెట్టినను వారివద్ద నింకను ధనము మిగులుచున్నది.

వారి కొనుగోలు శక్తి హెచ్చుచున్నది. వారివద్ద కావలసి నంత ధనమున్నది. కనుక వారిపై నాధారపడియున్నవారు పలువురు బయలుదేలుదురు. అనగా వారు తమ ధనముతో సది అవసరమైనవారి స్వేచ్ఛా స్వాతంత్ర్యము లనుకొనివేయుదురు. స్వేచ్ఛా స్వాతంత్ర్యములు కోల్పోయిన మనుజులు ఎన్నో అవమానములను పొందుచు తమ పొట్టనింపుకొనుటకై ధనికులు చెప్పినట్లెల్ల చేయుచుందురు.

ఆవిధముగా ప్రతి ధనికునిచుట్టును అతనిపై ఆధారపడి యుండి అతని మోచేతినీటిని త్రాగు బీదవారు పలువురు చేసు చుందురు. ఆ బీదవారు బానిసలు. వారి జీవితములు కడు నికృష్టమైనవి, వారి ఆత్మలు, విద్య బానిసత్వమునకే అలవాటుపడి యుండును. వారు తామున్నదే స్వర్గలోకమని భావించుకొని కలలుగాంచుచుందురు. స్వేచ్ఛా స్వాతంత్ర్యములన నేమోవారికి తెలియవు. వానిపేరుమాత్రమే వారికి తెలియును.

ధనికులు, వారిపై ఆధారపడి యున్నవారుకాక మిగిలిన వారింకను పలువురుందురు. వారు ధనికుల పలుకుబడికిలోనై యున్నవారుకారు. వీరు ధనికులకు, బీదవారికి మధ్య ఊగిసలాడు చుందురు. వీరిని మధ్యతరగతి వారందురు వీరివద్దకూడ ధన మున్నది. అందువలన వీరు అపారమగు ధనసంపదకల ధనికులకు లొంగియుండుటకు ఏమాత్రమును అంగీకరింపరు. తమంతట తాము ఇతరులను లొంగదీసికొని పరిపాలించు తాహతు వీరికి లేదు.

ఈ మధ్యతరగతి ప్రజలలోనే గొప్ప సుగుణసంపదలు కలవారు పండితులు, కళాస్రష్టలు మున్నగు వారందఱునుందురు.

స్వేచ్ఛా స్వాతంత్ర్యములను సంరక్షించు జనులీ తరగతికి చెందిన వారే; వీరినే నిజమైన ప్రజలు అని పిలువవగును."

ఆవిధముగ నేను నా ఉపన్యాసమును కొనసాగించితిని. నా ఉపన్యాసములో రాజరికమును పూర్తిగా సమర్థించితిని, స్వేచ్ఛా స్వాతంత్ర్యములను నిలబెట్టుచున్నామని పైకి చెప్పుచు. హృదయాంతరాళములలో కడు క్రూరభావములు కలవారి ప్రవర్తనమును నిశితముగా విమర్శించితిని. ఎట్టకేలకు నే నంత దీర్ఘముగ మాట్లాడుట అనుచితమను సంగతిని గ్రహించితిని.

అంతలో మా కాతిథ్యము నొసగిన గౌరవనీయుడు ఇట్లనెను: "ఏమేమి! నేనింత వఱకు మతగురువు వేషములోనున్న జెసూటును ఆదరించుచున్నానన్నమాట నాపేరు విల్కిన్సన్ అయినచో మీరు వెంటనే ఈ గృహమును వీడిపోవలయును."

జరిగినదానికి నేనెంతయు విచారించితిని. నా తెలివి తక్కువ తనమునకు నన్ను నేను నిందించుకొంటిని. నన్ను ఆదరించినవాని మనసెట్టిదో పూర్తిగ తెలిసికొనకుండ అతిథినన్న మాట మఱచిపోయి మర్యాద భంగముగ మాట్లాడిన నన్ను ఏమనవలయును?

"అయ్యా! నన్ను క్షమింపుడు. జరిగినదానికి నేనుహృదయ పూర్వకముగ విచారించు చున్నాను" అని నేనంటిని.

"క్షమించుటయా! మీరన్నమాటలు సామాన్యమైన మాటలా! మీరు క్షమింపుడని వేయిసార్లు అడిగినను క్షమించు టకు వీలుకాని మాటలు! స్వేచ్ఛా స్వాతంత్ర్యములను విడిచి పుచ్చుటయా! బానిసత్వమునకు లొంగిపోవుటయా? అయ్యా! తక్షణమే ఈయిల్లువీడి బయటకు పోవలయునని మిమ్ము గట్టిగా

హెచ్చరించుచున్నాను. లేనిచో మీరు అనుకోని అవాంఛనీయమైన సంఘటనలు జరుగును. మీరు వెంటనే వెళ్ళిపోవలయునని మఱియొకసారి హెచ్చరించు చున్నాను."

నన్ను క్షమింపవలసినదని మఱియొకసారి వినయపూర్వకముగ ప్రార్థింప బోవుచుంటిని. అంతలో నొకసేవకుడు తలుపు తట్టెను. ఆసవ్వడి వినగానే మాగదిలోనున్న యువతు లిట్లఱచిరి: "అయ్యబాబో! చచ్చినాము! మనయజమానుడు, యజమానురాలు వచ్చినట్లున్నారు!"

నే నంతవఱకు యజమానుడని భావించు చున్నవాడు ఆయింటి బట్లరు. ఆ గృహయజమానుడు ఇంటలేని సమయమున నతడు తాను యజమానుడుగ నటించెను. అతడు బట్లరైననేమి? నిజముచెప్ప వలయునన్న నతడు చాలమంది గౌరవనీయులకంటె బాగుగను రాజకీయములనుగూర్చి మాట్లాడి యుండెను. అతడు యజమానుడుగగూడ చాల చక్కగనే నటించెనని చెప్పవలసి యుండును.

అనతి కాలములో యజమానుడు, యజమానురాలు గదిలో ప్రవేశించిరి. వారిని చూడగనే నేను కలవరపడితిని. నన్నుచూచి వారుకూడ అపరిమితమగు ఆశ్చర్యమును ప్రకటించిరి. అసలు యజమానుడునన్ను, నాతో వచ్చిన ఆటగానిని ఉద్దేశించి ఇట్లనెను: "గౌరవనీయులారా! నేను, నాభార్య మీకు వినయపూర్వకమైన సేవకులము. మేము అనుకోకుండగనే మీరువచ్చి మాయిల్లు పావనము చేసినారు. మీకు మాపట్లగల అపరిమితమగు అభిమానమునకు మే మెంతయు కృతజ్ఞులము. మేము మిమ్మెట్లు సంతృప్తిపఱచగలమో తెలిసికొనగోరుచున్నాము."

నాకు అంతయు అయోమయముగ నుండెను. నోటివెంట మాట రాకుండెను. అనతికాలములో మాగదిలోనికొక యువతి ప్రవేశించెను. ఆమె ఎవ్వరు? అరబెల్లా విల్మట్. ఆమెకును, నా మొదటి కుమారుడు జార్జికిని వివాహము కావలసి యుండెను. కాని కొన్ని కారణములవలన ఆ సంబంధము చెడిపోయి యుండెను. నే నా పరిస్థితుల నన్నిటిని ఇదివఱకే వివరించి యుంటిని. నన్ను చూడగనే ఆమె మితిలేని సంతోషముతో నా చేతులలోనికి వచ్చిపడెను.

ఆమె ఇట్లనెను: "అయ్యా! మీరే మంచి సంఘటనవలన ఇచ్చటకు అనుకొనకుండ వచ్చుట తటస్థించినది. ప్రసిద్ధిచెందిన డాక్టర్ ప్రిమ్‌రోజ్ తమ యింటికే వచ్చినారని తెలిసిన నా అత్త మామ లెంతయు సంతసింతురు."

నా పేరును వినగానే అంతకు ముందే ఆ గదిలోనికి వచ్చిన దంపతులు ముందుకువచ్చి నన్ను మఱియొకసారి సాదర ముగ నాహ్వానించిరి. నే నచ్చటకెట్టి పరిస్థితులలో వచ్చితినో వారికి వివరించి చెప్పితిని; బట్లరు సంగతికూడ చెప్పితిని. అంతయు వినివారు మందహాసము చేసిరి. బట్లరును ఉద్యోగమునుండి తొల గించుటకు సిద్ధపడిరి. కాని నేను జోక్యము కలిగించుకొని అతనిని క్షమింప వలసినదని కోరితిని. వారు నామాటయందు గౌరవ ముంచి అతనిని క్షమించి విడిచిపుచ్చిరి.

ఆ యింటి యజమానునిపేరు ఆర్నాల్డు. అతడు, అతని భార్య నన్ను తమయింటకొన్ని దినములుండి ఆతిథ్యమును స్వీక రింప వలసినదని ప్రార్థించిరి. నేను వారికోరికకు అంగీకరించి యుండెడి వాడనో, అంగీకరించి యుండెడివాడనుకానో! నా

అచ్చటకు వచ్చియుండెను. "మానాటకములో నేడు క్రొత్త యువకుడొకడు నటింప బోవుచున్నాడు. అతడు నాటకములోని హారేషియోపాత్ర ధరించును. ఈ నూతన యువకుడు తన పాత్రకు అపూర్వమగు న్యాయము చేకూర్చునని నేను నమ్ము చున్నాను. ఇటువంటి వానిని నేనింతవఱకు చూచియుండలేదు. నటన అనునది ఒక్క-రోజులో రానిమాట నిజమే. కాని యితడు ప్రత్యేకముగ నటించుటకే జన్మించినాడేమోయని అనిపించు చున్నది. ఇతనిగొంతు, విగ్రహము, రూపము, చేష్టలు మున్నగు నవి అన్నియు కడుంగడు ప్రశంసనీయములుగ నున్నవి. అతడు మాకు కాకతాళీయముగ లభించినాడు అందుకు మేమెంతయు అదృష్టవంతులమని అనుకొను చున్నాము. మీరందఱు మా నాటకమునుచూచి ఆనందింప వలయునని కోరుచున్నాను" అని మేనేజరు మాతో అనెను.

యువకుడెవ్వరో తెలిసికో వలయునని నే నెంతయు కుతూహలపడ సాగితిని. మఱియు ఇంటిలోని యువతులు నాట కము చూతమని మమ్ము ప్రోత్సహింప సాగిరి. అందువలన సాయంకాల మగుసరికి మేము నాటకము జరుగు ప్రదేశమునకు పోతిమి. నాతో వచ్చిన ఆటగాడే నాటకసంఘములో ముఖ్యుడు. అందువలన నచ్చటివారు ఎంతో ఆదరముతోను, గౌరవముతోను ఆహ్వానించిరి. మమ్ము ముందుసీట్లలో కూర్చుండ బెట్టిరి. హారే షియో ఎప్పుడు దర్శనమిచ్చునాయని మే మెంతయు నాతురపడ సాగితిమి.

నాటకము ప్రారంభ మయ్యెను. అప్పుడు హారేషియో రంగస్థలముమీదికి వచ్చెను. హారేషియో ఎవ్వరు? మదదృష్ట

వంతుడగు నాకుమారుడు. అతనిని చూడగనే నాకుకలిగిన భావములనెట్లు వర్ణింతును? కుమారులున్న తల్లి దండ్రులూహింతురు గాక! అతడేదో ఆట్లాడబోవుచు మేమున్నవంకకు తిరిగెను. అప్పుడతడు నన్ను, విక్టోరియా కన్యను చూచెను. అతనినోట నింక మాట రాకుండెను. అతడు శిలా ప్రతిమవలె నిలబడిపోయెను.

తెర వెనుకనున్న నటులు అతని చేష్టలనుగూర్చి వేఱుగా తలచిరి. రంగస్థలమునకు క్రొత్తయగుటవలన నతడట్లున్నాడని తలచి వారతనిని ప్రోత్సహింపసాగిరి. కాని అతడు కదలలేదు; మెదలలేదు. కొంతవడి కతడు గోలుగోలున నేడ్చెను. పిమ్మట నతడు తెర వెనుకకుపోయెను. అప్పుడు నా మనస్సులో ఒకదాని వెంట నొకటి శరపరంపరగా భావములు రాసాగెను. అంతలో విక్టోరియా కన్య నన్ను తట్టెను. ఆమె పాలిపోయినట్లుండెను. వణకుచున్న గొంతుతో నామె, "అయ్యో! నన్ను మా అత్తమామల యింటికి తీసికొని పొండు" అని యనెను.

ఆర్నాల్డు గృహమునకు మేమందఱముపోతిమి. ఆర్నాల్డు నా ముఖ కవళికను చూచి ఆశ్చర్యపడెను; నే నట్లు ఎందుల కైతినో అతని కేమియు నర్థము కాకుండెను. అప్పుడు నాటకములో క్రొత్తగా వేషము వేయుటకు వచ్చిన యువకుడు నా కుమారుడు జార్జి అని అతనికి తెలిపితిని. వెంటనే అతడు జార్జిని తన యింటికి తీసికొని రావలసినదని గుఱ్ఱపు బండిని పంపెను. నా కుమారుడు రంగస్థలముపైకి మరల వచ్చుటకు నిరాకరించి నందున నాటక సంఘమువారు మఱి యొకనిని హామ్లెటు పాత్రకు ఎన్నుకొని యుండిరి అందువలన అనతికాలములోనే జార్జి బండిపై ఆర్నాల్డు గృహమునకు వచ్చెను.

ఆర్నాల్డు నా కుమారుని సాదరముగ లోనికి ఆహ్వానించెను. నేనుకూడ అతనిని దయతో స్వీకరించితిని. విల్మట్ కన్య అతని రాకను లెక్క-చేయని దానివలె ప్రవర్తింపసాగెను. ఆమె ప్రయత్నించి ఆ విధముగా చేయుచున్నదని నేను సులభముగా గ్రహించితిని. ఆమె మనస్సులోని ఆందోళన ఇంకను తగ్గలేదు ఆమె ఏవేవో విషయములను చెప్పి తనకు తోచినట్లు నవ్వసాగెను. ఆమె మాటిమాటికి ఏవో ప్రశ్నలు వేయసాగెను. కాని ఆమె జవాబుల కొఱకు నిరీక్షించుచున్నట్లు లేకుండెను.

## 20

నాటి రాత్రి మేమందఱము కలసి భోజనము చేసితిమి. భోజనమైన తరువాత ఆర్నాల్డు నా కుమారునితో నిట్లనెను: "నీ సామానులను నాటక సంఘము వారివద్దనుండి తెచ్చుటకు నా సేవకుల నిరువురను పంపుదును."

"వలదు, వలదు నేనేపోయి తెచ్చుకొందును" అని నా కుమారుడనెను.

కాని విల్మట్ కన్య ఆర్నాల్డుచెప్పిన దానిని పునరుద్ఘాటించెను. అప్పుడు విధిలేక జార్జి ఆమెతో నిట్లనెను: "నాకీ విశాల ప్రపంచములోనున్నవి ఒక కఱ్ఱ, ఒక చిన్న చేతి సంచిమాత్రమే వానిని తెచ్చుటకు ఇరువురు సేవకులను పంపవలసినఅవసరమేమి. వచ్చినది ?"

ఆ మాటలను విని నేనిట్లంటిని: "అయ్యో! కుమారుడా! నేను బీదవాడనైన తరువాత నీవు నన్ను విడిచివెళ్ళిపోయినావు.

నీవు బీదవాడుగనే నావద్దకు తిరిగివచ్చినావు. కాని ప్రపంచమన నేమో నీకు బాగుగా అర్థమైనదనియు, అపారమగు ప్రపంచ జ్ఞానమును సంపాదించినావనియు నేను నిస్సందేహముగ అభి ప్రాయపడుచున్నాను."

"అవును. నేను ఇల్లువదలిపెట్టి వెళ్ళినప్పుడు బీదవాడను. ఇప్పుడుకూడ బీదవాడనే. ఐశ్వర్యము వెంటపడి ప్రయాణము చేసినచో నది ఏ మాత్రము లభింపదు. అసలు నేనిటీవల ఐశ్వ ర్యము సంపాదింపవలయునను ప్రయత్నమును మానుకొన్నాను" అని నా కుమారుడు జవాబిచ్చెను.

అంతట ఆర్నాల్డు సతి ఇట్లనెను: "అయ్యా! నేను మీ సాహస కృత్యములను గూర్చి సంపూర్ణముగ తెలిసికోవలయు నని ఎంతయు ఆతురపడుచున్నాను. మొదటి భాగమును నామేన కోడలు ఎన్నోసార్లు చెప్పినది. మిగిలిన భాగమునుకూడ చెప్పి మమ్మందఱను సంతృప్తిపఱచవలయునని నేను కోరుచున్నాను."

అపుడు నా కుమారుడు ఇట్లనియెను: "అమ్మా! మీ కోరికను నేను తిరస్కరింపజాలను. మీరు నా సాహస కృత్యము లనుగూర్చి తెలిసికొనగోరుచున్నారు. ఈ సందర్భమున నేను మీకొక్క మనవి చేసికొనుచున్నాను. నేను పాల్గొనిన ఒక్క సాహస కృత్యమును గూర్చియైనను మీకు చెప్పజాలను. ఏల యన నేను మీకు చేసిన పనులను గూర్చి గాక చూచిన విష యములను గూర్చి చెప్పెదను.

నా జీవితములోని మొట్టమొదటి దురదృష్టకర సంఘటన చాల ఘోరమైనది. ఈ సంగతి మీకందఱకు తెలియును. అది నాకు అపారమైన బాధను కలిగించినది. కాని అది నన్ను పూర్తిగా

మంచి వేయలేను. ముందు ముందు మంచి జరుగవచ్చునని నే నాశించినాను. ఆ విధముగ ఆశించుటలో నా కంటె మించిన వాడు మఱి యొకడు లేడని చెప్పవచ్చును. నే నప్పుడు అట్టడుగుకు పోయినాను. కావున నే నింకపోవుట తటస్థించునేగాని ఇంకను క్రిందికి పోవుట జరుగదని ఆశించినాను.

ఆ ఆశతో నేనొకనాటి యుదయమున లండను మహానగరమునకు పయనమై పోయినాను. అప్పుడు నేనేమియు బాధపడుచుండుట లేదు. మఱునాటిని గూర్చికూడ నేనేమియు బాధపడకుంటిని. బాటమీదుగా కిలకిలారవములు చేసికొనుచు ప్రయాణమై పోవుచున్న పక్షులవలె నేనును ఉత్సాహముగ నుంటిని. ప్రతి యొక్కని శక్తి సామర్థ్యములు గుర్తింపబడుననియు, అచ్చట నాకు తగిన బహుమానము లభించుననియు నేను అనుకొని సాగితిని.

ఎట్టకేలకు నేను లండను మహానగరమును చేరుకొంటిని. మానాన్నగారు ఆ మహానగరములోనున్న మాబంధు వొకనికి ఒక ఉత్తరమువ్రాసి నాకిచ్చియుండిరి. మొట్టమొదటనే నా యుత్తరమును ఆబంధువు కిచ్చితిని. అతని పరిస్థితికూడ నా పరిస్థితివలెనే ఉండెను. అందువలన అతడు నాకెట్టి సాహాయ్యము నుచేయగలడో నా కర్థము కాకుండెను.

నేను మొదటినుండియు ఏదేని పాఠశాలలో పనిచేయవలెననుకొనుచుంటిని. నేనా విషయమును మా బంధువుకు తెలిపితిని. అతని కది నచ్చినట్లులేదు.

'నేనుగూడ బోర్డింగుపాఠశాలలో పనిచేసినాను. కాని ఆపని చేయుటకంటే న్యూగేట్ జైలులో పనిచేయుట మేలని అను

కొన్నాను. నేను పెందలకడ లేచినను ఆలస్యముగా లేచినా ననెడివారు. నా మొగము బాగుండలేదని కొందఱనెడివారు. పిల్లలు రకరకములుగా బాధపెట్టుచుండెడివారు. స్వేచ్ఛగా బయటకుపోయి తిరుగుటకు వీలుండెడిదికాదు. కాని నీవు పాఠశాలకు తగియున్నానని భావించుచున్నావా? ఏదీ నిన్ను కొంచెము పరీక్షింప నిమ్ము. నీ విదివఱకు తరిబియ్యతు పొందియున్నావా? ఎచ్చటనైన అప్రెంటిసుగా పనిచేసితివా?"

'లేదు.'

'అయిన నీవు పాఠశాలకు పనికిరావు. నీవు పిల్లల తల దువ్వగలవా?'

'చేతకాదు'

'అయిన నీవు పాఠశాలకు పనికిరావు. నీకు మసూచికము వచ్చినదా?'

'లేదు.'

'అయిన నీవు పాఠశాలకు పనికిరావు. మఱి ఒక్కమంచము మీద ముగ్గురు పరుండగలరా?'

'చేతకాదు'.

'అయిన నీ వెప్పటికిని పాఠశాలకు పనికిరావు. నీకు పెద్ద కడుపున్నదా?'

'ఉన్నది.'

'అయిన నీ వెంత మాత్రము పాఠశాలకు పనికిరావు. నీవు ఇంక ఏదేని పనికి పనికివత్తువుగాని దీనికి మాత్రము పనికిరావు. అయినను నేను నీ విషయమును ఆలోచించి ఏదేని సాహాయ్యము చేయుదును. నీవు కొంచెము జ్ఞానము, ఉత్సా

హము కలవానివలె కనబడుచున్నావు. నేను గ్రంథకర్తను పుస్తకములు వ్రాయుచున్నాను. నీవుకూడనావలె గ్రంథకర్త వెందుకు కారాదు? పుస్తకము లెందుకు వ్రాయరాదు? మహామహులగు రచయితలు గ్రంథములు వ్రాయుచు సరిగా తిండిలేక మలమలమాడు చుందురను విషయమును నీవు పుస్తకములలో చదివి యుందువను కొందును. ఎందుకును పనికిరాని రచయితలు ఐశ్వర్యముతో తులతూగు చుందురు. అట్టి వారిని సుమారు సలువది మందిని నేను నీకీ పట్టణములో చూపగలను. వారు పలువురి ప్రశంసలనుగూడ పొందుచున్నారు. నిస్సలైన రచయితలకు ధనములేదు; ప్రశంసలు లేవు.'

'నాకు గ్రంథకర్తనై పుస్తకములు వ్రాయుట అంగీకారమే'.

తరువాత నేను గ్రంథ రచనకు ప్రారంభించితిని. కొన్ని రచనలను ప్రచురించితిని."

"నీవు ఏ విషయమునుగూర్చి గ్రంథములను రచించినావు? ద్వితీయ వివాహముకూడదను విషయమును గూర్చి గ్రంథములు వ్రాసినావా? అన్నట్లు నీకు అర్థమవచ్చినాను. నీ కథను కొనసాగింపుము" అని నేనంటిని.

"ఒక విషయమని ఏమియున్నది? ఎన్నో విషయములను గూర్చి వ్రాసినాను. కాని విజ్ఞులెవ్వరును నా గ్రంథములను గూర్చి ఒక్కమాటయైనను అనలేదు. వారు నా రచనలను ప్రశంసింపలేదు; ఖండింపలేదు. వారు తమ మిత్రుల రచనలను తమకు వచ్చిన పదజాల మంతయు నుపయోగించి ప్రశంసించుచుండెడి

తమ శిష్యుల రచనలను ముక్కలు ముక్కలుగా చీల్చి తీవ్రముగా ఖండించుచుండెడివారు.

నే నొకనాడు ఒక కాఫీ గృహములో కూర్చుండి కాఫీ సేవించుచు నా గ్రంథముల భవిష్యత్తును గూర్చి ఆలోచించు చుంటిని. అంతలో నొక మనుజుడొకడు నేనున్న గదిలోనికి ప్రవేశించి నా ముందు కూర్చుండెను. మొదట మేము ఏవో కొన్ని విషయములను గూర్చి మాట్లాడుకొంటిమి. అనతికాలములో నతడు నే నొక గ్రంథకర్తనను విషయమును గ్రహించెను. అంతట నతడు తానుకూడ ఒక గ్రంథకర్తనను విషయమును తెలిపెను. పిమ్మట నతడు తనవద్దనున్న వ్రాత ప్రతులను కొన్నిటిని బయటకు తీసి, 'అయ్యా! నేను ఈ గ్రంథములను ప్రచురింపవలచుకొన్నాను. ఇందుకు చాల ధనము అవసరమై యున్నది. మీరుకూడ వీని ప్రచురణకు చందావేసి సాహాయ్యము చేయవలయునని కోరుచున్నాను' అని అనెను.

అంతట నేనేమి సమాధానము చెప్పవలయును? మనసులో గ్రుడ్డులాట ఎందులకని నావద్ద ఒక్క ఫార్తింగైనను లేదని స్పష్టముగా చెప్పితిని. అప్పుడతడు మఱికొన్ని ప్రశ్నలు వేసి నేనుగూడ డబ్బు సంపాదింపవలచుకొన్నాననువిషయమును గ్రహించెను.

పిమ్మట నతడు ఇట్లనెను: "అయ్యా! మీరింతవఱకు నేమియు సంపాదింపలేదనుచున్నారు. దీనినిబట్టి చూడగా మీ కింకను పట్టణ వాతావరణము సరిగా అర్థము కాలేదని తెలియుచున్నది. నేను మీకు కొన్నివిషయములను నేర్పెదను. బాగుగా అర్థముచేసికొని నా సలహా ప్రకారము ప్రవర్తింపుడు. ఇవిగో,

నా యీ వ్రాత ప్రతులను చూడుడు. వీనిని ఆధారముచేసికొని నేను కడచిన పండ్రెండు సంవత్సరములనుండి సుఖముగా జీవించు చున్నాను. ఎవ్వరైన ప్రభువు విదేశ యాత్రను ముగించుకొని ఇచ్చటకు తిరిగి వచ్చెనను కొనుడు జమైకానుండి ఒక ధనికుడు ఇచ్చటకు వచ్చెనను కొనుడు. వెంటనే నేను పోయి వారిని కలసికొని ఈ గ్రంథముల ప్రచురణకు సాహాయ్యపడవలసినదిగా యాచింతును. నేను మొట్టమొదట ముఖస్తుతిచేసి వారి హృద యములను ముట్టడింతును. తరువాత నా గ్రంథములను గూర్చి చెప్పకొందును. వారు మొట్టమొదటనే నా గ్రంథ ప్రచురణకు సాహాయ్యము చేయుదురనుకొనుడు. మరల వారి వద్దకుపోయి ఒక గ్రంథమును వారికి కృతినిత్తుననియు, అందుకు కొంతధనము నీయవలసినదనియు కోరుదును. అది పూర్తియైన తరువాత మఱి యొక వంకపెట్టి ధనమును గుంజుదును. ఆ విధముగా నేను అపా రమగు ధనము సంపాదించి జీవించుచున్నాను.

కాని మనలో మనమాట. నన్నిప్పుడందరును గుర్తించు చున్నారు. నా వ్యాపార మింక సాగునట్లులేదు ఈ కళను నీకు నేర్పుదును. నా బదులు నీవు నటించుచుండుము. గొప్ప ప్రభు వొకడు ఇటలీనుండి ఇటీవలననే తిరిగివచ్చినాడు. నా ముఖము అతని సేవకులకు బాగుగా తెలియును. అందువలన నీవు నీ వ్రాత ప్రతులను తీసికొని ఆ ప్రభువువద్దకు వెళ్ళుము. ఆ ప్రభు విచ్చిన సొమ్మును మన మిరువురము పంచుకొందము.'

"నేను ఆ విధముగ చేయుట కంగీకరింప లేము"

నా కుమారుని మాటలను విని నేనింక ఆగలేక ఇట్లం టిని: "అబ్బాయి, జార్జి! గ్రంథకర్తల వృత్తి ఇప్పుడిదియన్న

మాట! గ్రంథకర్తలు గొప్ప పండితులు కదా! అట్టి వారింత నీచమునకు దిగుచున్నారా? తమ పొట్టపోషించుకొనుటకు ఇతరులను పొగడుచు తిరుగుచున్నారా! ఎంత ఘోర మెంత ఘోరము!"

అంత నా కుమారుడు జార్జి ఇట్లనియెను: "అయ్యా! కాదు, కాదు. నిజమైన విలువగల కవులెవ్వరును అంతనీచముగ ప్రవర్తింపరు. నిజమైన తెలివి తేటలున్నచోట గర్వముకూడ నుండును. కావున వారు ఇతరులను నీచముగ పొగడి డబ్బు సంపాదించి జీవించుటకు వారేమాత్రము అంగీకరింపరు. సరియైన తెలివి తేటలు లేనివారు కొందఱు డబ్బు సంపాదించుటకు గ్రంథముల రచన నొకవృత్తిగా స్వీకరించి కడు నీచముగ ప్రవర్తింతురు. వారిని గూర్చియే ఇప్పుడు మనము చెప్పుకొనుచున్నాము. నిజమైన కవి కీర్తి ప్రతిష్ఠలను సంపాదించుటకై ఎంతటి కష్టములనైనను ఎదుర్కొనును. అపకీర్తి వచ్చు పనిని దేనిగాని చేయుట కతడేమాత్రము ఇష్టపడడు.

ఇక నా పరిస్థితిని వర్ణింతును. నా మనస్సు నీచమునకు దిగునట్టిది కాదు. నాలోకూడ కావలసినంత గర్వమున్నది. కాని నావద్ద డబ్బులేదు. ముఖ్యముగా డబ్బు కావలసియున్నది. కీర్తి ప్రతిష్ఠలమాట తరువాత నాలోచించుకోవచ్చును అందువలన నేను మధ్యమార్గము నవలంబింపవలసివచ్చెను. అనగా పొట్ట కూటికొఱకు నేను గ్రంథములను వ్రాయసాగితిని. ఈ వృత్తిలో బాగుగ పరిశ్రమచేసినగాని విజయ లక్ష్మి వరింపదు. నేనందులకు అర్హుడను కాకుంటిని. ఇతరుల ప్రశంసలను పొందవలయునను వాంఛను నేను అణచుకొనలేకపోతిని. దాని మూలమున

నేను వేగముగ రచనను సాగింపలేకపోతిని. నారచనలను కొన్ని పత్రికలు ప్రకటించెను గాని వానిని గుర్తించు వారెవ్వరును కన బడరైరి. స్వేచ్ఛా స్వాతంత్రములు, ప్రాచ్య దేశముల కథలు, పిచ్చి కుక్కకాటుకు మందు మున్నగు విషయముల మధ్య నా రచనలు వన్నెకురాలేదు.

ఇక నేను చేయవలసినది ఏమియున్నది? నావలెనే భగ్న హృదయులైన పలువురు గ్రంథ కర్తలుండిరి. వారు ఒకరినొకరు పొగడుకొనుచుండిరి; దూషించుచుండిరి; ద్వేషించుచుండిరి. నేను కూడ వారితో సాహచర్యము చేయసాగితిని. ఇతరుల రచనలలోని లోపములు నాకు ఆనందమును కలుగజేయసాగెను. ఇతరుల రచనలలోని మంచి నాకు ఆనందమును కలుగజేయ కుండెను. నేను సంతృప్తితో చదువలేకుంటిని; వ్రాయలేకుంటిని. రచన నాకొక వ్యాపారమై పోయెను.

ఒకనాడు నేను సెంట్ జేమ్సు పార్కులో ఒకబెంచిమీద కూర్చుండి ఏమేమో ఆలోచించుకొనుచుంటిని అప్పుడు గౌరవ నీయుడగు యువకు డొకడు నావద్దకు వచ్చెను. నా కతడు క్రొత్తవాడుకాడు. మా కిరువురకు విశ్వవిద్యాలయములో పరి చయ మేర్పడియుండెను. మేమిరువురము కొంచెము తబ్బిబ్బా యింపుతో నమస్కరించు కొంటిమి. అప్పుడు నేను చూచుట కెంతయు నసహ్యాముగనున్న దుస్తులను ధరించుకొనియుంటిని. నన్ను చూచుట కతడు అసహ్యాపడుచున్నాడని అను కొంటిని. నా నికృష్ట పరిస్థితిలో అతనిని కలసికొనుటకు నేను గూడ నిష్టపడకుంటిని. కాని అనతికాలములో అతని

గూర్చిన నాఅనుమానములు మటుమాయమయ్యెను. ఏలయన నా మిత్రుడు నెకో తాక్స్‌హిల్ అంతరంగముననుమంచివాడు."

అపుడు నేను ఇట్లంటిని: "ఏ మనుచున్నావు? జార్జి! తాక్స్‌హిల్! నీవన్న పేరదియేనా? అయిన నతడు మా యజమానుడై యుండును. మఱి యింకొకడు కాజాలడు."

నామాటలువిని ఆర్నాల్డుసతి ఇట్లు అనెను: "ఏమేమి! మీకు తాక్స్‌హిల్ అంత దగ్గఱివాడా? అతడు మా కుటుంబమునకు చాల కాలమునుండి మిత్రుడు. అనతి కాలములోనే అతడిచ్చటకు వచ్చునని మేము ఆశించు చున్నాము."

తరువాత నా కుమారుడుజార్జి ఇంకను ఇట్లు చెప్పసాగెను: మొట్టమొదట నా మిత్రుడు తాక్స్‌హిల్ చేసిన పనిఏమో తెలియునా? అతడు తన దుస్తులను నాకిచ్చెను. నేను నాదుస్తులను తీసివైచి అతడిచ్చిన దుస్తులను ధరించితిని. అతడు నన్ను తనవద్ద గుమస్తాపనికి తీసికొనెను. ఆ హోదాలో నేను ఎన్నో చిన్న చిన్న పనులను చేయవలసి వచ్చెను. నేను నాశక్తికొలది అతనికి సంతృప్తిని చేకూర్చుటకు ప్రయత్నింప సాగితిని. కాని అచ్చటకూడ నాకొక పోటీదారుడు బయలుదేఱెను. అతడు ఇదివఱకు ఎంవతఱి దగ్గఱో పనిచేసి యుండెను. ఇతరులను పొగడి తబ్బిబ్బు చేయుట అతనికి బాగుగ తెలియును.

ఇతరులను పొగడుట నాకేమాత్రము తెలియదు. కాని తాక్స్‌హిల్‌కు ముఖస్తుతి అనిన నెంతయు ఇష్టము. మఱియొకడు అతనిని తన చిత్తము వచ్చినట్లు పొగడు చుండెను. నేనేమో అతనినే మాత్రము పొగడకుంటిని. ఒకవేళ ప్రయత్నించి పొగడుదమన్నను అతని లోపములన్నియు నాకు బాగుగ తెలియును.

మఱియింక నే నతనిని ఎటు పొగడగలను? ఇక నే నతనివద్ద ఉద్యోగమును వదలుకోవలసిన పరిస్థితి ఏర్పడెను.

కాని అంతలో తార్న్‌హిల్ కొకవిషయమున నా సాహాయ్యము అవసర మయ్యెను. అతని తరఫున నే నొకరితో ద్వంద యుద్ధము చేయవలసి వచ్చెను. నే నందుల కంగీకరించి విజయమును సాధించితిని. అందుల కతడు నాపట్ల అపరిమితమగు కృతజ్ఞతాభావమును ప్రకటించెను. కాని ఏమిలాభము? అతడనతి కాలములో పటణమును వీడిపోనుండెను. నాకింక నెట్లు తోడ్పడ వలయునో నాకు తెలియకుండెను. ఎట్టకేల కతడొక నిర్ణయమునకు వచ్చెను. అతడు తనపెత్తండ్రియగు సర్ విలియమ్ తార్న్‌హిల్‌కొక యుత్తరమును వ్రాసియిచ్చెను. కొన్ని దినములకతడు పట్టణము వీడిపోయెను.

సర్ విలియమ్ తార్న్‌హిల్ చాల మంచి వాడనియు, న్యాయ శీలుడనియు ప్రసిదిగాంచి యుండెను. అందువలన తార్న్‌హిల్ ఇచ్చిన సిఫారసు ఉత్తరమును తీసికొని నే నతని వద్దకు బయలు దేఱితిని. అతని సేవకులు నన్ను అత్యంతాదరముతో ఆహ్వానించి లోనికి తీసికొని పోయిరి. ఒకచక్కని మందిరమున ప్రవేశ పెట్టిరి. అనతికాలములో నచ్చటకు సర్ విలియమ్ తార్న్‌హిల్ వచ్చెను. అతడు నా వద్దనుండి ఉత్తరమును తీసికొని చదివెను.

కొన్ని నిమిషములైన తరువాత నతడు ఇట్లనెను: "నా బంధువు నీకీ సిఫారసు ఉత్తరము నిచ్చినాడు. అత డీయుత్తరము నీకిచ్చుటకు నీవతనికి చేసినసేవఏమి? అతని తరఫున నీ వితరులతో పోరాడియుందువు. అనగా నీ వీతని దుర్గుణములను ప్రోత్స

హించి సమర్థించి నావన్నమాట. అందుకుగాను నీవు నావద్ద నుండి బహుమానమును ఆశించుచున్నావు! ఎంతచక్కగా నున్నది! నేను నీకెట్టిసహాయముచేయను. నీవు చేసిన నేరమున కిది శిక్ష. అంతియగాక నీవు పశ్చాత్తాపపడి ఇకముందెన్నడును ఇట్టి నేరమును చేయవని ఆశించుచున్నాను." అట్లని యతడా ప్రదేశము వీడిపోయెను. నేను బయటకు వచ్చితిని.

నేను పోయి పోయి క్రిస్ప్ కార్యాలయమును చేరుకొంటిని. అతడు తన కార్యాలయములో ప్రవేశించిన వారి కందఱకు సంవత్సరమునకు ముప్పదిపౌనుల నొసగును. అందుకు ప్రతిఫలముగా వారు జీవితాంతమువఱకు స్వేచ్ఛను కోల్పోవలయును. అతడు వారిని అమెరికాకు బానిసీండ్రుగా ఎగుమతి చేయును. నాకింక జీవితముమీద విరక్తిపుట్టుటవలన నేనుగూడ అతని కార్యాలయములో ప్రవేశించితిని. అదియొక పెద్దగుహావలె నుండెను. నేనచ్చట పలువురు మనుజులను చూచితిని. వారంద ఱును నేనున్నటువంటి పరిస్థితిలోనే యుండిరి. వారు క్రిస్ప్ రాక కొఱకు వేచియుండిరి. అంతవఱకు వారు కబుర్లు చెప్పుకొనుచుండిరి.

మఱి కొంతసేపటికి క్రిస్ప్ వచ్చెను. అతడు రాగానే అంతయు నిశ్శబ్దముగా నుండెను. అతడు నన్ను ఎంతో ఇష్టమున్నవానివలెచూచెను. నన్నుచూచి మందహాసము చేసెను. అతడు నన్నుకొన్ని ప్రశ్నలువేసెను. నేనా ప్రశ్నల కన్నిటికి సముచితమగు సమాధానముల నొసగితిని. నేను ప్రపంచములో ఏపని చేయుటకైనను పనికివత్తునని అతడనెను. నేను ఏ ఉద్యోగమునకు బాగుగా పనికివత్తునో తెలిసికొనవలయునని కాబోలు

కొంచెముసేపు అతడు ఆలోచించుచున్నట్లు నటించెను. ఆవిషయమును గ్రహించినట్లు సూచనగా అతడు నుదుటిమీద కొట్టుకొనెను. పెన్సిల్వేనియాలో కార్యదర్శి పదవియొకటి ఖాళీగా నున్నదనియు, దానికి నేనునియమింపబడునట్లు తనశక్తియంతయు నుపయోగించి ప్రయత్నించి చూతమనియు నతడనెను. అతడు మోసపుమాటలు చెప్పుచున్నాడని నాకు బాగుగా తెలియును. నన్నతడొక బానిసీడుగా నమ్మబోవుచున్నాడు. అయినను నేను అందులకు సమ్మతించితిని.

బయటకుపోయి ఏదేని పానీయమును సేవింపవలయునని నేను అనుకొంటిని. ఆ యుద్దేశ్యముతో నేను బయటకు వచ్చుచుంటిని. అంతలో ద్వారమువద్ద నాకొక కెప్టెను కనబడెను. అతనితో నాకదివరకు కొంచెము పరిచయముండెను. నాతో బాటు పానీయమును సేవించుటకు రావలసినదని నేనతని నాహ్వానించితిని. అతడందులకు అంగీకరించెను.

ఇరువురము ఒకచోట కూర్చుండి పానీయమును సేవింపసాగితిమి. అప్పుడు నే నతనికి నా నిర్ణయమును వివరముగా తెలిపితిని. అంతయు విన్నతరువాత నతడిట్లనెను: "అయ్యో! నీవు సర్వనాశనమైపోనున్నావు. నీపరిస్థితికి నేనెంతయు విచారించుచున్నాను. ఆ దుర్మార్గుడు క్రిస్పు నీకు మేలుచేయడు. నిన్నతడు అమెరికాలో బానిసీడుగా అమ్మివేయును. ఇది ఏమాత్రము వాంఛనీయమైన విషయముకాదు. ఉద్యోగము కొఱకు నీవంతదూరము సముద్రప్రయాణముచేయవలసినఅవసరమేమి వచ్చినది. నీవు చాల తక్కువదూరము ప్రయాణముచేసి

గౌరవముగ జీవితయాత్ర చేయవచ్చును. నాసలహాతీసికొన్నచో నీవు బాగుపడుదువు.

నా నావ రేపు ఆమ్‌స్టర్‌డామ్‌కు పోనున్నది. నీవచ్చుటకు నా నావలో ఎందుకురాకూడదు? నీ వచ్చుటకువచ్చి డచ్చివారికి ఆంగ్లభాష నెందుకు నేర్పకూడదు? ఆంగ్లభాషను నేర్చుకొనుటకు పలువురు నీవద్ద శిష్యులుగా చేరుదురు. నీకు కావలసినంత ధనము లభించును. నీవు ఆంగ్లభాషను చక్కగా బోధింపగల వనుకొందును.”

‘చక్కగానే బోధింపగలను. కాని నాకొకసందేహము వచ్చుచున్నది. డచ్చివారు ఆంగ్లభాషను నేర్చుకొనుట కిచ్చగింతురా? వారందులకు ఆతురపడుచున్నారా?’ అని నేనంటిని.

‘ఆంగ్లభాషను నేర్చుకోవలయునని వారెంతయు నాతురపడుచున్నారు. ఇతరపనులుగూడ మానుకొని ఆభాషను నేర్చుకొందురు. ఈవిషయమున నీవు సందేహపడవలసిన అవసర మేమియు లేదు’ అని అతడు నమ్మబలికెను.

అంతట నేనతని సూచనకు అంగీకరించితిని. డచ్చివారికి ఆంగ్లభాషను నేర్పి డబ్బు సంపాదింపవలయునను నుద్దేశ్యముతో నేను మఱునాడు కెప్టెను నావలో ప్రవేశించితిని.

వాతావరణము మాకెంతయు అనుకూలముగనుండెను. ప్రయాణము చేయవలసిన దూరముగూడ తక్కువే. అందువలన మానావ చాల కొద్దికాలములో ఆమ్‌స్టర్‌డామ్ నగరమును చేరుకొనెను. ఆకసమునుండి క్రిందపడినట్లు నేను ఆమ్‌స్టర్‌డామ్ నగరవీధులలో నుంటిని.

ఇక నొక్కటే మిషమైనను ఆమ్‌స్టర్‌డామ్ వీధులలో

నిరుద్యోగిగ తిరుగరాదనియు, డచ్చివారికి ఆంగ్లభాషనుబోధించి డబ్బు సంపాదింపవలయుననియు నిశ్చయించుకొంటిని. త్రోవలో కొంచెము గొప్పవారివలె కనబడిన ఇరువురు మువ్వురు డచ్చి వారితో మాట్లాడుటకు ప్రయత్నించితిని. నాకు డచ్చిభాష రాదు; వారికి ఆంగ్లభాషరాదు. అందువలన నామాటలు వాని కర్థమగుట లేదు. వారిమాటలు నాకు అర్థమగుట లేదు. అప్పుడు నాకు జ్ఞానోదయమయ్యెను. నాకొక ముఖ్యమగు విషయము అర్థమయ్యెను. డచ్చివారికి ఆంగ్లభాషను నేర్పవలయునన్నచో నేను ముందు డచ్చిభాషను నేర్చుకోవలసియున్నది. ఇంత స్వల్ప విషయమును నే నంతకుముందు మఱచిపోవుట ఎట్లుతటస్థించెనో నాకు ఆశ్చర్యముగనుండెను. ఆవిషయమును మఱచిపోయినాన్న మాటమాత్రము నిజము. ఆవిధముగా డచ్చివారికి ఆంగ్లభాషను నేర్పి డబ్బు సంపాదింపవలయునన్న ప్రణాళిక బుద్బుదప్రాయ మయ్యెను.

ఇకనేను ఆమ్‌స్టర్ డామ్‌లోనుండి చేయవలసిన దేదియు లేదు. అందువలన నేను తిరిగి ఇంగ్లండుకు ప్రయాణమై పోదలచి తిని కాని నాకంతలో లూవెయిన్ విశ్వ విద్యాలయమునుండి వచ్చుచున్న ఐరిష్ విద్యార్థియొకడు పరిచయమయ్యెను. మేము అనేక విషయములనుగూర్చి మాట్లాడితిమి. సందర్భ వశమున సారస్వతమునుగూర్చిగూడ మాట్లాడితిమి. సారస్వతమునుగూర్చి మాట్లాడుట యనిన నాకెంతయు నిష్టము. అట్టి సమయములందు నేను తక్కువ స్థితిలోనున్నానను విషయమునుగూడ మఱచిపోవు చుందును. లూవెయిన్ విశ్వ విద్యాలయములో గ్రీకు భాషను బోధింప గలవారు ఇరువుర్రైనను లేరని ఐరిష్ విద్యార్థి నాకు

తెలిపియుండెను. అప్పుడది నాకు ఎంతో ఆశ్చర్యమును కలిగించెను. ఆశను జనింపజేసెను. నేను లూవెయిన్‌కు పయనమైపోయి అచ్చటివారికి గ్రీకు భాషనునేర్పి డబ్బు సంపాదింప వలయునని నిశ్చయించుకొంటిని. ఆ నిశ్చయమును నేను ఐరిష్ విద్యార్థికి తెలిపితిని. అతడు నా యభిప్రాయమును గట్టిగా సమర్థించెను. గ్రీకు భాషనునేర్పి అపారమగు ధనమును సంపాదింప వచ్చునని అతడు గట్టిగా నమ్మబలికెను.

మఱునాటి యుదయమున నేను కడుధైర్య సాహసములతో లూవెయిన్‌కు బయలుదేఱి పోతిని. రోజులు గడచుచున్న కొలది నాసామానులు తగ్గిపోవు చుండెను. అసలుసగము సామానులు ఆమ్‌స్టర్‌డామ్ చేరుకొను నప్పటికే తగ్గిపోయి యుండెను. లూవెయిన్ చేరుకొను నప్పటికి మిగిలినవానిలో చాలభాగము వ్యయమై పోయెను.

నేను లూవెయిన్ విశ్వ విద్యాలయలో ప్రవేశించితిని. మామూలు ప్రొఫెసర్లను కలసి కొనుటకంటె ప్రిన్సిపాలును కలసికొనుటయే మేలని ఎంచితిని. ఆ యుద్దేశ్యముతో నేను తిన్నగా ప్రిన్సిపాలు కార్యాలయమువద్దకు పోయి నారాకనుగూర్చి అతనికి కబురు పంపితిని. ఒక సేవకుడు నన్నులోనికి తీసికొని పోయెను.

'మీరువచ్చిన పనిఏమి?' అని ప్రిన్సిపాలు ప్రశ్నించెను.

'మీ విశ్వ విద్యాలయములో గ్రీకుభాషను బోధించువారు తగినంతమంది లేరని విన్నాను. అందువలన గ్రీకుభాష నిచ్చటివారికి బోధింప వలయునను సదుద్దేశ్యముతో నేనిచ్చటకు

వచ్చియున్నాను. నేనా భాషలో గొప్ప పండితుడను' అని అంటిని.

ప్రిన్సిపాలు మొదట నా సామర్థ్యమును సందేహించి నట్లు కనబడెను. అంతట నేను అతనితో ఇట్లంటిని: 'అయ్యా! నాకు గ్రీకుభాషయందుగల పాండిత్యమును మీ యిష్టమువచ్చి నట్లు పరీక్షింప వచ్చును. అందుకు నాకెట్టి అభ్యంతరము లేదు. ఏ గ్రీకు రచననైనను లాటినులోనికి తర్జుమాచేసి చూపగలను.'

నా చిత్తశుద్ధిని గ్రహించిన ప్రిన్సిపాలు ఇట్లనెను: యువకుడా! నన్ను చూడుము. నే నెన్నడును గ్రీకుభాషను నేర్చుకొని యుండలేదు. దానిని నేర్చుకొనవలెనని యింతవఱకు నాకు కనబడుటలేదు. నేను ఏమాత్రము విచారించుటలేదు. గ్రీకుభాషను నేర్చుకొనకుండగనే నేను డాక్టరు పట్టమును పొందినాను. గ్రీకు భాషను నేర్చుకొనకుండగనే నేను సంవత్సరమునకు పదివేల ఫ్లారినుల ధనమును సంపాదించినాను. గ్రీకు భాషను నేర్చుకోకుండగనే నేను సంతోషముతో కడుపు నిండ తినుచున్నాను. ఇన్నిమాట లెందులకు ? నాకు గ్రీకు భాషరాదు. ఆ భాషలో ఏదేని మంచి యున్నదని నేను నమ్మను. తరువాత నా యిష్టము!"

ఆ విధముగ నేను లూవెయిన్ విశ్వవిద్యాలయములో కూడ ఆశాభంగము చెందితిని. నే నింక ఇంటికి తిరిగిపోవుట కిచ్చగింపకుంటిని ఏలయన నేనప్పటికి ఇంటినుండి చాలదూరము వచ్చియుంటిని. నేనింకముందుకే సాగిపోవలయునని నిశ్చయించు కొంటిని.

నాకు సంగీతము బాగుగ వచ్చును. ఒకవిధముగా నా గొంతుకూడ మంచిదే. అంతవఱకు నేను సరదాగా పాటలు

పాడుకొనుచుండెడివాడను. కాని యిప్పుడు అజ్ఞానము నుపయోగించి జీవన భృతిని సంపాదించుకొనవలయునని నిశ్చయించుకొంటిని. నేను అమాయకులగు ఫ్లాండర్సు రైతులవద్ద పాటలు పాడసాగితిని. బీదవారగు ఫ్రెంచివారివద్దగూడ పాటలు పాడసాగితిని. వారే ఎక్కువగా నా పాటలను విని ఆనందింపగలుగుచుండెడివారు.

చీకటిపడు నప్పటికి నేనొక బీదరైతు ఇంటికి పోయెడివాడను. నాకు ఎక్కువ ఇష్టమైన పాటలను పాడుచుండెడివాడను. అప్పుడా యింటిలోని వారు నాకు భోజనము పెట్టెడివారు; ఆరాత్రి పరుండుట కాశ్రయము నొసగెడివారు; మఱునాటికి సరిపడు ఆహార పదార్థములనుగూడ నొసగెడి వారు.

నేను ఒకటి రెండుసార్లు ధనికులముందు పాటలు పాడుటకు ప్రయత్నించితిని. కాని వారికి నాపాట లేమాత్రము నచ్చకుండెను. వారు నాకు ఒక్క చిల్లిగవ్వనైనను బహూకరింపకుండిరి. అది నాకు చాల అసాధారణమైన పరిస్థితిగా కనబడెను. ఏలయన నేను మంచి స్థితిలో నున్నప్పుడు గౌరవనీయుల ముందు సరదాకు పాటలు పాడుచుండెడివాడను; అప్పుడంద ఱును నన్ను పరిపరివిధముల ప్రశంసించుచుండెడివారు. ముఖ్యముగా యువకులు నన్నెంతగా ప్రశంసించుచుండెడి వారో వర్ణించి చెప్పజాలను; కాని యిప్పుడు సంగీతము నాధారముగా చేసికొని జీవించుచున్నాను. ఇప్పుడు నాకు భోజనము పెట్టుచున్నదది యొక్కటి మాత్రమే. ఈ ప్రపంచమున మానవుల పరిస్థితి ఇట్లున్నది. ఎవ్వరైన ఒక కళను ఆధారము చేసికొని జీవించుచున్నచో, పెద్ద మనుష్యుల మనుకొనువారు ఆ కళా

వారుని నైపుణ్యమును దూషింతురేగాని భూషింపరు. ఇది కడుంగడు శోచనీయమైన విషయము.

ఆ విధముగా పొట్ట పోషించుకొనుచు నేను పారిసు నగరము వంకకు పోవుచుంటిని. ఆ మహానగరమునకు పోవుటలో నాకు ప్రత్యేక యుద్దేశ్యమేదియు లేదు. నేను మామూలుధోరణి లోనే అచ్చటకు పోవుచుంటిని. పారిసు నగరవాసులకు ధనికులగు క్రొత్తవారనిన ఇష్టమే. తెలివి తేటలుగల క్రొత్తవారిని. వారు ఆదరింపరు. నాకు ధనము లేదు. నా తెలివితేటల నితరులు మెచ్చు కొందురో లేదో తెలియదు.

నేను పారిసు మహానగరములో నాల్కైదురోజులు అటు నిటునడచితిని. నేను మంచి మంచి గృహముల బాహ్యాభాగము లను మాత్రనే చూచితిని. నన్నానగరములో ఆదరించువారెవ్వ రును కనబడరైరి. అచ్చట ధనమున్నగాని జీవించుటకువీలు లేదు. అందువలన నే నా నగరమును విడిచిపెట్టి పోవలయునని నిశ్చ యించుకొంటిని.

అంతలో నాకొక ముఖ్యమైన వీధిలో నన్ను లండను మహానగరములో గ్రంథకర్తృత్వమునకు ప్రోత్సహించిన బంధు వొకడు కనబడెను అతని నచ్చట కలిసికొగలిగినందుకు నే నెంతయు సంతసింపసాగితిని. నన్ను కలిసికొన్నందు కతడు బాధ పడుట లేదని తలచితిని.

'నీవు పారిసు మహానగరమునకు వచ్చుటకుగల కారణ మేమి?' అని అతడు నన్ను ప్రశ్నించెను.

జరిగినవిషయమునంతను అతనికి తెలిపితిని. అతడు పారిసు నగరమునకు వచ్చుటగల కారణములను తెలిసికొనగోరితిని.

'నేనిచ్చట కొక వ్యాపారముపై వచ్చినాను. చిత్రకళా ఖండములు, పతకములు, పురాతనవస్తువులు మున్నగువానిని లండనులోని ఒక గౌరవనీయునికి కొనుటకై ఇచ్చటకువచ్చి యున్నాను. ఆ గౌరవనీయునకు ఇటీవలనే అపారమగు ధనము లభించినది. అందువలననే అతని కీబుద్ధి పుట్టినది' అని అతడు చెప్పెను.

తన కా సంగతి ఏదియు తెలియదని అతడిదివఱకు నా కెన్నోసార్లు చెప్పియుండెను. అట్టివాడిప్పుడు అదేపనిలో నిమగ్నుడై యున్నాడని తెలిసికొని ఎంతయు ఆశ్చర్యపడితిని.

'నీ కీ విషయమున చెప్పుకోదగినంత జ్ఞానమేదియు లేదు కదా! మఱి నీ కీ యుద్యోగ మెట్లిచ్చినారు? నీ వెట్లు విజయమును సాధించినావు?' అని ప్రశ్నించితిని.

'ఇది ఏమంత బ్రహ్మవిద్య కాదు. దీనిని నేర్చుకొనుట చాల సులభమైన విషయము. అయితే ఇందు పరమరహస్య మొకటి యున్నది. రెండు సూత్రములను జ్ఞాపకముంచుకొన్న చాలును. ఏ చిత్రమును చూచినను చిత్రకారుడు మఱికొంచెము శ్రమ తీసికొనియుండినచో మంచి చిత్రము తయారై యుండెడిదనుట మొదటి సూత్రము, ప్రిట్టో పెరూజినో చిత్రములను ప్రశంసించుట రెండవసూత్రము. ఒకప్పుడు నేను నీకు లండనునగరములో గ్రంథకర్తగా ఎట్లు తయారుకావలెనో నేర్పినాను. ఇప్పుడు నేను నీకు పారిసునగరములో చిత్రములు మున్నగువానిని కొను విధానమును నేర్పెదను' అని అతడనెను.

అతడు చెప్పినమాటలకు నేనుసంతోషంతో అంగీకారము తెలిపితిని. ఏదోవిధముగా డబ్బుసంపాదించి జీవించుటయే

నా జీవిత ధ్యేయముగానుండెను. అందువలన నేను అతని బసకు పోతిని. అచ్చట అతని సాహాయ్యముతో నాదుస్తులను మార్చు కొంటిని. కొంతసేపైనతరువాత అతనితో కలసి చిత్తరువులను వేలామువేయు ప్రదేశమునకు పోతిని. గౌరవనీయులగు ఆంగ్లేయు లచ్చటికే వచ్చి చిత్తరువులను కొనుచుందురు.

నాబంధువు ఎంతో గొప్పవారితో చాల చనువుగా మాట్లాడసాగెను. వారుకూడ అతనితో మాట్లాడసాగిరి. వారు ఏదేని చిత్తరువును కొనవలయునన్నను, పతకమును కొన వలయునన్నను, పురాతన వస్తువును కొనవలయునన్నను, అత నినే సలహా అడుగుచుండిరి. అతని సలహాల ప్రకారమే చేయు చుండిరి వారి కతని సలహాలలో నెట్టి లోపమును కనబడకుండెను. అతడు లోపరహితుడనియే భావించుచుండిరి. అది యంతయు నాకు అత్యాశ్చర్యమును కలుగజేయసాగెను.

ఆ సందర్భములలో నతడు నాసాహాయ్యమును చక్కగా నుపయోగించుకొనెను. ఎవ్వరైన అతని అభిప్రాయము నడిగి నపుడు అతడెంతో గంభీరముగా నన్ను ప్రక్కకు తీసికొని పోయి నా అభిప్రాయము నడిగెడివాడు; భుజము లాడించెడి వాడు; క్రొత్త విషయము తెలిసికొన్నట్లు నటించెడివాడు. తిరిగివచ్చి, 'ఇది చాల ముఖ్యమైన విషయము. అందువలన నేను బాగుగ ఆలోచించి అభిప్రాయము చెప్పవలసి వచ్చినది' అని యనెడివాడు. ఒక్కొక్కప్పుడతడు కొన్ని చిత్తరువుల రంగులను ప్రక్కనేయున్న కుంచెతో సవరించి, 'ఇప్పుడు చిత్త రువు బాగుపడినది' అని అనుచుండెడివాడు.

పారిసు నగరమున నా బంధువు పని పూర్తి అయ్యెను.

అతఁడింక లండను నగరమునకు తిరిగిపోవలసి యుండెను. అప్పు డతడు నన్ను కొందఱు గౌరవనీయులకు పరిచయము చేసెను; వారి ముందతడు నా శక్తి సామర్థ్యముల నెంతగానో ప్రశం సించెను.

నా బంధువు సిఫారసునుబట్టి నన్నొక గౌరవనీయుడు తన కుమారునకు గవర్నరుగా నియమించుకొనెను. మేమిరువు రము యూరపు ఖండములో సంచారము చేయసాగితిమి. డబ్బు వ్యవహారములలో నా శిష్యుడు నాకంటె పది ఆకులు ఎక్కువ చదివినవాడు. అతడు రెండు లక్షల పౌనుల ఆస్తికి వారసుడు. అతనికా ఆస్తిని వెస్టుఇండీసులోని బంధువొకడు ఇచ్చియుండెను. కాని అతని కెంకను సంపాదింపవలెనను వాంఛ జనించెను. అతడువట్టి పిసినిగొట్టు గూడ అతడెప్పుడును నన్ను డబ్బు నిలువ జేయు విధానములను గూర్చియే ప్రశ్నించు చుండెడివాడు. తక్కువ ఖర్చుతో ప్రయాణముచేయు విధమును గూర్చి అడి గెడివాడు. 'ఇచ్చట చవుకగాకొని లండను నగరములో ఎక్కువ వెలకు అమ్ముటకు వీలైన వస్తువులేవి?' అని అడుగు చుండెడి వాడు. ఉచితముగా చూడ నిచ్చెడి వింతల నతడు చూచుచుం డెడివాడు. డబ్బు ఈయవలసి వచ్చినపుడు, 'ఇవి ఏమంత చూడ దగినవి కావని నాకు తెలిసినవారు చెప్పినారు' అని అనెడి వాడు.

ఎవ్వరికైన డబ్బు ఈయవలసివచ్చి నపుడు, 'ప్రయా ణము ఎంత డబ్బు ఖర్చుతో కూడినదో!' అని అనకుండ డబ్బు ఇచ్చెడి వాడుకాడు. అప్పటి కతని వయస్సు ఇరువది యొకటి మాత్రమే. ఇరువది యొక్క సంవత్సరము లింకను నిండనే లేదు.

ఒకనాడు మేమిరువురము లెగ్‌హార్న్ నగరమునకు వచ్చితిమి. నడచిపోయి రేవు ప్రాంతమును చేరుకొంటిమి. 'సముద్ర మార్గమున ఇంగ్లండుకు ప్రయాణముచేసినచో ఖర్చు ఎంత అగును?' అని అతడచ్చటి వారిని ప్రశ్నించెను. 'ఖర్చు ఏ మాత్రము లెక్కలోనిదికాదు. భూ మార్గమున ప్రయాణము చేసినచో చాల ఖర్చగును' అని అచ్చటి వారతనికి సమాధానము చెప్పియుండిరి. అందువలన నతడు సముద్ర మార్గముననే ప్రయాణముచేయ దలచెను. అందువలన నతడు నాకప్పటి కీయవలసిన జీతము నిచ్చివైచెను. ఒక సేవకునితో కలసి లండను మహానగరమునకు పయనమై పోయెను.

అందువలన నేను మఱియొకసారి విశాల ప్రపంచముపై నాధారపడవలసిన పరిస్థితి ఏర్పడెను. కాని నాకది ఏమియు క్రొత్త కాదు. నే నందుకు అలవాటుపడి యుంటిని. ఆ ప్రాంతములోని వారందఱు సంగీతమున గొప్ప ప్రవీణులు. అందువలన నేను నా సంగీత జ్ఞానము నుపయోగించి జీవిత భృతి సంపాదించు కొనుటకు వీలులేకుండెను. కాని నేను అప్పటికి మఱియొక విద్య యందు ప్రావీణ్యము సంపాదించి యుంటిని. తర్కమున నేను గొప్ప నైపుణ్యము సంపాదించి యుంటిని. ఆ ప్రాంతములో తర్కశాస్త్ర ప్రవీణులకు మంచి గౌరవముండెను. నేను నా నైపుణ్యము నుపయోగించి జీవనభృతిని సంపాదించుకొంటిని. ఎట్టకేలకు నేను ఇంగ్లండు దేశమును చేరుకొంటిని.

ఇంగ్లండులో నాకు నాటక సంఘమువారితో పరిచయము మేర్పడెను. నేను వారితో తిరుగుచు చిల్లర వేషములను వేయసాగితిని. చివరకు నాకు వారు హాలేషియో వేషము నిచ్చినారు.

కాని నేను నటించుటకు వీలుకలిగినది కాదు. నాతండ్రిని చూడగనే శిలాప్రతిమవలె నైపోయినాను. తరువాత తెరవెనుకకు పోయినాను. పిమ్మట నేను ఇచ్చటకు రప్పింప బడినాను. ఇది నా కథ."

## 21

మఱునాటి మధ్యాహ్నము మే మందఱము భోజనములు ముగించి కులాసాగా కబుర్లు చెప్పుకొను చుంటిమి. అంతలో కొందఱు సేవకులు తార్న్‌హిల్ సామానును తీసికొని అచ్చటకు వచ్చిరి. ఆ సామానులను చూడగానే నామిత్రుడైన బట్లరునన్ను సమీపించి నాచెవిలో తననోరుపెట్టి మెల్లన నిట్లుచెప్పెను: "తార్న్‌హిల్ విన్మెట్‌కన్యను ప్రేమించు చున్నాడు. ఆమెను పొందగలయునని ఆశించు చున్నాడు. ఆర్నాల్డు దంపతులు వారి కిరువురకు వివాహము చేసినబాగుండునని అనుకొను చున్నారు."

మఱికొంత సేపటికి తార్న్‌హిల్ లోనికివచ్చెను. అతడు నన్ను, నా కుమారుని చూడగానే కొంచెము వెనుకంజ వేసినట్లు కనబడెను. మమ్మొక్రొత్తవారియింట చూచుట కతడాశ్చర్య పడినాడని నే ననుకొంటిని. అంతియకాని మమ్ము చూచుట కతడు ఇష్టపడుటలేదని నేను అనుకోలేదు.

మే మిరువురము ముందుబోయి అతనికి నమస్కరించితిమి. అతడు ఏమాత్రము కాపట్యములేని వానివలె మాకు ప్రతి నమస్కారము చేసెను.

తేనీరు సేవించిన తరువాత తార్న్‌హిల్ నన్ను ప్రక్కకు

పిలిచి. "మీ అమ్మాయి సంగతి ఏమైన తెలిసినదా?" అని ప్రశ్నించెను.

"నేను ఎంతో ప్రయత్నించినాను. కాని సఫలీకృత మనోరథుడను కాలేక పోయినాను" అని అంటిని.

అంతట నతడు ఎంతో ఆశ్చర్యమును ప్రకటించి ఇట్లనెను:

"మీరు ఇల్లువీడి బయలుదేఱినతరువాత నేను తఱచుగా మీయింటికి పోసాగినాను. మీ కుటుంబమువారిని ఓదార్ప సాగినాను. వారందఱును నిప్పుడు బాగుగనేయున్నారు. అన్నట్లు అడుగ మఱచినాను. మీ అమ్మాయి సంగతి విల్మొట్ కన్యకు కాని, మీ కుమారుడు జార్జికిగాని తెలియజేసినారా?"

"నేను వారి కింతవఱకు చెప్పియుండలేదు" అని నేనంటిని.

"మీరు చాల మంచి పని చేసినారని చెప్పవలసియున్నది. మీరు ముందుచూపుతో చేసినపనికి నేను మిమ్ములనెంతయు అభినందించుచున్నాను. మీరు మీ అమ్మాయికి సంబంధించిన విషయమును చాల రహస్యముగనుంచుట అంతఱకు చాల శ్రేయస్కరమని హెచ్చరించుచున్నవాడను. ఏలయన మీకు అపకీర్తిని కలిగించువిషయమును మీరే చాటించుకొనుట అసమంజసముగ నుండునుగదా! అదియునుగాక లిపీ మనమందఱము అనుకొనుచున్నంత నేరమును చేసియుండకపోవచ్చును" అని అతడనెను.

అంతలో నచ్చటకొక స్నేహితుడు వచ్చి, "మిమ్ము నాట్యమునకు పిలుచుచున్నారు" అని యనెను. అంతట తార్న్‌హిల్ ఆ ప్రదేశమును వీడిపోయెను. మా మంచిచెడ్డలను కనుగొనుచున్నందుకు అతడనిన నాకు సదభిప్రాయము కలిగెను.

కాని అతడు విల్మట్‌కన్యతో మాట్లాడుచున్న తీరును బట్టి అత డామెను ప్రేమించుచున్నట్లు స్పష్టపడుచుండెను. కాని ఆమె మాత్ర మతనికి ప్రోత్సాహము నీయకుండెను. ఆమె అతనిని సహించుచుండెను. ఆర్నాల్డు సతిని సంతృప్తిపఱచుటకే ఆమె అట్లు చేయుచుండెనని నేను గ్రహింపగలిగితిని. దురదృష్ట వంతుడగు నాకుమారునిపై ఆమె చల్లనిచూపులనుగూడ పఱుపు చుండుటను నేను చూచితిని. అది నాకెంతయు సంతోషమును కలుగ జేయుచుండెను. విల్మట్‌కన్య ధనికుడగు తార్న్‌హిల్‌ను ప్రోత్సహించుటలేదు; బీదవాడగు నా కుమారుని ప్రేమించు చున్నది, ఇది నాకు సంతోషకారణముకాదామఱి? తార్న్‌హిల్ మాత్రము ఏమియు ఎఱుగనివానివలె, ఏమియు చలింపనివాని వలె సంచరించుచుండెను. అది నాకు ఎంతయు ఆశ్చర్యకరముగ నుండెను.

ఆర్నాల్డు గట్టిగా బతిమాలుకొనుటవలన నేమచ్చోట ఒక వారముదినము లుంటిమి. రోజులు గడచుచున్నకొలది విల్మట్‌కన్య నా కుమారుని ఎక్కువ అభిమానముతో చూడ సాగెను. ఆమెకు నా కుమారునిపట్ల అభిమానము హెచ్చుచున్న కొలది తార్న్‌హిల్ కూడ అతనితో ఎక్కువ స్నేహము చేయ సాగెను.

తార్న్‌హిల్ ఇదివఱకు మా కుటుంబమువారి కందఱకు ఎన్నో ఉపకారములు చేయుదునని వాగ్దానముచేసి యుండెను. కాని యీసారి అతని ఔదార్యము వాగ్దానములు చేయుటతో ఆగలేదు.

నేను ఇంటికి బయలుదేఱి పోవలసిన సమయమువచ్చెను.

నాటి యుదమున తార్న్‌హిల్ ఆనందమును, సంతృప్తిని వెలి పుచ్చు చూపులతో నావద్దకువచ్చి ఇట్లనెను: "అయ్యా! నేను నా మిత్రుడు జార్జికి కొంచెము సేవచేయగలిగినందుల కెంతయు గర్వించుచున్నాను; సంతసించుచున్నాను. అదివమో తెలియునా? పశ్చిమ ఇండియా దీవులకు పోవుచున్న సైనికదళములలో నొక దానిలో పెద్దయుద్యోగము నిప్పించినాను. ఇందుకుగాను ఇవ్వ వలసినవారికి వందపౌనులుమాత్రమే ఈయవలెను. నా పేరు ప్రతిష్ఠ నుపయోగించి ఇంకను ఈయవలసిన రెండువందలపౌనులు ఈయవలసిన అవసరం లేకుండచేసినాను. నేనుచేసిన ఈచిన్న సాహాయ్యమునకు మీవద్దనుండి ప్రతిఫలమేమియు ఆశించుట లేదు. నా స్నేహితునకు సాహాయ్యము చేయగలిగినను ఆనందము, సంతృప్తి నాకు చాలును. మీ రిప్పుడు వందపౌనులు ఈయ గలరా? మీ వద్ద సొమ్ము లేకపోయినచో నేను ఇత్తును. తరు వాత మీరు నాకు ఈయవచ్చును."

తార్న్‌హిల్ మాటలకు నే నెంతయు సంతసించితిని; అతనికి నా కృతజ్ఞత తెలియజేయుటకు మాటలుచాలకుండెను. వెంటనే నే నతనికి ప్రామిసరీనోటు వ్రాసియిచ్చితిని. అతడు మాకు నూఱుపౌనులు ఉచితముగా ఇచ్చినంతగా కృతజ్ఞతను ప్రకటించితిని.

తార్న్‌హిల్ నా కుమారుడు జార్జికి ఇట్లు చెప్పియుం డెను: "నీవు ఉద్యోగముపొందుటకు త్వరలో లండను నగరమునకు బయలుదేఱిపోవలయును. ఏలయన నీ వచ్చుటకు సాధ్యమైనంత త్వరలో పోనిచో మఱియొకరు ఎక్కువ మొత్తమును చెల్లించి

ఆ యుద్యోగములో ప్రవేశింపవచ్చును." జార్జి అంపల కంగీక రించెను.

మఱునాటి యుదయమున జార్జి లండను మహానగరము నకు పయనమైపోవుటకు సిద్ధపడెను. అతడు మమ్ము వీడిపోవు చున్నందుకు ఏమాత్రము విచారించుచున్నట్లు లేకుండెను. మేము మాత్రము విచారింపసాగితిమి. తన్ను ప్రేమించుచున్న విల్మట్ కన్యను వీడిపోవుచున్నానను అభిప్రాయము జార్జికి కలిగినట్లు లేకుండెను. అందరివద్ద సెలవుతీసికొన్న తరువాత జార్జి నావద్దకు వచ్చెను. అతని కిచ్చుటకు నావద్ద ధన మేమియు లేదు. అందు వలన నేను అతనిని ఆశీర్వదించితిని.

"అబ్బాయి! నీ విప్పుడు నీ దేశముతరఫున పోరాడుటకై పోవుచున్నావు. ఇది సామాన్యమైన విషయముకాదు. నీ తాత గారి కాలమున రాజభక్తి గొప్ప సుగుణముగా పరిగణింపబడు చుండెడిది. నీ తాతగారు రాజుగారి తరఫున ఎంత ధైర్యముగ పోట్లాడినారో జ్ఞాపకము తెచ్చుకొనుము. అబ్బాయి, నీవు పోయి నీ తాతగారివలెనే యుద్ధముచేసి పేరు ప్రతిష్ఠలను సంపా దింపుము. భగవంతుడు నీకు మేలుచేయును. యుద్ధరంగమున నీవు మరణించుట తటస్థించినచో నీవు తప్పక వీరస్వర్గమును చేరుకోగలవు."

తరువాత జార్జి నన్ను వీడిపోయెను.

మఱునాటి యుదయమున నేనుగూడ ప్రయాణమునకు సిద్ధపడితిని. అంతకాలమున నన్ను గౌరవ మర్యాదలతోను ప్రేమతోను ఆదరించిన ఆర్నాల్డు దంపతులకు నా కృతజ్ఞతను తెలియజేసితిని. ఇటీవల నా కుమారుడు జార్జికి ఉపకారముచేసిన

తార్న్‌హిల్‌కుగూడ నా కృతజ్ఞతను తెలియజేసితిని. అంవటివద్ద సెలవుతీసికొని ఇంటిదిక్కుకు బయలుదేఱితిని.

ఇక నా కూతురు ఒలీవియా నాకు కనబడునను ఆశ లేకుండుటవలననే నేను ఇంటివంకకు పోవుచుంటిని. "ఓయి భగవానుడా! అంతయు నీదే భారము! నా కొమార్తెను క్షమింపుము! రక్షింపుము!" అని యని ఒక్క వేయిసార్లు వ్వుచ్చితిని. అన్నట్లు చెప్పమఱచితిని. నా శరీరము బలహీనముగ నుండుటవలన నేను గుఱ్ఱముపై ప్రయాణము చేయుచుంటిని. ఎట్టకేలకు నేను మాయింటికి ఇరువదిమైళ్ళ దూరముననున్న యొక ప్రదేశమును చేరుకొంటిని. అనతికాలములోనే నాకు ప్రియమైన మా కుటుంబమువారిని చూడ నవకాశము కలుగునని సంతసింపసాగితిని.

కాని, రాత్రి సమీపించుచున్నది. అందువలన రాత్రి కెచ్చటనైన విశ్రాంతితీసికొన దలచి బాటకు ప్రక్కనే యున్న ఒక పూటకూళ్ళయింటిలో ప్రవేశించితిని. "నాతో కలసి మీరు సారాయమును సేవింపవలయును" అని నేను ఆ ఇంటి యజమానునితో నంటిని. అందుల కతడు దయతో నంగీకరించెను. మే మిరువురము ఆ యింటిలోనికెల్ల మంచి గదియగు వంటగదిలోని కుంపటిముందు కూర్చుండి సారాయమును సేవింపసాగితిమి. దానిని సేవించుచు మేము రాజకీయ విషయములను గూర్చియు, దేశ పరిస్థితులనుగూర్చియు మాట్లాడుకొనసాగితిమి. అనేక విషయములతోబాటు తార్న్‌హిల్ విషయముగూడ ప్రస్తావనకు వచ్చెను.

తార్న్‌హిల్‌నుగుఱించి పూటకూళ్ళఇంటి యజమానుడు

ఇట్లు చెప్పెను: "తార్న్‌హిల్‌ను అందఱును ద్వేషించుచున్నారు; అసహ్యించుకొనుచున్నారు. అతని పినతండ్రి సర్ విలియమ్ తార్న్‌హిల్‌నుమాత్ర మందఱును ప్రేమించుచున్నారు. తార్న్‌హిల్ ఎంత దుర్మార్గుడో తెలియునా? తన్ను ఇంటిలోనికి రానిచ్చిన గౌరవనీయు లందఱి అమ్మాయిలను అతడు పాడు చేయును. వారిని దొంగతనముగా తీసికొనిపోయి రెండు మూడు వారము లనుభవించి తఱిమివేయును."

అంతలో నచ్చటకు యజమానుని భార్య వచ్చెను. ఆమె అంతకుమునుపు చిల్లర మార్చుకొనివచ్చుటకై ఎచ్చటికో పోయి యుండెను. తన భర్త నాతోబాటు సారాయమును సేవించు చున్న విషయము నామె గ్రహించెను. తనకు పాలీయ లేదని ఆమె ఎంతయు ఆగ్రహించెను.

అందువలన నామె భర్తతో నిట్లనెను: "ఇచ్చట నేమి చేయుచున్నావు?"

"నీ ఆరోగ్యముకొఱకు పానీయమును సేవించుచున్నాను" అని యజమానుడనెను.

అంతట యజమానురాలు కుపితురాలై ఇట్లనెను: "ఏమేమీ! నీవు నన్ను నీ యిష్టమువచ్చినట్లు ఉపయోగించు కొనుచున్నావు. ఈ పరిస్థితి నింక నే నేమాత్రమును సహింప జాలను. వ్యాపారములో మూడువంతుల పనిని నేను చేయు చుందును. నాలుగవవంతు పని అట్లేయుండును. నీవు చేయునది మాత్రము ఏమియు లేదు. ఇంటికి వచ్చినవారితో నెల్ల కలసి త్రాగుచు సారాయములో మునిగి తేలుచుందువు. నే నెప్పు డును ఒక గుక్కెడైనను సేవింపను.

ఆమె మాటలనుబట్టి ఆమె కోరిక ఏమో నాకు బాగుగ నర్థమయ్యెను. అందువలననే నామెకు వెంటనే గ్లాసెడు సారాయమునొసగితిని. ఆమె ఎంతో సంతోషముతో దానిని సేవించుచు నిట్లనెను: "దీనిని నేను మీ ఆరోగ్యముకొఱకు సేవించుచున్నాను. నే నీ సారాయము కొఱకు కోపమును ప్రకటింపలేను. నాభర్త యీ విధముగా వచ్చినవారితోనెల్ల కలసి త్రాగుచు కబుర్లు చెప్పుకొనుచు కూర్చుండిన వ్యాపారమంతయు నేమైపోవును? అతిథు లందఱును డబ్బీయకుండ వెళ్ళిపోయినచో భారమంతయు నాపై పడును. ఇతడు మాత్రమేమియు మాట్లాడడు. ఎంతకాలమని మేము నష్ట వ్యాపారము చేయగలము?

మా మేడమీద నొక యువతి బసచేసి యున్నది. ఆమె ప్రవర్తననుబట్టి చూడగా ఆమెవద్ద ఒకచిల్లి గవ్వయైనను లేదని నాకు గట్టిగా నమ్మకము కలుగుచున్నది. ఆమె ఇంతవఱకు డబ్బేమియు నీయలేదు. వెంటనే డబ్బు ఈయవలయునని ఆమెను తొందఱ పెట్టుట చాల అవసరము."

"ఇప్పుడు చెప్పవలసినంత తొందఱ ఏమివచ్చినది? ఆమె తప్పక యిచ్చునను టకు సందేహ మేమియును లేదు" అని యజమానుడ నెను.

"నాకా సంగతి ఏమియు తెలియదు. ఆమె ఇచ్చట సుమారు పదునేను దినములనుండి యున్నది. ఆమెవద్ద డబ్బుండు చిహ్నములేవియు ఇంతవఱకు నాకు కనబడలేదు" అని యజమానురాలనగా యజమానుడిట్లనెను: "ఆమె ఈయవలసిన సొమ్మునంతను ఒక్క మొత్తముగా ఇచ్చివేయు ననుకొందును."

"ఒక్క మొత్తము! అవునవును, ఆమె ఇచ్చిననేమి?

ఈయక పోయిననేమి? ఆమెను ఈరాత్రికే బయటకు గెంటివేయ వలయునని నిశ్చయించుకొన్నాను” అని యజమానురాలనెను.

అంతట యజమానుడిట్లనెను: “నీవా విషయమున ఏమాత్రము తొందఱ పడరాదు. ఆలోచించి నిధానముగ పనిచేయ వలయును. ఆమె గౌరవ కుటుంబమునకు చెందిన యువతి అందు వలన మన మామెను సముచితముగ గౌరవింపవలయును.”

“ఆమె గౌరవ కుటుంబమునకు చెందిననేమి? చెందక పోయిననేమి? నాకు కావలసినది డబ్బు! డబ్బు ఈయకపోయిన తరువాత ఆమె గౌరవ మెవరికి కావలయును? డబ్బు ఈయలేని వారు గౌరవ కుటుంబమునకు చెందిన వారెట్లగుదురు?” అని యజమానురాలు మేడపైకి పరుగెత్తుకొని పోయెను.

పైకిపోయిన యజమానురాలు గట్టిగా అఱచుచుండెను. ఆమె గొంతుకనుబట్టియు, మాటలను బట్టియు పైనఉన్న యువతి వద్ద ఒక్క-చిల్లి గవ్వయైనను లేదని అర్థముచేసికొంటిని. యజమానురాలి మాటలు నాకు స్పష్టముగా వినబడు చుండెను. “నీచురాలా! బయటకు పొమ్ము! వెంటనే బయటకుపొమ్ము. దుర్మార్గురాలా! నీతిమాలిన దానా! కులటా! వ్యభిచారిణీ! వెంటనే బయటకుపొమ్ము. లేనిచో నీకు చుఱక వేసెదను. అది మూడు నెలల వఱకు మానదని తెలిసికొనుము. ఏమి పొగరు పోతు తనము! దగ్గఱ ఒక్క- చిల్లిగవ్వయైన లేకుండ మావంటి మంచివారి యింట బసచేయుటయా? నేను నీకు బాకీఉన్నామను కొన్నావా? రమ్ము, రమ్ము బయటకురమ్ము. నీయంతట నీవు బయటకు రానిచో ఈడ్చివేయగలను.”

అంతట యువతి ఇట్లనసాగెను: “అమ్మా! నన్ను జాలి

దలంపుము. అనాథనగు నన్ను ఈ ఒక్కరాత్రికి సానుభూతితో చూడుము. మరణము మిగిలిన విషయములను చూడగలదు."

వెంటనే నేను ఆగొంతును ఆనవాలుపట్టితిని, ఆ గొంతు ఎవ్వరిది? దురదృష్టవంతురాలగు నా కొమార్తదది. సర్వనాశన మైన ఒలీవియాది. ఆమెనురక్షింపవలయుననుఉద్దేశ్యముతో నేను వెంటనే పరుగెత్తుకొని పోతిని. ఆ ఇంటి యజమానురాలు నా కొమార్తెజుట్టు గట్టిగా పట్టుకొని గదిలోనుండి బయట కీడ్చు కొని వచ్చుచుండెను. నేను పోయి నా కొమార్తెను చేతుల లోనికి తీసికొని గట్టిగా అదిమి పట్టుకొంటిని.

"వెళ్ళిపోయిన నా కూతురా! ఆహ్వానము! ఆహ్వానము! తిరిగి ఆహ్వానించుచున్నాను. నా నిధానమా! నిన్ను ఆహ్వానించు చున్నాను. నీకెప్పుడును నా హృదయ కుహరమున చోటుండును. దుష్టులు నిన్ను వదలివేయవచ్చును. కాని ఈ ప్రపంచంలో నిన్నెన్నటికిని వదలివేయని వాడున్నాడు. అతడు నేనే. నీవు పదివేల నేరములుచేసినను వాని నన్నిటిని మఱచిపోవుటకు సిద్ధ ముగా నున్నాను" అని నే నంటిని.

అంతట నాకూతురు, "అయ్యో! నా ప్రియమైన......" అని ప్రారంభించెను. కాని కొన్ని నిమిషములవఱకు ఆమె ఆ వాక్యమును పూర్తిచేయలేకపోయెను. కొన్నినిమిషములతరువాత నామె యిట్లనెను: "తండ్రీ! దేవతలింతకంటె దయనుచూపుదురా? నేను ఇంతదయకు తగుదునా? ఆ దుర్మార్గుడు! నేను అతనిని ద్వేషించుచున్నాను. నన్ను ద్వేషించుకొనుచున్నాను. నేను అంతఘోరమైన నేరమును చేసినాను. మీరు నన్ను క్షమింప జాలరు. ఏమాత్రము క్షమింపజాలరు."

అంతట నేనిట్లంటిని: "అట్లనుకొనకుము, బిడ్డా! నేను నిన్ను హృదయపూర్వకముగ క్షమించుచున్నాను. చేసినదానికి పశ్చాత్తాపపడుము. అప్పుడు మనమిరువురము శాంతి, సుఖము అనుభవింపవచ్చును. మన మింకను ఎన్నో ఆనందకరమైన దినములను చూడవచ్చును. నా చిన్నారి ఒలీవియా!"

"ఎన్నటికిని అట్లు జరుగదు. నేను బ్రతికియున్నంతకాలము నాకు బయట అపకీర్తి, ఇంట అవమానము తప్పవు. అయ్యో! నాన్నా! మీరు ఇదివరకటికంటె చిక్కిపోయినారు. పాలిపోయినట్లు కనబడుచున్నారు. నేనుచేసిన పనికి మీరంత అపారముగ బాధపడుచున్నారా? మీరు తెలివిగలవారే. నేనుచేసిన పాపమునకు మీరెందుకు బాధపడవలయును? నా పాపమును మీరెందుకు మీ నెత్తిపై పెట్టుకోవలయును?" అని ఆమె అనెను.

"మన తెలివితేటలు, యువతీ!" అని నేను సమాధానమీయబోతిని.

"మీరు నన్నంత నిర్దయగా ఏల సంబోధించుచున్నారు. మీ రా విధముగ బోధించుట కిదియే ప్రథమపర్యాయము" అని నా కొమార్తె యనగా నేనిట్లంటిని: "నన్నందులకు క్షమింపుము."

మే మావిధముగ మాట్లాడుకొనుచుండగా బయటకు పోయిన యజమానురాలు తిరిగివచ్చి ఇట్లనెను: "మీకింతకంటె మంచిగది కావలయు ననుకొందును."

"అవును" అని నేను అంటిని.

అంతట యజమానురాలు మమ్ము వేఱొక గదిలోనికి తీసికొని పోయెను. అచ్చట మేము స్వేచ్ఛగను, నిర్భయముగను మాట్లాడు కొనుటకు వీలుండెను.

"అసలు ఏమిజరిగినది! ఎట్లు జరిగినది?" అంతయు నాకు వివరించి చెప్పుము. ఈ దుస్థితి నీకెట్లు సంప్రాప్తించినదో చెప్పుము" అని యంటిని.

"నానా! ఆ దుర్మార్గుడు నన్ను కలసికొన్న మొదటిరోజు నుండియు రహస్యముగా తన యుద్దేశ్యమును ప్రస్తావింప సాగినాడు. ఆ యుద్దేశ్యము మర్యాద పూర్వకమైనదేయని నటింప సాగినాడు"

"నిజముగా నతడు దుర్మార్గుడే! కాని నా కావిషయమున అంతయు నాశ్చర్యముగ నున్నది! బర్చెల్‌వంటి సహృదయునకు అటువంటి నీచమైన భావమెట్లు కలిగినది? మంచి కుటుంబములో చిచ్చు పెట్టుట కతడు ఎందులకు ప్రయత్నించినాడు? ఈ సందేహములు నన్ను వేధించు చున్నవి."

"నాన్నా! ఏలనోకాని మీరా విషయమున పొరపడినారు. అట్లెందుకు పొరపడినారో నేను ఊహింపలేకున్నాను. బర్చెల్ సహృదయుడు. అతడెన్నడును నన్ను మోసగించుటకు అణుమాత్రమైనను ప్రయత్నము చేసియుండలేదు. పైగా నతడు అవకాశము చిక్కినపుడెల్ల నన్ను కలసికొని తార్న్‌హిల్‌తో స్నేహము చేయు చున్నందుకు మందలించుచుండెడివాడు. తార్న్‌హిల్ నిజస్వరూపమును నాముందు బయల్పరచు చుండెడివాడు. బర్చెల్ అతని ఇంకను సరిగా వర్ణింపలేదని నా అభిప్రాయము. తార్న్‌హిల్ ఎంతటి దుర్మార్గుడో, నీచుడో, కుటిలుడో నా కిప్పుడు బాగుగా అర్థమయినది."

"తార్న్‌హిల్! అవునా? అతడగుట సాధ్యమా?" అని నేను మధ్యలో కలుగజేసికొంటిని.

"అవును నానా! నీతి సూత్రములకు విరుద్ధముగ నన్ను తీసికొనిపోయిన దుర్మార్గుడు తార్న్‌హిల్! నాకు మరులు గొల్పిన దుష్టుడు తార్న్‌హిల్! నన్ను మోసగించుటకు అతడు ఇరువురు యువతులను నియోగించినాడు. వారు గౌరవ కుటుంబమునకు చెందినవారని అతడుమనకు పరిచయము చేసినాడు. కాని వారు నిజముగా నట్టివారుకారు. వారు ఎందుకును పనికిరాని స్త్రీలు. వారు తార్పుడు కత్తెలు. వారితో నీచులుతప్ప మఱి యితరు లెవ్వరును స్నేహము చేయరు. నన్ను లండనుకు తీసికొని పోవుటకు తార్న్‌హిల్ ఆ నీచరాండ్రను ప్రయోగించినాడు. వారి పన్నాగము అప్పుడు తప్పక నెఱవేఱి యుండెడిదే. కాని బర్చెల్ ఉత్తరము మూలమున వారి పన్నాగము నెఱవేఱ లేదు.

మన కేదో అపకారము చేయుటకై బర్చెల్ ఉత్తరము వ్రాసినాడని మన మను కొన్నాము. న్యాప్రవర్తన సరియైనది కాదని అతడా యుత్తరములో విమర్శించినాడని మన మను కొన్నాము. కాని నిజముగా మన కుపకారము చేయుటకు అతడా ఉత్తరము వ్రాసి యున్నాడు. ఆ ఉత్తరములో నతడు పట్టణ యువతులనే విమర్శించి యున్నాడు. మఱి ఆపట్టణ యువతుల పన్నాగములను భగ్నము చేయగలిగినంతటి పలుకుబడి బర్చెల్ కెట్లు వచ్చినదో నాకిప్పటికిని అర్థమగుటలేదు. అదియంతయు రహస్యమే. మన మిత్రులలోకెల్ల ఉత్తమమిత్రుడు బర్చెల్ అని నేను గట్టిగా నభిప్రాయపడుచున్నాను."

"అమ్మాయి! నీ మాటలు నాకు ఎనలేని ఆశ్చర్యమును కలిగించుచున్నవి. తార్న్‌హిల్ నట్టి నీచుడని నేను మొదట

అనుమానించినాను. కాని తరువాత ఆ అభిప్రాయమును మార్చుకొన్నాను. నా మొదటి అభిప్రాయమే సరియైనదని యిప్పుడు రుజువగుచున్నది. అతడెంత నీచుడైనను అతనికెట్టి ఇబ్బందియు లేదు; అతడు ధనికుడు, మనము బీదవారము. అమ్మాయి! నీవు చక్కని విద్యను సముపార్జించినావు; యుక్తాయుక్త విచక్షణా జ్ఞానము కలదానవు. మంచి గుణములు కలదానవు. మఱి నీ వంత సులభముగా అతనితో కలసి వెళ్ళి పోవుట ఎట్లు తటస్థించినదో నాకు ఆశ్చర్యముగ నున్నది."

"అయ్యా! అతడు విజయము సాధించుటకు కారణమేమో తెలియునా? నేను నా సౌఖ్యము కంటె అతని సౌఖ్యమునే ఎక్కువగా వాంఛించినాను. అతనిని సుఖపెట్టవలయుననియే నిశ్చయించుకొన్నాను. మా యిరువురకు ఒక పురోహితుడు రహస్యముగా వివాహము జరిపి యున్నాడు. అది అతనిని బంధించదను విషయము నాకు పూర్తిగ తెలియును. నేను అతని గౌరవ మర్యాదలను, మంచి తనమును నమ్మికొన్నాను".

"ఏమేమి! మీ కిరువురకు ఒక పురోహితుడు వివాహము జరిపించి యున్నాడా?"

"అవును. కాని మే మిరువురముకూడ ఆ పురోహితుని పేరును రహస్యముగా నుంచుదుమని వాగ్దానముచేసి యున్నాము."

"అయిన చాల మంచి పని జరిగినది. నిన్ను నేను ఇది వఱకు కంటె వేయిరెట్లెక్కువగా ఆహ్వానించుచున్నాను. ఏ దృష్టితో నాలోచించినను, ఎట్టి పరిస్థితులలోనైనను నీవతని భార్యవు. ఏ చట్టములుగాని మీ వివాహ బంధమును త్రెంచి

వేయఁజాలవు. మీ వివాహ సంబంధము కడు పవిత్రమైనది. దాని కెవ్వరును అడ్డు రాజాలరు."

"అయ్యో! నాన్నా! మీరు అమాయకులు! అతడెంతటి దుర్మార్గుఁడో మీకు అణుమాత్రమైనను తెలియదు. అతడిదివఱకు ఏడెనిమిది మంది యువతులను వివాహము చేసి కొన్నాఁడు. వారి వివాహములను జరిపించినది కూడ నా పురోహితుఁడే. ఆ దుర్మార్గుఁడు వారినికూడ విడిచి పుచ్చినాడు. వారికి జరిగిన శాస్తియే నాకును జరిగినది."

"అటులనా? అయినచో మన మా పురోహితుని ఉరి తీయించవలయును. రేపే ఈ విషయముల నన్నిటిని అధికారులకు తెలియఁజేయుదము."

"అతని పేరును రహస్యముగా నుంచెదనని నేను వాగ్దానముచేసి యుంటిని గదా! మఱి యిప్పుడతనికి వ్యతిరేకముగ ఫిర్యాదుచేయుట సరియగునా?"

"నీవా విధముగ వాగ్దానముచేసి యున్నచో నింక చేయఁ గలిగినది ఏమియున్నది? వాగ్దానభంగము చేయుమని నిన్ను నేను కోరజాలను. అతనికి వ్యతిరేకముగ ఫిర్యాదుచేసినచో, ఇతరులు బాగుపడుదురన్నమాట నిజమే. అయినను నీవు ఫిర్యాదు చేయరాదు. ఎక్కువ మంచిని పొందుటకై తక్కువ చెడును సహించుట సహజమైన విషయమే. రాజకీయములలో ఒక రాజ్యమును సంపాదించుటకై ఒక రాష్ట్రము నిచ్చివేయుట, సహజమే కదా. దేహమును రక్షించుటకు ఒక అవయవమును కోసివేయుట సహజమే కదా. అట్లనే నేను నీకు అడ్డు వచ్చినాను. నీ సంగతి చెప్పుము."

...నాటి యువయమునసే అతని నిజస్వరూపము ...పడినది. అతడు ఏ మాత్రము చిత్తశుద్ధిలేని వాడని ... నది. నాటి యువయమున నతడు నన్ను ఇరువురు స్త్రీలకు ...చయము చేసినాడు. వారుకూడ అతనిచే మోసగింపబడిన వారే. వారుకూడ నికృష్ట జీవితము గడపుచున్నవారే. కాని వారు వ్యభిచారముచేయుచు సంతృప్తిగ జీవితము గడపుచున్నారు. నే నతనిని మనసార ప్రేమించితిని. అట్టి నేను ఇతరు లతని ప్రేమను పంచుకొనుటను ఏ మాత్రము సహింపలేక పోతిని. నా అపకీర్తిని మఱచిపోవుటకు ప్రయత్నించితిని. ఆ యుద్దేశ్యముతో నేను చక్కగా మాట్లాడెడి దానను; దుస్తులు ధరించెడి దానను; నాట్యము చేసెడి దానను. కాని నాకు శాంతి సౌఖ్యములు కఱవయ్యెను.

నేనున్న ప్రదేశమునకు పలువురు పెద్ద మనుష్యు... వచ్చుచుండెడివారు. వారు ప్రతి క్షణము నా అందచంద... ఆకర్షణ శక్తిని అభివర్ణించుచుండెడివారు. కాని నే... కేమాత్రము లొంగెడి దానను కాను. వారి పొగడ్తల... చున్న కొలది, నా విచారముకూడ హెచ్చసాగ... విచార సముద్రమున మునిగి పోవుచుంటిని. ఆ ... అహంకారముతో అమర్యాదగ చూచుట ... అతడొకనాడు తనకు మిత్రుడైన ఒక పెద్ద ప్రభువు... టకు సాహసించెను. అతని కృతఘ్నత ... గాయి పఱచెనో, నే నిప్పుడు వర్ణించి చెప్ప... నేనేమి సమాధానము చెప్పితిని? ఇంక నచ్చ... కాలమైన నుండననియు, నా దారిని నేను పో...

నేను బయటకు వచ్చుచుండగా అతడు నాపైకి ఒక
విసరెను. అపుడు నాకు అపరిమితమగు కోపము వచ్చెను.
ఆ కోపముతో శక్తియంతయు నుపయోగించి ఆపన్న సల
పైకి విసర్చివైచితిని. బయటకు వచ్చివేసితిని. కొంతసేపటివఱకు
నా పరిస్థితి నాకు సరిగా అర్థము కాలేదు. నేను ఈ విశాల
ప్రపంచములో ఒంటరి దానిననియు, నేరకత్తెననియు, నీచురాల
ననియు, పతితననియు, పాపిననియు గ్రహించితిని.

సరిగా ఆసమయమున నొకబండి ఆదారిని పోవుచుండెను.
నేను ఆ బండిలో ప్రవేశించితిని. నా గమ్యస్థానమేమి ? నాకొక
గమ్యస్థానమనునది లేకుండెను. నేనా దుర్మార్గుని తీవ్రముగ
ద్వేషించుచుంటిని; అసహ్యించు కొనుచుంటిని; అందువలన అత
స్థానమైనంత దూరముగా పోవలయునని యే ఆశించు
. ఆ బండి ఇచ్చట ఆగిపోయినది. అందువలన ఇచ్చట దిగి
గాళ్ళ యింటిలో ప్రవేశించినాను. అప్పటినుండి నేను
నను గూర్చి ఎంతయు బాధపడుచున్నాను; దానికి
యింటి యజమానురాలి నిర్దయకూడ నన్ను అపరి
బాధించుచున్నది.

పూర్వము మా అమ్మతోను, సోదరితోను కలిసి
ముగ కాలముగడపెడిదానను.ఆసంగతిజ్ఞప్తికివచ్చి
యు బాధకలుగు చున్నది. వారు నన్నుగూర్చి
ంచు చున్నారన్నమాట నిజమే. కాని వారి
నా విచారము ఎక్కువైనది. ఏలయన నేను
అపకీర్తి పాత్రైనాను."

నీ వా విధముగ అను కొనకుము. ఓపిక

పట్టి యుండుము. ఓపికపట్టినచో అన్నియు చక్కగా జరుగును. నీకు మంచి భవిష్యత్తు కలదనియే నేను ఆశించు చున్నాను. నేటి రాత్రి చక్కగా నిదురింపుము. రేపు నిన్ను మనయింటికి తీసికొని పోదును. మనయింటిలోని వారందఱును నిన్ను సాదరముగ ఆహ్వానింతురు. పాపము, మీఅమ్మ సంగతి నేమి చెప్పుదును? ఆమె హృదయము తీవ్రముగ గాయ పడినది. అయినను ఆమె నిన్ను గాఢముగ ప్రేమించు చున్నది. ఒలీవియా! ఆమె జరిగిన దానినంతను మఱచిపోవును."

## 22

మఱునాటి యుదయము నేను పూటకూళ్ళయింటి ఔజ మానులవద్ద సెలవుతీసికొంటిని. నా కొమార్తెతో కలసి ఇంటికి బయలుదేఱి పోతిని. త్రోవలో నా కొమార్తెకుగల విచార మును, భయమును పోగొట్టుటకు సకల ప్రయత్నములు చేయ సాగితిని. గాయపడిన తల్లిని ఎదుర్కొనవలసిన విధానము నామెకు సంపూర్ణముగా బోధించితిని. మేము పోవుచున్న దారిలో ప్రకృతి దృశ్యములు కడు రమణీయముగ నుండెను.

నేనా అవకాశమును తీసికొని నాకొమార్తెతో నిట్లంటిని: "అమ్మాయి! మానవు లొకరి నొకరు సరిగా ప్రేమింపరు. కాని భగవంతుడు మనలనందఱను చక్కగా ప్రేమించు చుండును. మన చేతల వలననే మనకు అపకారము జరుగుచుండును. ప్రకృతి మనకు చేయు అపకారము చాల స్వల్పము. నేనునిన్ను ఎప్పటి వలె ప్రేమించు చుందును. నీపట్ల నాకుగల ప్రేమలో ఎట్టి

మాొప్పరాదని తెలసికొనుము. నేను జీవించి యున్నంతకాలము- నేనింకను చాల సంవత్సరములు జీవింతునన్నుట తథ్యము- నీకు సరియైన సంరక్షకుడుగా నుందును. నీకు నేర్పవలసిన విషయముల నన్నిటిని చక్కగా నేర్పెదను.

ప్రపంచము నిన్ను అనేకవిధముల నిందింప వచ్చును. కాని ఆనింద లేవియు నిన్నంటవు. నీమనస్సు మంచిది. కావున నిన్ను నిందలు ఏమియు చేయజాలవు. నీవు వానిని ధైర్యముతో ఎదుర్కొనుము. ఇప్పుడు నీకుమంచి స్నేహితులు పుస్తకములే. పుస్తకములు మధురాతి మధురమైనవి. కష్టకాలములోనున్న వారికి సాహాయ్యము చేయునవి గ్రంథములే. కొందఱకవి జీవితములోని సౌఖ్యముల ననుభవించుటకు సాహాయ్యము చేయలేక పోవచ్చును. కాని జీవితములోని కష్టముల నెదుర్కొనుట కవి తప్పక తోడ్పడును."

నేను పోవుదారిలో మాయింటి కయిదు మైళ్ళదూరమున నొక పూటకూళ్ళ యిల్లుండెను. నేను అద్దెకు తీసికొన్న గుఱ్ఱముబచ్చుట విడిచి పుచ్చవలసి యుండెను. నేను తిన్నగా నా కొమార్తెను ఇంటికి తీసికొనిపోవుట కిచ్ఛగింపకుంటిని. ఆమెను స్వీకరించుటకు నా కుటుంబమువారిని సిదపఱచియుంచ వలెననుకొంటిని. అనగా నేను నా కొమార్తెకంటె ముందుగా ఇంటికి పోవలయునన్నమాట. అందుకుగాను నేను నాటి రాత్రికి ఒలీవియాను ఆ పూటకూళ్ళ యింటిలో నుంచ వలెననుకొంటిని. నేను ఇంటికిపోయి మఱునాటి యుదయమున సోఫియాతో గూడ తిరిగి రావలె ననుకొంటిని.

నేను పూటకూళ్ళయిల్లు చేరునప్పటికే చీకటిపడెను.

అయినను మా కచ్చట నొక చక్కని గది దొరికెను. నేను నా కొమార్తె నందు ప్రవేశపెట్టితిని. ఆమెకు కావలసిన సకలసౌకర్యములను చేయవలసినదని ఆ యింటి యజమానురాలికి చెప్పితిని. పిమ్మట నా కొమార్తను ముద్దుపెట్టుకొని, మా యింటివంకకు బయలుదేఱిపోతిని.

మా యిల్లు శాంతి నిలయము. దానిని సమీపించుచున్న కొలది నా హృదయము క్రొత్త క్రొత్త భావములతో కూడిన ఆనందముతో నిండిపోసాగెను. నేను ఇంటికిపోయి నావారితో చెప్పవలసిన విషయములను ఊహించుకొనసాగితిని. వారు నన్ను స్వీకరించి ఆదరించు విధానముగూడ నూహించుకొనసాగితిని.

ఎట్టకేలకు నేను మా గ్రామములో ప్రవేశించితిని. అప్పటికి కర్షక కార్మికులందఱును నిదుర మునిగియుండిరి. ఏ ఇంటిలోను దీపపు వెలుగు కనబడకుండెను. ఎచ్చటను ఏ సవ్వడియు వినబడుటలేదు. కీచురాళ్ళధ్వనులు మాత్రము వినబడుచుండెను. నేను క్రమక్రమముగా మా యిల్లు సమీపింపసాగితిని. ఇక మా యింటికి నాకు మధ్య నొక ఫర్లాంగుదూరము మాత్రముండెను. అంతలో మా యింటికుక్క పసిగెత్తుకొనుచు వచ్చి నన్ను ఆహ్వానించెను.

నేను ఇంటివద్దకుపోయి తలుపు తట్టుసరికి అర్ధరాత్రమైయుండెను. అంతయు ప్రశాంతముగనుండెను. వర్ణించుటకు అలవి కాని ఆనందముతో నా హృదయము కొట్టుకొనుచుండెను. కాని అంతలో నాకు దిగ్భ్రాంతి కలిగించు దృశ్యము కనబడెను. మా యింటికి నిప్పు అంటుకొనినది! యింటి క్రింది భాగం ఎఱ్ఱగా మండుచున్నది. ఆ దృశ్యమునుచూడగానే నాకు

ఎంతో భయము వేసెను. ఆ భయముతో నేను చావుకేక పెట్టితిని. తరువాత నేను తెలివితప్పి పడిపోతిని.

అప్పటికి నా కుమారుడు మోజెస్ గాఢనిద్ర మునిగి యుండెను. నా కేకను వినగానే అతనికి మెలకువ వచ్చెను. వెంటనే అతడు ఇల్లంటుకొన్న విషయమును గ్రహించెను. అతడు త్వరగా పోయి నాభార్యను, సోఫీయాను లేపెను. వారు ముగ్గురును కట్టుబట్టలతో బయటకువచ్చి భయముతో కేకలు, బొబ్బలు పెట్టసాగిరి. వారి యఱపులకు నాకు తెలివివచ్చెను.

కాని ఏమిలాభము! నేనుఇదివఱకుకంటెఎక్కువభయంకరమైన దృశ్యములను చూడవలసివచ్చెను. అప్పటికి మంటలు ఇంటి పై భాగమునకు గూడ ఎగ ప్రాకియుండెను. ఇంటి కప్పు కొద్దికొద్దిగా కూలిపోసాగెను. నా భార్య, కొమారుడు, కూతురు ఆదృశ్యమును ప్రశాంతముగ చూచుచుండిరి. వారా మంటల సౌందర్యము ననుభవించుచు ఆనందించు చున్నట్లుండెను. నేను ఒకసారి ఆ మంటల వంక చూచుచుంటిని. మఱి యొకసారి నా కుటుంబము వారి వంక చూచుచుంటిని. ఆ విధముగ చాల సార్లు చూచితిని. ఎట్టకేలకు నా చిన్న కొమరులు ఇరువురును తమ తల్లివద్ద లేరను విషయమును గ్రహించితిని. వారెచ్చటనైన నున్నారేమోయని చుట్టును కలయ జూచితిని. కాని వారు నాకెచ్చటను కనబడ లేదు.

"అయ్యో! నా చిన్న కుమారు లిరువురును ఏమైపోయినారు ?" అని నేను గట్టిగా అఱచితిని.

"ఏమైపోయినారు ? అగ్ని కాహుతియై పోయినారు.

వారితో బాటు నేను కూడ మరణింతును" అని నా భార్య కడు ప్రశాంతముగ ననెను.

సరిగా ఆ సమయముననే ఇంటిలోని పిల్లల అరుపు నా చెవిని బడెను. మంట అప్పుడే వారికి తగిలి యుండుటవలన వారు మేల్కొని యుందురు. నేను వెంటనే ఇంటిలోనికి పోవలయునని నిశ్చయించు కొంటిని. నా నిశ్చయమును ఆపు వారెవ్వరును లేరు.

నేను మంటలలో నుండి పోవుచు: "నా పిల్ల లెచ్చట నున్నారు? నా పిల్ల లెచ్చట నున్నారు?" అని యరువసాగితిని. వారు పరుండియున్న గది తలుపులను నెట్టుకొని లోనికి పోతిని. "నా పిల్ల లెచ్చట నున్నారు?" అని యరచితిని.

"ఇచ్చట నాన్నా! మేమిచ్చట నున్నాము" అని నా పిల్ల లిద్దరును ఒక్కసారిగా అరచిరి. అప్పుడే వారు పరుండి యున్న భాగమునకు మంటలు అంటుకొని యుండెను. నేను వారి నిరువురను రెండు చేతులతోను తీసికొని శరవేగమున బయటకు వచ్చితిని. అంతలో ఇంటి పై కప్పు పూర్తిగా కూలి పోయెను.

అంతట నేను నా ఇద్దరు పిల్లలను రెండు చేతులతో పైకెత్తి పట్టుకొని ఇట్లంటిని: "ఇప్పుడు నా ఇల్లంతయు మాడి పోయినను నేను విచారింపను. నా వస్తువు లన్నియు నాశనమై పోయినను నేను విచారింపను. నా ఇరువురు పిల్లలు ఇచ్చట నున్నారు. నా నిధిని నేను రక్షించుకొన్నాను. సిబోరా! మన పిల్ల లిచ్చటనున్నారు. ఇల్లు కాలిపోయినను మనము సుఖముగా జీవింపవచ్చును."

నేను నాభార్య మాపిల్లలు నిరువురను ఎన్నోసార్లు ముద్దు పెట్టు కొంటిమి. వారిరువురును మామెడ పట్టుకొని గట్టిగా కౌగిలించుకొనిరి. వారిరువురును మా బాధలలో పాలుపుచ్చుకొనుచున్నట్లుండెను. నా భార్య ఒకప్పుడు నవ్వుచుండెను; మఱియొకప్పుడు ఏడ్చుచుండెను.

ఇల్లు అగ్ని కాహుతి యగుచుండగా ఏమియుపట్టనిప్రేక్షకునివలె నేను ప్రశాంతముగనిలబడిచూడసాగితిని. కొంచెంసేపైన తరువాతమంటలమూలమున నాచేయిదెబ్బతినెనను విషయమును గ్రహించితిని. అందువలన మాసామానులను రక్షించుటలోగాని, మంటలను ఆర్పివేయుటలోగాని నా కుమారుడు మోజెస్‌కు ఏమాత్రము సాహాయ్య పడలేకపోతిని. అప్పటికి ఇరుగు పొరుగు వారుకూడా మేల్కొని యుండిరి. మాకు చేతనైనంత సాహాయ్యము చేయుటకై పరుగెత్తుకొని వచ్చిరి. కాని వారు మాకప్పుడు చేయగలిగిన సాహాయ్య మేమియు లేకుండెను. మావలెనే వారును మంటల వంకకు చూచుచు నిలబడిరి.

నా వస్తువులన్నియు అగ్నికాహుతియైపోయి యుండెను. అందు నా కొమార్తెలకొఱకు ప్రత్యేకించిన వల్తువులుకూడ నుండెను. వంటగదిలోని పెట్టెయొకటి, అంతగా ముఖ్యమైనవి కాని సామానులు రెండు, మూడు మాత్రము అగ్నికాహుతి కాకుండా రక్షింప బడెను. వానిని మొట్టమొదటిలోనే నాకుమారుడు రక్షించి యుండెను.

ఇరుగు పొరుగువారు మా దీనస్థితినిచూచి తమకు చేతనైనంత వఱకు సాహాయ్యము చేయుటకు ప్రయత్నించిరి. వారు మాకు బట్టలిచ్చిరి. వంటపాత్రల నిచ్చిరి. మేము వానిని తీసి

కొని ఒక చిన్నయింట ప్రవేశించితిమి. త్సొల్లివారు నప్పటికి మా కాశ్రయ మిచ్చుటకు పెద్దయిల్లు లేకపోయినను చిన్న ఇల్లయిన నుండెను; మా పొరుగున నేయున్న ఫ్లామ్‌బరో కుటుంబమువారు మాకు సౌఖ్యము చేకూర్చుటకు అపారమగు సాహాయ్యము చేసిరి. మమ్ము ఓదార్చుటకు తమకు చేతనైనట్లు శతవిధముల ప్రయత్నించిరి.

ఆ విధముగా నా గొడవ అణగిపోయిన తరువాత నా భార్య నాతో నిట్లనెను: "నాథా! మీరింతకాలమువఱకు ఇంటికి తిరిగిరాకుండుటకు కారణము లేవి? జరిగిన విషయముల నన్నిటిని వివరముగా తెలిసికొనగోరు చున్నాను." అంతట నేను అన్ని విషయములను వివరముగా వర్ణించి చెప్పితిని. తరువాత నేను మా కుటుంబమువారు ఒలీవియాను ఘనముగ స్వీకరించునట్లు చేయుటకు ప్రయత్నింప సాగితిని. ఆమెను సాదరముగ నాహ్వానించుటకు మావద్ద నిప్పుడేమి యున్నది? అయినను ఉన్నదానితోనే ఆమెను సంతృప్తిపఱచ వచ్చును.

ఇంతకుముందు జరిగిన సంఘటనవలన నాయీ ప్రయత్నము సులభతరమైనది. ఈ సంఘటన (అగ్నిప్రమాదము) నా భార్య గర్వమును, అహంకారమును పూర్తిగా అణచివైచినది.

అగ్నిప్రమాదమునకు లోనగుటవలన నాచేతిబాధ చాల ఎక్కువగ నుండెను. అందుచేత ఒలీవియాను తీసికొని వచ్చుటకు నాకు వీలులేకుండెను. మఱి ఆమెను తీసికొనివచ్చుటకై నేను మోజెస్‌ను, సోఫియాను పంపితిని. వారుపోయి అనతికాలములోనే ఒలీవియాను ఇంటికి తీసికొని వచ్చిరి. ఒలీవియా తనతల్లి వంకకు సూటిగా చూడ లేకుండెను. నేను ఎంత బోధించిననేమి?

ఆమె యాపనిని చేయలేకుండెను. స్త్రీలు తప్పుచేసినచో పురుషులు సులభముగా క్షమింపగలరు. కాని ఇతరస్త్రీలు సులభముగా క్షమింపలేరు. ఈ విషయము ఒలీవియాకు తెలియును. అందువలననే ఆమె భయపడుచుండెను.

కాని నాభార్య ఒలీవియాతో నిట్లనెను: "అమ్మాయి! గొప్పగొప్ప భవనములలో నివసించిన తరువాత నీవీ పూరికొంపకు వచ్చినావు. గొప్పవారితో కలసి నివసించినవారికి, సర్వసౌఖ్యములను చవిచూచిన వారికి నేను, సోఫీ చేయగలిగినదేమియున్నది? లివీ, నీ తండ్రి నేను ఇటీవల ఎంతో బాధపడినాము. విచారసాగరమున మునిగిపోయినాము. కాని భగవానుడు నిన్ను క్షమించునని ఆశించుచున్నాను."

ఆమె ఆవిధముగ మాట్లాడుచున్నంతసేపు నాకూతురు ఒలీవియా గజగజ వణకిపోసాగెను. ఆమె ముఖము పాలిపోయెను ఆమె ఏడ్చుటకుగాని, సమాధానము చెప్పుటకుగాని నిస్సహాయురాలై యుండెను. ఆమె అపరిమితముగ బాధపడుచుండెను. ఆమె ఆవిధముగ బాధపడుచుండగా నేను చూచుచు ఊరకుండ లేకపోతిని. అందువలన నేను కాఠిన్యము వహించి నాభార్యతో నిట్లంటిని.

"డిబోరా! నామాటలను జాగ్రత్తగవినుము. వీనిని జ్ఞప్తియం దుంచుకొనుము. నే నిచ్చటకు ఎవరిని తీసికొనివచ్చినాను? క్షమించి తప్పుదారిని పట్టి తరువాత పశ్చాత్తాపపడిన నీ కొమార్తె నిచ్చటకు తీసికొనివచ్చినాను. ఆమె తిరిగి మన యింటికి వచ్చినది. ఇప్పుడు మన విధ్యుక్త ధర్మమేమి? మన మెప్పటివలె ఆమెను ప్రేమింపవలయును, ఆదరింపవలయును,

జీవితములో అసత్యైనష్టము లిప్పుడు శరవేగమున మనమీదకు వచ్చుచున్నవి. మనలో మన మీవిధముగ విమర్శించుకొనుచు ఆ కష్టములను వృద్ధిచేసికొనుట ఏమాత్రము ఉచితమైన పని కాదు. మనమందఱము ఏకాభిప్రాయము కలిగియున్నచో సంతృప్తికరముగ జీవింపవచ్చును.

ప్రపంచము మనలను పరిపరివిధములవిమర్శించుచుండును! మన మంతరము కలసికట్టుగా ఆ విమర్శనలను ఎదుర్కొనవలయును. లేనిచో మన మెందుకు పనికిరాకుండపోదుము. భగవంతుడు పశ్చాత్తాపపడిన వారిపట్ల అపారమగు కరుణను ప్రదర్శించును. మనము కరుణామూర్తియగు భగవానునిమార్గము నెందుల కనుసరింపరాదు? భగవానుడు మన చర్యల నెప్పుడు హర్షించును. ఏపాపము చేయనివానిని మనము మంచిగా చూచినంతమాత్రమున భగవానుడు హర్షింపడు. ఎన్నో పాపములు చేసి హృదయపూర్వకముగ పశ్చాత్తాపపడినవారిని మనము స్వీకరించి ఆదరించినచో భగవానుడు తప్పక హర్షించును. పతనమై పోవుచున్నవారిని మనము రక్షింపవలయును. పైకి పోవుచున్నవారిని మనము రక్షింపవలసినఅవసరమేమి వచ్చినది?"

## 23

మేము ఉన్న చిన్న ఇంటిలో మాకు కావలసినసౌకర్యము లన్నియు లేవు. అందువలన మేము ఎంతో కష్టపడి కావలసిన ఏర్పాట్లను చేసికొనవలసివచ్చెను. చేయి అవిటిదగుటవలన నేను నా కుమారుడు మోజెస్‌కు మామూలుగా చేయుచుండు

పనులలో ఏమాత్రము సహాయపడ లేకుంటిని. అందువలన నేను ఇంటివద్దనే కూర్చుండి మిగిలినవారికి పుస్తకములను చదివి వినిపింపసాగితిని. ముఖ్యముగా వారి హృదయములోని బాధలను పోగొట్టి సంతోషమును చేకూర్చు పాత్రములను చదువసాగితిని.

మా యిరుగు పొరుగువారు కూడ ప్రతిదినము మా యింటికి వచ్చి మాకు సంతోషము చేకూర్చుటకు ప్రయత్నింపసాగిరి. మాపాడై పోయిన యింటిని బాగుచేయుటలో మాకు తోడ్పడుచుండిరి.

సహృదయుడగు విజయమ్మునకూడ మా యింటికి ప్రతిదినము వచ్చుచుండెను. అతడింకను నా కొమార్తె ఒలీవియాను గాఢముగ ప్రేమించుచుండెను. మా పట్ల నెప్పటివలె స్నేహ భావము కలిగియుండెను. అతడు తిరిగి నా కొమార్తెతో పూర్వమువలె మాట్లాడి వివాహము చేసికొందుమని అనెడివాడే. కాని ఒలీవియా అతనిని పూర్తిగా తిరస్కరించియుండెను. అందువలన నతడింక ఆ ప్రశంసను తీసికొని రాలేదు.

నా కొమార్తె ఒలీవియా ఇంకను విచార సముద్రమున మునిగి యుండెను. ఒక వారము రోజులు గడచినను ఆమెకు పూర్వపు ఉత్సాహము, ఉల్లాసము రాలేదు. ఒకప్పుడామె తన్ను తాను గౌరవించుకొనుచుండెడిది; ఇతరులను సంతోష పెట్టుటకు ప్రయత్నించుచుండెడిది. ఆమె భవిష్యత్తును గూర్చి ఎంతయు ఆందోళన పడుచుండెను. ఆమె మనస్సు బలహీన పడుచుండెను. మనస్సుతో బాటు శరీరముకూడ బలహీనమగుచుండెను. వానితో బాటు ఆమె అందముకూడ తగ్గిపోవు

చుండెను. వానిని గూర్చి ఆమె ఎట్టి జాగ్రత్తను తీసికొన కుండెను.

మేము సోఫియాపట్లచూపు ఆదరణ ఆమె హృదయము నకు బాధను కలిగించుచుండెను; అట్టి సమయము లందామె కన్నీరు కార్చుచుండెను. ఆమె మనస్సులో ద్వేషము, అసూయ ప్రవేశించెను. నేనామెను బాగుచేయుటకు సహస్ర విధముల ప్రయత్నించుచుండెడివాడను. అప్పుడు నా బాధనుకూడ మఱచి పోవుచుండెడివాడను ఒకసారి నేనామెతో నిట్లంటిని.

"అమ్మాయి! నేను నీకొక కథ చెప్పెదను వినుము. మటిల్డా అను అమ్మాయి ఒక గొండవనీయుని వివాహము చేసి కొనియుండెను. కాని దురదృష్టవశమున నామె పదునేను సంవత్సరములు వచ్చునప్పటికే విధవ అయ్యెను. అప్పటి కామెయొక బిడ్డ తల్లిగూడ.

ఒక నాడామె తన బిడ్డను లాలించుచు మేడమీది కిటికీ వద్ద నిలబడియుండెను. ఆ కిటికీకి తలుపులు లేవు. ఆ మేడకు దిగువ భాగమున నొకనది ప్రవహించుచుండెను. మటిల్డా చేతి లోని బిడ్డ ఆమె చేతులలోనుండి హఠాత్తుగా ముందుకు దుమి కెను. అప్పుడా బిడ్డ నదిలో పడి ఒక్క క్షణకాలములో అదృశ్య మయ్యెను.

ఆ సంఘటన మటిల్డాకు ఆశ్చర్యమును కలుగజేసెను. కొంతసేపు ఆమెకేమియు తోచలేదు. తరువాత నామెబిడ్డను రక్షించుకోవలయునను తలపుతో నదిలోనికి దుమికెను. కాని ఆమెబిడ్డ నేమాత్రము రక్షించుకొనలేకపోయెను. పైగా ఆమె తన ప్రాణమును కోల్పోవుటకుకూడసిద్ధపడెను. ఎట్టకేల కామెయెంతో

కష్టముమీద తన ప్రాణములను రక్షించుకొని ఆవలిగట్టును చేసుకొనెను. నది కావలిగట్టుప్రాంతము నా సమయమున ఫ్రెంచి వారు దోచుకొనుచుండిరి. వారు ఇటాలియను యువతియగు మటిల్డాను ఖైదీగా పట్టుకొనిరి.

ఆకాలమున ఫ్రెంచివారును, ఇటాలియనులును తాము మానవులమన్న మాటనుమఱచి క్రూరముగపోరాడుకొనుచుండిరి. వారి దాహమునకు, క్రౌర్యమునకు మితిలేకుండెను. ఒకరినొకరు పూర్తిగా హతమార్చుకోవలయునని వారు పోరాడుచుండిరి. అందువలన ఫ్రెంచివారు తమకు చిక్కిన మటిల్డాను పూర్తిగా అనుభవించి చంపివేయవలయునని నిశ్చయించుకొనిరి. కానియువకు డగు ఫ్రెంచి సైనికాధికారి యొకడు ఆనిశ్చయమున కంగీకారము తెలియజేయలేదు. అత డామెను సురక్షితముగ తన స్వస్థాన మునకు చేర్చెను. ఆమె అపూర్వ సౌందర్యమతనికి కన్నుల పండుగుగనుండెను; ఆమె మంచితన మతని హృదయమును కైవసము చేసికొనెను. అనతికాలములోనే వారిరువురివివాహము జరిగెను. సైనికాధికారి పెద్ద యుద్యోగమునుపొందెను. అతడు భార్యతో కలసి సుఖముగా జీవింపసాగెను.

కాని సైనికాధికారుల సౌఖ్యము శాశ్వతమైనదికాదు. చాల సంవత్సరములు గడచినతరువాత ఆ అధికారిక్రిందనున్న సైన్యము ఓటమినిపొందెను. అప్పుడతడు తన భార్యతో కలసి యున్న పట్టణములోనే తల దాచుకోవలసివచ్చెను. శత్రువు లా పట్టణమును ముట్టడించిరి. కొంతకాలమున కది శత్రువుల వశమైపోయెను. ఇటాలియనులు ఆనగరములోని ఫ్రెంచివారి నంపఱిని ఖైదీలుగా పట్టుకొనిరి. వారా ఖైదీల నందఱను నిర్దా

క్షిణ్యముగ చంపివేయవలయునని నిశ్చయించుకొనిరి. ముఖ్యముగా వారు మటిల్డా భర్తయగు సైనికాధికారిని కడు క్రూరముగ హింసించి చిత్రవధ చేయవలయుననుకొనిరి. ఇటాలియనుల నంతకుమునుపు ఎన్నో సార్లు అతడు ఓడించియుండుటయే అందుకు కారణము.

ఇటాలియను సైనికులు గ్రంథించి సైనికాధికారినిపట్టుకొని శిరచ్ఛేదస్థలమునకు తీసికొనిపోయిరి. అచ్చట నొక సైనికుడు అతని వధించుటకు సిద్ధముగానుండెను. ఆ దృశ్యమును చూచుటకు పలువురు జనులచ్చట వేచియుండిరి. ఇటాలియనుసైనికాధికారి వచ్చి అనుమతి యొసగువఱకు ఆపనిపూర్తి కాదు. ఈలోపల నచ్చటకు కడసారి తన భర్తను చూచుటకు మటిల్డా వచ్చెను. అంతలో నచ్చటకు ఇటాలియను సైనికాధికారిగూడ వచ్చెను.

మటిల్డా తన భర్తతో నిట్లనెను: "అయ్యో! విధి ఎంత క్రూరమైనది! వాల్టర్నానదిలో పడిపోయిన నా కుమారుని రక్షించుకొనుటకై నే నా నదిలోనికి దుమికినాను. నేను నా కుమారుని రక్షించుకోలేక పోయినాను. నా ప్రాణముకూడ అప్పుడు పోవలసినదే. కాని ఎట్లో రక్షించుకొని ఆవలి గట్టు చేరుకొన్నాను. అప్పుడు మీరు నన్ను మీ సైనికులబారి నుండి రక్షించి వివాహము చేసికొన్నారు. అప్పుడు నేను ఎందుకు రక్షింపబడినట్లు? మీరు దారుణముగ వధింప బడుచుండ చూచుటకా?"

ఆమాటలను ఇటాలియను సైనికాధికారివినెను. అతడు ఎవరు? మటిల్డా కుమారుడు. అతడు వాల్టర్నానదిలో పడెనేగాని మునిగిపోలేదు. అతని నెవ్వరో రక్షించియుండిరి. అతడు పెరిగి

పెద్దవాడై సైనికాధికారి పదవిని పొందియుండెను. 'అమ్మా! నీవు నాతల్లివి' అని అతడు మట్టిల్లా పాదములపై బడెను. మిగిలిన విషయము సంతను సుఖముగా నూహింపవచ్చును. ఫ్రెంచి సైనికాధికారికి స్వేచ్ఛ యొసగబడెను. ప్రేమ, స్నేహము, విధ్యుక్త ధర్మము మున్నగునవన్నియు నిచ్చు సౌఖ్యముతో వారు ఆనందముగ జీవింపసాగిరి."

ఆ విధముగనేను నాకొమార్తె ఒకీవియాను సంతోష పెట్టుటకు ప్రయత్నించు చుండెడివాడను. కాని ఆమె పూర్తిగా నామాటలయందు మనస్సుంచి వినెడిదికాదు. పూర్వమామె ఇతరుల కష్టములపట్ల సానుభూతి చూపెడిది. కాని యిప్పుడామె ఆ సానుభూతి సంతను తనకే ప్రత్యేకించు కొన్నది. నలుగురిలో నున్నప్పుడామె తన్ను ఇతరులు అసహ్యించుకొను చున్నారేమో యని భయపడెడిది. ఒంటరిగా నున్నప్పుడామె తన భవిష్యత్తును గూర్చి బాధపడు చుండెడిది. ఆమెనుస్థితి ఆ విధముగానుండెను. ఆమెకు సౌఖ్యమనునది లేకుండెను.

అంతలో మాకు నిరుత్సాహకరమగు వార్తయొకటి తెలిసెను. దుర్మార్గుడగు తార్న్‌హిల్ విల్మట్‌కన్యను వివాహము చేసికొనబోవు చున్నాడనుటయే ఆవార్త! తార్న్‌హిల్ ఆమెను వివాహము చేసికొన దలచుచున్నాడను విషయము నాకు తెలియును. కాని అతడు ఆవిషయమును నావద్ద దాచుచుండెడివాడు. "విల్మట్‌కన్య అందమునుగాని, ఐశ్వర్యమునుగాని నే నేమాత్రము లెక్కచేయను. నే నామెను తీవ్రముగ ద్వేషించుచున్నాను" అని యతడు నాతో అనుచుండెడివాడు.

తార్న్‌హిల్ విల్మట్‌కన్యను వివాహము చేసికొన నున్నా

...ట్టి ఒలీవియా బాధను అతిశయింప జేసెను. అతని ...నము నామె ఏమాత్రము సహింపలేకుండెను.

తార్న్ హిల్ విల్మట్ కన్యల వివాహవార్త ఎంతవఱకు నిజమో తెలిసికొనవలయునని అనుకొంటిని. ఒకవేళ అది నిజమైనచో దానిని చెడగొట్ట వలయుననికూడ నిశ్చయించుకొంటిని. వివాహపు సంగతిని తెలిసికొనుటకు నా కుమారుడు మోజెస్‌ను పెండ్లికొమార్తె తండ్రియగు మిష్టర్ విల్మట్ వద్దకు పంపవలయు ననుకొంటిని. తార్న్ హిల్ మాయింట చేసిన మోసమునంతను తెలియజేయుచు ఒక ఉత్తరమువ్రాసి విల్మట్ కన్య కీయవలసినదని మోజెస్‌కిచ్చితిని.

నా సూచనల ప్రకారము మోజెస్ బయలుదేఱిపోయెను. మూడురోజులలో నతడు తిరిగివచ్చి యిట్లు చెప్పెను: "తార్న్ హిల్ విల్మట్ కన్యల వివాహవార్త నిజమే. వారిరువురునుకలసి గ్రామసీమకు పోయినారు. అందువలన విల్మట్ కన్యకు మీరువ్రాసిన యుత్తరము నామెకీయలేక పోయినాను. ఆమెకీయవలసినదని అచ్చటవదలివచ్చినాను. వారిరువురి వివాహముకొన్ని రోజులలోనే జరుగునట! కడచిన శనివారమునాడు వారిరువురునుకలసి చర్చికి వచ్చినారట. అమ్మాయితో బాటు ఆఱుగురు యువతులును, తార్న్ హిల్ తో బాటు ఆఱుగురు యువకులును వచ్చినారట. అంతయు గొప్పవైభవముగా నున్నదట. వారి వివాహవార్త గ్రామసీమలోని వారికందఱకు అపరిమితముగు ఆనందమును కలిగించుచున్నదట. ఎచ్చటకు పోయినను వారు గొప్పవైభవముతో పోవుచున్నారట. రెండు కుటుంబములకు చెందిన మిత్రులందఱును వచ్చినారట. ముఖ్యముగా తార్న్ హిల్ పినతండ్రి

యగు సర్ విలియమ్ తార్న్‌హిల్‌కూడ వచ్చినాడట.
చూచినను ఆనందము తాండవమాడుచున్నది. అం
పెండ్లికొమార్తె అందచందములను ప్రశంసించుచున్నారు. పె
కొమరుని ఆకారమును పొగడుచున్నారు. వారిరువురును ఒకరి
నొకరు గాఢముగ ప్రేమించుకొను చున్నారని చెప్పుకొను
చున్నారు. ఈ విశాల ప్రపంచమున ఆనందము ననుభవించు
చున్న మహనీయులలో తార్న్‌హిల్ ఒకడని నేను గట్టిగా విశ్వ
సించుచున్నాను."

"అతడు ఆనందము ననుభవించిన మనకేమి? కాని మన యీ పూరికొంపలను, గడ్డి పనుపులను చూడుము. పనికిరాని గోడలను నేలను చూడుము. అగ్నికాహుతియై నా చేయి ఎందుకును పనికి రాకుండపోయినది. నా పిల్లలు తినుటకు కావలసినంత ఆహారములేక అల్లల్లాడిపోవు చున్నారు. వారు నా చుట్టును జేరి ఏడ్చుచున్నారు. అబ్బాయి; నీ విటువంటి గృహమునకు తిరిగి వచ్చినావు" అని నేను అంటిని.

తార్న్‌హిల్ విల్మట్ కన్యల వివాహవార్త నిజమని తెలిసికొని నా కొమార్తె ఒలీవియా ఎంతో విచారముతో మూర్ఛపోయెను. అప్పుడు నా భార్య యామె కుపచారములు చేసెను. కొంచెము సేపటికి కామెకు తెలివివచ్చెను. అప్పటినుండి ఆమె ఇదివరకు కంటె ప్రశాంతముగ నుండ సాగెను.

నా హితులు మాకు ఎన్నో ఆహార పదార్థములను దయతో పంపసాగిరి. అవి మా కుటుంబము వారికి ఉల్లాసమును కలుగ జేయసాగెను. అందుకు నేనెంతయు సంతసించితిని.

మఱునాటి యుదయమున సూర్యుడు క్రొత్త తేజస్సుతో వెలుగుచున్నట్లుండెను. అందువలన మేమందఱము బయటకు పోయి భోజనముచేయవలెనని నిశ్చయించుకొంటిమి. అందఱము భోజన పదార్థములను తీసికొని నిర్ణీత ప్రదేశములకు పోతిమి. చెట్ల క్రింద కూర్చుంటిమి. చెట్లమీదనున్న పక్షులప్పుడు కడు మనోహరముగ కిలకిలారవములు చేయుచుండెను. నా కోరికపై సోఫియాకూడ పక్షులతోబాటు చెవుల కింపుగ పాడసాగెను.

ఒలీవియా మొట్టమొదట తార్న్‌హిల్‌ను ఆ ప్రదేశములోనే కలసికొనియుండెను. అందువలనవచ్చటి ప్రతి వస్తువు ఆమెకు విచారమును కలుగజేయుచుండెను. కాని అది యామె హృదయమునకు శాంతినే చేకూర్చుచుండెను. నా భార్యకుగూడ నట్టి భావములే కలిగెను. అప్పటినుండి ఆమె తన కొమార్తె నెప్పటివలె ప్రేమింపసాగెను. ఆమె ఒలీవియాతో నిట్లనెను: "ప్రియమైనఅమ్మాయి! నీ సోదరి సోఫియా మధురగీతములను పాడి మనలను సంతోషపఱచినది. నీవొక విచారగీతమును పాడి నీతండ్రిని సంతోషపెట్టుము. ఆయన కట్టి గీతములన్న నెంతయు యిష్టము."

ఒలీవియా అంత నొక విచారగీతమును పాడసాగెను. అంతలో మాకు అల్లంతదూరమున వచ్చుచున్న తార్న్‌హిల్ బండి కనబడెను. అది మాకు భయమును కలుగజేసెను. ముఖ్యముగా నా పెద్దకూతురు ఒలీవియా బాధ హెచ్చయ్యెను. తన్ను

మోసముచేసిన వానిని చూడరాదను నుద్దేశ్యముతో తన సోదరితో ఇంటికి తిరిగిపోయెను.

కొన్ని నిమిషములకు తార్న్‌హిల్ బంగ్లోనుండి క్రిందకు దిగి నే నింకను కూర్చుండియున్న ప్రదేశమునకు వచ్చెను. విషాద సంఘటన ఏదియు జరుగనట్లు ఎప్పటివలె నతడు నా ఆరోగ్య మునుగూర్చి ప్రశ్నించెను.

అప్పుడు నేనిట్లు సమాధానమిచ్చితిని: "అయ్యా! మీరు ఏమియు జరుగనట్లు నన్నెప్పటివలె పలుకరించుచున్నారు. ఇది మీ నైచ్యమును ఇనుమడింపజేయుచున్నదేగాని ఏమాత్రము తగ్గించుటలేదు. వట్టి అమాయకునివలె కనబడుటకు మీరు ప్రయత్నించుచున్నారు. ఇది మీ అహంకారమును సూచించుచున్నది. ఇదివరకైనచో మిమ్మింకు గట్టిగా శిక్షించియుండెడి వాడను. కాని యిప్పుడు వయస్సు నా యుద్వేగమును, ఉద్రేక మును అణచివేయుచున్నది. నేను తమాయించుకొని ప్రవర్తించు చున్నాను."

అంతట తార్న్‌హిల్ ఇట్లనెను: "అయ్యా! మీమాటలు నాకు విభ్రాంతిని గొలుపుచున్నవి. మీరెందుకిట్లు మాట్లాడు చున్నారో నాకు తెలియదు. మీమాటల అర్థమేమోకూడ నాకు తెలియుటలేదు. నా కంతయు అయోమయముగ నున్నది. ఇటీవల మీ కొమార్తె నాతో కలసి విహారయాత్రకు వచ్చిన విషయమును మీరు ప్రస్తావించుచున్నారా? అందు నేరమేమియు లేదని మీకు విన్నవించుకొనుచున్నాను."

"పో, పొమ్ము. నీవువట్టినీచుడవు; కుటిలుడవు; దుర్మార్గుడవు" అని నేను అపరిమితమగు కోపముతో ననసాగితిని; "పనికిమాలిన

దుష్టుడవు; ఏ దృష్టితో చూచినను అబద్ధాలకోరువు. నీనైచ్యము నా కోపమునుండి నిన్ను రక్షించుచున్నది. నేను సర్వాంశమున జయించినాను. నీవుచేసిన పనిని మా వంశము భరింపలేదు. నీవు తాత్కాలిక సౌఖ్యమున కాశించి ఒక అమాయకపు యువతి సౌశీల్యమును బలిగొన్నావు. మర్యాదతప్ప మఱే యితరమేమియు నెఱుగని కుటుంబమును కలుషితము చేసినావు. నీ మొగము చూడరాదు. ఇంక పొమ్ము."

"మీరుగాని ఆమెగాని దౌర్భాగ్యజీవితములను గడపుటకు నిశ్చయించుకొన్నచో, ఇంక నేను చేయగలిగిన దేదియులేదు. నే నందుల కెంతయు విచారింతును. మీరు సుఖముగా జీవించుట కవకాశము కలదని, నేను నిశ్చయముగ చెప్పుచున్నాను. మీరు నన్ను గుఱించి ఏ అభిప్రాయము నేర్పఱచుకొనియుండినను, మీరు సుఖపడుటకు నాకు చేతనైనంతవఱకు సాహాయ్యము చేయుదు నని నమ్మబలుకుచున్నాను. అనతికాలములోనే మన మామెను మఱియొకని కిచ్చి వివాహముచేయవచ్చును. వివాహము చేసికొన్నను ఆమె తన ప్రియునిగూడ కలిసికొనుచుండవచ్చును. ఏలయన నే నామెను జీవితాంతమువఱకు ప్రేమించుచునేయుందును; గౌరవించుచునేయుందును. ఇందుకు సందేహమేమియు లేదు" అని అతడనెను.

తార్న్‌హిల్ మాటలను వినగానే నాకు ఎక్కడలేని కోపమువచ్చెను. పెళ్లిచేసికొన్న తరువాతగూడ ప్రియుని కలసికొనుచుండ వచ్చును. ఎంత నికృష్టమగుసూచన! ఆ సూచనను చేయుటకు అతనికెంత ధైర్యము వచ్చినది. ఎంతగాయము తగిలినను మనస్సు ప్రశాంతముగ నుండవచ్చును. కాని ఈదౌష్ట్య

మును సహించుటనాకు శక్యముగాకుండెను. అతని మాటలు నన్నెంతగా గాయపఱచెనో నేనువర్ణించి చెప్పజాలను.

"ఓ కాలసర్పమా! వెంటనే ఈ ప్రదేశమును విడిచి పొమ్ము. ఇంకను ఇచ్చటనేయుండి నన్ను అవమానించుటకు ప్రయత్నింపకుము. అపారధైర్య సాహసములుకల నా కుమారు డింట యుండినచో ఈ యవమానము నేమాత్రము సహించి యుండెడివాడుకాడు కానినేనుముసలివాడను, దేహదారుఢ్యము లేనివాడను, నాపని వైపోయినది." అని అంటిని.

కాని అతడిట్లనెను: "నేను మీకు మేలుచేయుటకు వచ్చి నాను. అందువలననే మీతో ప్రశాంతముగ మాట్లాడు చున్నాను. కాని మీరు నేను కఠినముగ మాట్లాడునట్లు చేయు చున్నారు. నేను మీపట్ల స్నేహభావము కలిగియుండి మీకెట్టు ఉపకారము చేయగలనో తెలిపినాను. మీపట్ల శత్రుభావము వహించినచో మీకెట్లు అపకారము చేయగలనో తెలియ జేయుట అప్రస్తుతము కాదనుకొందును. మీరింతకు ముందు నాకు నూఱు పౌనులకు ప్రామిసరీనోటు వ్రాసియిచ్చి యుండిరి. దానిని నేను నా వకీలు పరము చేసియున్నాను. అతడు మీమీద దావా చేయునునని బెదరించు చున్నాడు. దానిని ఎట్లు ఆపవల యునో తెలియకున్నది: ఆ డబ్బును నేనే చెల్లింపవలసియుండును. కాని నేను చాలఖర్చులోనున్నాను. అందువలన నేనా పనినిచేయ జాలను.

అదియుగాక మాగుమస్తా మీరీయవలసిన శిస్తుకొఱకు తొందఱపడుచున్నాడు. తన ధర్మమేమో అతనికి బాగుగ తెలి యును. ఏలయన అటువంటి వ్యవహారములలో నేను ఎన్నడును

జోక్యము కలుగజేసికోను. అయినను నేను మీకింకను ఉపకారము చేయవలయుననియే నేను గాఢముగ వాంఛించుచున్నాను. మీరు, మీ అమ్మాయి నా వివాహ మహోత్సవమునకు రావలయునని వాంఛించు చున్నాను. అనతికాలములోనే విశ్మట్ కన్యతో నా వివాహము జరుగనున్నది. మీరందఱుకూడ తన వివాహమునకు రావలయునని విశ్మట్ కన్యకూడ కోరుచున్నది. మీరు ఆమె కోరికను, నాకోరికను తిరస్కరింపరనియే ఆశించుచున్నాను."

అపుడు నేనిట్లంటిని: "తార్న్‌హిల్! మనమింక ఈ సంభాషణను పొడిగింపవలదు. నేనుకడసారిగా చెప్పుచున్నాను, వినుము. నీవు నా కొమార్తెనుతప్ప మఱి ఏయితర యువతిని వివాహము చేసుకొనుటకు నేను అంగీకరింపనని స్పష్టముగా తెలిసికొనుము నీతో స్నేహము నన్ను సింహాసనముపై కూర్చుండపెట వచ్చును; నీతో విరోధము నన్ను పాతాళలోకమున కణచివేయ వచ్చును; కాని నేనా రెండింటిని అసహ్యించుకొందునని తెలిసికొనుము. నీవు నన్ను మోసముచేసినావు. ఆ మోసము కడు ఘోరమైనది. నీవు మంచి మర్యాదలు కలవాడవని నేనుకొన్నాను; కాని నీవు నీ నైచ్యమును ప్రదర్శించినావు. కావున నా స్నేహమింక నీకు లభించునని ఎన్నడును ఆశింపకుము. పోయి ఐశ్వర్యము ననుభవించుము. సౌందర్యము, ధనము, ఆరోగ్యము, ఆనందము ననుభవింపుము. నేనుదురదృష్టవంతుడను. నన్ను విచారము, అపకీర్తి, వ్యాధి, బీదఱికము ననుభవింపనిమ్ము. నేను తక్కువ స్థితిలోనున్నాను. ఎల్లపుడును నాగౌరవమును నిలబెట్టు

కొనుటకే ప్రయత్నించుచుందును. నేను నిన్ను క్షమింపగలను. కాని నేనెప్పుడును నిన్ను తిరస్కరించుచునే యుందును."

"మీరింత అహంకారముతో నిర్లక్ష్యముగ మాట్లాడు చున్నారు. ఇందుకు తగిన ప్రతి ఫలమును మీరు అనుభవింతు రనుటకు ఎట్టి సందేహమును లేదు. ఆ విషయమును నేను నిశ్చయముగ చెప్పుచున్నాను. అంతయును నన్ను అసహ్యించుకొను చుందురో, నన్ను అసహ్యించుకొనుచుందురో త్వరలోనే తెలియును" అని యని తార్న్‌హిల్ వెళ్ళిపోయెను.

మేమిరువుర మా విధముగ మాట్లాడు కొన్నప్పుడు నా భార్య, రెండవ కుమారుడు మోజెస్ అచ్చటనేయుండిరి. వారు తార్న్‌హిల్ మాటలను విని అపరిమితమగు భయముతో గజ గజవణకిపోసాగిరి. అతడు మాకు అపకారము చేయునని వారు భయపడసాగిరి.

తార్న్‌హిల్ వెళ్ళిపోయిన సంగతి తెలిసికొన్న నా కొమార్తెలిద్దరును ఇంటిలోనుండి మేమున్న ప్రదేశమునకు వచ్చిరి. జరిగిన విషయము నంతను వారికువురకు చెప్పితిమి. అంతయు తెలిసికొన్న తరువాత వారుకూడ నెంతయు భయపడ సాగిరి. కాని నేను మాత్రము అణుమాత్రమైనను భయపడ కుంటిని. అతడు మాకెట్టి హానియు చేయలేడని నేను అను కొంటిని. అతడు చేయవలసిన అపకారము నిదివరకే చేసినాడు. అతడింక ఏ అపకారము చేయబోయినను ఎదుర్కొనుటకు సిద్ధముగనున్నాను. యుద్ధములో దెబ్బలు తగిలినను ఇంకను శత్రువుతో పోరుచుందుము గదా! వెన్నిచ్చి పారిపోవుట భీరు

వుల లక్షణము. ధైర్యవంతులు కడవఱకు శత్రువుల నెదు రొడ్డుదురు.

తార్న్‌హిల్ బెదరింపులు వట్టి బెదరింపులు కావను విష యము త్వరలోనే స్పష్టమయ్యెను. ఏలయన మఱునాటి యుద యముననే తార్న్‌హిల్ గుమాస్తా వచ్చి బాకీపడిన శిస్తునంతను వెంటనే చెల్లించి వేయవలసినదని గట్టిగా కోరెను. జరిగిన విషాద సంఘటనల వలన నేనంతవఱకు ఆశిస్తును చెల్లించి యుండలేదు. ఆనాడుకూడ నేను శిస్తు చెల్లించు పరిస్థితిలో లేకుంటిని. మఱి దాని ఫలితమేమియగును? నాటి సాయంకాలమే ఆ గుమాస్తా మా పశువుల నన్నింటిని తోలుకొనిపోవును. మఱునాడు వానిని సగము ఖరీదుకే అమ్మివేయును.

ఆ సంగతి నెఱిగిన నాభార్యాబిడ్డలు సర్వనాశమునకంగీక రింపవలదనియు ఏదో విధముగా తార్న్‌హిల్‌తో రాజీపడవల సినదనియు నన్ను ప్రార్థించిరి. "తార్న్‌హిల్ ఇదివఱకువలె తఱ చుగా మన యింటికివచ్చుట కనుమతింపుడు" అని వారు నన్ను బతిమాలుకొనిరి. వారింకను ఇట్లనిరి: "పెద్ద భూస్వామియగు తార్న్‌హిల్‌తో విరోధము పెట్టుకొన్నచో మీరనుభవింపవలసి యుండు బాధల నన్నింటిని ఒక్కసారి ఊహించుకొనుడు. ఈ కాలము ఏ మాత్రము మంచిది కాదు. ఇటువంటి కాలములో మీరు జైలులోనుండి అచ్చటి కష్టముల ననుభవింపవలయును. మంటల మూలమున మీ చేయి ఎందుకును పనికిరాకుండపోయి నది. అప్పటినుండి మీ ఆరోగ్యమేమియు బాగుండలేదు. జైలు జీవితము మీ ఆరోగ్యమును సర్వనాశ ముచేయును."

కాని నేను ఏమాత్రము సడలక ఇట్లంటిని: "మీరందఱు

నెందులకిట్లు బాధపడెదరు? ఏది సరియైన పనో, ఏదికాదో నాకు బాగుగ తెలియును. సరియైనపని కాని దానిని చేయుమని మీ రెందులకు నన్ను బలవంతపెట్టెదరు? అసలెందులకు ప్రయత్నింతురు? నా ధర్మముప్రకారము నే నతనిని క్షమించినాను. కాని తప్పుడుపనులలో అతనికి నాకు రాజీఅనునది లేదు. అందులకు నా అంతరాత్మ ఏమాత్రము అంగీకరింపదు. ఒకపని ఏమాత్రము మంచిదికాదని నా హృదయములో అనుకొనుచుందును. కాని ఆపని చాలమంచిదని ప్రపంచమునకు చాటి చెప్పుచుందురా? మానవునకు త్రికరణశుద్ధి యుండవలదా? పిఱికివానివలె నొక చోట కూర్చుండి మనలను ఘోరముగ మోసముచేసిన ద్రోహిని పొగడుట సమంజసమా? నేను జైలుశిక్షను తప్పించుకోవచ్చును. కాని ఇంటివద్దకూర్చుండి నిరంతరము మానసికముగ బాధపడవలసివచ్చునే! ఎప్పటికిని అట్లు జరుగదు!

అటులజరుగుట కేమాత్రమువీలులేదు. మనము ఈప్రదేశమును వీడిపోవలసిన అవసరమురావచ్చును. అయిననుసరే, మన మింకను సన్మార్గమునే అనుసరింతము. మనమెక్కడ నున్న నేమి? మన హృదయములు ఎట్టి కల్మషములేక నిర్మలముగనున్న చాలును. మన హృదయములను శోధించుకొన్నప్పుడు మనకు సంతృప్తి ఆనందము కలుగును.

ఆవిధముగా నేము సాయంకాలమంతయుగడిపితిమి. నాటి రాత్రి హిమము బాగుగకురిసెను. అందువలన మాకుమారుడు మోజెస్ పెందలకడలేచి ఇంటిముందున్న మంచును తొలగించుటలో నిమగ్నుడైయుండెను. అత డావిధముగా కొంచెముసేపు

పని చేసినతరువాత ఇంటిలోనికిపరుగెత్తుకొనివచ్చెను. అప్పుడతని మొగము పాలిపోయియుండెను. కన్నులలో జీవకళ లేకుండెను.

"అట్లున్నావేమి?" అని నేను ప్రశ్నించితిని.

అతనిట్లుసమాధానము చెప్పసాగెను: "మనయింటివంకకు ఇరువురు క్రొత్తమనుజులు వచ్చుచున్నారు. వారున్యాయశాఖకు చెందిన ఉద్యోగులని నాకు బాగుగా తెలియును."

మోజెస్ ఆవిధముగా మాట్లాడుచుండగా న్యాయశాఖోద్యోగు లిరువురును మా యింటిలో ప్రవేశించిరి. వారు తిన్నగా నేను పరుండియున్న మంచమువద్దకువచ్చిరి. తమ యుద్యోగములను, తాము వచ్చినపనిని వారు వర్ణించిచెప్పిరి. పిమ్మట వారు నన్ను తమ అదుపులోనికి తీసికొనిరి. "మీరిచ్చటకు పదునొకండుమైళ్ళ దూరముననున్న జైలుకు వచ్చుటకు సిద్ధపడవలయును" అని వారు నాతో నిట్లనిరి.

అప్పుడు నేను వారితో నిట్లంటిని: "మిత్రులారా! మీరు నన్నిప్పుడు జైలుకు తీసికొనిపోవుటకై వచ్చియున్నారు. కాని ఈకాలము ఏమాత్రము బాగుండలేదు. వాతావరణమంతయు ప్రతికూలముగ నున్నది. మీ రీ సమయమున వచ్చుట చాల దురదృష్టకరమైన విషయము. ఏలయన మాయింటి అగ్నిప్రమాదములో చేయి యొకటి దెబ్బతిన్నది. నాకిప్పుడు స్వల్పముగా జ్వరమున్నది. కప్పుకొనుట కిప్పుడు నాకు మొద్దుబట్టలు కావలయును. నేను ముసలివాడనై పోయినాను. శరీరము చాల బలహీనముగనున్నది. బయట మంచు బాగుగా పడినది. ఈ మంచులో నడచిరాజాలను. కాని తప్పనిసరియైనచో......

పిమ్మట నేను నాభార్యాబిడ్డలవంకకు తిరిగి, "మనయింట

నింకను మిగిలియున్న వస్తువులన్నిటిని మూటగట్టుడు. వెంటనే ఈ ప్రదేశమును వీడిపోవుటకు సిద్ధముగానుండుడు." ఆ పనిని త్వరితగతిని చేయవలసినదని మఱియొకసారి కోరితిని.

నా మొదటి కూతురు, "ఈ కష్టములకన్నిటికి నేనే మూలకారణమును. నేను పాపిని" అని యనుకొని విచారింప సాగెను. ఆ విచారముతో నామె మూర్ఛ మునిగెను. అంతట నా కోరికపై మోజెస్ ఆమెకు ఉపచారము చేసెను కొన్ని నిమిషముల కామెకు తెలివి వచ్చెను.

నాభార్య అపరిమితమగు భయముతో పాలిపోయి గజగజ వణకసాగెను. ఆమె మా చిన్న కుమారుల నిరువురను గట్టిగా పట్టుకొనెను, ఏమియు తెలియనివారు క్రొత్తవారిని చూచుటకు భయపడి తల్లిని గట్టిగా కౌగలించుకొనసాగిరి. నేను నాభార్య నుత్సాహపఱచ సాగితిని. ఈలోపల నా రెండవ కొమార్తె సోఫియా నా సూచనల నన్నిటిని గ్రహించి సామానులను మూటలు కట్టెను. ఒక గంటసేపగువప్పటికి మే మందఱము ప్రయాణమునకు సిద్ధపడితిమి.

## 2వ

మేము మాగృహమును వీడి మెల్ల మెల్లన నడచి పోసాగితిమి. నాపెద్ద కూతురు ఒలీవియాకు కొద్దిరోజులనుండి జ్వరము వచ్చుచుండెను. ఆ జ్వరము ఆమెను పీల్చిపిప్పిచేయు చుండెను. అందువలన నామె నడవలేకుండెను. అప్పుడు న్యాయ శాఖోద్యోగులలో నొకడు ఎంతో దయతో గుఱ్ఱముపై తనవెనుక

భాగమున కూర్చుండ బెట్టుకొనెను. పాపము; వారుకూడ మాన వులు, వారిలోకూడ మానవత్వమున్నది. నాకుమారుడు మోజెస్ చిన్నకుమారులలో నొకనిని చేయిపట్టుకొని నడిపించు చుండెను. నాభార్య మఱియొక చిన్నకుమారుని చేయిపట్టుకొని నడిపించు చుండెను. నేను నా రెండవ కూతురు సోఫియా నాను కొని నడచిపోవు చుంటిని. ఆమె సంతతధారగా కన్నీరుకార్చు చుండెను.

కొంచెము సేపగునప్పటికి, మేము మాయింటినుండి కొన్ని మైళ్ళదూరము పోయియుంటిమి. అప్పటికి కొందఱు మనుజులు మా వెనుకగట్టిగా కేకలు వేసికొనుచు, అఱచుచు పరుగెత్తు కొనుచు వచ్చుచుండిరి. కొంతసేపటికి వారు మమ్ముకలిసికొనిరి. వారు సుమారు ఏబదిమంది యుండిరి. వారందఱు మాగ్రామము నకు చెందినవారే. వారు న్యాయశాఖోద్యోగులను కడుభయంక రముగ తిట్టసాగిరి. "మా శరీరములో రక్తమున్నంతవఱకు మా మతాధికారి జైలుకుపోవుట నేమాత్రము సహింపజాలము" అని వారు శపథము చేయసాగిరి.

గ్రామస్థులు న్యాయశాఖోద్యోగుల నిరువురను పట్టు కొని తీవ్రముగా శిక్షింపబోవు చుండిరి. అప్పుడు నేను జోక్యము కలిగించుకొంటిని. లేనిచో చాల అవాంఛనీయమైన సంఘట నలు జరిగి యుండెడివి. ఎంతో కష్టముమీద రెచ్చిపోయిన గ్రామస్తుల బారినుండి న్యాయశాఖోద్యోగుల నిరువురను రక్షించి తిని. నాకింక విముక్తి తథ్యమని నాపిల్లలు భావింపసాగిరి. అపుడు వారికి కలిగిన ఆనందమునకు పట్ట పగ్గములు లేకుండెను. వారా సంతోషముతో కేకలు వేయసాగిరి. కాని అనతి కాలము

లోనే వారి ఆశలు అడియాసలయ్యెను. నాకు సేవచేయుటకు వచ్చిన జనుల నుద్దేశించి నే నాడిన మాటలు వారికి తీవ్రమగు ఆశాభంగమును కలిగించెను.

నేను జనులతో నిట్లంటిని: "మిత్రులారా! ఎంతఆశ్చర్యకరమగు విషయము! మీరు నాపట ప్రేమను ప్రదర్శించు విధానమిదియేనా? చర్చిలోనేను మీకెన్నోసార్లు మంచిబోధలు చేసియుంటిని. వానిని అమలులోపెట్టు విధానమిదియేనా? మీప్రవర్తన నాకు ఆశాభంగమును కలిగించు చున్నది. న్యాయశాఖోద్యోగులను చూడవలసిన విధానమిదియేనా? మీరీవిధమున ప్రవర్తించుటవలన మీరు, నేనుకూడ చెడిపోవుట తథ్యము. మీ నాయకు డెవ్వరు? మిమ్ములనందఱి నీవిధముగ నిచ్చటకు తీసికొనివచ్చినవారెవరో చెప్పుడు. నేనతనిప్రవర్తనను తీవ్రముగ ఖండించుచున్నాను.

మీరందఱు ఆలోచనారహితముగ నిచ్చటకు వచ్చియున్నారు. మీరు భగవానునిపట్ల, దేశముపట్ల నాపట్ల మీకుగల విధ్యుక్తధర్మమును మఱచి పోయినారు. వెంటనే మీ మీ యిండ్లకుపోయి మీ విధ్యుక్తధర్మమును నెఱవేర్పుడు. ఎప్పటికైనను నేను మఱియొకసారి మిమ్ముచూడగలనని ఆశించుచున్నాను. అప్పుడుమీకు ఎక్కువ సౌఖ్యము చేకూర్చుటకు ప్రయత్నింతును. మిమ్మందఱును నేను మంచిగా జ్ఞాపక ముంచుకొనుటకు కావలసిన పరిస్థితిని సృష్టింపుడు. వెంటనే ఈ ప్రదేశము ను వీడిపొండు. మీకందఱకు శుభములు కలుగవలయునని ఆశీర్వదించుచున్నాను. ఇంకపొండు."

నామాటలను విన్న జనులు న్యాయశాఖోద్యోగులను కొట్ట

బోయి సంపులకెంతయు పశ్చాత్తాపమును ప్రకటింప సాగిరి. విచారముతో వారు కన్నీరుకార్చ సాగిరి. వారు ఒక్కొక్కరే నాయొద్దకువచ్చి నమస్కరించి వెళ్ళిపోసాగిరి. నేను ప్రత్యేయొక్కరితోను కరచాలనము చేసితిని. అందఱను ఆశీర్వదించితిని.

గ్రామస్థులందఱును వెళ్ళిపోయిన తరువాత మా ప్రయాణము నెప్పటివలె కొనసాగించితిమి. మాకింక త్రోవలో ప అడ్డును సంభవింప లేదు. ఇంకను రాత్రిపడకముందే మేము జైలు వున్న పట్టణమును చేరుకొంటిమి. అన్నట్టది యిప్పుడు పట్టణము కాదు; గ్రామముమాత్రమే. అందు కొన్ని పూరిండ్లుమాత్రమే యున్నవి. ఒకప్పుడది పెద్ద జనాభాగల గొప్ప పట్టణము. కాని యిప్పుడాచిహ్నములేవియు లేవు. ఒక్క జైలుమాత్రము మిగిలి యున్నది.

గ్రామములో ప్రవేశించిన తరువాత మేము పూటకూళ్ళ యింటిలో ప్రవేశించితిమి. అచ్చట మేము వెంటనే లభించిన ఆహార పదార్థములను, పానీయములను సేవించితిమి. నేను ఎప్పటి యుల్లాసముతో మా కుటుంబము వారందఱితో కలసి భోజనము చేసితిని. వారికందఱకు నాటిరాత్రి కచ్చట వసతి సౌఖర్యముల నేర్పఱచితిని. తరువాతనేను న్యాయశాఖోద్యోగులతో కలసి జైలుకుపోతిని. ఆజైలు పూర్వము యుద్ధఖైదీలను బంధించుటకు నిర్మింపబడి యుండెను. ఆ ఖైలులో నొకపెద్ద ఉమ్మడిగది యుండెను. ఖైదీలను పగలు ఆ పెద్దగదిలో నుంచుచున్న, రాత్రి సమయములందు బంధించుటకు ఒక్కొక్క ఖైదీకి ఒక్కొక్కగది యుండెను.

నేను ఖైదులో ప్రవేశించితిని. అచ్చటి వారందఱును

విచారించు చుందురనియు, తమ దురదృష్టమును తలంచుకొని గోలుగోలున నేడ్చుచుందురనియు నేను తలచితిని. కాని అచ్చటనంతయు అందుకు వ్యతిరేకముగా నుండెను. అచ్చటి వారందఱును తమ దుఃఖమును మఱచిపోయి ఆనంద సాగరమున నీదులాడుటకే ప్రయత్నించు చుండిరి. "ఇచ్చటకు వచ్చిన క్రొత్త ఖైదీలు మొట్టమొదట మాకందఱకు సారాయము పోయించ వలయును" అని ప్రాతఖైదీలు నాతో ననిరి. నేను వారు చెప్పి నట్లు చేయుటకు అంగీకరించితిని. అప్పటికి నావద్దనున్న డబ్బు చాలవఱకు ఖర్చయిపోయెను. ఉన్న కొద్దిసొమ్మును వారికిచ్చి తిని. వారు దానిని సారాయము కొఱకిచ్చిరి. అనతికాలములో సారాయము వచ్చెను. దానిని వారు చిత్తుగాత్రాగి కేకలు, బొబ్బలు పెట్టసాగిరి; నవ్వసాగిరి; నిర్లక్ష్యముగ దూషింపసాగిరి. జైలంతయు రణగొణధ్వనితో నిండిపోయెను.

అప్పుడు నాలోనేను ఇట్లనుకొంటిని: "అయ్యయ్యో! అనేక నేరములు చేసిన వీరు ఎంతో ఉల్లాసముగ కాలముగడుపు చున్నారు. ఏ నేరము చేయని నేను విచారముతో కృశించిపోవు చున్నాను. ఇదియెట్లు సంభవించుచున్నది? వారును నేనును ఒక జైలులోనున్నాము. వారికంటె నేనే ఎక్కువ సంతోషముగ నుండుటకు చాల కారణములున్నవి."

ఆ విధముగ ననుకొనుచు ఉల్లాసముగ నుండుటకు ప్రయ త్నింప సాగితిని. కాని ఉల్లాసమనునది ప్రయత్నము చేయుటవలన రాదు. పైగా ఆప్రయత్నములోనే కష్టమున్నది. నేను ఆలోచించు కొనుచు జైలులో నొకమూల కూర్చుంటిని. అంతలో తోడి ఖైదీ యొకడు నావద్దకు వచ్చెను. అతడు నాప్రక్కనే కూర్చుండి

సంభాషణ కుపక్రమించెను. నాతో నెవ్వరు మాట్లాడవలచినను సరే, నే నెప్పుడును అందులకు సంసిద్ధుడనే. అట్టివారి నెవ్వరిని నేను నిరుత్సాహ పఱచను. అది నాజీవిత సూత్రము. ఇతరులు చెప్పుమాటలు మంచివైనచో వానివలన నేను లాభము పొందవచ్చును; చెడ్డవైనచో నేను వారిని బాగుచేయుటకు ప్రయత్నింప వచ్చును.

నా ప్రక్కనే కూర్చున్న ఖైదీకి ఎన్నో విషయములు తెలియునని నేను గ్రహించితిని. ప్రపంచ జ్ఞానమతనికి బాగుగ నున్నది. మానవ స్వభావ మతనికి బాగుగ తెలియును. "మీరు పరుండుటకు తగిన శయ్యను అమర్చుకొని యున్నారా?" అని అతడు నన్ను ప్రశ్నించెను. ఇంటివద్ద నున్నప్పుడు నేనా విషయమునుగూర్చి ఆలోచింప వలసిన పనిలేకుండెను. జైలుకు వచ్చిన తరువాత ఆవిషయమింకను నాకు తట్టనేలేదు" అని సమాధాన మిచ్చితిని.

"అది నిజముగా చాల దురదృష్టకరమైన విషయము. ఇచ్చట మీకు పరుండుటకు గడ్డితప్ప మఱి యింకేమియు నీయరు. మీగది చాలపెద్దది. అచ్చటచాల చల్లగానుండును. మీరు గౌరవనీయునివలె కనబడుచున్నారు. ఒకప్పుడు నేనుకూడ గౌరవనీయుడనే. అందువలన నా ప్రక్కబట్టలో కొన్నింటిని మీ కిచ్చుటకు నేను సిద్ధముగా నున్నాను" అని అతడనెను.

నేనందుల కతనికి కృతజ్ఞతను తెలిపితిని. జైలులోనున్న దురదృష్టవంతులలోగూడ అటువంటి మానవత్వ మింకను మిగిలియున్నందుకు నేను ఆశ్చర్యమును ప్రకటించితిని. "బాధలలోనున్నపుడు స్నేహితులుండుట అవసరము. ఏలయన

స్నేహితులు మన సౌఖ్యములలోనేగాక బాధలలోగూడ పాలు పంచుకొందురు. ఒక ఋషిపుంగవుడు ఆ విషయమునుగూర్చి చక్కగా చెప్పియున్నాడు. ఒక్క ఏకాంతవాసమే మానవునకు శరణ్యమైనచో ఇంక నీ ప్రపంచ మెందులకు?"

అంతట నా తోడిఖైదీ ఇట్లనెను: అయ్యా! మీరు ప్రపంచమునుగూర్చి మాట్లాడుచున్నారు. ప్రపంచమిప్పుడు వృద్ధాప్యదశలోనున్నది. యుగయుగాలనుండి ప్రముఖవేదాంతులు ఈ ప్రపంచసృష్టినిగూర్చి వేర్వేఱు అభిప్రాయములు వెలిపుచ్చుచున్నారు. ప్రపంచసృష్టి వారికి కొఱుకరానికొయ్యగనేయున్నది. వారు ఎన్నిరకముల అభిప్రాయములు వెలిపుచ్చినారు! ఎన్ని విధములుగా ప్రయత్నించినారు! వారందఱి ప్రయత్నములును వృథాయైనవి!"

అప్పుడు నేను మధ్యలోకల్పించుకొనియిట్లంటిని: "మీరు గొప్ప పాండిత్యమును వెలిపుచ్చుచున్నారు. అట్టి సమయమున నేను అడ్డువచ్చినందుకు క్షమింపవలసినదిగా కోరుచున్నాను. ఈ విషయములన్నిటిని నేనుఇదివఱకే వినియున్నాననుకొందును. ఇదివఱ కొకసారి వెల్బ్రిడ్జి సంతలో మిమ్ము దర్శించు సదవకాశము లభించిన దనుకొందును. మీ పేరు ఎఫ్రాయిమ్ జెంకిన్సన్ కాదా?"

నా ప్రశ్నను విని అతడు నిట్టూర్పుపుచ్చెను.

నేనింకను నిట్లంటిని: "మీకు డాక్టర్ ప్రిమ్రోజ్ జ్ఞప్తియందున్నాడా? అతనివద్ద మీరొక గుఱ్ఱమును కొనియుంటిరి."

అప్పుడతడు నన్ను జ్ఞప్తికి తెచ్చుకొనెను. అంతకుమును పతడు నన్ను గుర్తించియుండలేదు. నేను గుర్తుకువచ్చిన

తరువాత నత డిట్లనెను: "అయ్యా! మీరు నాకు బాగుగ జ్ఞప్తియం దున్నారు. మీవద్ద నేనొక గుఱ్ఱమును కొన్నాను. కాని మీకు అప్పుడు షామిర్మయలేదు షామ్మిర్చుట మఱచిపోయినాను. మీ పొరుగువనేయున్న ఫ్లామ్‌బరోనుగూర్చిమాత్రమే నేనిప్పుడు భయపడుచున్నాను. అతనిమూలమునవనే నాకు మఱియొకసారి జైలుశిక్ష పడును. ఏలయన నేను దొంగనాణెములు ముద్రించు చున్నానని అతడు ప్రమాణముచేసి చెప్పబోవుచున్నాడు. నేను మిమ్మగాని మఱి యే యితరులనుగాని మోసగించినందుకు హృదయపూర్వకముగ విచారించుచున్నాను. ఏలయన చూడు డివిగో ఈ శృంఖలములు! నా పాడుబుద్ధియే సన్నిస్థితికి తెచ్చి నది! ఇదియంతయు నేను చేసికొన్న కర్మ."

అప్పుడు నే నిట్లంటిని: ఈ జైలులోనున్న నేను మీకు ఏ సాహాయ్యము చేయలేనని తెలిసియు, మీరు మీప్రక్కవస్తు లను కొన్నిటిని నాకిత్తునని అన్నారు. ఇది మీమంచితనమునకు చిహ్నము. ఇందుకు నేను మీకు తగినయుపకారముచేయుదును. ఫ్లామ్‌బరో సాక్ష్యమును చాలవఱకు తగ్గించుటకుగాని, పూర్తిగా అణచివేయుటకుగాని నేను ప్రయత్నింతును. మొదటిఅవకాశము లభింపగనే ఈపనిమీద నేను నా కుమారుని అతనివద్దకు పంపె దను. నాకోరిక నతడు నిస్సందేహముగా మన్నించును. అదియు గాక నేనుగూడ మీకు అనుకూలముగ సాక్ష్యము చెప్పెదను. మీరా విషయమునుగూర్చి అణుమాత్రమైనను భయపడవలదు."

"అయ్యా! నే నిందులకు తగిన ప్రత్యుపకారము చేయు దును. నేను నా ప్రక్కవస్తువులలో సగముకంటె ఎక్కువభాగ మును మీ కొసగెదను. ఈ జైలులో నాకు మంచి పలుకుబడి

యున్నది. ఇచ్చట నున్నంతవఱకు నేను మీకు మంచి స్నేహితుడుగా నుందును అని అత డనెను.

"నేను మీకెంతయు కృతజ్ఞుడను. కాని ఒక్క విషయము మాత్రము నాకు అపరిమితమగు ఆశ్చర్యము కలుగజేయుచున్నది. మీరిప్పుడు మంచి వయస్సుగల యువకునివలె నున్నారు. కాని వెనుక నేను మిమ్ము చూచినపుడు కనీసము అరువదిసంవత్సరముల వయస్సుగల వృద్ధునివలెనున్నారు. ఇది ఎట్లు సంభవము?" అని నేను సందేహము వెలిపుచ్చితిని.

అంతట నత డిట్లనెను: అయ్యా! మీకీ ప్రాపంచిక వ్యవహారములతో నేమాత్రము సంబంధము లేనట్లున్నది. అప్పుడు నేను దొంగజుట్టు ధరించియుంటిని. నేను పదునేడు సంవత్సరముల యువకునివలె వేషము వేసికొనగలను డెబ్బది సంవత్సరముల వృద్ధుని వేషముకూడ వేసికొనగలను. ఇంత మోసగాడ నగుటకు నేనెంతో కృషిచేసినాను. ఏదేని వృత్తిని నేర్చుకొనుటకు నే నీకృషిలో సగము కృషిని చేసియుండినను నేడు నేను గొప్ప ధనవంతుడనై యుండెడివాడను. నేను దుర్మార్గుడనే. అయినను మీకు స్నేహితుడుగా నుండగలను. నేను మీ కుపకారము చేయుదునని అనుకోని సమయమునందు మీ కుపకారము చేయగలను."

మా సంభాషణ ఇంకను చాలసేపు కొనసాగియుండెడిదే. కాని అంతలో జైలు అధికారిసేవకు లచ్చటకు వచ్చిరి. వారు ఖైదీల పేర్లను పిలిచి ఎవరిగదిలో వారిని బంధించుటకై వచ్చియుండిరి. వారు నాకొఱకు నిర్ణయింపబడిన గదిని తెలిపిరి. ఎండు గడ్డిమోపును నెత్తిమీద పెట్టుకొన్న సేవకుడొకడు నన్ను

చీకటి దారులగుండా తీసికొనిపోయి ఒక పెద్దగదిలో ప్రవేశ పెట్టెను. అతడు గడ్డిమోపును క్రిందపడవైచి, "దీనిని మీరు ప్రక్కగా వేసికొనుడు" అని యనెను.

"కృతజ్ఞుడను" అని నేనంటిని.

గదిలో నొకమూల గడ్డిని పఱచితిని. అంతకుమునుపే నా జైలుమిత్రుడు తన ప్రక్కబట్టలలో కొన్నిటిని నాకొసగి యుండెను. నేను వానిని గడ్డిపనుపుపైన పఱచితిని.

నన్నచ్చటకు తీసికొనివచ్చిన సేవకుడు చాలమంచివాడు. "అయ్యా! మీ రీ రాత్రి ఇచ్చట సుఖముగా నిద్రింపవలయునని కోరుచున్నాను. ఇంక సెలవు" అని యతడు వెళ్ళిపోయెను. అంతట నేను దేవుని ధ్యానించితిని. అందఱిని సన్మార్గమునకు తీసికొనివచ్చు సర్వలోకరక్షకుని స్తుతించితిని. తరువాత నేను పక్కపై పరుంటిని. అనతికాలములో నాకు నిదురపట్టెను.

తెల్లవారువఱకు సుఖముగా నిద్రించితిని.

# 26

మఱునాటి యుదయమున నా కుటుంబము వారు నన్ను నిదురనుండి మేల్కొల్పిరి. వారు కన్నీరు కార్చుచు నాశయ్యను ప్రక్కనే కూర్చుండి యుండిరి. పరిస్థితులు వారికి అపరిమితమగు విచారమును కలిగించుచుండెను. కన్నీరు కార్చుచున్నందుకు నేను వారిని మెల్లన మందలించితిని. "మీ రెందులకు విచారింతురు? నిన్న రాత్రి నిదురించినంత ప్రశాంతముగ నే నిదివఱ

కేస్నడును నిదురించి యుండలేదు. నామాట నమ్ముడు. నన్ను గూర్చి విచారింపకుడు" అని అంటిని.

అచ్చటకు వచ్చిన వారిలో ఒలీవియా లేదు. అందువలన, "లిపీ ఏమైనది ?" అని నేను వారిని ప్రశ్నించితిని. అపుడు నా భార్య ఇట్లనెను: "నిన్న జరిగిన సంఘటన, అసట ఆమె జ్వరమును హెచ్చించినవి. అందువలన నామెను తీసికొని వచ్చుట శ్రేయస్కరము కాదని పూటకూళ్ళ యింటిలోనే ఉంచి వచ్చినాము."

తరువాత నేను నా కుమారుడు మోజెస్‌తో నిట్లంటిని: "అబ్బాయి! మీరు బసచేసిన పూటకూళ్ళ యిల్లు ఇచ్చటకు చాల దూరమున నున్నది. అచ్చటినుండి ఇచ్చటకు వచ్చుట శ్రమతో కూడిన పని కావున ఈ జైలుకు సమీపమున మీరు మకాము చేయుటకైదైన ఇల్లు దొరకునేమో వెదకి కనుగొనుము."

వెంటనే మోజెస్ ఆ పనిపై పోయెను. కొంతసేపటికతడు తిరిగివచ్చి యిట్లనెను: "నాన్నా! నేను అన్ని ఇండ్లను వెదకినాను. మా కందఱకు సరిపోవు స్థలము దొరకలేదు. ఒక్క గది మాత్రము దొరకినది. అందు మా అమ్మ, అమ్మాయిలిద్దఱు నివసింపవచ్చును."

జైలు అధికారి చాల మంచివాడు. అందువలన అతడు నా కుమారులు ముగ్గురును నాతోబాటు జైలులోపనుండుటకు అనుమతి యొసగెను. అందువలన నా గదిలో నొకమూల వారి ముగ్గురకు సరిపడు పక్క ఏర్పాటు చేయఁబడెను. దానిని చూచి నేను సంతృప్తి చెందితిని.

జైలులో పరుండుటకు నా కడపటి కుమారులిరువురు ఇచ్ఛగించుచున్నారో లేదో తెలిసికొనదలచి నేను వారితో నిట్లంటిని: "నాయనలారా! మీకు చాల మంచివారుగాని ఈ గది ఎట్లున్నది? మీ కొఱకు సిద్ధము చేయబడిన ఈ క్రొత్త ప్రక్క ఎట్లున్నది? ఈ గది చీకటిగానున్నది. అయినను ఇచ్చట పరుండుటకు మీరు భయపడరనుకొందును."

అప్పుడు డిక్ ఇట్లనెను: "భయమెందుకు, నాన్నా! మీరుండగా భయమెందుకు? మీరుండు ప్రదేశమెట్టిదైనను మేము నిర్భయముగ పరుందుము."

నాలుగు సంవత్సరముల బిల్ ఇట్లనెను: "మా నాన్న ఉన్న ప్రతిచోటు నాకు ఇష్టమైన చోటే."

తరువాత నా కుటుంబములోని వారు ఎవరెవరే పనులు చేయవలయునో నిర్ణయించితిని. నేనిట్లంటిని: "సోఫియా! నీ సోదరి ఆరోగ్యము క్రమక్రమముగ క్షీణించుచున్నది. కావున నీవామెను కనిపెట్టుకొని యుండవలయును. ఆమెకు ఎప్పటి ఆరోగ్యము చేకూరునట్లు నీవు చేయవలయును. డెబోరా! నీవు నన్ను కనిపెట్టుకొని యుండుము. డిక్! బిల్! మీరు నావద్ద కూర్చుండి చదువు చుండవలయును. ఇక మోజెస్! నీవు చెమటోడ్చి కష్టపడి పనిచేసి డబ్బు సంపాదింపవలసియున్నది. మన కుటుంబము వారందఱు నీ సంపాదన పైననే ఆధారపడి యుందురు. నీవు ప్రతి దినము పనిచేసి తెచ్చు కూలి మన కందఱకు సరిపోవును; అంతియకాదు, మనము సుఖముగా జీవింపవచ్చును. వచ్చిన దానిని జాగ్రత్తగా ఖర్చుపెట్టుకొను విధానమును మాత్రము నేర్చుకొనవలయును.

మోజెస్ ! నీవు ఇప్పుడు పదునాలు వత్సరముల ప్రాయ ముగలవాడవు. నీకు కావలసినంత బలమున్నది. భగవానుడు నీకాబలము నెందుల కిచ్చినాడు? దానినసద్వినియోగము చేయుటకే. నిస్సహాయులగు మన కుటుంబము వారిని ఆకలి బాధ నుండి రక్షించుటకు నీవాశక్తి నుపయోగింపవలసి యున్నది. అందువలన తేపటినుండి పనిచేయుటకు కావలసిన ఏర్పాటును ఈ రోజుననే చేసికొనుము. ప్రతి దినము పనిపూర్తియైన తరువాత వచ్చు డబ్బును ఇంటికి తీసికొని వచ్చి కుటుంబ ఖర్చులకు వినియోగింపుము."

ఆ విధముగా అన్ని విషయములను నిర్ణయించిన తరువాత నేను ఉమ్మడి గదిలోనికిపోతిని. అచ్చట గాలి, వెలుతురు బాగుగ నుండునను నుద్దేశ్యముతోనే నేనట్లు చేసితిని. కాని నేనచ్చట ఎంతోసేపు ఉండలేకపోతిని. అచ్చటకు వచ్చిన ఇతర ఖైదీలు తమ చిత్తము వచ్చినట్లు పశువులవలెను; రాక్షసుల వలెను ప్రవర్తింపసాగిరి. నాకు వారి ప్రవర్తన ఏ మాత్రము నచ్చలేదు. అందువలన నా గదిలోనికి తిరిగి వచ్చితిని. అచ్చట నేను కూర్చొని ఇతర ఖైదీల ప్రవర్తనను గూర్చి ఆలోచింప సాగితిని. వారెందుల కట్లు ప్రవర్తించుచున్నారు? వారు తమ భవిష్యత్తును ఎందులకు నాశనము చేసికొనుచున్నారు? మానవ జాతి వారిపై నెందుకు ధ్వజమెత్తినది ?

వారిపట్ల నాకు అపరిమితమగు సానుభూతి కలుగసాగెను. వారిని గూర్చి ఆలోచించుటతో నా మనస్సులోని కష్టములు కూడ పటాపంచలయ్యెను. తోడి ఖైదీలనందరును మంచి మార్గమునకు తీసికొని రావలయు ననుకొంటిని. అది నా విధ్యుక్త

ధర్మమనుకొంటిని. అందువలన నేను మరల ఉమ్మడి గదిలోనికి పోవలయునని నిశ్చయించుకొంటిని. వారు నన్ను నిర్లక్ష్యముచేసినను సరే, వారికి నా మంచి సలహాల నీయవలయునని అనుకొంటిని. ఏమైనను సరే పట్టుదలతో పనిచేసి వారి జీవితములను సంపూర్ణముగా మార్చివేయవలయునని అనుకొంటిని.

తరువాత నేను ఉమ్మడి గదిలోనున్న ఖైదీల మధ్యకు పోతిని. జైలు మిత్రుడు జెంకిన్సన్‌ను కలసికొని అతనికి నా నిర్ణయమును తెలిపితిని. అంతయు విన్న తరువాత నతడు కడుపుబ్బ నవ్వెను. కాని యతడా విషయమును మిగిలిన ఖైదీల కందరకు తెలియజేసెను. నా సూచనను వారందరును హర్షధ్వానములతో స్వీకరించిరి. అందుకు కారణమేమో తెలియునా? అంతవఱకు వారు ప్రాతపద్ధతులతో ఆనందము ననుభవించుచుండిరి; కష్టముల మఱచిపోవుచుండిరి. ఇప్పుడు నాసూచన ఆనందము ననుభవించుటకు వారి కొక క్రొత్త పద్ధతిగా నుండెను. ఆదృష్టితోనే వారు సూచనను హర్షించిరి. అంతియ కాని వారు నా సూచనలలోని అసలు ఆంతర్యమును గ్రహించినట్లు లేదు. ఏమైననేమి? వారు నా మాటలను వినుట కంగీకరించిరి. కావున వారి నెట్లయినను బాగుచేయవచ్చునని నేను తలచితిని.

తరువాత నేను పవిత్రగ్రంథమగు బైబిలులోని కొన్ని భాగములను గంభీరస్వరముతో వారికి చదివి వినిపింపసాగితిని. అందరును వినసాగిరి. వారి కదియంతయు తమాషాగానుండెను. మరికొందఱు దగ్గిరి, మఱికొందఱు తుమ్మిరి. ఇంకను కొందఱు కనుబొమలు ఎగురవైచిరి. వారి కదియంతయు నొక ఆటగా నుండెను. అయినను నేను నా పవిత్ర పథ్యమును మానలేదు.

కొందఱైన నా పఠనమువలన బాగుపడుదురని నేను గాఢముగ విశ్వసించుచుంటిని.

పఠనము పూర్తియైనతరువాత అచ్చటనున్న వారినుద్దేశించి మాటాడసాగితిని. నా యుపన్యాసము మొట్టమొదట వారిని ఉల్లాసపఱచుట కుద్దేశింపబడినట్టిదే కాని కోపపడుట కుద్దేశింపబడినట్టిది కాదు. నేను వారితో నిట్లంటిని: "మిత్రులారా! నే నెందుల కీవిధముగ శ్రమపడుచున్నాను? ఏదో స్వలాభము కొఱకు నే నీవిధముగ చేయుటలేదని తెలిసికొనుడు. మీ క్షేమమును కాంక్షించియే నే నీవిధముగ చేయుచున్నాను. నేను మీ తో డి ఖైదీని. మీకు బోధించుటవలన నాకు ప్రత్యేకముగ కలుగు లాభమేదియు లేదు. మీరు అపవిత్రకరమైన మాటలు మాట్లాడుచున్నారు. మీమాటలు నాకు అపరిమితమగు విచారమును కలిగించినవి. మీరట్లు మాట్లాడుటవలన మీకు కలుగు లాభ మణుమాత్రమైనను లేదు; పైగా మీరెంతో నష్టపడవచ్చును. మిత్రులారా! ప్రపంచము మిమ్ము తృణీకరింపవచ్చును. కాని నేను మిమ్ము నా స్నేహితులుగా భావించుకొనుచున్నాను. మీ మంచినే కోరుచున్నాను.

మీదూషణలవలన, ప్రమాణములవలన మీ పస్సులోనికి ఒక పెన్ని నాణెమైన వచ్చునా? ఒక్కచిల్లి గవ్వయైనను రాదే! మఱి మీ రెందులకట్లు మాట్లాడెదరు? ప్రతిక్షణము పిశాచము నెందుకు తలచుకొనుచుందురు? పిశాచముతో నెందుకు స్నేహము చేయుచుందురు? పిశాచము మిమ్ము ఎట్లు ఉపయోగించుకొనునో మీకు తెలియదా? పిశాచము మీతో స్నేహము చేసి మీకు చేకూర్చిన లాభమేమో? ఒక్కపరి ఆలోచించు

కొనుడు. మీ రీ విధముగ చెడిపోవుటకు, నిరంతరము అసభ్యముగ మాట్లాడుటకు కారణము పిశాచమేకదా? పిశాచమును తలచుకొనుటవలన మీ కడుపేమైన నిండుచున్నదా? పిశాచము చేయుపనులు నాకు బాగుగ తెలియును. మీకు నష్టమేకాని లాభమేమియు కలుగదని నేను ఉద్ఘాటించుచున్నాను.

మన మొక మానవునితో స్నేహము చేసితిమనుకొనుడు. నమ్మిన మనల నతడు ఘోరముగ మోసముచేసినాడనుకొనుడు. అప్పుడు మనము ఏమిచేయుదుము? అతని స్నేహమును మాని మఱియొకరి స్నేహముచేయుదుము. అట్లే మీరుకూడ చేయరాదా? భగవంతుడు తన్ను నమ్మినవారికందఱకు మేలుచేయును. ఈ విషయము మనకందఱకు బాగుగ తెలియును. మఱి మీరందఱు ఆ భగవానుని ఏల శరణువేడరాదు? అతడు మిమ్ము క్షమించి ఆశీర్వదించును. ఒకప్పుడొక తెలివితక్కువవాడు ఒక యిల్లు దోచుకొనెను. తరువాత నతడు దొంగలను పట్టుకొను వారి రక్షణను కోరెను. మఱి అప్పుడు వానిగతి ఏమయ్యెను? దొంగతనముచేసిన నేరమున నతడు ప్రాణములు కోల్పోయెను. మీరుకూడ నట్లేచేయుదురా? మీరు చెడ్డ సహవాసమువలన ఎన్నో అవినీతికర కార్యములు చేసినారు. అందుకు ఫలముగ మీరు జైలుకు వచ్చినారు. మఱియిప్పుడు మీ కర్తవ్యమేమి? సర్వలోక రక్షకుడగు భగవంతుని ఆశ్రయించుటయా? లేక మిమ్ములనింకను పాడుచేయు పిశాచము నాశ్రయించుటయా? మీరందఱును ఈ విషయమునుగూర్చి జాగ్రత్తగా నాలోచించుకొని ఒక నిర్ణయమునకు రండు."

నా యుపన్యాసము ఖైదీలను బాగుగా నాకర్షించెను.

కొందఱు నావద్దకువచ్చి హృదయపూర్వకముగ కరచాలము చేసిరి. "మీరు చాల మంచివారు; నిజాయితీపరులు. మీతో స్నేహముచేసి ఇంకను పలువిషయములు తెలిసికో వలయునని మేము గాఢముగ వాంఛించుచున్నాము" అని వారు అనిరి. "నేను రేపుగూడ ఉపన్యసింతును మీరందఱును విని లాభము పొందుడు" అని నేను వాగ్దానము చేసితిని. ఖైదీల హృదయము లను తప్పక మార్చగలననియు, వారు మంచి మార్గమున తమ జీవితములను గడపుకొందురనియు నేను నమ్మసాగితిని.

మనుజుడు ఎంత చెడ్డవాడైనను సరే. అతడింక బాగు పడడని తలచుటకు వీలులేదు. ఎంతటి పతితుడైనను మారుటకవ కాశము కలదు. అట్లతడు మారుటకు తోడ్పడువాడు చాల గట్టి వాడై యుండవలెను. నేను మొదటినుండియు ఈ విధముగ నభి ప్రాయపడు చుంటిని. అందువలననే నేను ఖైదీల జీవిత పథము లను మార్చగలనని గట్టిగా నమ్ముచుంటిని.

ఆ విధముగా సంతృప్తిచెందిన తరువాత నేను నా గది లోనికి పోతిని. అప్పుడచ్చట నాభార్య భోజనము సిద్ధముగా నుంచెను. అంతకుముందు జెంకిన్సన్ నాతో నిట్లనియుండెను: "అయ్యా! నా భోజనమునుగూడ మీవద్దకు తెచ్చుకొందును. మనము కలసి భోజనము చేయుదము. మీతో మాట్లాడుట నాకెంతయు సంతోషదాయకమైన విషయము." నేనతని కోరి కను అంగీకరించితిని. అందువలన జెంకిన్సన్‌కూడ తన భోజనము తీసికొని నా గదిలోనికి వచ్చెను.

జెంకిన్సన్ అంతకుముందు నా కుటుంబమువారిని చూచి యుండలేదు. ఏలయన వారు ఉమ్మడి గదిలోనుండిగాక మఱి

రొకదారిని నా గదిలో ప్రవేశించుచుండిరి. అందువలన నతడు మొట్టమొదటి సారిగా నా రెండవ కూతురు సోఫియా సౌందర్యమును చూచి ఆశ్చర్యచకితుడయ్యెను, అతడు నా చిన్నకుమారులనుకూడ చూచెను.

"అయ్యో! డాక్టర్! మీ పిల్లలుచాల అందమైనవారు! చాల మంచివారు! అట్టివారికి ఈ జైలు ఏ మాత్రము తగదని నేను అభిప్రాయపడు చున్నాను" అని అతడు అనెను.

అప్పుడు నేను ఇట్లంటిని: "జెంకిన్సన్! నా పిల్లలు మంచి నీతి వర్తనులు. అందులకు నే నెల్లప్పుడును భగవానునకు కృతజ్ఞుడను. వారు సుగుణములు కలవారైనచో, మిగిలినవి ఉన్నను లేక పోయినను ఒకటే. సత్ప్రవర్తనయే ముఖ్యము."

"మీ కుటుంబము వారందఱును ఇచ్చటనుండుట మీకు సంతృప్తిని ఆనందమును ఒసగునని నేను ఊహించుచున్నాను. నిజముగ మీజీవితము కడుధన్యమైనది."

"అవును, నీవుచెప్పినమాట నిజమే. ముమ్మాటికిని నిజమనుటకెటి సందేహం లేదు. నాకీ ప్రపంచమునంతను ధారపోసినను నేను వారిని వదలియుండను. వారున్నచోటు పూరిగుడిసైయైనను సరే, నాకు రాజ భవనమువలె నుండును. నా సౌఖ్యము నెవ్వరైనను ఒకేఒక విధముగ కూలద్రోయగలరు. అది నావారికి హాని చేయుటయే. అప్పుడు నే నెంతయు విచారింతును" అని నేనంటిని.

అప్పుడతడు ఇట్లనెను: "అట్లయినచో కొంతవఱకు నేను గూడ నేరగాడనని భయపడు చున్నాను. మీ కుమారులలో నొకనికి నేను హానిచేసినానని తలంచు చున్నాను. అందులకతడు

నన్ను క్షమింపవలయునని కోరుచున్నాను." అట్లని అతడు నా కుమారుడు మోజెస్ వంకకు చూచెను.

పూర్వము నా కుమారుడు మోజెస్ జెంకిన్సన్‌ను మారు వేషములోనుండగా చూచి యుండెను. అయినను అతడు గొంతును బట్టియు, ఆకారమును బట్టియు జెంకిన్సన్‌ను గుర్తించి అతని హస్తమును పట్టుకొని మందహాసము చేయుచు నిట్లనెను: "అయ్యా! నేను మిమ్ము క్షమించినాను మిమ్ము తిరిగి ఇచ్చట కలసికొన గలిగినందులకు నే నెంతయు సంతసించు చున్నాను. కాని మీవద్దనుండి ఒక విషయమును తెలిసికో వలయునని యున్నది. మీరు నేను సులభముగా మోసమునకు లోనగుదనని మీరెట్లు గుర్తించినారు. నా మొగముపై నేదేని ఆనవా లున్నదా? నాకంతయు ఆశ్చర్యకరముగ నున్నది".

అప్పుడు జెంకిన్సన్ ఇట్లనెను: "మిత్రమా! నేను నీ మొగము చూచి గ్రహింపలేదు. నీ తెల్ల మేజోళ్ళు, తలలోని నల్ల రిబ్బనుచూచి గ్రహించినాను. వానిని చూడగనే నిన్ను మోస గింప వలయునను బుద్ధి పుట్టినది. నీ తెలివి తేటలను తక్కువపఱచి చెప్పుట కాదుగాని, నేను నీకంటె ఎక్కువ తెలివితేటలుకల వారినే మోసపుచ్చినాను. అయిననేమి? నాచే మోసగింప బడిన వారిసంఖ్య హెచ్చయి పోయినది. ఆ తెలివితక్కువవారే నన్ను పట్టించినారు. దాని ఫలితమే ఈ కారాగారవాసము."

"మీ జీవితగాథను సంపూర్ణముగ చెప్పినచో మా కెంతయు నుల్లాసముగ నుండును. అదియుగాక మేము నేర్చుకో వలసిన విషయములెన్నో అందుండునని నేను భావించు చున్నాను" అని మోజెస్ కడు వినయపూర్వకముగ ననెను.

అంతట జెంకిన్సన్ ఇట్లనెను: "నేను ఆ విధముగ నేమా త్రము అభిప్రాయ పడుటలేదు. నా జీవితగాథ వినుటకేమంత సొంపుగా నుండదు. మీరు నేర్చుకోదగిన విషయము లేవియు నందులేవు. నేను పన్నిన పన్నాగములు, చేసిన ఘోర కృత్యములు మీకు తెలిసినచో మీరు ప్రతివిషయమును అనుమానించుచుందురు. అందువలన మీరు సుభముగా విజయ సోపానములను అధిరోహింప జాలరు. ప్రయాణీకు డొకడు ఒకదారిని బడి ప్రయాణము చేయుచున్నాడనుము. అతడు తనను కలిసికొన్న ప్రతి మనుజుని అనుమానింప ప్రారంభించిన నేమగును? తన వంకకుజూచు ప్రతియొక్కనిని దొంగగాభావించిన నేమగును? దొంగవలె కనబడు ప్రతియొక్కనిని అనుమానించి వెనుదిరిగి చూచుచుండిన నేమగును? అతడు సకాలమునకు గమ్యస్థానమును చేరుకొనగలుగుట అసంభవమగును.

నా అనుభవమునుబట్టి చూడగా ఈ ప్రపంచములో విషయ పరిజ్ఞానముకలవాడే బుద్ధిహీనుడని తోచుచున్నది. చిన్నప్పటినుండియు నేను జిత్తులమారినని అందరును అనుకొనుచుండెడివారు. నాకు ఏడు సంవత్సరములు వచ్చినప్పుడే 'ఇతనికి యువకున కుండవలసిన బుద్ధులన్నియు నున్నవి' అని స్త్రీలు అనుచుండెడివారు. పదునాలుగు సంవత్సరముల ప్రాయము వచ్చినప్పటికే నేను ప్రపంచమునంతను అర్థముచేసికొంటిని; యువతులను ప్రేమింపసాగితిని. ఇరువది సంవత్సరముల ప్రాయముగలవాడనైతిని. అప్పుడు నావంటి నిజాయితీపరుడు మఱియొకడు ఉండెడివాడు కాడని నేను నిస్సంశయముగ చెప్పగలను.

కాని నన్నందఱును జిత్తులమారి అనెడివారు నన్నెవ్వ

రును నమ్మోకివారుకారు. ఇక విధిలేక నన్ను నేను రక్షించుకో వలసివచ్చెను. నన్నుగూర్చి అందఱును అనుకొనుచున్నట్లే చేయవలసివచ్చెను. అప్పటినుండియు నేను జిత్తులమారిగనే నివసించుచున్నాను. నా బుద్ధి ఎప్పుడును ఇతరులను మోసగించు ప్రణాళికలతోనే నిండిపోవుచుండెను. నా హృదయ మెప్పుడును నన్నెవ్వరైన కనుగొని పట్టుకొందురను భయముతో నిండిపోవుచుండెను. మీ పొరుగుననే ఫామ్‌బరో అను రైతు నివసించుచుండెడివాడు. అతడు చాల నిజాయితీపరుడు. నిరాడంబరజీవి అతనిని చూచి నేను నవ్వుచుండెడివాడను. అతనిని కనీసము సంవత్సరమున కొకసారియైనను మోసగించుచుండెడి వాడను.అయినను అతడు ఏమాత్రముఅనుమానించకతన పనులను నెఱవేర్చు కొనుచుండెడివాడు. అందువలన నతడుధనికుడైనాడు. నేను జిత్తులుప్రయోగించిఎందరినో మోసగించినానన్నమాటయే గాని ధనికుడను కాలేకపోయినాను బీదవాడుగనే యున్నాను. కనీసము మంచిజీవితము గడిపినానన్న సంతృప్తికూడ నాకు లేకుండపోయినది.”

పిమ్మట నతడు నాతోనిట్లనెను: “అయ్యా! మీసంగతిని నాకు తెలియజేయుడు. మీరెందులకు జైలుకువచ్చినారు? నన్ను నేను జైలు శిక్షనుండి రక్షించుకొనలేకపోవచ్చును. కాని నా స్నేహితుల నా శిక్షనుండి రక్షింపవచ్చును.”

అతని కుతూహలము తీర్చుటకై నన్ను ప్రస్తుత కష్టముల లోనికీడ్చిన సంఘటనలనన్నిటిని వివరముగా వర్ణించిచెప్పితిని. ఆ కష్టములనుండి తప్పించుకొనలేకపోవుచున్నాననువిషయమును కూడ తెలిపితిని. అతడు నాకథయంతయు విన్నతరువాత కొన్ని

నిమిషములేమో ఆలోచించెను. పిమ్మట నతడు ఏదో మంచి యుపాయము తట్టినవానివలె వ్రేలితో నుదుటిపై కొట్టుకొనెను.

"అయ్యా! మీకథయంతయు సావధానముగ నాలకించినాను. మీకెట్టి సాహాయ్యమును చేయగలనో ఆ సాహాయ్యము నంతను చేయుదునని వాగ్దానము చేయుచున్నాను. ఇంక సెలవు" అని యని అతడు మమ్ము వీడిపోయెను.

# 27

ఖైదీల నందఱును మంచిమార్గమునకు త్రిప్పవలయునని నేను నిశ్చయించుకొంటినిగదా. నా నిశ్చయమును, ప్రణాళికను మఱునాటి యుదయమున నాభార్యకు, పిల్లలకు తెలిపితిని. వారందఱును ముక్తకంఠముతో నా యుద్దేశ్యమును ఖండించిరి.

వారందఱి తరఫున నాభార్య యిట్లనెను: "నాథా! మీకీ అభిప్రాయమెందులకు తట్టినది? మీ నిశ్చయము, ప్రణాళిక అను చిత్రమైనవి. అసంభవమైన విషయమును సంభవముగ చేయ వచ్చునా? మీరు అనుచితము, అక్రమము నైన పనులకెందుకు పూనుకొనెదరు? మీకు వృథాకాలయాపనతప్ప మఱియింకే మియునుండదు. మీ పఠనములు, ఉపన్యాసమును ఈ దోషుల మనస్సులలో నెట్టిమార్పును తీసికొనిరాలేవు. వారి మనస్సులు కరడుకట్టుకొని పోయినవి. వానిని మార్చుట ఎవరికి సాధ్యము? సాధ్యముకాని పని సాధింపబూనుట అవివేకముకాదా? మీ ప్రయత్నమువలన మీకు కడకు మిగులునది అవమానము

మాత్రమే. కావున మీ ప్రయత్నమునుండి విరమించుకో వలసిందని కోరుచున్నాను."

అంతట నేను ఇట్లంటిని: "మీ అభిప్రాయముతో నే నే మాత్రము ఏకీభవింపజాలను. ఈ ఖైదీలు ఎన్నో నేరములు చేసిన మాట నిజమే! వీరు సంపూర్ణముగ పతనము చెందినమాట నిజమే! కాని ఒక్క విషయమును మాత్రము జ్ఞప్తియందుంచు కొనుము. వీరు మానవులు! వీరెట్టి పరిస్థితిలోనున్ననుసరే, మనము శ్రమించి పనిచేసినచో, వీరి మనస్సులను మార్చగలము. వీరు మానవులు! ఈ విషయమును మఱియొకసారి యుద్ఘాటించు చున్నాను. వీరు మానవులు కనుకనే నాప్రేమకు పాత్రులైనవారే వీరుమానవులు కనుకనే మంచిమార్గమున పెట్టవలయునను బుద్ధి నాకు కలిగినది.

నా సలహాలను వారు తృణీకరింతురని మీరు సందేహించుచున్నారు. నేను మీ సందేహమును కాదనను! వారు నా సలహాలను తృణీకరించిన తృణీకరింపవచ్చును. అందువలన నాహృదయ మింకను వికసించును. నేనింకను బలపడుదును. నేనిచ్చు సలహాలు వారిని బాగుచేయలేక పోవచ్చును. కాని ఆ మంచి సలహాలు నన్ను బాగుపఱచునన్న మాటమాత్రము తథ్యము. ఈ నికృష్టులు రాజకుమారులై యుండినచో ఏమి జరిగియుండెడిది? వీరికి మంచి సలహాల నిచ్చుటకు వేలకొలది ప్రముఖులు సిద్ధపడి యుండెడివారు. కాని నాదృష్టిలో సింహాసనములమీద కూర్చుండు రాకుమారుల హృదయములెంత విలువైనవో, ఈ చీకటికొట్టములలో బంధింపబడియున్న నికృష్టులగు ఖైదీల హృదయ

ములుకూడ అంతే విలువైనవి. కావున వీరిహృదయములను మార్చుటకుగూడ ప్రతియొక్కడును ప్రయత్నింప వలయును.

వారి హృదయములను మంచిమార్గమున పెట్టగలిగినచో పెట్టుడును. బహుశా వారు నన్ను అలక్ష్యము చేయకపోవచ్చును. సముద్రములో మునిగిపోవుచున్న వందమందిలో నేను ఒకని నైనను రక్షింప వచ్చును. అంతవఱకు అది లాభమే కదా! ఈ విశాల ప్రపంచమున మానవుని మించిన విలువైన రత్నమేది? ఒక్క మానవుని రక్షించినను అది ఘనముగ చెప్పుకొనదగిన విషయమే గదా!"

అంతట నావారేమియు మాట్లాడలేదు. నేనుకూడ ఇక నేమియు మాట్లాడకుండ ఖైదీలుండు ఉమ్మడి గది లోనికి పోతిని. అప్పు డచ్చట చాలమంది ఖైదీలుండిరి. వారు ఎంతో ఉల్లాసముగనుండిరి. వారందఱును నావైపు కెగాదిగ చూచుచుండిరి. ఎందుకో తెలియునా? వారు ఏదోవిధముగ నన్ను హేళనచేసి సంతోషమును పొందదలచుచుండిరి.

నేను పుస్తకమును తెఱచి చదువబోవుచుంటిని. అంతలో నొకడు నా తల మీదనున్న విగ్గును వంకరగలాగెను. అతడాపని చేయదలచియే చేసియుండెను. కాని ఏదో పొరపాటున జరిగినట్లు, "అయ్యా! నా పొరపాటును క్షమింపవలయును" అని ప్రార్థించెను

మఱియొకడు కొంచెము దూరముగా నిలబడియుండెను. అతడు పండసంపునుండి ఉమ్మివేయుటలో మంచినేర్పుకలవాడు. అతడానేర్పును నామీద ప్రయోగించెను. అతని ఉమ్మి వచ్చి నా పుస్తకముమీదపడెను. మూడవవాడు వికృతముగ నవ్వి,

విస్మృతముగు గొంతుతో, "తథాస్తు" అని అఱచెను. అంతట మిగిలినవారు ఏదో గొప్పపని జరిగినట్లు నవ్విరి. నాలుగవ వాడొకడు నా జేబులోనుండి కడు నేర్పుగా కళ్ళజోడును దొంగిలించెను.

అయిదవవాడు అందఱికంటె ఆఱాకులు ఎక్కువచదివి యుండెను. అతడు చేసినపని అచ్చటనున్న వారి కందఱకు అపరిమితమగు సంతోషమును కలుగజేసెను. బల్లమీఁద నేను పెట్టిన పుస్తకములలో నొకదానిని నతడు తీసివైచి దానిబదులతడచ్చట అశ్లీలగ్రంథము నొకదాని నుంచెను. నేను వారు చేసిన వికృత కార్యముల నన్నిటిని గమనించితిని. కాని గమనింపనట్లు ఏమియు లెక్కచేయునట్లు నటించితిని. గమనించి నేను చేయఁగలిగినది ఏమియున్నది? వారి నింకను రెచ్చగొట్టుటమాత్రమే జరుగును.

తాత్కాలికోద్రేకములకు లోనైనవారు ఒకటిరెండుసార్లు మాత్రమే అల్లరిచేయుదురు. అది తాత్కాలికమైనదిమాత్రమే. కాని నాలోని శాశ్వతశక్తులు వారిపై శాశ్వతముగ పనిచేయును. అంతవఱకు నేను ఓపికపట్టి యుండవలయును.

వారు ఎంతఅల్లరిచేసినను నేను ఓపికతో నా విధ్యుక్త ధర్మమును నెఱవేర్చుకొని పోసాగితిని. ఆఱురోజులు కాక పూర్వమే కొందఱు ఓపికవహించిరి. అందఱును నే చెప్పినది వినసాగిరి.

నీతి నియమములు లేని నికృష్టులగు ఖైదీలను మంచి మార్గమున పెట్టుటకు నేను ప్రయత్నించితిని. అది సామాన్యమగు ప్రయత్నముకాదు. దానికి ఎంతో పట్టుదల అవసరము. విఘ్నముల నేమాత్రము లెక్కచేయక ముందుకు ఉరికిపోవుట

అవసరము. నే నావిధముగ ప్రయత్నించితిని కనుకనే వారిలో మార్పు తీసికొని రాగలిగితిని. విజయమును సాధింపగలిగితిని. అందుకు నేనెంతయు సంతసించితిని. నన్ను నేను పరిపరివిధముల ప్రశంసించుకొంటిని.

నేను వారి మనస్సును మార్చుటకు ప్రయత్నించుటతో మాత్రమే సంతృప్తిచెందలేదు. జైలులో నున్నంతకాలము వారికి కావలసిన కొన్ని సౌకర్యములనుగూడ చేకూర్పదలచితిని. అనగా వారి కవసరమగు కొన్ని వస్తువులను సమకూర్పవలసి యున్నది. వారు జైలులో కడు నికృష్టజీవితము గడుపుచుండిరి. జైలులో వారికి చాలినంత ఆహారము లభించుట లేదు. ఒకొ్కక్కప్పుడు వారు తమను మించినవారు లేరని ఆనందసాగరమున తేలియాడుచుందురు. మఱియొకప్పుడు వారు దుఃఖసాగరమున మునిగిపోవుచుందురు.

జైలులో వారు చేయుచున్న పనులేవి? ఒకరితోనొకరు దెబ్బలాడుకొనుట, పనికిరాని ఆటలాడుట, మత్తుగా నిదురించుట. నేను వారు డబ్బు సంపాదించుటకు కొన్ని ప్రణాళికలు వేసితిని. కఱ్ఱ తెప్పించి దానితో కొన్ని పరిశ్రమలకు పనికివచ్చు వస్తువు లను వారిచే చేయింపసాగితిని. వారాపనిని చి తమదితో చేయ సాగిరి. తయారైన వస్తువులను నేను బయటివారికి సరియైన ధరకు అమ్మసాగితిని. ఆ వచ్చిన ధనమును అందఱకు పంచి యీయసాగితిని. ఆ ధనముతో వారు తమకు కావలసిన సరకు లను తెప్పించుకొనెడివారు. వారి జీవితము సుఖముగా గడచి పోవుచుండెను.

నే నంతటితో సంతృప్తిచెందలేదు. తప్పుచేసిన వారికి

జరిమానా విధింపసాగితిని. బాగుగ పరిశ్రమ చేసినవారికి బహు మానముల నీయసాగితిని.

ఆవిధముగా పదునేను దినములగునరికి నేను ఖైదీలనంద ఱను మంచిమానవులుగా తయారుచేసితిని. వారి నొక సంఘ ముగా నేర్పఱచితిని. ఆ సంఘమునకు కావలసిన నిబంధనలను తయారుచేసితిని. అనగా నేనొక చట్ట నిర్మాతగా తయారైతి నన్నమాట. ఆటవికజనులను, క్రూరులను-అవిధేయులను నాగరి కులుగను, దయాపరులుగను విధేయులుగను మార్చితినన్నమాట.

చట్టములను తయారుచేయువారు గమనింపవలసిన అంశము లేవి? చట్టముల పరమోద్దేశ్యమేమి? చట్టములు దోషులమనస్సు లను మార్చి బాగుపఱచునవిగ నుండవలయును. అంతియగాని కఠినముగనుండి వారి మనస్సుల నింకను కరడు కట్టించునవిగ నుండరాదు. మానవులు నేరములు చేయకుండనుండుటకు ఏమి చేయవలయును? వారికి విధించు శిక్ష లెట్టివిగ నుండవలయును? ఆ శిక్షలు వారిలో మంచిమార్పును తీసికొనివచ్చునవిగ నుండ వలయును. అంతియకాని వారి మనస్సుల నింకను గట్టిపఱచు నవిగ నుండరాదు.

నేడు మన దేశమున జైలుపరిస్థితు లెట్లున్నవి? అమాయ కులు, నేరగాండ్రుకూడ జైళ్ళలో బంధింపబడుచున్నారు. జైళ్ళ లోని పరిస్థితులు కడు దుర్భరముగనున్నవి. ఒక్క నేరము చేసినందుకు జైలులో బంధింపబడినవాడు, ప్రాణములతో బయటకు వచ్చినచో వేయి నేరములు చేయుటకు సిద్ధపడు చున్నాడు. ఏ నేరము చేయనివాడు బయటకు వచ్చి నేర ములు చేయుట కుద్యుక్తుడగుచున్నాడు.

ఈ పరిస్థితి మారిపోవలయును. యూరపు ఖండములోని ఇతర దేశములో గల జైళ్ళ పరిస్థితు లెట్లున్నవో గమనింపవల యును. అచ్చటి పరిస్థితులు ఖైదీలకు ఉత్సాహమును కలిగించు నవిగనుండును. వారు చేసినపనికి పశ్చాత్తాప పడునట్టివిగ నుండును. నేరములు చేసినవారు పశ్చాత్తాపపడి బయటకువచ్చి మంచి జీవితములు గడపుచుందురు. అమాయకులు మంచిగుణ ములు నేర్చుకొని ఇదివఱకుకంటె మంచి జీవితము గడపు చుందురు.

ఖైదీలను బాగుపఱచుటకది మంచి పద్ధతికాని కఠినాతి కఠినమగు శిక్షలు విధించుట ఏ మాత్రము మంచిపనికాదు. నేను మఱియొక ముఖ్యమగు ప్రశ్న వేయుచున్నాను. కొద్దిపాటి నేర ములు చేసినందుకుగాను నేరగాండ్రకు ఉరి శిక్షను విధించు అధికారమును ప్రభుత్వమువారి కెవరు ఇచ్చియున్నారు? హత్య చేసిన సందర్భములలో హంతకులకు ఉరిశిక్షవిధించు అధికారము ప్రభుత్వమువారి కుండుట న్యాయమను విషయము సుస్పష్టముగ తెలియుచునే యున్నది. ఆత్మరక్షణ ముఖ్యము. ఇతరుల ప్రాణ ములపట్ల ఏమాత్రము లక్ష్యము లేకుండ చంపివేసిన వాని ప్రాణ మును తీసివేయుట సహజము, న్యాయము. ఆ విషయమున ప్రభుత్వమువారిని అందఱును సమర్థింతురు.

కాని దొంగకు ఉరిశిక్ష విధించుటలో న్యాయమేమి యున్నది? ఒకడు దొంగతనము చేసినంతమాత్రాన అతని ప్రాణముతీసి వేయుటకు ప్రకృతి నిబంధన లేమాత్రము అంగీక రింపవు. అవి మనకా హక్కును ఇచ్చుట లేదు; అతడు దొంగిలిం చిన గుఱ్ఱము నాదెంతయో; అతనిదిగూడ నంతియే; అట్టి సందర్భ

ముఖందు అతని అంగీకారముతో మాత్రమే ఉరితీయవచ్చును. అనగా వారిరువురు కలసి ఒక ఒడంబడిక చేసికోవలయు నన్న మాట. కాని ఈ అంగీకారపుటొడంబడిక సరియైనదికాదు. ఏల యన ఎవరికిగాని తన ప్రాణము తీసికొనుటకుగాని, ఇతరులకు కుదువబెట్టుటకుగాని హక్కులేదు. అదియుగాక ఈ అంగీకారపు ఒడంబడిక సరియైనదికాదు. నేటికాలపు న్యాయస్థానములోకూడ ఆ విధముగనే తీర్పు ఇచ్చెదరు. చిన్న నేరమునకు అంత అప రాధము పనికిరాదు. ఒకడు చనిపోయి, మిగిలిన యొకడు గుఱ్ఱమునెక్కి తిరుగుటకంటె ఇరువురును జీవించి యుండుట మేలుకదా.

ఇరువురిమధ్యగల ఈ ఒడంబడిక ఏ విధముగ చెల్లదో, అట్లే నూరుమంది మధ్యగాని, నూరువేలమంది మధ్యగల ఒడం బడికకాని ఏ మాత్రము చెల్లనేరదు. పదిమిలియనుల వృత్త ములు కలసి ఒక చతురస్రము కాలేవు. అట్లే వేలకొలది జనులు ముక్త కంఠముతో పలికెను అసత్యమునకు పునాది యేర్పడదు. ఆ విధముగా హేతువాదము, ప్రకృతి చెప్పు విషయమొకటే ప్రకృతి నిబంధనల ననుసరించి జీవించు అనాగరికులు ఒకరిప్రాణ ముల నొకరు గౌరవించుకొందురు. విలువగా చూచుకొందురు. వారు సాధారణముగా రక్తము చిందింపరు. తమపట్ల పూర్వమిత రులు చూపిన క్రౌర్యమునకు ప్రతీకారముగ మాత్రమే రక్తము కన్నుల చూతురు.

మన పూర్వీకులగు శాగ్జనులు యుద్ధ సమయములలో అతి భయంకరులై ఇతరుల ప్రాణములు తీసెడివారు. కాని శాంతి సమయములందు తీసెడివారుకారు. ప్రకృతి నిబంధనల పలుకుబ డి

ఎక్కువగా నున్న దేశములలో ఇప్పటికిని ఏ నేరమునకుగాని ఉరి శిక్ష విధింపరు.

నాగరికులమని విఱ్ఱవీగుచున్న ప్రజలుగల దేశములలో మాత్రమే శిక్షలు కఠినాతి కఠినముగ నున్నవి. ఈ దేశములోని చట్టములు ధనికుల అధికారమునకు లోబడి యున్నవి. అందువలన వారెప్పుడును బీదవారిని అణచి వేయుటకే ప్రయత్నించుచుందురు.

ప్రభుత్వములు ప్రాతబడుచున్నకొలది వృద్ధాప్యముతో బాటువచ్చు శోకావస్థనుగూడ పొందుచున్నవి. మన ఆస్తులు పెరుగుచున్న కొలది వాని విలువ హెచ్చిపోవు చున్నట్లును, మన సంపద పెరిగిపోవుచున్నకొలది మన భయముకూడ హెచ్చుచున్న ట్లును, మన ఆస్తులను రక్షించుకొనుటకు రోజు రోజుకు చట్టములు పెరిగిపోవు చున్నవి. ఆ ఆస్తులమీదికెవ్వరును దండెత్తి రాకుండ ఆపుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. మిగిలిన యూరపు ఖండము మొత్తముమీద ఒక సంవత్సరములో శిక్షను పొందిన నేరగాండ్ర సంఖ్యకంటె; మన ఒక్క దేశములో అదే సంవత్సరము శిక్షనుపొందిన నేరగాండ్ర సంఖ్య హెచ్చుగా నున్నది. ఇందుకు కారణమేమి? మన శిక్షాస్మృతిలోని నిబంధనల సంఖ్య అంత కంతకు హెచ్చిపోవు చుండుటయా? లేక మన దేశములోని జనులు స్వేచ్ఛా విహారులై అనుజ్ఞలు లేక తమ యిచ్చ వచ్చినట్లు నేరములు చేయుచుండుటయా? బహుశా ఈరెండును నై యుండును. ఏలయన ఈరెండును ఒకదానికొకటి తోడ్పడుచుండును.

విచక్షణా జ్ఞానములేని శిక్షాస్మృతివలన ఎంతో తేడా గల వేర్వేరు నేరములకు ఒకేవిధమగు శిక్ష విధింప బడుటను

మనము చూచుచున్నాము. ప్రజలకు శిక్షలో తేడా కనబడక పోవుటవలన నేరములలోని తేడాకూడా కనబడదు. అన్ని నేరములును ఒకేవిధమైనవని వారు భావించుచుందురు. అందువలన నిజముగా ఘోరమైన నేరములనుకూడ చేయుచుందురు. నేరమునకు నేరమునకు మధ్యగల తేడాను తెలిసికొనుటవలననే ప్రజల నైతిక జీవనము అభివృద్ధిచెందును. అది తెలిసికొనలేనివాడు ప్రజల నైతికముగ పతనము చెందుదురు. శిక్షాస్మృతి పెరుగుచున్నకొలది నేరములుగూడ పెరుగుచుండును. నేరములు పెరుగుచున్నకొలది శిక్షాస్మృతికూడ పెరిగిపోవుచుండును. ఇదియంతయు నొక విషవలయము వంటిది.

అధికారులు నేరగాండ్రను శిక్షించుటకు చట్టముల సంఖ్యను హెచ్చింపరాదు. బీదవారిని అణచివేయుటకు సంఘపు టుచ్చులను బిగింపరాదు; నికృష్టులు నిరుపయోగమైన వారని భావించి వారిని పరలోకమునకు పంపరాదు; ఇతరులను మంచి మార్గమునకు తెచ్చుటకు బదులు పగతీర్చుకోరాదు. మఱి ఏమి చేయవలయును? ప్రభుత్వమువారి అధికారమునకు హద్దుండవలెను. చట్టములు ప్రజలను రక్షింపవలయునేగాని భక్షింపరాదు.

నేరగాండ్రకుగూడ అంతరాత్మకలదు. వారి అంతరాత్మ నిరుపయోగమైనదని, పనికిమాలినదని ఎవ్వరు భావింపరాదు. వారిని బాగుచేయుటకు కొందఱు నడుము కట్టుకోవలసి యున్నది. ఈ నడుము కట్టుకొనువారు చాల పట్టుదలతో పనిచేయవలసియుందురు. వీరు ముఖ్యముగా తెలిసికోవలసిన విషయమొకటి యున్నది. నేరగాండ్ర ముఖములేగాక హృదయ

ములు కూడనున్న వన్న దే ఆవిషయము. అందువలన పట్టుదలతో పనిచేసినచో వారిని మంచిమార్గమునకు తీసికొనిరావచ్చును. నేరగాండ్రు తాము చేసిన నేరమునకు ప్రతిఫలముగా మరణింప వలసినపనిలేదు. వారు సన్మార్గమునకు వచ్చి సుఖముగా జీవింప వచ్చును. అందులకు సురక్షితముగనుండుటకు కొందఱి రక్తమును చిందింపవలసిన పని ఏమియు లేదు.

౨౧

నేను జైలులో ప్రవేశించి పన్నెండుదినములు దాటి పోయెను. కాని నే నీలోపల నాప్రియమైన కొమరిత ఒలీవియాను ఒక్కసారియైనను చూచియుండలేదు. ఆమె మిగిలినవారితో బాటు జైలుకు ఒక్కసారియైనను వచ్చియుండలేదు. అందువలన నేను ఆమెను చూడవలయునని గాఢముగా వాంఛింపసాగితిని. ఆ కోరిక నొకనాడు నాభార్యకు తెలిపితిని.

మఱునాటి యుదయమున ఒలీవియా నా గదిలో ప్రవేశించెను. ఆమె కడు బలహీనముగనుండెను. అందువలన నామె తనసోదరి సోఫియాన్పై ఆనుకొనివచ్చియుండెను. ఆమెముఖములో కానవచ్చిన మార్పు నన్ను చకితునిచేసెను. ఆమె ముఖములో పూర్వము అపూర్వమగు కళాకాంతులు నాట్యమాడుచుండెడివి. ఇప్పుడవియన్నియు మటుమాయమైపోయినవి. వాని బదులు లామె మొగమును ప్రేతకళ సంపూర్ణముగ నావరించినట్లుండెను. అది నాకెంతయు భయమును కలిగించెను. ఆమె కణతలు లోతుకు పోయియుండెను. నుదురు బిగువుగనుండెను.

బుగ్గలు పాలిపోయియుండెను. ఆమె యావిధముగా నుండగా నేనిదివఱ కెన్నడును చూచియుండలేను.

నే నామెతో నిట్లంటిని: "ప్రియమైన లిపీ! నిన్ను చూడ గలిగినందులకు నే నెంతనూ సంతసించుచున్నాను. కాని లిపీ! ఎందుకిట్లు నిరుత్సాహముగ నున్నావు? ఎందుల కీ విచారము? నీవు నన్ను ప్రేమించుచున్నావనుకొందును? నేను నిన్ను గాఢ ముగా ప్రేమించుచున్నాను. నాకు నాశరీరముఎంతవిలువవైనదో నీ శరీరముకూడ అంతే విలువైనది. నీకు నాపట్ల ఏమాత్ర మభి మానమున్నను మఱి నీశరీరమును నీవిధముగ పాడుచేసికొనవచ్చును. అమ్మాయి విచారపడకుము. ఉల్లాసముగ నుండుము. నిరంతరము మందహాసము చేయుచుండుము. మనకెల్లప్పుడుచెడ్డ దినములేయుండవు. మనకు తప్పక మంచిదినములు రావచ్చును!"

అంత ఒలీవియా ఇట్లనెను: "నాన్నా! మీరు మొదటి నుండియు నాపట్ల అపారమగు దయను ప్రదర్శించుచున్నారు. ఇందుకు నే నెంతయు కృతజ్ఞురాలను. మనకింకను ముందు మంచి రోజులు కలవని మీరు ఆశాభావమును వెలిబుచ్చుచున్నారు. అందు పాల్గొనుట కింక నాకు అవకాశముండదను. అందుకు నే నెంతయు బాధపడుచున్నాను. ఈ ప్రపంచమున నేనింక సౌఖ్యము ననుభవించుటకు స్థానము లేదు. ఇచ్చట నేనుకష్టములనే అనుభవించు చున్నాను. అందువలన ఈప్రపంచమును సత్వర ముగ వీడిపోవుట మేలని అభిప్రాయపడుచున్నాను. నాన్నా మీరు థార్న్‌హిల్‌ను కలసికొని ఆయనతో రాజీపడుట శ్రేయస్కరముగ నుండును. ఆయనమీపట్లసానుభూతిని ప్రకటింపవచ్చును.ఆవార్త తెలిసినచో నేను నిశ్చింతగ మరణింప వచ్చును."

"నే నెన్నటికిని అతనితో రాజీ పడను. నీకొమాలినవానికి అణగి యుండుటయా! నాకొమార్తె వ్యభిచారిణియని నే నంగీకరించుటయా? నేను తార్న్‌హిల్‌తో రాజీ పడుటయన్న అర్థ మదియే కదా! అదినేను సహింప గలిగిన విషయమా! నే నా విషయమున కెన్నటికిని అంగీకరింపజాలను. ప్రపంచమంతయు నీవు వ్యభిచారిణివని చాటించిన చాటింపవచ్చును; నిన్ను నీచముగ చూడవచ్చును. కాని నే నెన్నడును ఆ విధముగ భావింపను. నీవు నేరము చేసినావని నే నెన్నడును అంగీకరింపను. నీవు ఇతరులను సులభముగా నమ్మెడు స్వభావము గలదానవు. అందువలననే అట్లు జరిగినది. ప్రియమైన ఒలీవియా! ఈ జైలు ఎంతో భయంకరమైనదిగ కనబడవచ్చును. కాని నేనిచ్చట ఏ బాధలు అనుభవించుటలేదు. నా జీవితము ప్రశాంతముగ గడచిపోవుచున్నది. నీవు సుఖముగా జీవించియుండుటయే నా ఆశయము. నీవు జీవించి యుండగా తార్న్‌హిల్ మఱియొకర్తను వివాహమాడినచో నీజీవితమింకను దుఃఖభాజనమై పోవును. అందువలన నే నందుల కేమాత్రము అంగీకరింపజాలను. ఇది ముమ్మాటికి నా నిశ్చయము." అని నేను అంటిని.

కొంచెము సేపైనతరువాత ఒలీవియానన్ను విడిచి వెళ్ళిపోయెను. నేను నా కొమార్తెతో మాట్లాడుచుండగా నాతోడి ఖైదీ జెంకిన్సన్ అచ్చటనే యుండెను. ఒలీవియా వెళ్ళిపోయిన తరువాత ఆతడు నాతో ఇట్లనియెను: "అయ్యా! మీరు తార్న్‌హిల్‌తో రాజీపడుట కెందులకు అంగీకరింపకున్నారో నాకు అరమగుటలేదు. అతనితో రాజీ పడుటవలన మీకు స్వేచ్ఛ లభించును. మీరీ విషయమున మొండిపట్టు పట్టవలసిని కదు వినయ

పూర్వకముగ హెచ్చరించు చున్నాను. ఒక్క-కొమార్తె కేదో మంచి జేయవలయునను తలంపుతో మిగిలినవారి మంచిని త్యాగము చేయుటలో అర్థము లేదు. ఆమె మీకు బాధను కలిగించినది. అట్టియామె కొఱకు మీరు మిగిలిన వారికందఱును బాధపెట్టుట! ఇది ఏమాత్రము ఉచితముకాదు. ఒకయువతికి, ఒక యువకునకు మధ్య సమాగమము నాపుచేయుట న్యాయమేమో నాకు తెలియదు. మీరిప్పుడు చేయుచున్నపని అదియే గదా! మీరు వారి వివాహమునకు అంగీకరించుటలేదు. కాని మీరు వారి వివాహముల నాపుచేయలేరు. వారికి విచారమును మాత్రమే కలిగింపగలరు."

కాని నే నిట్లంటిని: "అయ్యా! మమ్ము సర్వనాశనము చేయుచున్న మనుజుడెట్టివాడో మీకు తెలియదు. మీ కతనితో పరిచయము లేదను కొందును. నే నతనికి ఎంత లొంగిపోయినను నాకు ఒక్క-గంట కాలమైనను స్వేచ్ఛ లభింపదను విషయము నాకు బాగుగా తెలియును. ఇటీవలనే గడచిన సంవత్సరము అతనికి సామ్మొసగవలసినవాడు మరణించినాడను సంగతి నాకు తెలిసినది. నే నతనికి లొంగిపోవుటవలనను, అతడు చేయుపనులకు అంగీకారమును తెలుపుటవలనను నాకు మేలు కలగవచ్చును. అతడు నన్ను జైలునుండి విడిపించి ఒకమనోహర భవమున నివసింపవలసినదని ఆహ్వానింప వచ్చును. కాని నేను మాత్రమతనికి లొంగను. అతడుచేయు నికృష్టపు కార్యముల కేమాత్రము అంగీకరింపను. ఏలయన నేనట్లు చేసినచో వ్యభిచారము నీతి సూత్రముల కనుగుణమైనదేయని అంగీకరించి నట్లగును.

నాకొమార్తె ఒలీవియా జీవించియున్నంతవఱకు అతడు

చేసికొను ఏ వివాహమైనను చట్టసమ్మతముకాదు. ఆమె మరణించినచో నప్పటి పరిస్థితివేఱు. అప్పుడునేను స్త్రీ పురుషుల సమాగమము నాపుటకు ప్రయత్నించినచో వట్టి నీచుడనే యగుదును. నేనెన్నడును అట్టి నీచకార్యమునకు అంగీకరింపను. అతడు దుర్మార్గుడనుటకు ఎట్టి సందేహమును లేదు. కాని నాకౌమార్తె మరణించిన తరువాత అతడు వివాహము చేసికొనుటకునేను అడ్డుపడను. అతడు వివాహము చేసికోవలయుననియే కోరుదును. అప్పుడతడు వ్యభిచారము చేయకుండ సంసారము చేయుటకు వీలు కలుగును.

కాని యిప్పటి పరిస్థితి వేఱు. నాకౌమార్తె ఇంకను జీవించి యున్నది. ఈజైలునుండి విముక్తి పొందుటకై నాకౌమార్తె మరణమును కొనితెచ్చు పత్రముపై సంతకము పెట్టుటయా? అప్పుడు నావంటి క్రూరుడైనతండ్రి మఱి యింకొకడుండునా? నేనొక బాధనుండి తప్పించుకొనుటకు ప్రయత్నించి నా కౌమార్తె హృదయమును వేయి ప్రక్కలు చేయుట న్యాయమా?"

అతడు నామాటలలోని సత్యమును అంగీకరించెను. కాని యిట్లనెను: "అయ్యా! మీరు చెప్పినదంతయు బాగుగనే యున్నది. మీ కౌమార్తె ఆరోగ్యము చాల వఱకు క్షీణించినది. మీరింక ఎంతో కాలము ఈజైలులో నివసింపవలసిన పని లేదనుకొందును. మఱియొక విషయము. మీరు తార్న్‌హిల్‌కు లొంగిపోవుట కంగీకరింపక పోవచ్చును. కాని మీ కేల విషయము నంతయు అతని పిన తండ్రియగు సర్ విలియమ్ తార్న్‌హిల్ ముందు ఉంచరాదు? అతడు చాల న్యాయశీలుడని ప్రసిద్ధిగాంచి

యున్నాడు. మంచి వారినతడు రక్షించును. దుష్టులను శిక్షించును. అతడు మీకు తప్పక సాహాయ్యము చేయునని నేనునమ్ముచున్నాను. తార్న్‌హిల్ చేసిన అకృత్యములన్నిటిని పేర్కొనుచు తపాలాద్వారా ఆయనకొక జాబు పంపుడు. మూడు దినములలో మీకాయనవద్దనుండి సమాధానము రాకపోయినచో నేను తల తీయించుకొందును."

నే నతడుచేసిన సూచనకు ఎంతయు కృతజ్ఞత తెలిపితిని. వెంటనే నేనా సూచనను అమలులో పెట్టుటకు ప్రయత్నింపసాగితిని. కాని ఉత్తరము వ్రాయుటకు నావద్ద తెల్లకాగితము లేకుండెను. దురదుష్టవశమున మావద్దనున్న ధనమంతను నాటి యుదయము ననే ఆహార పదార్థములను కొనుటకు వినియోగించితిమి. జెంకిన్సన్ దయతో నాకు కావలసిన తెల్లకాగితము నిచ్చెను. అంతట ఉత్తరము వ్రాసి పోస్టులో వేయించితిని.

నా యుత్తరమును సర్ విలియమ్ తార్న్‌హిల్ ఎట్లు స్వీకరించును? అతడు దానికేమని సమాధాన మొసగును? ఆ ప్రశ్నలకు నాకు సరియైన సమాధానము లభింపకుండెను. ఆ యాందోళనతో నేను తరువాతి మూడుదినములు గడపసాగితిని. ఈ లోపల నాభార్య నన్ను వేధించుకొని తినసాగెను. "మీరు తార్న్‌హిల్ పెట్టు ఎటువంటి షరతులకైనను అంగీకరింపుడు. మీరు వెంటనే జైలునుండి బయటకు వచ్చుట మిక్కిలి యావశ్యకమై యున్నది" అని ఆమె చెప్పసాగెను. నాకొమార్తె ఆరోగ్యము క్షీణించి పోవుచున్నదని నాకు గంట గంటకు కబురు రాసాగెను.

మూడవరోజు గడచి పోయెను. నాలుగవరోజు వచ్చెను! నాకు సర్ విలియమ్ తార్న్‌హిల్ వద్దనుండి జవాబురాలేదు. అవును

మఱి నాకు జవాబు నెట్లువచ్చును? నేనుఅతనికి పూర్తిగా క్రొత్త వాడను. తార్న్‌హిల్ అతనికి బంధువు. నేను ఆ బంధువుపై నేరారోపణ చేసితిని. మఱి నాకు ఎట్లు విజయము లభించును? ఇదివఱకు నా యాశలన్నియు అడియాశ లయ్యెను. ఇప్పుడు మాత్రము అంతకంటె మంచిఫలిత ముండునా?

నా మనస్సుమాత్రము ఏమాత్రము సడలలేదు. జైలులోని నిర్బంధమువలనను, సరియైన గాలి లేకపోవుటవలనను నా ఆరోగ్యములో కొంచెముమార్పువచ్చినట్లుండెను. అగ్నిప్రమాదమునకు లోనై నా చేయి యొకటి పాడైపోయి యుండెనుగదా. దాని పరిస్థితి ఇంకను అధ్వానమాయెను. నా పిల్లలుమాత్రము నాప్రక్కనే కూర్చుండి ఒకరితరువాత నొకరు గ్రంథములు చదివి వినిపింపసాగిరి. వారు నా బోధనలను వినుచుండెడివారు; కన్నీరు కార్చుచుండెడివారు. కానినాకొమార్తె ఆరోగ్యమునాఆరోగ్యముకంటె ఎక్కువవేగముగా క్షీణింపసాగెను. ఆమె ఆరోగ్యమునకు సంబంధించిన ప్రతివార్త నాబాధను హెచ్చించుచుండెను.

నేను సర్ విలియమ్ తార్న్‌హిల్‌కు ఉత్తరమువ్రాసిన అయిదవనాటి యుదయమున ఒలీవియా మాట్లాడ లేకపోవుచున్నదను వార్త నాకు తెలిసెను. ఆ వార్త నాకు అపరిమితముగు బాధను కలిగించెను. ఆ సమయమున జైలు నిర్బంధము నాకు నిజమైనబాధను కలిగించెను. నా కొమార్తెప్రక్కనే కూర్చుండి ఓదార్పవలయుననియు, ఆమెకుబలమును చేకూర్పవలయుననియు, ఆమె కడపటి కోరికను తెలిసికోవలయుననియు, భగవానుని సన్నిధానమును చేరుకొనుటకు ఆమెకు సరియైన మార్గమును తెలిపు

జేయవలయుననియు నే నెంతయు నాతురపడసాగితిని. కాని ఏమిలాభము? నేను పోవుటకు వీలులేదు!

అంతలోనాకు మఱియొక వార్తవచ్చెను. ఆమెమరణించు చున్నది. ఆమెప్రక్కనే కూర్చుండి ఏడ్చు అదృష్టమునకుగూడ నేను నోచుకొనలేదు. నేనెంతటి దురదృష్టవంతుడను! జైలుశిక్ష ఎటువంటిది. మఱికొంతసేపటికి నాతోడఖైదీ జెంకిన్సన్ కడపటి వార్తతో వచ్చెను. "అయ్యా! విచారింపకుడు! సహనముతో హృదయము గట్టిచేసికొనుడు!" మీ పెద్దఅమ్మాయి విచారించినది. ఈ దారుణమైన సంఘటనను మీరు నిర్విచారముగ భరింపుడు!" అని అతడనెను. అవును! నిజముగా పెద్దకొమార్తె మరణము దారుణమైనసంఘటన! నేను దానిని భరించకతప్పదు! భరింపక నేను చేయగలిగినది ఏమియున్నది! కన్నకొమార్తె శవమునైన చూచుటకు నోచుకొనని దురదృష్టవంతుడను నేను!

మఱునాటి యుదయమున జెంకిన్సన్ మరల నావద్దకు వచ్చెను. అప్పుడు నా చిన్నపిల్లలిద్దఱును నాప్రక్కనేకూర్చుండిరి. వారే నాకిప్పుడు సహచరులు. ఆ అమాయకబాలురు, అన్నము పున్నెము ఎఱుగని బాలురు, నాకు సంతోషమును చేకూర్చుటకు తమ శక్తికొలది ప్రయత్నించుచుండిరి.

వారిట్లనసాగిరి: "నాన్నా!విచారింపకుడు. మీరు వృద్ధులు ఇంకఏడ్చుటమీకేమాత్రమునుతగదు! మేముమీకుగ్రంథమును చదివి విని పింపమా!" నాన్నా! మా సోదరి ఇప్పుడుదేవతకదా! దేవతకొఱకెవ్వరైన ఏడ్తురా? దేవతయైన మాసోదరికొఱకు మీరు ఏడవవచ్చునా!" నాతోబాటు మానాన్నగూడ నున్నచో

నే నీ భయంకరప్రదేశమును వదలి దేవతనై పోయినచో ఎంతయు బాగుండును" అని డిక్ అనెను.

అప్పుడు బిల్ ఇట్లనెను: "అవును! నా సోదరి యిప్పుడు స్వర్గలోకమున నున్నదికదా! ఆలోక మీలోకముకంటె సర్వవిధముల మేలైనదికదా. అచ్చట మంచివారుతప్ప మఱియితరులెవ్వరును నుండరుగదా. ఈలోకమందలి మనుజులు చాల చెడ్డవారు!"

అంతలో జెంకిన్సన్ వారిమాటల కంతరాయముకలిగించెను. అతడు నాతో నిట్లనెను: "అయ్యా! మీకొమరిత ఒలీవియా మరణించినది. ఇక మీ రామెనుగూర్చి ఆలోచింపవలసినపనిలేదు. మిగిలిన కుటుంబమువారిని గుఱించి మీరు బాగుగ నాలోచింపవలసియున్నది. మీ జీవితమును రక్షించుకొనవలసిన బాధ్యతకూడ మీపైనున్నది. మీ ఆరోగ్యము ఎట్లు క్షీణించిపోవుచున్నదో గమనించుచున్నారా? మీకుఅవసరపదార్థములు సరిగా లభింపకపోవుటవలనను, సరియైన గాలిలేకపోవుటచేతను మీ ఆరోగ్యము కృష్ణపక్ష చంద్రునివలె క్షీణించిపోవుచున్నది. ఇదియెంతయు శోచనీయమైన విషయము.

మీకుటుంబమువారు మీపై ఆధారపడియున్నారు. మీరు వారి క్షేమమును కాంక్షించుచున్నారు. అందుచే మీరు మీ అహంకారమును, గర్వమును తగ్గించుకోవలసిన పనిలేదు. ఇప్పుడు మీరుచేయవలసినపని ఒకటిమాత్రమున్నది. మీ రట్లు చేయుట న్యాయముగను, హేతువాదమున కనుకూలముగను నుండును."

అప్పుడు నేను ఇట్లంటిని: "సర్వలోక సంరక్షకుడగు భగ

వానుడు కరుణామయుడు. ఇక నాలో నెట్టి అహంకారముకాని, గర్వముకాని లేదు. నా హృదయములో నవియున్న సూచన ఏమాత్రము కనబడినను నన్ను నేను తీవ్రముగ ద్వేషించు కొందును. అంతియకాదు, నన్నీవిధముగ నేప్రించుచున్నవానికి మేలు కలుగవలయునవియే వాంఛించుచున్నాను. నాకిప్పుడతనిపై ఏమాత్రము ఆగ్రహము లేదు. నా కొమార్తె ఒలీవియా నాకు అతని ఐశ్వర్యముకంటె విలువైనది. అట్టియామె పోవుట కతడే మూలకారణము. నాహృదయము నతడు తీవ్రముగ గాయపఱచి నాడు. వేయేల? నన్ను ఎన్నివిధముల బాధించుటకు వీలుకలదో అన్నివిధముల బాధించినాడు. అయినను నా మనస్సులో నిప్పుడు అణుమాత్రమైనను ప్రతీకారవాంఛ లేదు. నే నిప్పుడతడు వివా హము చేసికొనుటకు అంగీకరించుచున్నాను. నే నిదివఱ కతనికి ఏదేని అపకారము చేసియుండిన అందుకెంతయు విచారించు చున్నాను."

జెంకిన్సన్ కలము, సిరాబుడ్డి తీసికొని తెల్లకాగితముపై నేను చెప్పినదంతయు యథాతథముగ వ్రాసెను. అత డాపనిని కడు నేర్పుతో చేసెను. అతడు వ్రాసిన విషయముక్రింద నేను సంతకము పెట్టితిని. తార్న్‌హిల్ అప్పుడు గ్రామ సీమయందొక చోట నుండెను. అతనికి ఉత్తరము నందజేయుటకు నా కుమా రుడు నియోగింపబడెను.

ఉత్తరమును తీసికొనిపోయి మోజెస్ సుమారు ఆఱు గంటలలో తిరిగివచ్చెను. అతడు నోటిసమాధానముమాత్రమే తీసికొనివచ్చెను. అతడు నాతో నిట్లనెను: నేను తార్న్‌హిల్ ఉన్న ప్రదేశమునకు పోయినాను. అచ్చటి సేవకులు నన్ను

అహంకారముతోను, అనుమానముతోను చూచిరి. అందువలన నేను లోనికిపోయి ఆతనిని కలసికొని ఉత్తరము నిచ్చుటకు వీలు లేకపోయినది. కొంతసేపటికి అతడు ఏదోపనిపై నెచ్చటికో పోవుచు బయటకు వచ్చినాడు. మూడు రోజులలో అతని వివాహము జరుగునట. దానికి కావలసిన ఏర్పాట్లను చేసికొనుటకతడు వెళ్ళుచున్నాడట. అప్పుడునేను ఎంతో వినయముగ నతని వద్దకు పోయి మీరొసగిన యుత్తరము నిచ్చితిని.

ఛార్లెహిల్ ఆ యుత్తరమును చదివి నాతో ఇట్లనెను: 'సమయము మించిపోయిన తరువాత అణకువను ప్రదర్శించుట వలన లాభమేమి యున్నది? ఇప్పుడింక నది అనవసరము. మీరు నా పినతండ్రికేదో దరఖాస్తు పెట్టుకొన్నారని వినియుంటిని. ఆయన దానిని తగిన విధముగనే తిరస్కరించినాడనికూడ తెలిసినది. మఱియొకమాట. ఇకముందు మీరు నాకే విషయమునైన తెలియజేయ దలచినయెడల, నాపేర యుత్తరముల నేమాత్రము వ్రాయకూడదు. వానిని నా వకీలుకే పంపవలయును. మీయింటిలోని యిద్దఱు యువతుల విచక్షణాజ్ఞానమనిన నాకు సదభిప్రాయము కలదు; వారు మధ్యవర్తిత్వము వహించినచో నెంతయు బాగుండెడిది.' పిమ్మట నతడు వెళ్ళిపోయెను. నేను మీవద్దకు తిరిగి వచ్చినాను.

ఆ మాటలను వినినేను అచ్చటనేయున్న నా పెద్దకూతురు దీనా జెంకిన్సన్‌తో నిట్లంటిని: "అయ్యా! మీరు నా కుమారుని మాటలనన్నిటిని విన్నారుకదా! నన్ను సర్వనాశనము చేయబూనుకొన్నవాని స్వభావ మెట్టిదో మీకిప్పుడు తెలిసినదిగదా! అతడు ఒకే సమయమున సరసముగను, క్రూరముగను నుండ

గలడు; నన్నతడు తన యిష్టమువచ్చినట్లు ఉపయోగించుకొనని
మ్ము. నన్ను నిర్బధించుట కతడునెన్ని ప్రయత్నములు చేసినను
అనతికాలములోనే నేను స్వేచ్ఛను పొందగలను. నేనిప్పుడు
నా శాశ్వత నివాస స్థానమును సమీపించు చున్నాను. దగ్గఱకు
పోవుచున్నకొలది అది ఎంతో ప్రకాశవంతముగ కనబడుచున్నది.
ఆ ఆశయే నాకు ఉల్లాసమును కలిగించు చున్నది నాబాధను
నేను మఱచి పోవునట్లు చేయుచున్నది. నేను నాపిల్లలను తల్లి
లేని పిల్లలను చేసిపోవుచున్నమాట నిజమే. కాని వారుపూర్తిగ
నిస్సహాయులు మాత్రముకారు. నన్ను తలంచుకొని కొందఱు
స్నేహితులు వారికి సాహాయ్యము చేయుదురన్నమాట తథ్యము.
మఱికొందఱు భగవానుని సంతృప్తి పఱచుటకై నాపిల్లలకు
సాయపడ వచ్చును."

ఆనాడు అంతవఱకు నాభార్య నన్ను చూచుటకు వచ్చి
యుండలేదు. నేనా విధముగ మాట్లాడుచుండగా ఆమె లోనికి
వచ్చెను. ఆమె చూపులలో అపరిమితమగు భయము గోచరించు
చుండెను. ఆమె మాట్లాడుటకు ప్రయత్నించు చుండెను గాని
నోటమాట రాకుండెను నేనామె పరిస్థితిజూచి డగ్గుత్తికతో
నిట్లంటిని: "ప్రియురాలా! నీ బాధలతో నా బాధల నతిశయింప
జేయుటకు ప్రయత్నించెద వెందులకు? మనమెంత అణకువగా
నున్నను కఠినుడగు యజమాని హృదయము మాఱకున్న నేమి?
ఈ చీకటి కారాగారమున నేను మరణింప వలయునని అతడు
శాసించిన నేమి? మనము అత్యంత ప్రేమపాత్రురాలగు అమ్మా
యిని పోగొట్టుకొన్న నేమి? నేను మరణించిన తరువాత నీకు

సౌఖ్యమును, ఆనందమును చేకూర్చుటకు మిగిలిన పిల్లలుండ లేదా! కలరుగదా!"

"లేరు!" అని నాభార్య అనెను. "మనము మరియొక ప్రియమైన పిల్లను పోగొట్టుకొన్నాము. సోఫియా నెవ్వరో మనల నుండి వేరుచేసినారు! దుష్టులెవ్వరో ఆమెను తీసికొనిపోయి నారు!"

"ఏమేమి!" అని జెంకిన్సన్ అఱచెను: "సోఫియా నెవ్వరో తీసికొని పోయినారా? అసంభవము! అసంభవము! అట్లు జరిగి యుండదు! అట్లు జరిగి యుండదు!"

నాభార్య సమాధానమేమియు చెప్పలేదు, ఆమెకంటివెంట మంటికి నేకధారగా కన్నీరు కార్చసాగెను. నా భార్యతో బాటు ఖైదీలలో నొకని భార్యకూడ వచ్చియుండెను. ఆమె నాభార్యతో బాటు నిలబడియుండెను. ఆమె జరిగిన విషయమంతయు వివర ముగా నిట్లు చెప్పెను: "నేను మీభార్యగారు, మీఅమ్మాయి సోఫియా గ్రామమునకు కొంచెము దూరమునందున్న బాటపైన నడచి పోవుచుంటిమి. అంతలో శరవేగమున పోవుచున్న బండి యొకటి మావద్దకు వచ్చెను. అది మావద్ద ఆగిపోయెను. ఆబం డిలోనుండి చాల విలువైన దుస్తులను ధరించిన యువకుడొకడు క్రిందకువచ్చెను. అతడు తార్న్‌హిల్ మాత్రము కాడు. అతడు మీ కొమార్తె నడుమును రెండుచేతులతో గట్టిగా పట్టుకొని బలవంతముగా బండిలోనికి పోయెను. మరల శరవేగమునబండి బయలు దేఱెను. అత్యల్పకాలములో నాబండి మాకు అగపడ కుండ పోయెను."

అపుడు నే నిట్లంటిని: "ఇంతటితో నా కష్టములన్నియు

పూర్తియైనవి. ఈ భూలోకమున నున్న వారెవరుగాని నాకింక ఏకష్టమును కలుగజేయలేరు. ఏమి! ఒక ర్తకూడ మిగులలేదా! ఒక్కర్తనుగూడ మిగల్చరాదా! రాక్షసుడు! నాకు ప్రియాతి ప్రియమైన కూతురు! ఆమె దేవతల సౌందర్యము కలది! దేవతల సౌ దర్యము గలది! నాభార్య క్రిందపడి పోకుండునట్లు చూడుడు! నాకు ఒక్కర్తనుగూడ మిగల్చరాదా!"

అప్పుడు నాభార్య ఇట్లనెను: "అయ్యో! నాథా! నాకేమో ఓదార్పు కావలయునని మీరు భావించు చున్నారు. కాని నా కంటే మీకే ఎక్కువ ఓదార్పు కావలయును. మన కష్టములు సామాన్యమైనవికావు. అయినను నేనీ కష్టములను భరింపగలను. ఇంతకంటె నెక్కువ కష్టములనుగూడ భరింపగలను. మీరు సుఖముగ నుండుటమాత్రము నాకెంతయు అవసరము. వారు నా పిల్లల నందఱను తీసికొని పోనిండు. ఈ ప్రపంచము నంతను తీసికొని పోనిండు. మిమ్ములను నాకు మిగిల్చిన చాలును."

నా కుమారుడు మోజెస్ అప్పుడచ్చటనే యుండెను. అతడు మా విచారమును తగ్గించుటకు ప్రయత్నింప సాగెను. "మన మింకను కృతజ్ఞులమై యుండుటకు కారణముండవచ్చును. మనకు మంచిరోజులు రావచ్చును. మీరు విచారింపవలదు" అని అత డనసాగెను.

"అబ్బాయి!" అని నే నంటిని: "ఈ విశాల ప్రపంచము నంతను ఒక్కసారి కలయజూడుము. ఇందు నాకెచ్చటనైన రవంత యైన సౌఖ్యము మిగిలి యున్నదేమో చూడుము. ఆశాకిరణము లక్షియు అస్పృశ్యమైపోయిన విషయమును నీవు గ్రహించుటలేదా!

మన ఆశాజ్యోతులన్నియు సమాధికావాలనే ఉన్నవను విషయ
మును గ్రహింపుము."

అంతట మోజెస్ ఇట్లనెను: "నాన్నా! మీరావిధముగ
అనుకోవలసిన పనిలేదు. మీకింకను సంతృప్తికలిగించు విషయ
ములు కలవు. నేనిట్లెందుకు చెప్పుచున్నానో తెలియునా? నాకు
సోదరుడు జార్జి వద్దనుండి ఉత్తరమొకటి వచ్చినది.

"ఏమిజరిగినది? మన దుస్థితి అతనికి తెలియునా? మన
మందఱము కష్టములు పడుచున్నాము. అతని కేబాధలును లేవని
అనుకొందును" అని నేను మధ్యలోనంటిని.

"అతని కెట్టిబాధలునులేవు" అని మోజెస్ చెప్పసాగెను:
"అతడు చాల ఉల్లాసముగనున్నాడు. సంపూర్ణసౌఖ్యముల ననుభ
వించుచున్నాడు. అతని యుత్తరము మంచి విషయములనే
తెలియజేయుచున్నది. అందు చెడ్డవిషయముల ప్రశక్తియే లేదు.
అతడు తన పై అధికారియగు కల్నల్ కెంతయు ఇష్టుడు. ఆ
మహనీయుడు ఖాళీరాగానే మనవానికి లెఫ్టినెంట్ హోదా నిత్తు
నని వాగ్దానము చేసియున్నాడట."

"ఇదియంతయు నిజమని నీవు గట్టిగా నమ్ముచున్నావా?
నా కుమారునకు అపాయమేదియు సంభవింపలేదని నీవు గట్టిగా
నమ్ముచున్నావా?" అని నాభార్యఅనెను.

"నా సోదరుని కెట్టి అపాయమును కలుగలేదని నేను
నిశ్చయముగా చెప్పగలను. మీరతడు వ్రాసిన ఉత్తరమును
చూడవచ్చును. అది మీకు అపరిమితమగు ఆనందము నొసగ
గలదు. మీకు ఆనందము నొసగునదేదైననున్న, అది ఈ
యుత్తరమే" అని మోజెస్ అనెను.

నాభార్య మరల నిట్లనెను: "ఆ యుత్తరము అతనివద్ద నుండియే వచ్చినదనియు, అతడు సుఖముగ నున్నాడనియు నీవు గట్టిగా నమ్ముచున్నావా?"

"గట్టిగా నమ్ముచున్నాను. నిశ్చయముగ నతడే ఈ యుత్తరమును వ్రాసియున్నాడు. అతడు మన కుటుంబమునకు గర్వకారణము. అందఱను పోషింపగల సమర్థుడతడు" అని మోజెస్ అనెను.

"అయినచో నేను భగవానున కెంతయు కృతజ్ఞురాలను. నేను ఇటీవల వ్రాసిన యుత్తర మతనికి అందియుండదు. అది దారితప్పి ఎచ్చటికో పోయియుండును. నాథా! ఇతరవిషయము లన్నిటి లోను భగవానుడు మనపై అనుగ్రహము చూపియుండలేదు. ఈ విషయమునమాత్ర మాయన మనపై అనుగ్రహము చూపి యున్నారు. నేను ఇటీవల మన అబ్బాయికి వ్రాసిన యుత్తర ములో నేమి వ్రాసినానో తెలియునా? ఆ యుత్తరమును నేను ఎంతో కోపముతో వ్రాసినాను. ఆ యుత్తరములో మనకష్టము లన్నిటిని వివరముగ వ్రాసినాను. 'నీకు పురుషహృదయమున్నదా? ఉన్నచో నీతండ్రికి, సోదరికి న్యాయము చేకూర్చుము. ప్రతీ కారముచేయుము. ఇవే నా ఆశీర్వచనములు' అని నేనా యుత్త రములో వ్రాసినాను. అన్నివిషయములను స్వయముగా నడి పించు భగవానుడు ఆ యుత్తర మతని కందకుండ చేసినాడు. నాకింక భయమేమియు లేదు" అని నాభార్య అనెను.

అప్పుడు నే నిట్లంటిని: "నీవు చాలచెడ్డగా వ్రాసినావు. మఱి యొకప్పుడైనచో నిన్నందులకు కఠినాతికఠినముగ మందలించి యుండెడివాడను. అయ్యో! నీవు సర్వనాశనమునుండి ఒక్క-

వెం(ఠుక వాసిలో తప్పించుకొన్నావు! నీ కుమారుడు సర్వనాశనమైపోయి యుండెడివాడు ఈ సందర్భముచే మనకు మనపట్లగల దయకంటె భగవానునికి మనపట్లగల దయ ఎక్కువైనదని రుజువైనది. నే నీలోకమును వీడిపోయినపుడు నాపెద్దకుమారుడు మిగిలిన వారికంతటకు తండ్రిగాను, సంరక్షకుడుగను నుండుటకు భగవంతు డీవిధముగ చేసియున్నాడు భగవానుడు నాసౌఖ్యముల న్నిటిని తీసివేసి పెట్టి వైచినాడనియు, నాకీ జీవితములో నింక సుఖము లేదనియు నే నిదివరకు అన్యాయముగ ఫిర్యాదుచేసి యున్నాను. నా పెద్ద కుమారుడు సుఖముగ నున్నాడనియు, మా బాధ తనకు తెలియదనియు ఇప్పుడు తెలియుచున్నది. భర్తను గోల్పోయిన తల్లిని, సోదరులను, సోదరీమణులనుచక్కగా పోషించుట కతడింకను మిగిలియున్నాడు. అన్నట్లు సోదరీ మణు లెక్కడ మిగిలియున్నారు? అతని కింక వారు లేరు. ఇరువురును పోయినారు. నానుండి వేరుచేయబడినారు!"

అంతలో మోజెస్ అడ్డువచ్చి ఇట్లనెను: "నాన్నా! అన్న (వాసిన ఈ యుత్తరమును చదువుటకు నాకు అనుమతి నొసగుము. ఇది నీకు ఆనందమును కలిగించునను విషయము నాకు తెలియును."

"చదువుము" అని నేనంటిని.

అంతట నా కుమారుడు మోజెస్, జార్జి (వాసిన యుత్తరము నిట్లు చదువ సాగెను.

గౌరవనీయులగు నాన్నగారు,

నా చుట్టును ఆవరించుకొని యున్న ఆనందమునుండి కొన్ని క్షణముల పాటు నా ఊహాశక్తిని నాకు (ప్రియాతి (ప్రియ

మైన వారి వంకకు మరల్పుచున్నాను. వారు ఇంటివద్ద కుంపటి చుట్టును కూర్చున్నారు. వారందఱును ఈ యుత్తరములోని ప్రతి అక్షరమును ఎంతో ఆసక్తితో వినుచున్నారని నేనూహించుకొనుచున్నాను. వారి ముఖములు కడు ప్రకాశవంతముగ వెలుగుచున్నవి వారు కష్టమననేమో, విచారమననేమో అణుమాత్రమైన నెఱుగరు. మీరు ఇంటివద్ద సర్వసౌఖ్యములను అనుభవించుచున్నారన్న మాట నిజమే! అయినను నా యీ వాక్యములు మీ సౌఖ్యము నతిశయింప జేయునని నమ్ముచున్నాను. నా యిక్కడ పరిస్థితితో నేను సంపూర్ణముగ సంతృప్తి చెంది యున్నాను. అన్ని విధముల నేను సుఖముగ నున్నాను.

మొకటి యాజ్ఞకు విరుద్ధముగ మా సైనిక దళము దేశమును వీడి పోరాదని మఱియొక యుత్తరవు జారీయైనది. సైనికాధికారి (కలనల్) నాకు గాఢ మిత్రుడు. అతడు నన్ను తాను పోయిన చోటికెల్ల తీసికొని పోవుచున్నాడు. నేను తరువాత ఒక్కడనే ఆయా ప్రదేశములకు పోవుచున్నాను. అచ్చటివారు నన్నెంతో గౌరవముగ స్వీకరించుచున్నారు. నిన్న రాత్రి నేనొక గొప్ప యువతిని కలసికొన్నాను. ఆమెతో కలసి నాట్యముచేసినాను. ఈ విషయమున నేను విజయము సాధింపగలనని ఆశించుచున్నాను. కాని నేనింకను ఇతరులను జ్ఞప్తి యందుంచుకొనుట నా కర్మ. పలువురితరులు మాత్రము నన్నప్పుడే మఱచి పోయినారు. అట్టి వారిలో మీ రొకరని తలచుచున్నాను. మీ వద్దనుండి ఒక ఉత్తరము ముక్కయైన వచ్చునని నేను ఎంతో కాలమునుండి ఆశించుచువచ్చినాను. కాని నా ఆశనిరాశయైనది. సోదరీమణులు ఒలీవియా, సోఫియాలు నాకు తఱచుగా ఉత్త

రములు వ్రాయుచుండుమని వాగ్దానము చేసినారు కాని వారు కూడ నన్ను మఱచి పోయినారని తోచుచున్నది. వారికవ్వుడును నట్టి అల్లరిపిల్లలు. వారిపై నాకిప్పుడు ఎంత కోపముగనున్నదో వ్రాయజాలను. అన్నట్లు నిజముగా నాకు వారిపై నాకు కోపమునులేదు. నా సోదరీమణులను నే నెట్లు కోపింపగలను? వారిని నేను హృదయపూర్వకముగ ప్రేమించుచున్నాను. వారి పట్ల నాకుగల ప్రేమతో నాహృదయము ఆర్ద్రమై పోవుచున్నది. అమ్మకు నా నమస్కారములు. సోదరులకు నా ఆశీర్వచనములు.

మీ విధేయుడు.

జార్జి.

ఉత్తరములోని విషయమునంతను తెలిసికొన్నతరువాత నే నిట్లంటిని: "మన మిప్పుడు వర్ణనాతీతమైనదుస్థితిలోనున్నాము. కాని మన కుటుంబములో కనీస మొకడైనను ఈ దుస్థితికి బయటనున్నందుకు మనము భగవానున కంజలి ఘటించి కృతజ్ఞతను ప్రకటింపవలయును. భగవంతుడు నా కుమారునకుతోడుగ నుండుగాక! నేను ఆతనికి అప్పగింపగల ఆ స్థితియు లేదు. నాభార్యను ఈ చిన్న కొమరుల నిరువురను మాత్రమప్పగింతును. భగవంతుడు వీరికి సర్వసౌఖ్యములను చేకూర్చుగాక! వీరెల్లప్పుడును ధర్మపథము ననుసరించి నడచుకొందురుగాక."

నే నట్లనుచుండగా జైలులో నేదో పెద్ద సవ్వడియగు చున్నట్లు వినబడసాగెను. అనతికాలములో నా సవ్వడి అణగి పోయెను. నా గదిలోనికి వచ్చుటకున్న దారిలో శృంఖలముల సవ్వడి వినబడసాగెను. జైలు అధికారి నాగదిలో ప్రవేశించెను. అతనితోబాటు మఱియొక మనుజుడుగూడ నుండెను. ఆమనుజుని

శరీరమునిండ రక్తముండెను; గాయములుండెను, అతని చేతులకు చాల బరువైన సంకెళ్ళు తగిలింపబడియుండెను. ఆమనుజుడు నన్ను సమీపించుచుండెను. అతని దుస్థితిజూచి నేనెంతయు సానుభూతిని చూపసాగితిని. కాని అస్పష్టకాంతిములో నతడు నా కుమారుడని గ్రహించితిని. అప్పుడు నాకుకలిగిన భయము నేమని వర్ణింతును.

"నాజార్జి! నాజార్జి! నిన్ను నేను ఇట్లాచూచుట! గాయములు! సంకెళ్ళు! ఇదేనా నీవనుభవించుచున్న సౌఖ్యము! ఈవిధముగనేనా నీవు నావద్దకు తిరిగివచ్చుట! ఈ దుర్భర దృశ్యము వెంటనే నా హృదయము నెందుకు వేయి వ్రక్కలు చేయదు? నే నెందుకు వెంటనే మరణింపను!" అని నేనువాపోవ సాగితిని.

"అయ్యో! మీ మనస్థైర్యమంతయు నేమైపోయినది? నేను బాధపడవలయును. నా జీవితమింక నాది కాదు. వారినా ప్రాణము తీసికొనెందు" అని జార్జి, అనెను.

నేను కొన్ని నిమిషములవరకు ప్రశాంతముగనుండి నా ఉద్వేగమును అణచుకొనుటకు ప్రయత్నించితిని. కాని ఆప్రయత్నములో నేను మరణించియుండవలసినదనుకొంటిని. "అయ్యో! అయ్యో! అబ్బాయి! నిన్నీవిధముగ చూచుటకు నే నెంతయు విచారించుచున్నాను. కాని నేనేమిచేయగలను? నేనునిస్సహాయుడను నీకే సాహాయ్యమును చేయలేను! నీకేసాహాయ్యమును చేయలేను! నీవు భగవదాశీర్వచనమునుపొందితివని నేనుతలచితిని. నీవు సురక్షితముగ నుండవలయునని భగవానుని ప్రార్థించితిని.

కాని నిన్ని విధముగ చూచుచున్నాను! గాయములు! శృంఖలములు! అయినను యువకుల మరణము సుఖమైనది. కాని నేను ముసలి వాడను; చాల ముసలివాడను; ఈ దృశ్యమును చూచుటకింత పెద్దకు జీవించి యున్నాను, నా పిల్లలందఱును ఒకరి తరువాత నొకరు రాలిపోవుచుండగా నేను చూచుచు కూర్చున్నాను. ఈ శిథిలములమధ్య నేనింకను దుఃఖ భాజనుడను, ఉత్కృష్టమునగు జీవితమును గడపుచున్నాను. వారికాలము తీఱిపోవుచున్నది. నాకాలమింకను తీఱలేదు. ఇది ఎంతో శోచనీయమైనది. విధాతా! నా పిల్లల సంపదను హత్యచేసినవాని తలపై వేయి పిడుగులో కురసారిపడుగాక; అతడుకూడ నావలెనే జీవించి చూచును.....” అని అనసాగితిని.

కాని జార్జిజోక్యము కలిగించుకొని యిట్లనెను: “అయ్యా! ఆగుడు! ఆగుడు! నేను మీ ప్రవర్తనచూచి సిగ్గుపడవలసి వచ్చెను. అయ్యా! ఇదియేమి! మీ వయస్సును మఱచిపోయి నారు! మీ వృత్తిని మఱచి పోయినారు! దేవుడు చేయవలసిన నిర్ణయమును మీరే చేయుచున్నారు! మీరు యితరుల నెత్తిపై పిడుగులు పడవలయునను చున్నారు. కాని ఆ పిడుగులు మీ తలపైపడి మిమ్ముల సర్వనాశనము చేయును. అయ్యా! మీ రిప్పుడు చేయవలసిన పనియేమి? అంతకాలములో నేను మరణింపవలసి యున్నది. మీరందుకు నన్ను సిద్ధపఱచవలయును! నేనా మరణమును ధైర్యముతో నెదుర్కొనుటకు మీరు నాకు సాహాయ్యము చేయవలయును!”

“అబ్బాయి! అబ్బాయి! నీవు మరణింపరాదు! నీవు మరణింపరాదు! నీవు చేసిన ఏ నేరముగాని అంత ఘోరమైన శిక్షకు

తగినదికాదని నేను గట్టిగా నమ్ముచున్నాను. తన పూర్వీకులు సిగ్గుపడునట్లు చేయు నేరమును దేనినిగాని నా ప్రియమైనజార్జి చేసియుండడని నేను నిశ్చయముగ విశ్వసించు చున్నాను" అని నే నంటిని.

"అయ్యో! నేను క్షమింపరాని నేరమును చేసియుంటినని ఎంతయు భయపడు చున్నాను! ఇంటివద్దనుండి అమ్మ వ్రాసిన యుత్తరము నాకు అందినది. నేను వెంటనే బయలుదేఱి వచ్చినాను. మన గౌరవమును, పేరు ప్రతిష్ఠలను సర్వనాశనము చేసిన వానిని శిక్షించుటకై వచ్చినాను. నన్ను కలసికోవలసినదని అతనికి జాబు పంపినాను; కాని అతడు స్వయముగ వచ్చినన్ను కలసికోలేదు. నన్నుపట్టుకొని శిక్షింపవలసినదని తన సేవకులను నలుగురిని పంపినాడు. మొట్టమొదట నన్నుకొట్టిన వానినొకనిని తీవ్రముగ గాయపఱచినాను. అతనికి తగిలిన గాయము ప్రాణమోసము కలిగించునని నేను భయపడుచున్నాను. కాని మిగిలిన వారు నన్ను ఖైదీగా పట్టుకున్నారు. ఆ పిఱికివాడు చట్టమును నాకు వ్యతిరేకముగ ప్రయోగింప వలయునని నిశ్చయించుకొన్నాడు. నేను చేసిన నేరమునకు చక్కని రుజువులున్నవి. మొట్టమొదట సవాలుచేసిన వాడనునేనే. చట్టమును మొదట నుల్లంగించినవాడను నేనే. నేను క్షమింప బడుదునను ఆశనాకు అణుమాత్రమైనను లేదు. మీరిదివరకెన్నోసార్లు మనస్థైర్యమును గూర్చి చక్కని యుపన్యాసముల నొసగినారు. మీరా మనస్థైర్యము నిప్పుడు ప్రదర్శింపవలయునని ప్రార్థించు చున్నాను" అని జార్జి అనెను.

"తప్పక నీవు నాలో మనస్థైర్యమును చూడగలవు" అని

నేనంటిని; నేనిప్పుడు ఈ ప్రపంచమునకు, అందలి సౌఖ్యములకు అతీతుడను. ఈ క్షణమునుండి నా హృదయము నీ భూలోకము నకు బంధించిన బంధనము లన్నింటిని త్రెంచి వేయుదును. మనల నిరువురను శాశ్వతలోక నివాసమునకు సిద్ధము చేయు దును. నాయనా! నిశ్చయముగ నేను నీకు మార్గమును చూపె దను. పైకి పోవుటలో నా ఆత్మ నీ ఆత్మకు మార్గమును చూపును. మన మిరువురము కలసియే పైకి ప్రయాణముచేయు దము. నీకీ లోకమున క్షమాపణ దొరకదని నేనిప్పుడు నిశ్చ యముగ నభిప్రాయపడుచున్నాను. అనతికాలములోనే మన మిరువురము దేవుని ముందు సమాధానము చెప్పుకొనవలసి యున్నది. అచ్చట నీవు క్షమాపణను కోరుకొనుము. నీకది తప్పక లభించును.

కాని మన మా విషయమున లోభితనముగా ప్రవర్తింప రాదు. అందు మనతోడి ఖైదీల కందఱకు భాగ మీయవల యును. ఓ జైలు అధికారీ! నీవు చాల మంచివాడవు. ఖైదీలం దఱును ఇచ్చట నిలబడుటకు అనుమతింపుము. నేను వారి నభి వృద్ధి పఱచుటకు ప్రయత్నింతును."

అట్లని నేను నా గడ్డి పరుపుపైనుండి లేచుటకు ప్రయ త్నించితిని. కాని నా కందుకు తగినంతబలము లేకుండెను. నేను మెల్లన గోడకు ఆనుకొనగలిగితిని. నా సూచనల ప్రకారము ఖైదీ లందఱును సమావేశమైరి; నా సలహాను వినుట వారికెంతయు ఇష్టమగుట వలననే వారట్లుచేసిరి. నా కుమారుడు, భార్య నాకు రెండు ప్రక్కలనుండి ఆధారముగానుండిరి. నేను చుట్టును కలయ

జూచితిని. అందఱును వచ్చిరి. ఇంక రావలసిన వారెవ్వరును లేరు. నేను నా యుపన్యాసమును ప్రారంభించితిని.

## 29

నా మిత్రులారా, పిల్లలారా, తోడి ఖైదీలారా, ఈ లోకపు మంచి చెడ్డ పంపకములను గురించి నేను ఆలోచించి నప్పుడు మనుష్యులు సుఖముగా అనుభవించుటకు చాల ఈయబడినదనియు, బాధపడుట కంతకంటె ఎక్కువగా నీయబడిన దనియు, గమనించితిని. ఈ విశాల ప్రపంచములోని ప్రతియొక్క మానవుని పరిశీలించిన, ఇంకను సుఖింపవలయునని కోరని మానవు డొక్కడును కనబడడు. కాని ప్రతి దినమును ఆత్మ హత్య చేసికొనువారు వేలకొలది కనబడుచున్నారు; అనగా వారికే ఆశాకిరణమును కనబడుట లేదన్నమాట. అనగా ఈ ప్రపంచములో భగవంతుని ఆశీర్వచనమును పొంది సంపూర్ణముగ సుఖించుచున్న వారెవ్వరును లేరన్నమాట. కాని సంపూర్ణముగ దుస్థితిలో మునిగిపోవు చున్నవారు ఉన్నా రన్నమాట.

మానవు డీ విధముగ బాధల నెందుకనుభవింపవలయును? సంపూర్ణముగ దుస్థితిలో మునిగిపోయిన మానవు లెందుల కున్నారు? ఇటువంటి పరిస్థితి మార్చి ప్రతి యొక్కడు సంపూర్ణ సౌఖ్యముల ననుభవించు పరిస్థితులు నేల కల్పించ రాదు? ఈప్రశ్నలకు సరియైన వివరణము నీయబోవుటసాధ్యము కాదు ఒకవేళ సాధ్యమైనను ఉపయోగ మేమియు లేదు. మన

మా కుతూహలమునుండి తప్పించుకొనుటకు భగవానుడే కొన్ని ఏర్పాట్లుచేసి యున్నాడు. ఉన్న దానితో సంతృప్తి చెందని కతడు కొన్ని ఉద్దేశ్యములను సృజించినాడు.

ఈ పరిస్థితిలో మానవుడు తనకు సాహాయ్యము చేయుమని తత్వశాస్త్ర సాహాయ్యమును స్నేహపూర్వకముగ నర్థించి యున్నాడు. అతని సంపూర్ణముగ ఊహించుటకది చాలదని భగవంతుడు గ్రహించి, అతనికి మతమును సాహాయ్యముగా నొసగియున్నాడు. తత్వశాస్త్రముయొక్క ఊహింపుచాల వినోదముగ నుండును. కాని తఱచుగా మిథ్యా హేతువాదముగ నుండును. మనము చక్కగా అనుభవింప గలిగినచో జీవితములో ఎన్నో సౌఖ్యములు కలవని అది చెప్పును. మఱియొకచోట, మన మిచ్చట తప్పకకష్టముల ననుభవింప వలసియున్నదియు, కాని జీవిత కాలము స్వల్పమగుటవలన ఆ కష్టములు త్వరలోనే పోవునవియు చెప్పును. ఆవిధముగా నీయూహింపులు ఒకదానినొకటి నాశనముచేయును. ఏలయన జీవితము సౌఖ్యముల కాటపట్టైనచో, మఱి అది స్వల్పకాలమైనచో బాధాకరమైన విషయమే! మఱి జీవితము చాల కాలమున్నచో దుఃఖములుకూడ చాలకాల ముండును. ఈవిధముగ తత్వశాస్త్రము బాహ్యమయముగ నున్నది. కాని మతము మాత్రము అత్యున్నత ధోరణిలో మానవునకు ఊహింపు నొసగును. మానవుడు తన మనస్సును మఱియొక చక్కని నివాసమునకు సిద్ధము చేసికొను చున్నాడని అదిచెప్పును.

మంచివాడు ఈ భౌతికకాయమును విడిచినపుడు, అత్యుత్తమమైన మనస్సును కలిగి యుండును; అప్పుడతడు సర్వసౌఖ్యములకు నిలయమగు లోకమును సృష్టించు కొన్నట్లగును. కాని

చెడ్డవాడు తన శరీరమును; మనస్సును ఎన్నో సద్గుణములతో పాడు చేసికొని యుండును; అతడీ భౌతిక కాయమును విడచు నపుడు సకల దుర్గుణములకు ఆలవాలమైన మనస్సు కలిగి యుండును. భగవంతుడు తీసికొను నునుకొనుచున్న ప్రతీకార చర్య అతనికి స్పష్టముగ కనబడుచుండును. కావున మనము మన జీవితములో ఎట్టి పరిస్థితిలోనైనను మతమునుండియే నిజమైన ఊరడింపును పొందగలము. ఏలయన మన మిత్రులకే సుఖముగానున్నచో, ఆసౌఖ్యముల ననంతముగ చేసికోవచ్చునని ఆశపందింతుము. ఇది వఱకే కష్టముల ననుభవించు చున్నచో విశ్రాంతి గృహ మొకటి యున్నదని ఊరడిల్లుచుండును. అదృష్టవంతులకు మతము నిరంతర సౌఖ్యమును సూచించు చుండును. దురదృష్ట వంతులకది బాధా విముక్తిని సూచించు చుండును.

ఆ విధముగ మతము అందఱు మానవులపట్ల చాలదయ కలిగి యున్నను ముఖ్యముగా నది కష్టములలో నున్నవారికి అపూర్వమైన బహుమానముల నొసగుచున్నది. జబ్బులలో నున్నవారు, కట్టుబట్టలు లేనివారు, ఇల్లు లేనివారు, ఖైదీలు. ఎక్కువ భారమును మోయుచున్నవారు- వీరికి మన పవిత్ర గ్రంథములలో తఱచుగా వాగ్దానములు చేయబడి యున్నవి. మన మతప్రవక్త తాను నికృష్టుల స్నేహితుడనని చెప్పుకొని యున్నాడు. దొంగ మతప్రవక్తల వలెకాక ఆయన దిక్కుమాలినవారి అభ్యున్నతికే ఎక్కువగా పాటుపడి యున్నాడు. ఆలోచనారహితులు ఆ మహనీయుడు చేసినపని పక్షపాతముతో కూడుకొని యున్నదని విమర్శించినారు; యోగ్యత లేనిచోట బహుమానము నిచ్చినట్లయిన దని ఖండించినారు. కాని వ్యారొక్క విషయమును గూర్చి

ఎప్పుడును ఆలోచింపరు. సుఖముగా నిరంతర సౌఖ్యముల నొసగుట ఒకే ఒక లాభమును చేకూర్చు చున్నది. ఏలయన ఆ వరము వారి కిదివఱకేయున్న సౌఖ్యము లను వృద్ధి చేయుటకు మాత్రమే తోడ్పడును. కాని కష్టము లలో నున్నవారి కది రెండు విధముల లాభకరమైనది. వారి కష్ట ముల బాధ నిచ్చుట తగ్గించును. తరువాత ఉత్తమ సౌఖ్యము లను బహూకరించును.

అంతియేకాదు. మఱియొక విధముగా గూడ భగ వానుడు ధనికులపట్ల కంటె బీదవారిపట్ల ఎక్కువ దయను ప్రద ర్శించుచున్నాడు. మరణము తరువాతి జీవితము వాంఛనీయ మైనదని ప్రకటించి భగవంతుడందుల కచ్చటి మార్గమును కూడ సుగమపఱచును. కష్టములలో నున్నవారి కిదివఱకే వివిధ రక ముల భయములతో పరిచయమున్నది. కష్టములలో నున్నవాడు ప్రశాంతముగ మరణించును. ఏలయన అతనికి ఆ స్థితిపోవుచున్న దను విచారము లేదు. అతడు మరణింపకుండనుండుటకు బంధనము లెవ్వియు లేవు. అతడా సమయమున ప్రకృతి బాధను మాత్రమే పొందును. ఆ బాధ అతడిదివఱకు అనుభవించిన నికృష్టమగు బాధల కంటె ఏమంత ఎక్కువైనది కాదు. ఒక మేరవఱకు బాధల నను భవించిన తరువాత ఇంక బాధబాధగా కనబడకుండునట్లు ప్రకృతి తోడ్పడును.

ఆ విధముగా భగవానుడు ఈ జీవితములో సుఖముగా నున్నవారికి ఒకే లాభమును చేకూర్చుచున్నాడు; కష్టములలో నున్నవారికి రెండు లాభములను చేకూర్చుచున్నాడు. కష్టములు పడ్డవారికి మరణ సమయమున ఎక్కువ ఆనందము కలుగు

చున్నది; మఱియు తరువాత ననుభవించు సౌఖ్యములు ఇనే నటకు కష్టముల ననుభవించి యుండుటవలన అతిశయముగా కనబడును. మిత్రులారా! ఈ విధముగ కష్టముల ననుభవించిన వారు ఆధిక్యమును పొందుచున్నారు. ఆ ఆధిక్యము సామాన్య మైన దేమాత్రమును కాదు. పవిత్ర గ్రంథములోని బీదవాని కథ మీకు జ్ఞప్తియుండు లేదా? అతడు స్వర్గలోకమును చేరు కొన్నాడు; అచ్చటి అమర సౌఖ్యముల నన్నిటిని అనుభవించు చున్నాడు. అతడు అనుభవించుచు సౌఖ్యముల ఆధిక్యమతి శయించినది పవిత్ర గ్రంథములో పేర్కొనబడినది. ఒకప్పుడు నేను దుస్థితిలో నుంటిని ఇప్పుడు సౌఖ్యముల ననుభవించు చున్నాను. కష్టములుపడుట యున్న నేమో ఒకప్పుడు నాకు తెలి యును; ఇప్పుడు సౌఖ్యమన్న నేమో తెలియును. మొదటినుండి సౌఖ్యముల ననుభవించిన వారికంటె నాకిచ్చటి సౌఖ్యముల విలువ హెచ్చుగా తెలియుచున్నది అని ఆ బీదవాడన్నాడు.

కావున మిత్రులారా, తత్వశాస్త్ర మెప్పటికిని చేయలేని పనిని మతము చేయుచున్నదను విషయమును గమనింపుడు. సుఖముగా నున్న వారిని, సుఖముగా లేనివారిని భగవానుడు సమాన దృష్టితో చూచుచున్నాడు. మానవులనుభవించు సౌఖ్య ముల నన్నిటిని కొంచెమించుగా ఒకే ప్రమాణమునకు తీసికొని వచ్చున్నాడు. ధనికులకు బీదవారికిగూడ అతడు ఒకే విధముగు సౌఖ్యము నొసగును. వారి తరువాతి ఆశాకిరణములు కూడ ఒకే విధముగ నుండును. ధనికు లిచ్చటనే సౌఖ్యముల నను భవించి ఆనందము పొందుచున్నారు. ఒకప్పుడు కష్టములు

అనుభవించినారు కనుక బీదవారు తరువాతి సౌఖ్యముల త్తిక్త్య మును పొందుచున్నారు. ఇది గణనీయమైన అంశము.

ఇవి కష్టముల ననుభవించినవారికి గల ప్రత్యేకమైన సౌకర్యములు. వీనిలో వారు మిగిలినవారందఱికంటె ఒకమెట్టు పైన నున్నారు. మిగిలినవానిలో వారు మిగిలిన వారందఱికంటె క్రిందనున్నారు. బీదల కష్టముల నెఱిగినవారు జీవితమునందు వాని సహింపవలయును. మనుజులకు కావలసిన జీవితావసరములన్నియు నున్నవారు బీదవారుకారు. ఎవరికి జీవితావసరములు లేవో, ఎవరు తమకు జీవితావసరములు కావలయునని వాంఛించు చుందురో వారు బీదవారు. మిత్రులారా! మనమందఱు మట్టి వారమే. మనము దుస్థితిని అనుభవింపవలసినదే. మన మెన్ని ప్రయత్నములు చేసిననేమి? జీవితావసర వస్తువులను సమకూర్చు కొనలేని ప్రయత్నములన్నియు వృథాప్రయత్నములే. జీవితావసర వస్తువులు లేనిదే సహజమగు వాంఛలు ఎట్లు తీరును? గాలి వెలుగు లేని ఈ చీకటి కొట్టములు ఎట్లుమారును? భగ్నహృదయుడు తన బాధల నెట్లు తీర్చుకోవచ్చును. మనము వీనినన్నిటిని ఎదుర్కొనవచ్చునని మెత్తని శయ్యపై కూర్చుండియుండు తత్త్వశాస్త్రజ్ఞులు చెప్పెదరు, అయ్యో! వీని నెదుర్కొనుటకు మనము చేయు ప్రయత్నములు మన బాధలను మఱింత అతిశయింప జేయునుగదా!

మరణము చాల సులభమైనది. ప్రతిమనుకొనును సహజముగ దానిని పొందవచ్చును. కాని ప్రాణముండగా పడు బాధలు కడు భయంకరమైనవి. వీనిని ఏమానవుడు కాని సహింపలేడు.

కావున నో మిత్రులారా! మనము స్వర్గలోక సౌఖ్య ములు ననుభవించుచున్నాము. భగవంతుడందుకు మనకు వాగ్దానము చేసియున్నాడు. ఇది మనకందఱకు ప్రత్యేకముగ ప్రియమైన విషయము. మనకు ఈజీవితములోనే బహుమానము లభించియుండెనచో మనము మానవులలోకెల్లనికృష్టమైయుండెడి వారము. ఈ గది గోడలను చూడుడు; ఇది మనుజుని యుత్సాహ మును చంపివేయును. పైగా భయమును కలుగజేయును. మన లను బంధించియుంచును. ఇక్కడి శాంతి యీ భయంకరదృశ్య మును చూచుటకుమాత్రమే సరిపడును. ఇచ్చట మనమందఱ మెన్ని బాధలు పడుచున్నామో మీకు బాగుగ తెలియును. మీ చూపులలో నావిషయము స్పష్టముగ తెలియుచునేయున్నది. మిత్రులారా! మన కందఱకీ కష్టములుపోయి స్వర్గలోకసౌఖ్య ములు లభించును. ఆహాహా! మన మెంతటి అదృష్టవంతులము! అచ్చట నిర్మలమైన గాలి వీచుచుండును. మనోహరమైన కాంతి వ్యాపించుచుండును! ప్రార్థనా గీతములను పాడుకొనుచు సర్వ సౌఖ్యముల ననుభవించుచు నచ్చట జీవింపవచ్చును. అచ్చట మనకు యజమానుడులేడు. మనల నవమానముచేయు వా రెవ్వరును లేరు. మన కన్నులలో నెప్పుడును భగవత్స్వరూపమే ప్రతిఫలించుచుండును. ఈ మంచివిషయములను తలచుకొన్నపు డెల్ల మరణదేవత నాకు మంచివార్తలను తెచ్చు వార్తావహు డుగ తోచుచుండును. మరణదేవత వాడి బాణములు నాధార ముగనుండి కట్టువాల కనబడుచుండును. ఇచ్చట కలకాలము జీవించుటవలన లాభమేమి యున్నదనిపించును. ఇచ్చటి సౌఖ్య ములు ఎందుకును పనికిరానివనిపించుచుండును. రాజభవనము

లలో నుండు రాజు లచ్చటి లాభములకొఱకు ఏర్పడుచుండ వలయును. మనము వానిని కడు ఆతురతముతో అపేక్షించుచుండవలయును.

మఱి అవిజయన్నియు మనవగునా? అవియన్నియు తప్పక మనవి అగును. మనము వానికొఱకు ప్రయత్నింపవలసియున్నది. మన మిూఁజై లులోనుండుటవలన అనుకోనివిధముగా ఒకలాభము చేకూరెనది. బయటనున్నచో మన ప్రయత్నముల కెన్నో ఆటంకములు వచ్చియుండెడిది. ఇచ్చట నుండుటవలన మనలను దారి తప్పించునవి ఏవియు లేవు. మనము పట్టుదలతో ప్రయత్నింతము. అవి తప్పక మనవి అగును. ఎంతో కాలమందుకు పట్టదు. అచిర కాలములోనే మనము విజయము సాధింతుము. మన మొక్కసారి వెనుకకు తిరిగి జరిగిపోయినకాలమును చూచినచో నది ఎంతో స్వల్పకాలముగ కనబడును. మఱి భవిష్యత్కాలము వంకకు చూచినచో నది యింకను ఎంతో స్వల్పకాలముగ కనబడును. మనకు వయసు మిూఱుచున్నకొలది రోజులు తగ్గిపోవుచున్నట్లు కనబడుచుండును.

అందువలన మనమిప్పుడు ఎంతో సంతోషింపవలయును. అనతికాలములోనే మన ప్రయాణము ముగిసిపోవును. భగవానుడు మనపైనుంచిన భారమును తొలగద్రోసికొందుము. కష్టములలో మునిగియున్నవారికి నిజమైన స్నేహితుడు మరణదేవత మాత్రమే. కొంతకాల మది అలసిపోయియున్న నాటపాటల హేళన చేయుచున్నట్లుండును. కాని అంత్యమున అతనికష్టములకు భరతవాక్యము పలుకును. మన మాలోకమును చేరుకొందుము. అప్పుడింక మనలను పాతాళలోకమున కణగద్రొక్కవేయు ధనికు

లుండెదరు. మనము భూలోకములో పడిన కష్టములను గూర్చి సంతోషముగ తలచుచుందుము. అప్పుడుమనలను మన స్నేహితు లందఱు చుట్టుముట్టియుందురు. మన సౌఖ్యముల కింక అంత మనునది యుండదు."

# 30

ఆవిధముగా నేను నా యుపన్యాసమును ముగించితిని. ఖైదీలందఱును తమ తమ స్థానములకుపోయిరి. ఆ జైలుఅధికారి, అట్టి ఉద్యోగమున్న వా రందఱిలోను పరమదయాళుడు. అతడు తన విధ్యుక్తధర్మమును సక్రమముగ నిర్వహించుచుండెడివాడు అంతకు మించి లేనిపోని అధికారమును చెలిగించెడివాడుకాడు. అతడు నాతో నిట్లనెను: "అయ్యా! మీ కుమారుడు జార్జిపై ఆరోపింపబడిన నేరమును చాల ఘోరమైనది. అందువలన నేను నా విధ్యుక్తధర్మము ప్రకార మతని నొక గట్టిగదిలో బంధింప వలసి యున్నది. ప్రతిదినము ఉదయమున మిమ్మతడు దర్శించు టకు అనుమతి నొసగుదును."

"నేను మీయెడల ఎంతయు కృతజ్ఞుడను" అని యంటిని. తరువాత జార్జి హస్తమును గట్టిగా పట్టుకొని వీడ్కోలు చెప్పితిని. "నీ విధ్యుక్తధర్మము నే మాత్రము మఱచిపోకుము" అని గట్టిగా హెచ్చరించితిని.

నిమ్మట నేను నాకల నాగక్షివసుప్పై పడుంటిని. నాచిన్న

కుమారులలో నొకడు నాప్రక్కనే కూర్చుండి ఏదో గ్రంథమును చదువసాగెను. అంతలో జెంకిన్సన్ నావద్దకువచ్చి, 'అయ్యా! మీ రెండవ కొమార్త సోఫియా సంగతి తెలియ వచ్చినది. రెండు గంటల క్రిత మామె ఒక క్రొత్త గౌరవనీయునితో కలసి యున్నట్లు ఒకడు చూచి చెప్పినాడు. వారిరువురును ఇచ్చటకు సమీపమునయున్న యొక పూటకూళ్ళ యింటిలో బసచేసినారట. అచ్చట వారేదో ఫలహారములు తీసికొన్నారట. వారు తిరిగి పట్టణమునకు వచ్చుచున్నట్లున్నదట !"

అతడా విధముగా చెప్పుచుండగా జైలు అధికారి నా వద్దకు వచ్చెను. అతని చూపులలో తొందర, ఆనందము తొణికిసలాడుచుండెను. "అయ్యా! మీ అమ్మాయి దొరకినది" అని అతడనెను. అతని వెంటనే మోజెస్ పరుగెత్తుకొని వచ్చెను. "సోదరి సోఫియా దొరకినది. క్రిందనున్నది. ప్రాత మిత్రుడగు బర్చెల్‌తో కలసి ఇచ్చటకు వచ్చుచున్నది" అని అతడు గట్టిగా పలికెను.

అతడా మాటలు ముగించగానే నా ప్రియమైన సోఫియా నావద్దకు వచ్చెను. ఆమె చూపులు అపరిమితముగు సంతోషముతో నిండియుండెను. నాపట్ల గల ఎనలేని ప్రేమతో నన్ను ముద్దుపెట్టుకొనుటకై ఆమె నావద్దకు పరుగెత్తుకొని వచ్చెను. నా భార్య డిబోరా ప్రశాంతముగ కన్నీరు కార్చసాగెను. అది ఆమె ఆనందమును సూచించుచుండెను.

"నాన్నా ! నాన్నా ! ఇదుగో వచ్చినాను ! నన్ను శత్రువుల బారినుండి రక్షించిన మహనీయు డిదుగో! నే నీయన కెంతయు ఋణపడియున్నాను. ఈయన కడు ధైర్యసాహసములు

కలవాడు. నేనిప్పుడు స్వేచ్ఛగను, సురక్షితముగను నుండుటకు కారణ మీయన సాహసమే........." అని సోఫియా చెప్ప సాగెను. కాని అంతలో బర్చెల్ ఆమెను ముద్దుపెట్టుకొనెను. అతని సంతోషము ఆమె సంతోషము కంటె వేయిరెట్లుండెను. అతడు ముద్దుపెట్టుకొనుటవలన నా కొమార్తె మాటలు ఆగి పోయెను.

నేను బర్చెల్‌తో నిట్లంటిని: "బర్చెల్ మహాశయుడా! ఇప్పుడు మేము నికృష్టమైన ప్రదేశమున నున్నాము. నీవిప్పుడిచ్చటకు వచ్చియున్నావు! నీ విదివఱకు మమ్ము చూచినప్పటికిని, ఇప్పటికిని చాల తేడా ఉన్నది. మేము పూర్తిగా అణగారిపోయినాము. నీవు మాకు ఎల్లప్పుడును స్నేహితుడవు. నీకు సంబంధించినంత వఱకు మా పొరపాట్లను చాలకాలము క్రిందటనే తెలిసికొన్నాము. మా కృతఘ్నతకు హృదయ పూర్వకముగ పశ్చాత్తాపపడినాము. అప్పుడు నిన్ను మేము తృణీకరించినాము; అవమానించినాము; కడు నీచముగ తఱిమి కొట్టినాము. అందువలన నేనిప్పుడు నీ మొగమును చూచుట కెంతయు సిగ్గుపడుచున్నాను. నాలో నేను కుమిలిపోవుచున్నాను. నన్ను నీవు క్షమింతువని ఆశించుచున్నాను. నన్ను ఏ మాత్రము ఔదార్యములేని నీచుడొకడు మోసగించినాడు. స్నేహమను ముసుగుతో మా యింటికివచ్చి కడునీచముగ మోసగించినాడు. నన్ను క్షమింపవలయునని మఱియొకసారి కోరుచున్నాను."

బర్చెల్ ఇట్లు సమాధానము చెప్పెను: "నేను మిమ్ము క్షమించుట అసంభవము! ఏలయన నేనుఎన్నడును మీపై ఆగ్రహపడియుండలేదు. నేనప్పుడు కొంతవఱకు మీ భ్రాంతినిచూచి

నాను మీరాభ్రాంతిలోపడి మోసపోకుండ అడ్డగించుట నాకు శక్యముకాకపోయినది. అందువలన నేను విచారించుట తప్ప మఱి యింకేమియు చేయలేకపోయినాను."

"నీవు ఘన బుద్ధి కలవాడవని, ఔదార్యము కలవాడవని మొదటినుండియు ఊహించుచునేయుంటిని. అది నిజమని ఇప్పుడు సుస్పష్టముగ తెలిసినది" అని నేను బర్చెల్‌తో నంటిని. తరు వాత సోఫియాతో, "నా ప్రియమైన బిడ్డా! నీకు స్వేచ్ఛ ఎట్లు లభించినది? నిన్ను దొంగతనముగా తీసికొనిపోయిన దుష్టు లెవ్వరు?"

సోఫియా ఇట్లనెను: "నిజముగా నన్ను దొంగతనముగా తీసికొనిపోయిన దుష్టు లెవ్వరో నాకు తెలియదు. ఆ విషయ మున నేను వట్టి అమాయకురాలను. నేను, అమ్మ నడచి పోవు చుండగా వెనుకనుండి ఒక దుష్టుడు వచ్చినాడు. నేను సాహా య్యముకొఱకు కేకలు పెట్టుటకు పూర్వమే అతడు నానడుము గట్టిగా పట్టుకొని బలవంతముగ తీసికొనిపోయి తన బండిలో కూర్చుండ పెట్టుకొన్నాడు. అనతికాలములో నా బండి అతివేగ మున ప్రయాణము చేయసాగినది. రోడ్డుమీద ప్రయాణము చేయుచున్న పలువురు నాకు కనబడినారు. నన్ను రక్షింపవలసిన దనివారిని పలువిధముల ప్రార్థించితిని. కాని నామాటల నాలకించు వారెవ్వరును లేరైరి. ఈ లోపల ఆ దుష్టుడు నేను అఱవకుండ చేయుటకు శత విధముల ప్రయత్నింపసాగెను. ఒకప్పుడతడు నన్ను బెదరించుచుండెడివాడు; మఱి యొకప్పుడు బతిమాలు కొనుచుండెడివాడు. 'నీవు ప్రశాంతముగ కూర్చుండియున్నచో నేను నీకెట్టి హానియుచేయను' అని యతడను చుండెడివాడు.

ఈ లోపల నేను నా వెనుక కట్టబడియున్న కాన్వాసు గుడ్డను తొలగించి వెనుకకు చూడసాగితిని. అప్పుడల్లంత దూరమున నాకెవ్వరో మహానీయుడు కనబడినాడు. ఆ మహానీయుడెవరు ? చేత దుడ్డు కఱ్ఱపట్టుకొని శరవేగమున నడచి వచ్చుచున్న మీ ప్రాత మిత్రుడు బర్చెల్ కనబడినాడు. పూర్వము మన మా చేతి కఱ్ఱను చూచి హేళనచేయు చుండెడివారము. అతడు నా మాట వినబడునంత దగ్గఱకు వచ్చెను. అంతట నే నతనిని పేరు పెట్టి పిలిచి నాకు సాహాయ్యము చేయవలసినదని ప్రార్థించితిని. ఆ విధముగ నేను ఎన్నోసార్లు కేకలు పెట్టితిని. అంతట నతడు పెద్ద ధ్వనితో, 'బండి నాపుము !' అని బండి వానిని హెచ్చరించెను. కాని బండి వాడా కేకను సరకు గొనలేదు. పైగా నతడా బండిని ఇంకను వేగముగ పోనీయసాగెను. బర్చెల్ ఇంక మా బండిని సమీపింపలేడని భావించితిని. కాని ఒక్క నిమిషకాలములో నతడు మా బండి ప్రక్కకువచ్చి గుఱ్ఱములతో బాటు పరుగెత్త సాగెను. మఱుక్షణమే అతడు బండి వాని నొక గట్టి దెబ్బకొట్టెను, ఆ దెబ్బ కతడు క్రింద పడి పోయెను.

బండివాడు క్రిందపడి పోగానే గుఱ్ఱములు తమంతట తాము ఆగిపోయెను. బండిలోని దుష్టుడు నోటికి వచ్చినట్లెల్ల ప్రేలుచు ఒరలోనుండి కత్తితీసి బయటకు వచ్చెను.

'నీకు ప్రాణములపై ఆశకలదేని నా దారి కడ్డు రాక నీదారిని నీవు పొమ్మ్న' అని అతడు బర్చెల్‌ను హెచ్చరించెను.

కాని బర్చెల్ అతని మాటలు నేమాత్రము లెక్కచేయక తన దుడ్డు కఱ్ఱతో అతని కత్తిని ముక్కలు ముక్కలు

చేసెను. అతడు పాఱిపోసాగెను. బర్చ్చెలు సుమారు అతని నొక్క పావు మైలు వఱకు వెంబడించెను. కాని అతడు తప్పించుకొని పాఱిపోయెను.

నాకు విముక్తి కలిగించిన వానికి సాహాయ్యము చేయుటకై నేను బండిలోనుండి బయటకు వచ్చితిని. కాని అంతలో బర్చ్చెల్ విజయదుందుభిని మ్రోగించుచు నావద్దకు వచ్చెను. క్రింద పడిపోయిన బండివాడు. అప్పటికి లేచి పాఱిపోవుటకు ప్రయత్నించు చుండెను. కాని బర్చ్చెల్ అతనితో నిట్లనెను: 'నీకు ప్రాణముపై ఆశకలదేని పాఱిపోకుము. బండిని వెనుకకు త్రిప్పి పట్టణమునకు తీసికొనిపొమ్ము.' ఇంక విధిలేక బండివాడతడు చెప్పినట్లు చేయ సాగెను. కాని బండివానికి తగిలిన గాయము కడు తీవ్రమైనదిగా నాకు కనబడెను. బండి పోవుచున్న సమయమున నతడు తన బాధనుగూర్చి మొఱపెట్టుకొనసాగెను. ఎట్టకేల కతనిని బర్చ్చెల్ కు దయకలిగెను. నాకోరికననుసరించి బర్చ్చెల్ అతనిని విడిచి పుచ్చి మఱియొక క్రొత్తబండివానిని ఏర్పాటుచేసెను. ఆబండి వాని మేము త్రోవలో నొక పూటకూళ్ళయింటివద్ద ఆగి కుదుర్చుకొంటిమి."

అప్పుడు నేనిట్లంటిని: "సోఫియాకుమారీ! ఆమెకువిముక్తి కలిగించిన సాహసికుడు బర్చ్చెల్! మీకు వెయ్యిసార్లు స్వాగతము! మేమిప్పుడు ఏమాత్రము ఉల్లాసముగ లేము. అయినను మా హృదయములుమిమ్మునుస్వీకరించుటకు సిద్ధముగనున్నవి. బర్చ్చెల్! నీవు నా కూతురును శత్రువులబారినుండి విముక్తి కలిగించినావు. అందు కామె నీకు తగిన ప్రతిఫలమని భావించినచో ఆమెనిచ్చెదను. బీద కుటుంబమునకు చెందిన పిల్లను స్వీకరించుటకు నీ వంగీకారం

మైనచో ఆమెనుతీసికొనుము. ఆమె యనుమతిని సంపాదింపుము ఆమె తన హృదయమును నీకిచ్చినదను విషయము నాకు తెలి యును. నాహృదయమునుగూడనీకిచ్చినాను. నేను నీకిచ్చుచున్నది సామాన్యమైనదికాదు. నాకుమార్తె సోఫియా అపూర్వ సౌందర్య మునకు ప్రసిద్ధిగాంచినది. కాని నా అర్థమదికాదు. ఆమె మనస్సు చాలమంచిది. నే నా విషయమును నొక్కి చెప్పుచున్నాను."

అంతట బర్చెల్ ఇట్లనెను: "అయ్యా! మఱి మీకు నా పరిస్థితులన్నియు కూలంకషముగ తెలియునుగదా! నేను మీ కొమార్తెను తగినవిధముగ పోషించుటకు శక్తిలేనివాడనే!"

"అయ్యా! మీరెందుకు అభ్యంతరపెట్టుచున్నారు? నే నన్నమాట మీ కిష్టములేదా? అయినచో నేను మిమ్ము బల వంత పెట్టజాలను. కాని నే నొక్కవిషయమును గట్టిగా చెప్ప గలను. నా కొమార్తకు మీరు తగినట్లు మఱి యితరులెవ్వరును తగరని నేను నిశ్చయముగ చెప్పగలను. నే నామెకు అష్టైశ్వర్య ముల నీయగలిగిన శక్తిగలిగియున్నను, ఆమెను వివాహము చేసికోవలయునని వేలకొలది జనులు వాంఛించుచున్నను నేను ఆమెను ఉదారుడు, నిజాయితీపరుడు, సాహసికుడు,సచ్ఛీలుడునగు బర్చెల్ కే అర్పింతును." అని నేను అంటిని.

బర్చెల్ సమాధానమేమియు నీయలేదు. అతనిముఖముపము అవమానకరమైన తిరస్కృతివలెనుండెను. నామాటలకు జవా బీయకుండగనే అతనిట్లనెను: "ఇక్కడకు దగ్గఱగానున్న పూట కూళ్ళ యింటివద్దనుండి మంచి భోజనపదార్థములను, సారా యమును తెప్పించుకొనుటకు వీలున్నదా?"

"వీలున్నది అని జైలుఅధికారి అనెను. "అయినచో అతి స్వల్పకాలములో ఎంత చక్కని భోజన పదార్థములను, సారాయములను తెప్పించుటకు వీలున్నదో అంత చక్కనివానిని తెప్పింపుడు" అని యనెను.

వెంటనే జైలుఅధికారి అందుకు కావలసిన ఏర్పాట్లు చేసెను.

"నేనిచ్చటకొంచెముసేపు(వ్రాలి నమతీసుకొందునుఇచ్చట నేను జైలులో నున్నమాట నిజమే. కాని నేను నేను ఎంతో ఉల్లాసముగ నున్నాను" అని బర్చెల్ అనెను.

అల్పకాలములో జైలు సేవకుడొకడు ప్రాంతహోటళ్ళ యింటి వద్దనుండి మంచి మంచి భోజన పదార్థములను, సారాయములను తెచ్చెను. జైలు అధికారి సూక్కొక శోఖంబు ఎగ విచ్చెను.

నా కూతురు సోఫియా ఇంకను తన సోదరుడు జార్జి మస్థితినిగూర్చి తెలిసికొని యుండలేదు. ఆవిషయము నామెకు తెలియజేసి అచ్చటి సంతోషకర వాతావరణమును చెడగొట్ట రాదని మేము అనుకొంటిమి. నేను ఉల్లాసముగ నుండవలెయు నని ఎంతో ప్రయత్నింప సాగితిని. కాని నా ప్రయత్నము వృథా కాసాగెను, నాజార్జి పరిస్థితిని నేను మఱచిపోలేకుంటిని. ఆతలంపు నాప్రయత్నమును భగ్నము చేయసాగెను. నేనింక ఆతలంపును అణచుకోలేక పోతిని. అందువలన నాకుమారునకు సంబంధించిన విషయమునంతను అచ్చటి వారికి తెలిపి సంతోషకర వాతావర ణమును చెడగొట్టితిని. "నా కుమారుడుకూడ ఇచ్చటకువచ్చి ఇందు పాల్గొనుట కనువదించుడు" అని నేను జైలుఅధికారిని

ప్రార్థించితిని. నా కథనమును శ్రోత్తగా విన్నవారు నిశ్చేష్టులైరి. వారు తేరుకొన్న తరువాత, "నా తోడి ఖైదీ జెంకిన్సన్‌కూడ ఇందు పాల్గొనుటకు అనుమతింపుడు" అని జైలు అధికారిని కోరితిని. అతడు దయతో నా రెండు కోరికలకు అంగీకారము తెలిపెను.

నా కుమారుడు జార్జి నా గదిలోనికి వచ్చుచుండెను. అతని చేతి శృంఖలముల సవ్వడి వినబడుచుండెను. సోఫియా అతనిని కలిసికొనవలయునను ఆతురతతో ఎదురుగా వెళ్ళెను.

ఈలోపల బర్చెల్ నన్ను: "మీ అబ్బాయి పేరు జార్జియేనా?" అని ప్రశ్నించెను. "అవును" అని నేను సమాధానము చెప్పితిని. తరువాత బర్చెల్ ఇంకేమియు మాట్లాడలేదు. కొన్ని క్షణములకు జార్జి గదిలో ప్రవేశించెను. అతడు బర్చెల్‌ను ఆశ్చర్యముతోను భక్తి గౌరవ భావములతోను చూడసాగెను. ఆ విషయమును నేను గమనించితిని.

నేను జార్జితో నిట్లంటిని: "రమ్ము, రమ్ము! కుమారుడా! మనమిప్పుడు ఎంతో హీనస్థితిలో నున్నాము. అయినను భగవానుడు మనకిప్పుడు బాధలనుండి కొంత విముక్తిని కలిగించియున్నాడు. నీ సోదరి సోఫియా మనకు మరల లభించినది. ఆమెకు విముక్తిని ప్రసాదించిన మహనీయుడుకూడ నిచ్చటనే యున్నాడు. ఆ మహనీయుని కరుణా ప్రసాదమువలననే నాకొక కూతురైనను మిగిలినది. అబ్బాయి! స్నేహభావమున ఆయనతో కరచాలనము చేయుము. ఆయన మన కృతజ్ఞతకెంతయు తగియున్నాడు."

నా కుమారుడు నేను చెప్పుచున్న మాటలను ఆలకించు

చున్నట్లు లేకుండెను. అతడింకను బర్చ్వెల్‌కు దూరముగనే నిలబడి యుండెను.

సోఫియా అతనితో నిట్లనెను: "ప్రియమైన సోదరుడా! నాకు విముక్తిని ప్రసాదించిన మహనీయునిపట్ల కృతజ్ఞతాభావము నెందుకు ప్రకటింపవు? సాహసికులెప్పుడును ఒకరి నొకరు ప్రేమించుకొనుచుండ వలయును.

జార్జి అప్పటికిగూడ నేమియు చేయలేదు. అతడు గౌరవ భావముతోను, ఆశ్చర్యముతోను దూరమునుండియే బర్చ్వెల్ వంకకు చూడసాగెను. ఎట్టకేలకు బర్చ్వెల్ నా కుమారుని ముందుకు రమ్మని కోరెను. అప్పుడతడు ఎంతో రాజఠీవిని ప్రకటించెను. అటువంటి రాజఠీవిని నే నంతకుముందు ఎన్నడును చూచియుండలేదు. అతడు ఎదుటవానికంటె గొప్పవానివలె కొంచెముసేపు జార్జివంకకు చూచెను. పిమ్మట నతడిట్లనసాగెను: "ఆలోచనలేని అబ్బాయి! నీవు మరల అదే నేరమును....." అతడింకను వాక్యమును పూర్తిచేయకముందే జైలు అధికారి సేవకుడొకడు వచ్చి ఇట్లనెను: "ఈ పట్టణములోనికొక గొప్ప గౌరవనీయుడు పలువురు సేవకులతో కలసి వచ్చియున్నాడు. ఆయన ఇచ్చటనున్న గొప్ప గౌరవనీయునకు తమ మన్ననలను తెలుపుమన్నారు. వారిని కలసికొనుట కెప్పుడు వీలుపడునో తెలిసికొనగోరుచున్నారు."

"నాకు తీరిక యున్నప్పుడు దర్శనము చేసికోవచ్చును" అని బర్చ్వెల్ అనెను. పిమ్మట నతడు జార్జితో నిట్లనెను: "ఒక ప్పుడు నీవుచేసిన నేరమునకు నిన్ను మందలించి యున్నాను. నీవు మరల నిప్పుడు అదే నేరమును చేసియున్నావు. అందుకు నీవు

చట్టము ప్రకారము న్యాయమైన శిక్షను పొందుదువు. నీకు నీ ప్రాణమునిన విలువ లేదు. అందువలన ఇతరుల ప్రాణములనుగూడ తీయుటకు నీకు హక్కుగలదని భావించు చున్నావు కాబోలు. ఏమాత్రము విలువ లేని జీవితమును పణముపెట్టు మల్లునకును, ఎక్కువ జాగ్రత్తతో సంచరించు హంతకునకును తేడా ఎక్కడ నున్నది?"

అప్పుడు నేను బర్చెల్‌తో నిట్లంటిని: "అయ్యా! మీరెవ్వరైనను తప్పుదారిని పట్టిన ఈతనిని సానుభూతితో చూడుడు. అతడు చేసినపని అతని బుద్ధికి పుట్టినది కాదు. తన తల్లి వ్రాసిన యుత్తరము ప్రకారమతడట్లు చేసినాడు. తన్ను ఘోరాతి ఘోరముగ హింసించిన ఒక నీచునిపై ఆమెకు అపరిమితమగు ఆగ్రహము జనించినది. ఆనీచునిపై పగతీర్చుకొనవలసినదని ఆమె తన కుమారిని హెచ్చరించినది. అయ్యా! ఆమె వ్రాసిన యుత్తరమిదిగో! ఈ యుత్తరము నాకుమారుని నేరమును తగ్గించును. నాభార్య అవివేకమును చూపును.

బర్చెల్ నావద్దనుండి యుత్తరము తీసికొని దానినెంతో శ్రద్ధగా చదివెను. పిమ్మట నతడిట్లనెను: "ఇది మీకుమారునకు సంపూర్ణమగు క్షమాపణ నొసగలేదు. కాని మీకుమారుని నేరమును తగ్గించుటకు తోడ్పడును. అందువలన అతనిని క్షమింపవలయునని బుద్ధిపుట్టు చున్నది." తరువాత నతడు నా కుమారుని హస్తమును దయతో పట్టుకొని, "నన్నిచ్చట చూచుటకు నీవెంతయు ఆశ్చర్య పడుచున్నావనుకొందును. ఆశ్చర్య పడవలసిన పనిలేదు. ఇంతకంటె స్వల్పమగు విషయములకుగూడ నేను ఖైదీలను సందర్శించు చుందును. సహృదయుడగు కొడుకునకు సంపూర్ణ

మగు న్యాయమును చేకూర్చుటకై నే నిచ్చటికి వచ్చి యున్నాను. ఆ సహృదయుడన్న నా కెంతో గౌరవ భావము కలదు. నేను చిరకాలమునుండి మారువేషమున నీతండ్రిదయను గమనించుచునే యున్నాను. నే నాయన గృహమున పొగడ్తలచే నిష్కృతముగాని గౌరవమును పొందియున్నాను; అపూర్వమగు సౌఖ్యముల ననుభవించినాను. ఆఇంట కుంపటివద్ద కూర్చొని ఆనందించినాను. నేనిచ్చటకు వత్తునని నాఅన్నకుమారుడు తార్న్హిల్ కు ఇదివఱకు తెలిపియున్నాను. అతడిచ్చటకు వచ్చినట్లు కన బడుచున్నది. పరీక్షింపకుండ అతనిని నేరగాడని నిర్ణయించుట ఏమాత్రము సమంజసముకాదు. అతడెవ్వరికైనహాని చేసియుండి నచో, అందుకు పరిష్కార మిప్పింపబడును. నేను గొప్ప చెప్పు కొనుటకాదుకాని సర్ విలియమ్ తార్న్హిల్ వద్ద న్యాయము పొందనివారు లేరు.

అప్పుడు మాకంతయు నర్థమయ్యెను. మాయింటికి నిరా డంబరముగవచ్చి మా ఆతిథ్యమును పొందిన మహనీయుడు సర్ విలియమ్ తార్న్హిల్ కాక మఱియొకరుకాదు. ఒకప్పుడు మాచే అవమానింపబడిన ఉదారుడు సర్ విలియమ్ తార్న్హిల్ కాక మఱియొకరుకాదు. మాకిటీవల ఉపకారముచేసిన మహనీయు డతడే! బర్చెల్ మారువేషముననున్న సర్ విలియమ్ తార్న్ హిల్, ఆయన సుగుణములు; ఆసాధారణ విశేషములు అందఱకు తెలిసినవే.

బర్చెల్ బీదవాడని అందఱము అనుకొనినారు. నిజ ముగా నతడు గొప్ప ఐశ్వర్యవంతుడు; పేరు ప్రఖ్యాతులు కలవాడు. అతని యుపన్యాసముల నందఱును ఆసక్తితో వినుచుందురు.

అతడు దేశభక్తి, రాజభక్తి కలిగిన వ్యక్తుడు. నాభార్య తన పూర్వపు పరిచయమును తలచుకొని భయముతో వెనుకకు తగ్గెను. కొన్ని నిమిషములకు పూర్వమతడు తనవాడని సోఫియా భావించుచుండెను. ఇప్పుడతడు గొప్ప ఐశ్వర్యవంతుడను విష యము సుస్పష్టమైనది. అనగా తనకు అతనికి మధ్య చాలదూర మున్నది. అతడింక తనకు దక్కడని ఆమెఎంతయు విచారింప సాగెను.

నాభార్య సానుభూతిని పురిగొల్పు మొగముతో నిట్లనెను: "అయ్యా! నేనుఘోరతప్పిదము చేసినాను. మీరెప్పుడుగానినన్ను క్షమించుట ఎట్లు సంభవమగును? మిమ్ము కడచినసారి మా యింటివద్ద దర్శించు భాగ్యము కలిగినది. కాని వట్టి తెలివితక్కువ దాననగు నేను మిమ్ముకడు తీవ్రముగ నిందించినాను. మీతో వ్యంగముగ మాట్లాడినాను; ఎత్తిపొడిచినాను. నన్ను క్షమింప రాని విధముగా మాట్లాడినాను. నన్ను క్షమింతురా?"

అంతట నతడు మధురమగు మందహాసము చేయుచు నిట్ల నెను: "అమ్మా! నీవుచాల మంచిదానవు. మీ మాటల కన్ని టికి నేను సరియైన సమాధానముల నిచ్చియుంటినిగదా. మన యిద్దరిలో నెవరు బాగుగా మాట్లాడిరను విషయమును, అప్పుడక్కడ నున్నవారే నిర్ణయింపగలరు. నిజము చెప్పవలయు నన్న నాకిప్పుడు ఎవ్వరిపైనను కోపములేదు; మా చిన్న అమ్మాయి సోఫియాను భయపెట్టినవారిపై మాత్రమే కోప మున్నది. నేనా దుర్మార్గుని రూపమును పరీక్షించుటకైన అవ కాశము లేక పోయినది. లేకపోయినచో అతని రూపమును వర్ణిం చుచు పత్రికలో నొకప్రకటనను చేసి యుండెడివాడను. సోఫియా!

ప్రియురాలా! మఱియొకసారి చూచినచో అతనిని గుర్తింప గలవా?"

అప్పుడు సోఫియా ఇట్లనెను: నేను స్పష్టముగ చెప్పజాలను. కాని ఒక విషయము మాత్రము జ్ఞాపకమున్నది. అతని కనుబొమలలో నొకదానిపై పెద్దగుర్తొకటియున్నది."

అప్పుడు జెంకిన్సన్ జోక్యము కల్పించుకొని ఇట్లనెను: "అమ్మా! మధ్యలో అడ్డువచ్చుచున్నందుకు క్షమింపవలయును. దయతో నాకొక్కవిషయమును తెలియజేయుడు. అతడు తనస్వంత ఎఱ్ఱజుట్టును ధరించియున్నాడా?"

"అవును. ధరించియున్నాడనుకొనుచున్నాను" అని సోఫియా అనెను.

పిమ్మట నతడు సర్ విలియమ్ థార్న్‌హిల్ వంకకు తిరిగి ఇట్లనెను: మహాశయా! గౌరవనీయులగు తాము అతని కాళ్ళ పొడవును గమనించి యున్నారా?"

"లేదు. అతని కాళ్లెంత పొడవైనవో నేను నిశ్చయముగ చెప్పజాలను. కాని అతడు కడువేగముగ పోగలడని మాత్రము నిశ్చయముగ చెప్పగలను" అని సర్ విలియమ్ థార్న్‌హిల్ అనెను. "ఈ దేశములో నా పరుగునుదాటి పాఱిపోగలవారెవ్వరు లేరని నా అభిప్రాయము. అట్టి నన్నే అతడు దాటి పాఱిపోయినాడు."

అంతట జెంకిన్సన్ ఇట్లనెను: "గౌరవనీయా! అతడెవరో నే నెఱుగుదును. అవును తప్పక అతడే. ఇంగ్లండులోకెల్ల అతని మించి పరుగెత్తువారెవ్వరును లేరు. అతడు ఎందఱో పోటీదారులను ఓడించినాడు. అతనిపేరు టిమొతీ బాక్స్టర్. నాకతడు

బాగుగ తెలియును. అతడు శీక్షణమున నెచ్చటనుండునో గూడ నాకు తెలియును. జైలు అధికారి నాతోబాటు తన సేవకుల నెవ్వనిను పంపునట్లు చేయును. ఒక్క గంటకాలములో అతనిని తీసికొనివచ్చి మీయెదుట పెట్టగలను."

అంతట సర్ విలియమ్ తార్న్‌హిల్ జైలు అధికారి కొఱకు కబురు పంపించెను. అతడు పదనిమిషకాలములో వచ్చెను. అంతట సర్ విలియమ్ తార్న్‌హిల్ ఇట్లనెను: "నన్ను మీరు ఎఱుగుదురా?"

"నేను మిమ్ముల నెఱుగక పోవుటయేమి? నేను సర్ విలియమ్ తార్న్‌హిల్‌ను బాగుగా నెఱుగుదును. ఆయనను ఎఱిగిన ప్రతియొక్కరును, ఆయనను గూర్చి ఇంకను తెలిసికోవలయునని కోరుకొనుచుందురు." అని జైలు అధికారి అనెను.

అంతట ప్రభువు (సర్ విలియమ్ తార్న్‌హిల్) ఇట్లనెను: "అయినచో నాకొక కోరికయున్నది. నా అధికారము క్రింద నొకవార్తను పంపవలసియున్నది. అందువలన మీరు ఈ జెంకిన్సన్‌ను! ఇద్దరు సేవకులను కొంచెము సేపు నా స్వాధీనములో నుంచవలయును. ఈ జెంకిన్సన్ పాఱిపోకుండ నేను పూచీ పడుదును."

"మీ వాగ్దానము చాలును. మీరు మీయిష్టము వచ్చినప్పుడెల్ల ఒక్కనిముషము ముందు హెచ్చరిక చేసి దేశమందంతట త్రిప్పవచ్చును." అని జైలు అధికారి అనెను.

జైలు అధికారి సమ్మతిప్రకారము జెంకిన్సన్ ఇద్దరు సేవకులను తీసికొని టిమొతీ బాక్స్టర్‌ను తీసికొనిరాబోయెను.

మా కడపటి పిల్లవాడు బిల్ అప్పుడే వచ్చి ముద్దు పెట్టుకొనుటకుద్దేశముతో ప్రభువు మోకాళ్లపైకి ఎగబ్రాకసాగెను. ఆవిధ

ముగ ప్రవర్తించుచున్నందుకు నాభార్య బిల్‌ను తీవ్రముగ మందలింపబోయెను కాని ఆ మహనీయుడు ఆమెను ఆపు చేసెను. చినుగుగుడ్డలు ధరించిన బిల్‌ను అతడు మోకాలిపై కెక్కించుకొని ఇట్లనెను: "బిల్! విశేషములేమేని ఉన్నవా? నీ ప్రాత మిత్రుడు బర్చెల్ జ్ఞాపకమున్నాడా? ఓహో, డిక్! నీవుకూడ నిచ్చటనే యున్నావా? నేను మిమ్ములను మఱచి పోలేదని తెలిసికొందురు గాక." అట్లని యతడు వారికువురకు జేబులోనుండి తీసి పెద్ద రొట్టె ముక్కల నిచ్చెను. వారా యుదయమున సంతృప్తిగ భోజనముచేసి యుండలేదు. అందువలన వారా రొట్టె ముక్కలను సంతృప్తితో భుజించిరి.

తరువాత నందఱము భోజనమునకు కూర్చుంటిమి. అప్పటి కది బాగుగా చల్లారిపోయి యుండెను. అంతకు మునుపు నా చేయి బాధపెట్టసాగెను. అదిచూచి ప్రభువు నాకొక మందు చీటి వ్రాసి యిచ్చెను. ప్రభువు సరదాగా వైద్య శాస్త్రమును కూడ నభ్యసించి యుండెను. వేర్వేఱు వ్యాధులకు సముచితమైన మందుల నతడు చక్కగా ఈయగలడు. నేను మందు చీటిని అచ్చటకు సమీపమున నున్న వైద్యునకు పంపితిని, అతడు వచ్చి మందువేసి కట్టుకట్టెను. వెంటనే నా చేతి బాధ తగ్గెను.

మేము భోజనము చేయుచుండగా జైలు అధికారి కూడ నచ్చటనే యుండెను. అతడు ప్రభువుకు తన శక్తికొలది గౌరవ మర్యాదలు చేయసాగెను. మే మింకను పూర్తిగా భోజనము చేయక పూర్వమే తాక్న్‌హిల్ నద్దనుండి అతని కొక మంచి వార్త వచ్చెను.

"నా గౌరవమును, నిర్దోషిత్వమును నిలబెట్టుకొనుటకై మీముందు హాజరగుటకు నాకు అనుమతిని ప్రసాదింపవలయును" అని తాన్షహిల్ కోరియుండెను. ప్రభువందుల కంగీకరించెను. తాన్షహిల్‌ను లోపలికి ప్రవేశపెట్టవలసినదని కోరెను.

# 31

తాన్షహిల్ ఏమియు నెఱుగని అమాయకుని వలె మందహాసము చేయుచు లోనికివచ్చెను. మందహాసముచేయుట కతడు ప్రత్యేకముగ ప్రయత్నింపవలసిన పనిలేదు. మోస గాడగు నతని మొగముపైనది ఎప్పుడును తాండవమాడుచునే యుండును. అతడు ప్రభువును సమీపించి కౌగిలించుకొనఁ బోయెను. కాని ప్రభువు తిరస్కార భావముతో నిరాకరించెను.

ఔదాసీన్యమును వెలిబుచ్చు దృష్టితో నతడు, "ఇది ఇచ్చకము లాడుటకు తగిన సమయము కాదు" అని సుస్పష్టముగ చెప్పెను: "నా హృదయమునుచేరుటకు సరియైన ఏకైకమార్గము గౌరవముతో కూడిన మార్గమే. కాని యిచ్చట నాకు అసత్యము, పిఱికి తనము, క్రౌర్యము మున్నగు వానితో కూడిన చిక్కైన సమస్యలున్నవి. ఈ ముసలి వానికి నీకు చాల స్నేహమని నాకు బాగుగ తెలియును. మఱి నీవితని నిట్లు చేసినావేమి? అత డిచ్చిన ఆతిథ్యమునకు బదులుగా అతని కొమార్తెను జిత్తులు ప్రయోగించి తీసికొని పోయినావు. ఆ అవమానమును ప్రతి ఘటించినందున అతని జైలులో త్రోయించినావు. అతని కుమారుని మగవాడుగా ప్రతిఘటించుటకు భయపడి,....."

అంతట తార్న్‌హిల్ జోక్యము కల్పించుకొని యిట్లు నెను: "అయ్యా! అటువంటి విషయములలో పాల్గొనవలదని మీరు నాకు ఎన్నోసార్లు సలహా ఇచ్చియున్నారు. ఆ సలహా ప్రకారమే నేను నడచుకొన్నాను. నేనట్లు చేయుట నేరమని మీరు భావించుచో నేనేమి చేయగలను? ఇది న్యాయమా?"

అపుడు సర్ విలియమ్ ఇట్లనెను: "నీవు చాల చక్కగా మాట్లాడినావు. నీ వీ సందర్భమున చాల చక్కగాను, జాగ్రత్తగాను ప్రవర్తించినావు. అయితే నీ తండ్రి మఱి యొక విధముగా చేసియుండెడివాడు. నా సోదరుడు నిజముగా గౌరవము నకు చిహ్నము. కాని నీవు—అవును, నీవు ఈ సందర్భమున చాలచక్కగ ప్రవర్తించినావు. నేను నిన్ను అందుల కెంతయు ప్రశంసించు చున్నాను."

తరువాత తార్న్‌హిల్ ఇట్లనెను: "మిగిలిన విషయముల లోని నా ప్రవర్తనగూడ మీ సూత్రములకు విరుద్ధముగ నుండ దని ఆశించుచున్నాను. అయ్యా! ఈగౌరవనీయుని కొమార్తతో కలసి నే నప్పుడప్పుడు కొన్ని ప్రదేశములందు కనబడిన మాట నిజమే. ఆలోచన లేమివలన నట్లు జరిగినది. ఈ ప్రపంచము కడు విచిత్రమైనది. అట్టి స్వల్పవిషయములను కొందఱు చిలవలు పలవలు కల్పించి ప్రచారము చేయుదురు. అట్టి వారిని అప వాదములు వేయుటలో ముందు పేర్కొనవలెను. నే నామెతో వ్యభిచరించితినని ప్రచారము చేసినారు. ఇది ఎంతయు సత్య దూరమైన విషయము. విషయము నంతను స్పష్టముగ వివ రించి చెప్పుటకై నే నీ గౌరవనీయుని వద్దకు పోయినాను; కాని ఇతడు నన్ను మాట్లాడనీయక అగౌరవ పఱచినాడు. నన్ను

నిశితముగ దూషించి అవమాన పఱచినాడు. ఇంక మిగిలిన విషయములను గూర్చి చెప్పెదను. ఇతడీ జైలులో నుండుటకు కారణమేమి ? ఈ విషయమును మీకు నా వకీలు, గుమాస్తా చక్కగా వివరించి చెప్పగలరు. నా వ్యవహారముల నన్నిటిని వారే చూచుచున్నారను విషయము మీకు తెలియును. ఇతడు ఇతరులవద్దనుండి సొమ్మును అప్పుగా తీసికొన్నాడు. ఆ అప్పును తీర్చుట కితడు ఇష్టపడుటలేదు. లేదా ఆ అప్పును తీర్చగల సామర్థ్యమితనికి లేదు. అందువలన ఈ విధమైన చర్యతీసికొనుట వారి ఇష్టమై యున్నది. చట్ట సమ్మతమైన చర్యలను తీసికొనుటలో ఇతరులకు, బాధ కలిగించు విషయముగాని, అన్యాయము చేయు ప్రసక్తిగాని లేదు."

అపుడు సర్ విలియమ్ ఇట్లనెను: "అంతయు నీవు చెప్పినట్లే జరిగి యుండినచో అందు క్షమింపరాని నేరమేదియు లేదు. ఈ గౌరవనీయుని నీ వీ విధముగ ఒత్తిడి పెట్టకుండ ఓపికపట్టి యుండినచో నీ ప్రవర్తన చాల ప్రశంసనీయముగ నుండి యుండెడిది. మనతోడి మానవుల కష్టములను తీర్చు బాధ్యత మనపై నున్నది. కనీసము నీవు చట్ట సమ్మతముగనైన ప్రవర్తించినావు."

ఆ మాటలను ప్రోత్సాహముగ తీసికొని తార్న్‌హిల్ ఇట్లనెను: "నే చెప్పిన విషయములు సరియైనవి కావని ఇతడే మాత్రము అనజాలడు. చేతనైనచో నా మాటలను వ్యతిరేకింపుమని కోరుచున్నాను. నేను చెప్పిన దంతయు సరియైనదని సాక్ష్యమిచ్చుటకు నా సేవకులు సిద్ధముగ నున్నారు. నేను ఏ నేరము చేయని అమాయకుడను. ఈ విషయము సులభముగా

పజువుచేయు వచ్చును. మీ దృష్టిలో నా ఘనతను తగ్గించుట కితడు ప్రయత్నించు చున్నాడు. అందువలన నా కతనిపట్ల అపరిమితమగు ఆగ్రహము కలుగుచున్నది. ఈ విషయమున నే నతనిని క్షమింపజాలను. మీరు కోరినచో నే నతనిని మిగిలిన అన్ని విషయములలోను సహింపజాలను.

ఇతని కుమారుడు నా ప్రాణము నపహరించుటకు ప్రయత్నించినాడు. ఇంతఘోరమైన నేరము మఱియొకటి కలదా? ఈ విషయమున చట్టము న్యాయమును చేకూర్చునని ఆశించు చున్నాను. ఇదిగో అతడునన్ను సవాలుచేయుచు పంపిన యుత్తర మిచ్చట నున్నది. పజువుచేయుట కింకను ఇద్దరు సాక్షు లున్నారు. గౌరవనీయుడొకడు తీవ్రముగ గాయపడినాడు. అత నికి ప్రాణభీతి ఏర్పడినది. ఈ విషయమున నా పినతండ్రి నన్ను వెనుదీయుమని హెచ్చరించును - ఆయన అట్లుచేయడని నాకు బాగుగ తెలియును - న్యాయము చేకూరునట్లు చూతును. అత నికి తగిన బాధ కలుగునట్లు చూతును."

"నరరూప రాక్షసుడా!" అని నాభార్య తార్న్‌హిల్ నుద్దేశించి అఱచెను. నీవు ఇదివఱకు తీర్చుకొన్న పగచాలదా? నాపెద్ద కుమారుడుగూడ నీ క్రౌర్యమునకు బలికావలయునా? నాకుమారుడు పసిబిడ్డవంటి అమాయకుడు. అందువలన మహనీయుడగు సర్ విలియమ్ మమ్ము రక్షించునని ఆశించుచున్నాను. నాకుమారుడు ఏ నేరము చేయలేదని నేనుగట్టిగా నమ్ముచున్నాను. అతడెప్పుడును ఏ మానవునకు ఎట్టిహానిని చేసియుండలేదు.'

అంతట సర్ విలియమ్ ఇట్లనెను: "నీవు నీ కుమారుడు సురక్షితముగ నుండవలయునని కోరుకొను చున్నావు. నేను అంత

కంటె ఎక్కువగ కోరుకొను చున్నాను. కాని నీ కుమారుని నేరము విస్పష్టముగ కనబడు చున్నందుకు నే నెంతయు విచారించు చున్నాను. మఱి మా తార్న్‌హిల్ పట్టుపట్టినచో..."

అంతలో నచ్చటకు జెంకిన్సన్ జైలుసేవకు లిరువురితో కలసివచ్చి మాదృష్టి నాకర్షించెను. వారితో బాటు చాలమంచి దుస్తులుధరించిన పొడవైన మనుజు డొకడుండెను. నాకొమార్తె సోఫియాను బలవంతముగ తీసికొనిపోయిన దుష్టుని వర్ణన కా పొడవైన మనుజుడు చక్కగా సరిపోవు చుండెను.

జెంకిన్సన్ ఇట్లనెను: "ఇదుగో దొరకినాడు. మనకు కావలసినవాడు లభించినాడు."

తార్న్‌హిల్ జెంకిన్సన్‌ను, అతని అధీనములోనున్న పొడవైన మనుజుని చూడగనే తార్న్‌హిల్ భయముతో సగము మనిషియైపోయినట్లాయెను. చేసిన నేరములకతని మొగము వివర్ణమయ్యెను. అతడా ప్రదేశమును వీడి పాఱిపోవుటకు ప్రయత్నింపసాగెను. కాని ఆ యుద్దేశ్యమును గమనించిన జెంకిన్సన్ అతనిని ఆపివైచెను.

"ఏమి! యజమానుడా! నీ ప్రాత స్నేహితులు జెంకిన్సన్, బాక్స్టర్ లిరువురను కలిసికొనుటకు సిగ్గుపడు చున్నావా? కాని గొప్పవారందఱును తమస్నేహితులను మఱచిపోవు విధానమిదియే కాని మేముమాత్రము నిన్ను మఱచిపోము. నే నావిధానముగ నిశ్చయించుకొని యున్నాను" అని జెంకిన్సన్ తార్న్‌హిల్‌తో ననెను. పిమ్మట నతడు సర్ విలియమ్ వంకకు తిరిగి ఇట్లనెను: "అయ్యా! నాచేతనున్న ఖైదీ ఇగివఱకే జరిగిన విషయమునంతను అంగీకరించి యున్నాడు.

ప్రాణభీతి కలుగునట్లు తీవ్రముగ గాయపడినాడన్న గౌరనీయు డితడే. ఈ విషయములోని కితనిని మొట్టమొదట దింపినవాడు తార్న్‌హిల్ అట! గౌరవనీయునివలె కనబడుట కెప్పుడితడు ధరించియున్న దుస్తులను తార్న్‌హిల్ ఇచ్చియున్నాడట! డబ్బు నిచ్చినదికూడ నతడేనట. సోఫియాను దొంగిలించుకొనిపోవుటను గూర్చి వా రిరువురును ఒక ప్రణాళికను వేసికొన్నారట. ఇతడు సోఫియా కుమారిని దొంగిలించుకొనిపోయి ఒక సురక్షితమైన ప్రదేశమునకు చేర్పవలయునట! అచ్చట నత డామెను బెదిరించి భయపెట్టవలయునట! ఈలోపల నచ్చటకు తార్న్‌హిల్ కాకతాళీయముగ వచ్చినట్లు వచ్చి ఆమెను రక్షింపవలయునట! అప్పుడు వా రిరువురును కొంచెముసేపు పోరాడవలయునట! పిమ్మట నతడు పాఱిపోవలయునట! ఆవిధముగా తార్న్‌హిల్ ఆమెను రక్షించినాడన్న నెపముతో ఆమె ప్రేమను పొందుటకు చక్కని అవకాశము నేర్పాటుచేసికొనదలచినాడు. కొన్నినాళ్ళామె ననుభవించి తరువాత తఱిమివేయ దలచినాడు."

'టిమొతీ బాక్స్టర్ ధరించిన కోటు నిదివరలో, తార్న్‌హిల్ ధరించియుండగా సర్ విలియమ్ చూచియుండెను. మిగిలిన విషయముసంతను సవిస్తరమైన సాక్ష్యమునొసగి బాక్స్టర్ చక్కగా రుజువుపఱచియుండెను. "తాను ఇరువురు సోదరీమణులను ఒకేసారి ప్రేమించుచున్నట్లు తార్న్‌హిల్ నాతో ఎన్నోసార్లు అనియున్నాడు" అని అతడు చక్కగా ఉద్ఘాటించెను.

పిమ్మట సర్ విలియమ్ విషజ్వాలలుగ్రక్కుచు నిట్లనెను: "అయ్యయ్యో! భగవానుడా! నేను నా హృదయములో ఎట్టి కాలసర్పమును పెంచుచున్నాను. తనకు బహిరంగముగా న్యాయ

మును చేసుకొన్నవలయునని ప్రార్థించినాడే! అవును, తప్పక అతని కట్టి న్యాయమును చేసుకొన్నవలయును. జైలు అధికారీ! అతనిని పట్టుకొనుము. అయినను వలదులెమ్ము. అతనిని ఆపుటకు చట్ట సమ్మతమైన సాక్ష్యము లేదనుకొందును.

అంతట తార్న్‌హిల్ అపరిమితమగు వినయముతో ఇట్లనెను: "నాకు వ్యతిరేకముగ సాక్ష్యముచెప్పిన వీ రిరువురును నికృష్టులు; చట్టి పనికిమాలినవారు. వీరిసాక్ష్యములు నంగీకరించుట ఏమాత్రము పాడిగాదు. వీరి సాక్ష్యమును అంగీకరింపవలదని వినయపూర్వకముగ ప్రార్థించుచున్నాను. నా సేవకులను పరీక్షింపుడు."

"నీ సేవకులు! వారింక నీసేవకులని ఏమాత్రమనరాదు! అయినను వారేమి చెప్పెదరో వినుటకు నాకెట్టి అభ్యంతరము లేదు. నీ బట్లరును పిలువుము." అని సర్ విలియమ్ అనెను.

బట్లరు లోనికి ప్రవేశపెట్టబడెను. అతడు తన పూర్వపు యజమానుడగు తార్న్‌హిల్ వంకకు చూచెను. తార్న్‌హిల్ చూపునుబట్టి అతనిచేతిలో ఇంక అధికారమేమియు లేదనిబట్లరు అర్థము చేసికొనెను.

సర్ విలియమ్ అతనితో గట్టిగా ఇట్లనెను: "నీ యజమానుడును, నీ యజమానుని దుస్తులను ధరించిన అతడును కలసియుండగా నీవెప్పుడైన చూచియున్నావా?"

"అయ్యా! ఒక్కసారికాదు! వేలకొలదిసార్లు చూచినాను. తార్న్‌హిల్‌కు అమ్మాయిలను తీసికొని వచ్చుచుండెడి వాడతడే" అని బట్లరు చెప్పసాగెను.

అప్పుడు తార్న్‌హిల్ జోక్యము కల్పించుకొని, "ఏమేమి! నా ముఖము ఎదుటనే అట్లు చెప్పుచున్నావా!"

"నీ ముఖము మీదేకాదు! ఎవ్వరి ముఖము మీదనైన చెప్పెదను. నిజము చెప్పవలయు నన్న తార్న్‌హిల్! నేను నిన్ను ఎన్నడును ప్రేమించి యుండలేదు. నీవన్న నాకెప్పుడును ఇష్టము లేదు. ఇప్పుడు నా మనస్సులోని విషయమును చెప్పుటకు నేను అణు మాత్రమైన లెక్కచేయను" అని బట్లరు అనెను.

జెంకిన్సన్ బట్లరు వంకకు చూచి ఇట్లనెను: "అయిన నన్ను గురించి నీకేమైన తెలియునేమో గౌరవనీయులగు సర్ విలియమ్ వారికి తెలియజేయుము."

"నిన్ను గురించి నాకంతగా మంచి విషయములు తెలి యునని నేను అనుకొనను. ఆ గౌరవనీయుని కొమార్తను మోసపుచ్చి ఆ రాత్రి మన యింటికి తీసికొని వచ్చిన వారిలో నీ వొకడవు" అని బట్లరనెను.

అపుడు సర్ విలియమ్ ఇట్లనెను: "తార్న్‌హిల్! అయిన నీ నిర్దోషిత్వమును రుజువు చేసికొనుటకు ఎంత చక్కని సాక్షిని తీసికొని వచ్చినావు! నీవు మానవజాతికి మచ్చవంటి వాడవు. నీవు ఇటువంటి నికృష్టులతో స్నేహముచేసినావన్న మాట! కాని బట్లర్! నాకొక విషయము చెప్పుము. ఈ గౌరవనీయుని కూతురును తార్న్‌హిల్ ఇంటికి తీసికొని వచ్చిన వాడితడేనని నీవు అభిప్రాయపడుచున్నావా?"

"కాదు, కాదు. ఇతడే తీసికొని వచ్చినాడని నేను అభి ప్రాయపడుటలేదు. ఆ పనిని తార్న్‌హిల్ స్వయముగా నిర్వ హించుకొన్నాడు. కాని వారిరువురకు వివాహము చేసినట్లు

నాశించిన పురోహితుని మాత్రమతడు తీసికొని వచ్చినాడు" అని బట్లరనెను.

జెంకిన్సన్ ఇట్లనెను: "బట్లరు చెప్పిన దంతయు నిజమే. అతడు చెప్పిన దానిని నేను కాదనలేను. తార్న్‌హిల్ నాకు ఇచ్చిన పని అది. నే నా పనిని చేసితినని విచార పూర్వకముగ అంగీకరించుచున్నాను."

"ఓయి భగవానుడా!" అని సర్ విలియమ్ అనెను; ఇతని దుష్ట కార్యములను గూర్చి తెలిసికొన్న కొలది నాకు భయము హెచ్చగుచున్నది! ఇతడు చేసిన నేరము లన్నియు నిప్పుడు స్పష్టముగ తెలియుచున్నవి. ఇతడు క్రౌర్యము, పిఱికి తనము, ప్రతీకార వాంఛ కలిగియుండి ఈ గౌరవనీయుని కుటుంబమునకు ఎనలేని హాని చేసినాడని స్పష్టమగుచున్నది. జైలు అధికారీ! పాప మిప్పుడు నీ అధీనమున నున్న సైనికాధికారికి నా కోరికను అనుసరించి స్వేచ్ఛ నొసగుము. తరువాత జరుగు దానికి నన్ను నమ్ముము. నే నీ విషయ మంతయు నా మిత్రుడగు మేజిస్ట్రేటుకు కన్నులకు స్పష్టముగ కనబడునట్లు వివరముగ తెలియ జేయుదును. నీ వీ విషయమున సందేహ పడవలసిన పని ఏమియులేదు. అన్నట్లు మఱచి పోయినాను; పాప మా దుర దృష్టవంతురాలగు అమ్మాయి ఎక్కడ నున్నది? ఆమె ఇచ్చటకు వచ్చి ఈ నీచుని నైచ్యము నింకను స్పష్టము చేయుగాక! అతడామెను ఎట్లు మాటలు గొల్పి తీసికొని పోయినాడో తెలిసి కొన వలయునని నేను తీవ్రముగ వాంఛించు చున్నాను. ఆమెను లోనికి ప్రవేశపెట్టుడు. ఆమె ఎక్కడ నున్నది?"

అప్పుడు నే నిట్లంటిని: "అయ్యో! ప్రభూ! ఆవిషయము

నాహృదయమును తీవ్రముగ గాయపఱచుచున్నది. ఒకప్పుడు నే నామెను కలిగియున్నందుకు ఎంతో సంతోషించినాను. కాని ఆమె దుస్థితి.....”

నేను వాక్యమును పూర్తిచేయకమునుపే అంతరాయము కలిగెను. మఱి అప్పుడు నాకెందుకు అంతరాయము కలిగినది! అచ్చటకు క్రొత్తగా ప్రవేశించిన వారెవరు? అరబెల్లా విల్మట్ కన్య ప్రవేశించినది. ఆమెకును తార్న్‌హిల్‌కును మఱునాడు వివాహము జరుగనున్నది.

అచ్చటనున్న సర్ విలియమ్‌ను, తాను పెండ్లిచేసుకొనబోవుచున్న తార్న్‌హిల్‌ను చూచి విల్మట్‌కన్య ఆశ్చర్యసాగరమున మునిగెను. ఆమె ఆశ్చర్యమునకు సరియైనది మఱియొకటి లేదని నిస్సందేహముగ చెప్పవచ్చును. ఆమె అచ్చటకు రావలెనని వచ్చియుండలేదు. కాకతాళీయముగ మాత్రమే వచ్చియుండెను. జైలులో నామె సర్ విలియమ్‌ను, తార్న్‌హిల్‌ను కలసికొనుట సంభవించునని ఆమె ఎన్నడును అనుకొని యుండలేదు.

విల్మట్‌కన్య తన ముదుసలి తండ్రియగు విల్మట్‌తో కలసి ఆ పట్టణముమీదుగా తన మేనత్తయగు ఆర్నాల్డుసతి ఇంటికిబోవుచుండెను. ఏలయన తార్న్‌హిల్ విల్మట్‌కన్యల వివాహము తన యింటివద్ద జరుగవలయునని ఆర్నాల్డుసతి గట్టిగా పట్టుపట్టియుండెను. త్రోవలో వారేవేని ఫలహారములను తీసికొనగోరిరి. అందువలన వారిరువురును పట్టణమునకు మఱియొక వైపుననున్న పూటకూళ్ళ యింటిలో బసచేసిరి.

ఆమె తనగది కిటికీలోనుండి బయటకు చూచుట తట

స్థించెను. అప్పుడాయువతీమణి వీధిలోనాడుకొనుచున్న నాకుమారుడు డిక్‌నుచూచి యుండెను వెంటనే ఆమె ఆకుఱ్ఱవానిని తన వద్దకు తీసికొనిరావలసినదని ఒక సేవకుని పంపియుండెను. ఆసేవకుడు డిక్‌ను ఆమెవద్దకు తీసికొనిపోయెను. ఆమె అతనివద్దనుండి మా దురదృష్టమునకు సంబంధించిన కొన్ని సంఘటనలనుగూర్చి తెలిసికొనెను. వాని కన్నిటికి మూలకారణము తన్ను వివాహముజేసికొన బోవుచున్న తార్న్‌హిల్‌అని మాత్రమామెకు తెలియలేదు.

"పాపము, డాక్టర్ ప్రిమ్‌రోజ్ ఈపట్టణములోని జైలులో నున్నట్లు తెలియుచున్నది. ఆయన చాల మంచివాడు. నేను జైలుకు పోయి ఆయననొకసారిచూచి ఈ కాలములో తిరిగి వత్తు" నని విల్మట్‌కన్య తనతండ్రికి చెప్పియుండెను.

కాని తండ్రి విల్మట్ అందుల కంగీకరింపలేదు. "వలదు, వలదు. నీ వివాహము రేపు కానున్నది. మఱినేడు నీవు జైలుకు పోవుట అనుచితముగను, అసంగతముగను నుండును. నీవిప్పుడు డాక్టర్ ప్రిమ్‌రోజ్‌ను చూడవలసిన అవసరమేమి వచ్చినది? వివాహమైపోయిన తరువాత నీవు అతనిని చూడవచ్చును" అని అతడనెను.

"అవును. రేపే నా వివాహము జరుగనున్నది. దానికిని, డాక్టర్ ప్రిమ్‌రోజ్‌ను సందర్శించుటకును సంబంధమేమో తెలియకున్నది. కష్టములలోనున్న ప్రిమ్‌రోజును చూచుట భావ్యముగనుండును. ఆయన ఆశీర్వచనమును పొందుటకూడ నుచితముగనుండును. నేను తప్పక పోయివత్తును" అనివిల్మట్ కన్య అనెను.

తండ్రి మాటలు కుమార్తె సహించలేదు. కుమార్తె మాటలు తండ్రికి సహించలేదు. ఆ విషయమును గూర్చి ఇద్దరును కొంచెము సేపు చర్చ జరుపుకొనిరి. ఎట్టకేలకు తండ్రి కుమార్తెకు లొంగి పోయెను. అట్లు జరుగుట సహజమే కదా!"

"నీవు పోయి త్వరగా తిరిగిరమ్మా" అని తండ్రి అనెను.

"నన్ను జైలుకు తీసికొనిపొమ్మా. మీ నాయకుని గారిని చూడవలయును" అని ఆమె డిక్ తో ననెను.

అంతట డిక్ ఆమెను మేమందరము న్న గదిలోనికి తీసికొనివచ్చెను. గదిలో క్రొత్తవారుందురని ఆమె అనుకోలేదు. అందరి నచ్చట చూచినందుకు ఆమె కెంతయు ఆశ్చర్యము కలిగెను.

ఈ విధమైన దైవికమైన సమావేశములు ప్రతిదినము జరుగుచునే యుండును. అవి దైవికమైనవైనను మనకు ఆశ్చర్యము గొల్పవు. కొన్ని అసాధారణ పరిస్థితులలో జరిగిన దైవిక సమావేశములు మాత్రమే ఆశ్చర్యమును కలిగించుచుండును. మన జీవితానందము కొరకు, జీవిత సౌఖ్యముల కొరకు అట్టి దైవిక సంఘటనలు జరుగుచుండును. మనము సరిగా అన్నము తినవలెనన్నను, బట్ట కట్టవలయునన్నను అట్టి సంఘటన లెన్నో కలిసి పనిచేయుచుండవలయును. రైతు కష్టపడి పనిచేయవలయును. వర్షము కురియవలయును. సముద్రములో నావలు ప్రయాణము చేయుటకు గాలి సరియైన దిక్కున వీచవలయును. జనులు ఎప్పటివలె వస్తువులు సరఫరాను కోరుచుండవలయును.

మేమందరము కొన్ని క్షణములవరకు ఏమియు మాట్లాడలేదు. నా శిష్యురాలు విస్మెట్ కన్య చాల అందమైనది. ఆమె

చూపులలో దయ, ఆశ్చర్యము ప్రస్ఫుట మగుచుండెను. అది యామె సౌందర్యమునకు అపురూపమైన శోభ నొసగుచుండెను.

తార్న్‌హిల్ మాకు సాహాయ్యముచేయుటకు అచ్చటకు వచ్చినాడని ఆమె తలచెను. మమ్ము పాతాళలోకమునకు అణగ ద్రొక్కుట కతడు ప్రయత్నించుచున్నాడను విషయము, పాపము, ఆమెకు తెలియదు!

అందువలన నామె తార్న్‌హిల్‌తో నిట్లనెను: "నా ప్రియమైన తార్న్‌హిల్! నేను లేకుండ నీవు ఒంటరిగనిచ్చటకు వచ్చుటలో నీవు నాపట్ల కొంచెము నిర్దయగా ప్రవర్తించినావనుకొనుచున్నాను. మనయిరువురకు ప్రియాతిప్రియమైన కుటుంబమువారి దుస్థితినిగూర్చి నీవింతకుపూర్వము నాకు తెలియజేయకుండ నుండుటకూడ అశ్లేయున్నది. నీవు ఈ కుటుంబమువారిఅభ్యున్నతికి నీ శాయశక్తుల పాటుపడుచున్నావను విషయము నాకు తెలియును. నేను ఈయన శిష్యురాలను. నా కీయన కష్టములు తెలిసి యుండినచో నేను కూడ మీవలెనే ఈయనకు సాహాయ్యపడి నా కృతజ్ఞతను ప్రకటించుకొని యుండెడి దానను. ఈయనను మీ రెంతగా గౌరవించు చున్నారో నేనును అంతగా గౌరవించుచున్నాను. కాని మిమ్ము గురించి నా కొక విషయము తెలియును. మీ పిన తండ్రిగారివలెనే మీరును ఇతరులకు మంచి సాహాయ్యము రహస్యముగాచేసి ఆనందపడుదురు."

సర్ విలియమ్ ఆమె మాటలకు అడ్డువచ్చి, "అతడు ఇతరులకు మంచి సాహాయ్యముచేసి ఆనందపడును! కాదు, అమ్మాయి! అతడు ఎంత నీచమైనవాడో, అతనికి ఆనందము కలిగించు విషయములు కూడ అంతే నీచమైనవి. ఇత డెంతటి

నికృష్టుడో తెలియునా? ఈ గౌరవనీయుడే మునుపటి కొమా ర్తెను భ్రాంతిలో బడవైచి మోసపుచ్చి తీసికొనిపోయినాడు. ఒక నీచునకు గౌరవనీయుని వేషమువేసి అతని ద్వారా రెండవ కూతురును గూడ తీసికొని పోవుటకు విఫల ప్రయత్నము చేసి నాడు. ఈ గౌరవనీయుని జైలులోకి త్రోయించినాడు. ఈయన కుమారుడు జార్జి కడు ధైర్యసాహసములతో నీ మోసగానిని ఎదిరించుటకు ప్రయత్నించినాడు. అందువలన నీ నీచుడు జార్జి చేతులకు సంకెళ్ళు వేయించి జైలులో పెట్టించినాడు. నీవు ఈ నరరూప రాక్షసుని కౌగిలినుండి తప్పించుకొను సదవకాశము లభించినది. ఇందుకు నేను నిన్నెంతయు అభినందించుచున్నాను."

"అయ్యో దేవుడా!" అని విల్మట్ కన్య అఱచెను: "నేనెట్లు మోసగింపబడినాను! ఈ తార్న్‌హిల్ నాతో నేమి చెప్పినాడో తెలియునా? ఈ గౌరవనీయుని ప్రథమ పుత్రుడు కెప్టెన్ జార్జి ప్రిమ్‌రోజ్ క్రొత్తగా వివాహము చేసికొన్న యువతితో కలసి అమెరికాకు వెళ్ళిపోయినాడని చెప్పినాడు. ఎంత మోసము! ఎంత మోసము! నే నిక్కడకు వచ్చుట మేలైనది."

అంతట నా భార్య ఇట్లనెను: "మధురాతి మధురమైన యువతి శిరోమణీ! అతడు నీకంతయు అసత్యమునే చెప్పినాడు. నా పెద్ద కుమారుడు జార్జి ఇంతవఱకు అమెరికాకు వెళ్ళి యుండ లేదు; ఏ యువతిని వివాహము చేసికొని యుండలేదు. మీరిద్దరును ఒకరి నొకరు ప్రేమించుకొన్నారు. తరువాత సంబంధము చెడిపోయినది. అయినను అతడు నిన్నే ప్రేమించుచున్నాడు. అతనికి నీ పట్ల గల ప్రేమ అపూర్వమైనది. అందువలన నతడు

మఱి యే యితర యువతిని గూర్చిగాని ఆలోచించుట లేదు. అతడు బ్రహ్మచారిగనే మరణించును గాని మఱి యొక ర్తను వివాహము చేసికొనడు."

తరువాత నామె యింకను తన కుమారుని చిత్తశుద్ధితో కూడిన ప్రేమను వివరముగావర్ణించి చెప్పసాగెను. జార్జి ఎందుకు తార్న్‌హిల్‌తో పోరాడవలసివచ్చినదో సరిగావివరించిచెప్పెను. తరువాత నామె వేశ్యలు యువతులను ఏ విధముగ మోసగించి నాకో కన్నులకు కట్టినట్లు చెప్పెను. అతడు వేశ్యలు యువతులను వివాహము చేసికొనుచున్నట్లు నటించిన విషయమును గూడ చెప్పెను. అతని పిఱికి తనమును సోదాహరణముగ వివరించి చెప్పెను. ఆమె యీ విధముగా చెప్పగా కడు నికృష్టమైన, నీచమైన తార్న్‌హిల్ నిజ స్వరూపము బయల్పడెను.

అంతయు విన్న తరువాత విల్మట్ కన్య ఇట్లనెను: "ఓయి భగవానుడా! నేను నీ కెంతయు కృతజ్ఞురాలను! నేను అగాధమైన మహా సముద్రము లోనికిబోయి కొద్దిలో తప్పించుకొన్నాను! నిజముగా నేను అదృష్టవంతురాలను. ఈ ఘోరమైన అపాయమునుండి తప్పించు కొన్నందుకు నేనెంతయు సంతోషించుచున్నాను. నా ఆనందమునకు మితిలేకున్నది! ఈ నీచుడు నాకు నూఱువేల అసత్యములను చెప్పియున్నాడు! ఎంత మోసగాడు! మీ కుమారుడు జార్జి నాపట్ల విశ్వాసముగ లేడట! ఎవరో యువతిని వివాహము చేసికొని అమెరికాకు వెళ్ళిపోయినాడట! ఆ విషయమును చెప్పి నేనింక జార్జికి చేసిన వాగ్దానమునకు కట్టుబడి యుండవలసిన అవసరములేదని చెప్పినాడు! నేను తనమాటలను నమ్మునట్లు గొప్ప కళా . నైపుణ్యమును

ప్రవర్తించినాడు. ఇతని మాటలను నమ్మి గొప్ప ఉదారుడు సాహసికుడునగు జార్జిని నా మనస్సులోనుండి తొలగించినాను, ఈ దుష్టుని వివాహము చేసికొనుటకు నిశ్చయించుకొన్నాను."

ఒక గౌరవనీయుని తీవ్రముగ గాయపఱచినాడన్న నెపము మీద అధికారులు జార్జి చేతులకు సంకెళ్ళు తగిలించినారు; జైలులో పెట్టినారు. కాని ఆ గాయపడినవాడు వట్టి మోస గాడని ఇప్పుడు రుజువైనది. అందువలన జార్జి చేతులకున్న సంకెళ్ళు తొలగింపబడెను. అతనికి మరల సంపూర్ణమగు స్వేచ్ఛ లభించెను. అతనిపై ఇంక ఏ ఆరోపణయు లేదు. జెంకిన్సన్ ఎంతో అభిమానముతో అతని జుట్టును చక్కగా దువ్వెను; అతడు ఆకర్షణీయముగా కనబడుటకు చేయవలసిన ఏర్పాట్ల న్నిటిని చేసెను. తరువాత నతడు సైనికాధికారి వేషముతో మా వద్దకు వచ్చెను. అప్పుడతడు చూచుట కెంతయు బాగుగ నుండెను.

జార్జి విల్మట్ కన్యనుచూచి దూరమునుండియే వినయ ముగా నమస్కరించెను. నా భార్య డిబోరా చక్కని యుప న్యాస మొసగి విల్మట్ కన్య మనస్సును మార్చినదనియు, ఆమె కిప్పుడు తనపట్ల సదభిప్రాయమున్నదనియు అతనికి తెలిపెను. కాని అతడు ఆమెలోని మార్పును గమనించెను. ఆమె కన్నీరు, చూపులు మున్నగునవి యన్నియు అతనికి ఆమె హృదయము లోని భావములను సుస్పష్టముగా తెలియజేయుచుండెను. "మీ గుఱించి మోసగాడగు తార్న్హిల్ మోసపు మాటలు చెప్పినాడు. నేనతని మాటలు నమ్మి అతనిని వివాహము చేసి కొనుట కంగీకారము తెలిపినాను. నాకు జ్ఞానోదయమైనది.

నే నెప్పటివలె మిమ్ము ప్రేమించుచున్నాను. నన్ను క్షమింపవల యును" అను నర్థము వచ్చునట్లామె చూపులుండెను.

జార్జి విల్మట్ కన్య నమ్రతకు ఎంతయుఆశ్చర్యపడసాగెను. అది నిజమని అతడు నమ్మలేకుండెను.

"యువతీమణీ! ఇది భ్రాంతియనుకొందును! నేను కలగను చున్నానా? నే నిందుకుతగను! నా ఆనందమునకు మితిలేకున్నది. భగవంతుడు నాకు ఎట్టి సౌఖ్యమునొసగినాడు!" అని జార్జి అనెను.

"కాదు, కాదు. మీరు భ్రాంతికి లోనుకాలేదు. నేను మోసపోయినాను. కడు నీచముగ మోసపోయినాను. అందువల ననే నేను వాగ్దాన భంగముచేసి ఆ మోసగానిని వివాహము చేసికొనుట కిచ్ఛగించినాను. లేనిచో వాగ్దానభంగ మెన్నటికిని జరిగియుండెడిదికాదు. మీపట్ల నాకుగల ప్రేమఎట్టిదో, స్నేహ భావమెట్టిదో మీకు బాగుగ తెలియును. మీ కా విషయము చాలకాలమునుండి తెలియును. కాని నే నిటీవల చేసినపనిని మఱచిపొమ్ము. అంతకుమునుపు నేను మిమ్ముతప్ప మఱియొకరిని ప్రేమింపనని వాగ్దానము చేసియుంటిని. ఆ వాగ్దానము నిప్పుడు పునరుద్ధరించుచున్నాను. అరబెల్లా మీదికాకపోయినచో, ఆమె మఱి యింకెవ్వరిదికాదని జ్ఞప్తియుంచుకొనుడు" అని విల్మట్కన్య అనెను.

"నీ వింకెవ్వరిదానవుకాదు. నేను నీ తండ్రికి చెప్పి నీ కోరిక నెఱవేఱునట్లు చేయుదును" అని సర్ విలియమ్ అనెను.

ఆ మాటలలోని యర్థమును నా కుమారుడు మోజెస్ సంపూర్ణముగ గ్రహించెను. అతనికింక చెప్పవలసిన దేదియు లేదు

వెంటనే అతడు విల్మాట్ బసచేసియున్న పూటకూళ్ళయింటికి పరుగెత్తుకొనిపోయెను. జరిగిన విషయములన్నిటిని మోజెస్ అతనికి వివరించి చెప్పదలచెను. ఈలోపల తార్న్‌హిల్ తన్ను సమర్థించుచున్న వారెవ్వరును లేరను విషయమును గ్రహించెను. తానుచేసిన చెడ్డపనులన్నియు నగ్నముగ బయల్పడినవను విషయమును గ్రహించెను. ఇతరులను పొగడుటవలనగాని, కపటముగ నుండుటవలనగాని తన ఆటలింక సాగవని అతడు గ్రహించెను. "నేను వీరిని ధైర్యముతో నెదుర్కొందును. నా కిప్పు డదియే సరియైనమార్గము. ఇంతకుతక్క మరియొక మార్గములేదు" అని అతడు నిశ్చయించుకొనెను. అప్పు డతడు కరడుగట్టిన దుష్టునివలె తన నిజస్వరూపమును బయల్పఱచెను.

తార్న్‌హిల్ సిగ్గు, మానాభిమానములు విడిచిపెట్టి ఇట్లనెను: "జరిగినదానినంతను చూడగా నాకిచ్చట న్యాయము లభించదనువిషయము స్పష్టమగుచున్నది. కాని నాకు న్యాయము చేకూరునట్లు చేయవలయునని నిశ్చయించుకొన్నాను. (సర్ విలియమ్‌వంకకుతిరిగి) "నేను ఇక మీ అనుగ్రహము, ఆస్తిపాస్తులపై ఆధారపడియున్న బీదబంధువునుగాను. నేను వానిని తిరస్కరించుచున్నాను. వానిని నే నేమాత్రము లెక్కచేయుట లేదు. విల్మాట్ ఎక్కువ ఓపికతో పెద్దఆస్తిని సంపాదించియున్నాడు. ఆ ఆస్తి ఇపుడు నాకుదక్కకుండ ఎవ్వరునుఏమియు చేయజాలరు. ఆ ఆస్తియంతయు నాకు చెందునట్లు ఇదివఱకే దస్తావేజులు వ్రాయబడియున్నవి. అవి సురక్షితముగ నావద్దనే ఉన్నవి.

నేను విల్మాట్‌కన్యను వివాహము చేసికొనుటకెందు

కంగీకరించినాను? ఆమెను చూచికాదు! ఆమె ఆస్తిచూచి అంగీకారమును తెలిపినాను. ఆమె ఆస్తి నాకుదక్కినది! అనగా నాకు కావలసినది దక్కినది. విల్మట్ కన్య నాకువద్దు. ఆమెను ఎవ్వరు వివాహము చేసికొన్నను నాకు ఎట్టి అభ్యంతరము లేదు."

దుష్టుడగు తార్న్‌హిల్ మాటలు అశనిపాతమువలె నుండెను. సర్ విలియమ్ ఎంతయు భయపడెను. విల్మట్ ఆస్తి యంతయు తార్న్‌హిల్ పేర వ్రాయబడినదను విషయమంతయు అతనికి బాగుగ తెలియును. దస్తావేజులను వ్రాయించుటలో అతనికి గూడ పాలుగలదు.

తనకింక ఆస్తి ఏమియు లేదనువిషయమును విల్మట్ కన్య గ్రహించెను. అప్పుడామె జార్జివంకకు తిరిగి యిట్లనెను: "నన్నింత వఱకు మీరు విలువైనదానినిగ భావించుచు వచ్చినారు. ఇప్పుడు నా ఆస్తియంతయు పోయినది కావున నేను మీకు ఎట్టి ఐశ్వర్యమును ఈయజాలను. నేను మీకు ఐశ్వర్యము నీయ లేకపోయినను, నా హస్తమును మాత్ర మీయగలను."

అంతట విల్మట్ కన్యను హృదయపూర్వకముగ ప్రేమించుచున్న జార్జి ఇట్లనెను: యువతీశిరోమణీ! నేను మొదటినుండియు నీ హస్తమునే ఆశించుచువచ్చినాను. విలువైనది నీహస్తమనియే నేను మొదటినుండియు భావించుచు వచ్చినాను. నేను నీఐశ్వర్యమునుగుఱించి ఎన్నడును ఆలోచించియుండ లేదు. నాప్రియమైన అరబెల్లా! నీకిప్పుడు ఐశ్వర్యమేమియు లేకపోవుటవలన నా ఆనందము అతిశయించుచున్నది. నా చిత్తశుద్ధిని నీవు చక్కగా అర్థముచేసికొనుటకిప్పుడు సదవకాశము లభించినది. ఇది మనకు

పరీక్షాసమయము. ఇందు మనము అపూర్వమగు విజయమును సాధించినాము. భగవంతుడు నీకు మేలుచేయుగాక!

అంతలో నచ్చటకు విల్మట్ వచ్చెను. తన కొమార్తె అరబెల్లా ఒక ఘోరమైన ఆపదనుండి తప్పించుకొన్నది. అది అతనికెంతయు సంతోషమును కలిగించుచుండెను. తార్న్హిల్‌తో తన కొమార్తకు నిశ్చయమైన వివాహపు యొడంబడికను రద్దుచేయుట కతడు సులభముగా అంగీకరించెను. కాని అతనికొక విషయము తెలిసెను. అత డీదివరకే తన యాస్తి నంతను తార్న్హిల్‌కు వ్రాసియిచ్చెను. అదియింక తనకు తిరిగి రాదు. తార్న్హిల్ తిరిగి యివ్వడు. ఆవార్త విల్మట్‌కు తీవ్రమైన ఆశాభంగమును, విచారమును కలిగించెను.

"తార్న్హిల్ కింతవరకు స్వంతఆస్తి అనునది ఏమియు లేదు. ఇప్పుడు నా యాస్తియంతయు అతనికి చెందినది. అతడు భాగ్యవంతుడైనాడు. ఇదివంతయు దురదృష్టకరమైనవిషయము. అతడు దుర్మార్గుడైనను నేను భరింపగలను. కాని నా ఆస్తి యంతయు అతనికి అనవసరముగా పోవుటను నేను ఏమాత్రము భరింపజాలను. నాకిది చేదుకట్టె మ్రింగినట్లుండును? ఇప్పుడు నే నేమి చేయుదును? నా కేమియు తోచకున్నది! అంతయుఅగమ్య గోచరముగనున్నది. ఇప్పుడెవ్వరైన నన్నురక్షించినబాగుండును. ఎవ్వరైన నాకు శాంతిని చేకూర్చినబాగుండును. నాశిరస్సువేయి ముక్కలై పోవుచున్నది. నా హృదయము వేయి వ్రక్కలై పోవుచున్నది" అని విల్మట్ విచారముతో అనుకొనసాగెను.

సర్ విలియమ్ అతని ఆందోళనను తగ్గించుటకై ఇట్లనెను: "అయ్యా! నేను నా మనస్సులోని అభిప్రాయమును మీకు

స్పష్టముగ తెలియజేయు చున్నాను. మీయిప్పటి ఆశాభంగము నాకు పూర్తిగ అయిష్టముగలేదు. మీరు ఆస్తిని సంపాదించవలెనని దురాశతో ప్రయత్నించినారు; ఆస్తిని సంపాదించినారు. అందుకు మీ కిప్పుడు తగిన శిక్ష లభించినది. ప్రతియొక్కరును ఆస్తిని సంపాదించుట అవసరమే. కాని మీరు సంపాదించిన తీరు వేఱు. మీ కొమార్తె ఇప్పుడు భాగ్యవంతురాలుకాదు; కాని యామె తగినంత సంతృప్తినీయగల నేర్పును కలిగియున్నది.

ఇచ్చటనున్న ఈ సైనికాధికారిని చూడుడు. ఇతడెంతయు మంచివాడు; నిజాయితీ పరుడు; సాహసికుడు! చిత్తశుద్ధికలవాడు. ఇతడు మీ కొమార్తె ఐశ్వర్యము నెన్నడును ఆశించియుండలేదు. ఐశ్వర్యములేని మీ కొమార్తె పాణిగ్రహణము చేయుట కితడు హృదయపూర్వకముగ సంగీకరించు చున్నాడు. వీరిరువురును చాలకాలమునుండి ఒకరి నొకరు గాఢముగ ప్రేమించుకొను చున్నారు. ఈతని తండ్రియనిన నాకెంతయు అభిమానముకలదు. కావున ఇతని అభ్యున్నతికి నాశక్తికొలది పనిచేయుదును. అందువలన ఆ స్థితిపోయినదని విచారింపకుడు. పైపై మెఱుగులను చూచి మోసపోకుడు. మీ కొమార్తె నితనికిచ్చి వివాహము చేయుటకు సంతోషముతో సంగీకరింపుడు. అందువలన అందఱకు ఆనందము, సుఖము కలుగును."

అప్పుడు విల్మట్ ఇట్లనెను: "సర్ విలియమ్! నామాట నమ్ముడు. నే నిదివఱకెన్నడును నా కొమార్తె ఇష్టమునకు వ్యతిరేకముగ ప్రవర్తించి యుండలేదు. అట్లే ఇప్పుడును ప్రవర్తింపను. నా కొమార్తె గౌరవనీయుడగు ఈ యువకుని ఇంకను ప్రేమించు చున్నచో, ఆమె ఇతనిని వివాహము చేసికొనుటకు నాకెట్టి

అభ్యంతరమునులేదు. నేను వారి వివాహమునకు హృదయ పూర్వకముగ అంగీకరించుచున్నాను. నేను భగవానున కెంతయు కృతజ్ఞుడను. నా కంకను కొంచెము ఆస్తి మిగిలియున్నది. మీ రితనికి చేతనైనంత సాహాయ్యము చేయుదుమని వాగ్దానము చేసి యున్నారు!

నాదింక నొక్క కోరిక మాత్రమున్నది. గౌరినీయు నిత డొక్కడు ప్రేమరోజా నొకొక్క వాగ్దానము చేయవలయును. ఇతని ఆస్తిపోయినది, కాని అది యెప్పుడైన ఇతనికి తిరిగి రావచ్చును. అటుల వచ్చినపుడు ఇతడు నాకొమార్తెకు ఆయువే పానులు నీయవలయును. అటుల చేయుదునని ఇతడిప్పుడు నాకు వాగ్దానము చేయవలయును. ఈ ప్రేమికుల నిరువురను ఈ రాత్రికే కలిపివేయుటకు నేను సిద్ధముగా నున్నవాడను. అందుకు నేను మొట్టమొదటవాడను. నూతన దంపతులకు సర్వ శుభములు కలుగవలెనని హృదయ పూర్వకముగ కోరుచున్నాను."

ఇక నూతన దంపతులను సంతోషపెట్టు భారము నాపైనుండెను. పోయినసొమ్ము తిరిగి వచ్చునా? వచ్చుననుటకు నా కేమాత్రము లేకుండెను. ఒకవేళ వచ్చినను నేను అనుభవించు నదియు లేదు. నేను నాపిల్లల క్షేమమునే ఎప్పుడును కాంక్షించు చుందును.

నేను ఇట్లంటిని: "నేను ముసలివాడనై పోయినాను. నా కింక నీజీవితములో కావలసినది ఏమియున్నది? నాబిడ్డల సుఖమే నా సుఖము. కాని వారి కిచ్చుటకు నావద్ద నిప్పుడే ఆస్తియు లేదు. అందుకు నే నెంతయు విచారించు చున్నాను. కాని ఏమి లాభము? నాడబ్బు పోయినది. అది వచ్చునో రాదో తెలియదు.

నే నంతటి దురదృష్టవంతుడను! అట్టిసొమ్మును నావారిక వాగ్దానము చేయుట! అయ్యో! నే నెట్టివాడను! అయినను వాగ్దానము చేయుమన్నారు గనుక ఎట్టి అరమరికలు లేక వాగ్దానము చేయుదును. పోయినసొమ్ము తిరిగి వచ్చినచో నా పెద్ద కుమారునకు భార్య కాబోవుచున్న అరబెల్లాకు ఆలువే౦ పౌనులసొమ్ము నిత్తు నని వాగ్దానము చేయుచున్నాను."

అప్పుడు నా కుమారుడు జార్జి; విల్మట్‌కస్య అపరిమిత మగు ఆనందముతో ఒకరి నొకరు గట్టిగా కౌగలించుకొనిరి. నా కుమారుడు జార్జి ఇట్లనెను: "ఎన్నో కష్టముల తరువాత నాకీ అపూర్వమగు బహుమానము! నేను ఆశించిన దానికంటె ఇది చాల ఎక్కువైనదనుటకు సందేహమేదియు లేదు! సౌశీల్యము యొక్క మూర్తిని నే నిప్పుడు పొందుచున్నాను! బాధల తరువాత పొందుటవలన విలువ అతిశయించినది. నేను అనుకొన్న దానికంటె ఎక్కువ జరిగినది. ఇందుకు నేను భగవంతుని కెంతయు కృతజ్ఞుడను! సర్వలోక రక్షకా! మమ్ము ఆశీర్వదింపుము."

ఉమ్మట విల్మట్ కస్య మందహాసము చేయుచు నిట్లనెను: "ప్రియాతిప్రియుడవైన జార్జి! ఈ నీచుడు మా ఆస్తిని అనుభవింప వలయునని చూచుచున్నాడు! అతనినే అనుభవింపనిండు. మా ఆస్తిలేకుండగనే మీరు సంతోషముగ నుండుమనుచున్నారు. నేనును అట్లే ఉందును. నేను అదృష్టవంతురాలను! మనుజులలో కెల్ల అధమాధముడైన వానిని త్యజించి ఉత్తమోత్తముడైన వానిని స్వీకరించినాను. ఆ నీచుడే ఆ ఆస్తి ననుభవించునుగాక! నాకది అక్కరలేదు. నేను బీదతనములోనే సుఖమనుభవింతును."

ఆమాటలను విని తార్న్‌హిల్ ద్వేషబుద్ధితో పండ్లిగి

లించుచు నిట్లనెను: "నీకు అక్కఱలేని ఆ స్త్రీతో నేను సుఖముగ నుందునని వాగ్దానము చేయుచున్నాను."

అంతట జెంకిన్సన్ ఇట్లనెను: "అయ్యా! ఆగుడు! ఆగుడు! ఇల్లు అలుకగానే పండుగ రాలేదు. మీరు ఈయువతీ శిరోమణి ఆ స్త్రీని అన్యాయముగ అనుభవింప వలయునని చూచుచున్నారా? మీరందు ఒకచిల్లి గవ్వనైనను ముట్టుకొనుటకు వీలు లేదని నేను నొక్కి నక్కాణించుచున్నాను. (సర్ విలియమ్ వంకకు తిరిగి) ఆర్యా! ఇతడిదివఱకే ఒక యువతిని వివాహము చేసికొనియుండి నచో విల్మట్ కన్య ఆ స్త్రీ ఇతనికి చెందునా?"

అప్పుడు సర్ విలియమ్ ఇట్లనెను: "ఇది ఏమంతప్రశ్న? ఇంత స్వల్పముగు ప్రశ్నను ఎందుకు వేసెదవు? నిస్సందేహముగ ఇతనికి చెందదు."

"నేనందుల కెంతయు విచారించుచున్నాను. ఏలయన ఇతనికిని నాకు మంచిస్నేహమున్నది. నేనీతని శ్రేయోభిలాషిని. ఇతనిని గాఢముగ ప్రేమించినాను. కాని నే నిప్పుడొక విషయ మును స్పష్టముగ ప్రకటింపవలసియున్నది. విల్మట్ ఆ స్త్రీ ఇతని కిచ్చుచు వ్రాసియిచ్చిన దస్తావేజులు నాలుక గీసికొనుటకైనను పనికిరాదు. ఏలయన ఇతని కిదివఱకే వివాహమైనది" అని జెంకిన్సన్ అనెను!

ఆమాటలను విన్న తార్న్‌హిల్ అపరిమితముగు ఆగ్రహ ముతో నిట్లనెను "దుర్మార్గుడా! బుద్ధిహీనుడా! అసత్యము పలి కెద వెందులకు? నే నింతవఱకు చట్టసమ్మతముగ ఏయువతిని వివాహము చేసికొనియుండ లేదు."

కాని జెంకిన్సన్ ఇట్లనెను: "నన్ను క్షమింపవలయునని

కోరుచున్నాను. నిశ్చయముగ నీకిదివఱకు చట్టసమ్మతమైన వివాహము జరిగినది. నేను నిజాయితీపరుడను; నీకు మిత్రుడను; నీభార్యను నీకు తెచ్చి చూపెదను. అందుకు నీవు నాపట్లస్నేహ భావమును, కృతజ్ఞతను ప్రకటింపవలయును. ఇచ్చటి మహా నీయులు కొన్ని నిమిషములవఱకు తమ కుతూహలము నాపుచేసి కొనగలిగినచో వారికితని సతీమణిని చూపెదను."

అట్లని యతడు తనకు సహజమైన వేగముతో పోయెను. అచ్చటివారందఱును అతడేమి చేయబోవుచున్నాడా యని పరి పరివిధముల ఊహాగానము చేయసాగిరి. కాని ఎవ్వరి మనస్సునకును ఏమియు తట్టకుండెను.

"పోయినపోనిమ్ము. నేనిదివఱకు ఏమిచేసియుంటిని. సరే నేనిప్పుడతనిని ఎదిరించి నిలబడుదును. నేనిప్పుడు చిన్నవాడను గాను. ఇట్టివంటివిషయములలో మంచి అనుభవము కలవాడను. ఇతని పరిహాసమునకు, బెదరింపునకు నేను ఏమాత్రము భయ పడను."

"నా కాశ్చర్యముగనున్నది? ఇతని యుద్దేశ్య మేమై యుండును?" అని సర్ విలియమ్ అనెను; "ఏదో తమాషా చేయబోవుచున్నాడా? అంతయు అయోమయముగనున్నది. ఏమియు తోచుటలేదు."

అపుడు నే నిట్లంటిని: "ఇతడుతమాషా చేయబోవుచున్నా డని నే ననుకొనుటలేదు. ఏదో గట్టిపనినే చేయబోవుచున్నాడను కొందును. వాన్‌హిల్ అమాయకులను మోసగించుటకు ఎన్నో ప్రణాళికలను పన్నియున్నాడు. త్రాడి దన్నువాని తలదన్నువా డుండునన్నట్లు బహుశా ఇతనిని మించినవారెవ్వరో ఉండి

యుందురు. వారు ఇతనిని మోసగించియుండవచ్చును. ఇట్లు జరుగుట సాధ్యమే. ఇందు అసంభవమేమియు లేదు. ఒకసారి ఆలోచింపుడు. ఇతడు ఎందఱినో సర్వనాశనము చేసియున్నాడు. ఎందఱి కుటుంబములనో ఇతడు అపకీర్తిపాలు చేసినాడు. ఎందఱో తలిదండ్రు లితనిపై అపరిమితముగు ఆగ్రహము కలిగియున్నారు. వారిలో నెవ్వరైననొకరు—ఆశ్చర్యము! అద్భుతము! పోయిన నాకొమార్తను తిరిగిచూచుచున్నానా? ఇది సంభవమా? ఆమెయే! ఆమెయే! సందేహము లేదు! నాజీవితసర్వస్వము! నాఆనందము! ఒలీవియా! ఒలీవియా! నీవు మరణించినావని నేను అనుకొన్నాను కాని యిప్పుడు నిన్ను తిరిగి చూడగలుగుచున్నాను. నీవు చిరకాలము జీవించి నాకు సౌఖ్యము నొసగుదువుగాక!"

నాకు ప్రియాతిప్రియమైన ఒలీవియాను జెంకిన్సన్ నా వద్దకు తీసికొనివచ్చెను. అప్పటి నాఆనందము నేమనివర్ణింతును? చిరకాల వియోగానంతరము కలసికొను ప్రేయసీ ప్రియుల సంతోష మెట్లుండును? నాసంతోషము వారి సంతోషముకంటె మిన్నగానుండెను. నే నామెను నా చేతులలోనికి తీసికొంటిని. ఆమె ఏమియు మాట్లాడకుండెను, ఆమె వదనమామె ఆనందమును తెలియజేయుచుండెను.

"ప్రియమైన కుమారీ! ఈ వృద్ధాప్యమున నన్ను ఊరడించుటకై నీవు తిరిగి నావద్దకు వచ్చినావా?" అని నేను అంటిని.

"అవును! ఆమె మీకు ప్రియమైన కుమారి. ఆమె సామాన్యమైన యువతి కాదు. ఆమెవంటియువతి మఱియొకర్తె ఈ ప్రపంచమున లేదని నేనునిశ్చయముగ చెప్పగలను. ఈమెఅపూర్వ

మైన సౌశీల్యముకలది; మంచి నిజాయితీపరురాలు" అని జెంకిన్సన్ నాతో అనెను.

పిమ్మట నతడు తార్న్‌హిల్‌తో నిట్లనియెను: "నీవచ్చట నిలబడియున్నావన్నమాట నిజమేకదా! నీవచ్చట నిలబడి యుండుట ఎంతనిజమో, నీవీ యువతిని చట్టసమ్మతముగ వివాహము చేసికొనియుండుటయు అంతే నిజము. నేనుసత్యముతప్ప మరి యితరమేమియు పలుకుటలేదు. నీకందుకు రుజువుకావల యునా? ఇదిగో లైసెన్సు. దీనినిబట్టియే మీ కిరువురకు వివాహము జరిగినది." అట్లని అతడు లైసెన్సును సర్ విలియమ్ చేతికొప్పగించెను. సర్ విలియమ్ దానిని చదివి. "ఇది అన్నివిధములుగాను సరిగానేయున్నది" అని సంతృప్తి వెలిపుచ్చెను.

తరువాత జెంకిన్సన్ ఇట్లనెను: "గౌరవనీయులారా! మీ కిదియంతయు నాశ్చర్యకరముగనున్నది. కాని కొన్నిమాటలు చెప్పిన మీ కీ సమస్యఅంతయు చక్కగా నర్థము కాగలదు. తార్న్‌హిల్‌పట్ల నాకు గొప్ప స్నేహభావముకలదు. అది మా యిద్దరిమధ్య విషయము. అతడు నన్నుఅప్పుడప్పుడు చిన్న చిన్న పనులు చేయుటకు నియోగించుచుండెడివాడు. మిగిలినవిషయములమాట అటుండనిండు. ప్రస్తుతాంశమునకు వత్తును. ఈ యువతిని మోసముచేయుటకుదొంగవివాహపులైసెన్సును, దొంగ పురోహితుని తీసికొని రావలసినదని ఇతడు నన్నుకోరినాడు. కాని నేను ఇతనికి నిజమైన స్నేహితుడను. అందువలన నేను ఏమి చేసినాను? పోయి నిజమైన లైసెన్సును, పురోహితుని తీసికొని వచ్చినాను. ఇరువురకు త్వరగా వివాహము చేసినాను. నేనేదో ఔదార్యమువలన ఈపని చేసినానని మీరందఱు అనుకొన

వచ్చును. కాదని స్పష్టముగ చెప్పుచున్నాను. అసలు విషయమును చెప్పుటకు నేను ఎంతయు సిగ్గుపడుచున్నాను. నేను ఆ వైటెసెన్నును దగ్గఱపెట్టుకొని అవసరమైనపుడు తార్న్‌హిల్‌కు చూపి, బెదరించి, కావలసినంత డబ్బు గుంజవచ్చునను అభిప్రాయముతో అటులచేసినాను.”

ఆమాటలను వినగానే అచ్చటివారందఱును ఆనందముతో పకపకనవ్విరి. మా సంతోషము ఉమ్మడిగదినిగూడ చేసుకొనెను. అచ్చటి వారందఱును మాపట్ల సానుభూతిని ప్రకటించిరి. ఆసందాతిరేకమున సంకెళ్లు కదలించి ధ్వనిచేసిరి.

ప్రతియొక్కరి మొగముపైనను సంతోషము తాండవమాడుచుండెను. ఒలీవియా బుగ్గలుగూడ సంతోషాతిశయమున గులాబిరంగు ధరించెను. ఆమెకిప్పుడు అపకీర్తి ఏమియులేదు. ఆమెకు పేరుప్రతిష్ఠలు, సంపదకూడ తిరిగివచ్చినది. ఆమె ఆరోగ్యము బాగుపడుటకు, పూర్వము సౌందర్యము వచ్చుటకు అది చాలును.

నా ఆనందముతో సమానమైన ఆనందము అచ్చటనున్న ఇతరులెవ్వరికి లేదనిచెప్పవచ్చును. నా ఆనందము అపూర్వమైనది, అపురూపమైనది. నాకూతురు ఒలీవియానింకనునాచేతులలోనే పెట్టుకొని నాహృదయము నిట్లు అడిగితిని: “ఈ ఆనందమంతయు భ్రాంతివిలాసము కాదుకదా?”

నేను జెంకిన్సన్ వంకకుతిరిగి ఇట్లంటిని: “నేను ఎన్నో కష్టములతో బాధపడుచుంటినిగదా? అటువంటిసమయమున నీవు నా కొమార్తె ఒలీవియా మరణించినదని ఎందుకు చెప్పినావు? నా బాధనెందుకు అతిశయింపజేసినావు?”

అంత జెంకిన్సన్ ఇట్లనెను: "మీ ప్రశ్న ఏమంతకష్టమైనది కాదు. నేను దానికి సులభముగ సమాధానము చెప్పగలను. మిమ్ములను జైలునుండి విడిపించుటకు సులభమైన మార్గమేది? మీరు థార్న్‌హిల్‌కు లొంగిపోవుట, అతడు వేరొక యువతిని వివాహమాడుటకు మీరు అంగీకరించునట్లుచేయుట. మీ కొమార్తె బ్రతికియున్నంతవఱకుఅటుల చేయనని ప్రతిజ్ఞగావించి యున్నారుగదా! మఱి యింక మీరు అందుకు అంగీకరించునట్లు చేయుటఎట్లు? మీ అమ్మాయి మరణించినదని మిమ్ము నమ్మించుటకంటె వేఱుమార్గము లేకపోయినది. ఈ నా ప్రణాళికలో మీభార్యకూడ చేయునట్లు నేను ప్రోత్సహించినాను. ఆమె అంగీకారమును సంపాదించినాను. అసలు విషయమును మీకు చెప్పుటకు అప్పటినుండి ఇప్పటివఱకు సరియైన అవకాశము లభింపలేదు. ఇందుకు మీరు నన్ను క్షమింపవలయును."

అప్పుడచ్చటనున్న వారందఱిలోను ఒక్క-ఇరువురి మొగములు మాత్రము ఆనందముతో ప్రకాశించుటలేదు. థార్న్‌హిల్ స్వరూపము పూర్తిగా మాఱిపోయినట్లుండెను. అతని నిప్పుడు అపకీర్తి ఆవహించియున్నది అతనికి ఆ సిగ్గుకూడ చిల్లిగవ్వయైనను లేదు. ఆవిషయము నతడు సంపూర్ణముగా గ్రహించినట్లుండెను. అతనిముం దిప్పుడొక అగ్నిగుండమున్నది. అందులోనికి దుముకుట కత డెంతయు భయపడుచున్నాడు; గజ గజ వణకిపోవుచున్నాడు.

థార్న్‌హిల్ తన పినతండ్రి పాదములపై బడెను. తన్ను క్షమింపుమని, దయజూడుమని కడు హీనస్వరమున ప్రార్థించెను. అతని మాటలు ఎట్టివారి కైనను జాలి గొల్పునట్లివి

నుండెను. అతనిసంగతి సర్ విలియమునకు బాగుగ తెలియును. అందువలన నతడు తార్న్‌హిల్‌ను తిరస్కార భావముతో చూసి వేయబోయెను. కాని తార్న్‌హిల్‌ను దయతో జూడ వలసినదని నేను సర్ విలియమ్‌ను ప్రార్థించితిని.

నా ప్రార్థన నాలకించి సర్ విలియమ్, తార్న్‌హిల్‌ను పైకెత్తి, కొన్ని నిమిషములాగిన తరువాత నిట్లనెను: "నీ దుర్గుణములు, నేరములు, కృతఘ్నత సామాన్యమైన వే మాత్రమును కావు. అందువలన నిన్ను దయతో చూచుటకు వీలులేదు. కాని నిన్ను పూర్తిగా విడిచి పుచ్చను. అత్యవసరములగు జీవితావసరములను సమకూర్చుకొనుటకుగాను నీకు కొంత డబ్బు నొసగెదను. నీవు విచ్చల విడిగా తిరుగుటకు మాత్రము ఒక్క చిల్లిగవ్వయైన నీయను. ఒకప్పుడు నీకు చెందిన ఐశ్వర్యములో మూడవ భాగమును నీ యీ భార్యకు అప్పగింతును. భవిష్యత్తులో నీ క్షేమమైన ఎక్కువ డబ్బు కావలసివచ్చిన ఈమె దయా ధర్మ భిక్షములపై నాధారపడవలసి యుండును."

తనపట్ల దయతో ప్రవర్తించినందుకు తార్న్‌హిల్ సర్ విలియమ్‌కు కృతజ్ఞతను తెలియజేయసాగెను. అతడొక చిన్న యుపన్యాసమును ప్రారంభింపబోయెను. కాని సర్ విలియమ్ ఇట్లనెను: "ఆగుమాగుము. నీనైచ్యమిదివరకే స్పష్టముగా బయల్పడినది. ఇప్పుడు కల్లబొల్లి మాటలు చెప్పి ఆనైచ్యము నింకను హెచ్చించుకొనకుము. వెంటనే ఈ ప్రదేశమును వీడిపొమ్ము. నీ పూర్వపు సేవకులలో నీకు కావలసిన వానిని, తగిన వానిని మాత్రము ఎన్నుకొనుము."

అంతట తార్న్‌హిల్ ఆ ప్రదేశమును వీడిపోయెను.

వెంటనే సర్ విలియం మందహాసము చేయుచు ఒలీవియావద్దకు వచ్చి, "నీకు సర్వసుఖములు చేకూరవలయునని ఆశించు చున్నాను" అని అనెను. తరువాత విల్మాట్ కన్య, ఆమె తండ్రి కూడనట్లే చేసిరి. నా భార్యకూడ తన కోమార్తెను ఎనలేని ప్రేమతో ముద్దుపెట్టుకొనెను: "నీ స్థితి నాకు ఆనందమును కలి గించుచున్నది" అని ఆమె అనెను. అటు పిమ్మట సోఫియా, మోజెస్‌లు కూడనట్లే చేసిరి. మాకు ఎనలేని లాభమును చేకూ ర్చిన జెంకిన్సన్‌కూడ ఆ గౌరవములో పాల్గొనెను. ఇక మా సంతోషమును అభివృద్ధి చేయుటకు ఏ పనియు అవసరము లేనట్లుండెను.

సర్ విలియమ్‌కు సంతోష మెప్పుడు కలుగును? ఇతరు లకు మేలుచేసి నప్పుడు కలుగును. అతడు వికసించిన ముఖ ముతో చుట్టును కలయజూచెను. అతని కందటి ముఖములలోను సంతోష చిహ్నములు కనబడుచుండెను. ఒక్క సోఫియా ముఖము మాత్రమందుకు విరుద్ధముగా నుండెను. ఎందువలననో తెలియదుగాని సోఫియా సంపూర్ణముగ సంతృప్తి చెందినట్లు కనబడకుండెను. అందుకు కారణములు ఆమెకే తెలియ వలయును.

సర్ విలియమ్ మందహాసముచేయుచు నిట్లనెను: "ఇప్పు డిచ్చోనున్న వారందఱును, ఒకరిద్దఱు తప్ప, ఆనంద సాగరమున తేలియాడు చున్నారని తెలియుచున్నది. వారి ముఖములో విష యమును సుస్పష్టముగ చెప్పుచున్నవి. ఇంక నేనొక్క న్యాయ సమ్మతమైన కార్యమును చేయవలసియున్నది. (నా వంకకు తిరిగి) అయ్యా! మన మిరువురమును సహృదయులమగు ఈ జెంకి

స్సన్‌కు ఎంతో ఋణపడి యున్నామను విషయము మీకు తెలియును. మన మిసుపురమును ఇతనిని సముచితముగ బహూకరించుట ఎంతయు బాగుండును. సోఫియా కన్య ఇతనిని సంతోషపెట్టగలదని నేను గట్టిగా అభిప్రాయపడుచున్నాను. నేనామెకు అయిదు వందల పౌనుల నీయదలచుకొన్నాను. ఆ సొమ్ముతో వీరిరువురును సుఖముగ జీవింపగలరని నేను ఆశించుచున్నాను. ఈ విషయమున నాకు సందేహ మేమియు లేదు. సోఫియా! మాట్లాడుము. నేను కుదిర్చిన ఈ వివాహ సంబంధమును గూర్చి నీ అభిప్రాయ మేమి? నీవతనిని వివాహము చేసికొందువా?"

ఆ భయంకరమైన, అసహ్యమైన సూచనను వినగానే సోఫియా తన తల్లి చేతులలోనికి క్రుంగిపోయెను.

ఆమె హీనస్వరమున నిట్లనెను: "వివాహము చేసికొనుటయా! ఎన్నటికిని కాదు! ఎన్నటికిని కాదు!!"

సర్ విలియమ్ మరల నిట్లనెను: "ఏమి! వివాహముచేసికోవా? జెంకిన్సన్ మీ కుటుంబమునకు ఎనలేని మేలును చేకూర్చిన మహనీయుడు: అందమైన యువకుడు నేనతనికి అయిదు వందల పౌనుల నిచ్చుచున్నాను. అతనికింకను మంచి భవిష్యత్తు ఉన్నది."

మాట్లాడ లేక, మాట్లాడ లేక సోఫియా ఇట్లనెను: "మీరా విధముగ మాట్లాడవలదని కడు వినయ పూర్వకముగ విన్నవించు కొనుచున్నాను నన్నింక బాధపెట్ట వలదని వేడు కొనుచున్నాను."

సర్ విలియమ్ ఇట్లనెను: "అతడు మీ కుటుంబమునకు

కెంతో మేలుచేసినాడు. మీరతనికి ఋణపడియున్నారు. నీ సోద రిని రక్షించిన మహనీయుడతడు! అతనికి అయిదు వందల పౌనులున్నవి! ఏమి! అతనిని వివాహముచేసికొనవా? ఇట్టి వంటి మొండి తనము నిదివఱకు నేను చూచి యుండలేదు!"

అంతట సోఫియా కోపముతో నిట్లనెను: "ఎన్నటికిని చేసికోను! ఎన్నటికి చేసికోను! ఆపని చేయవలసి వచ్చినచో సంతకంటె ముందుగా మరణింతును!"

"అట్లయినచో, ఏమిచేయవలయును? నీ వతనిని వివాహము చేసికొనుట కిష్టపడనిచో నిన్ను నేనే వివాహము చేసికో వలసి యుండును" అని సర్ విలియమ్ అనెను. అట్లని అతడు సోఫియాను పట్టుకొని తన ఱొమ్ముభాగమునకు గట్టిగా అనుము కొనెను.

అతడింకను ఇట్లనెను: "మాధురాణి మధురమైన యువతీ శిరోమణీ! నా ప్రణయ సామ్రాజ్య లక్ష్మీ! వివేకవతీ! నీవాడగు బర్చెల్ నిన్ను మోసగించుననియెట్లనుకోగలిగినావు? స్వార్థ ముతో గాక అతని కొఱకే ప్రేమించిన ఉత్తమోత్తమమైన యువతిని సర్ విలియమ్ తార్న్‌హిల్ వదలుకొనునని నీవెట్లు అనుకొన్నావు? నేను కొన్ని సంవత్సరములనుండి నా ఆస్తినిగాక నన్ను ప్రేమించు యువతికొఱకు వెదకుచున్నాను. నా ఆస్తి నెవ్వరైన ప్రేమింతురు. నుతి సన్నాక ఉత్తమ మానవునిగా గ్రహించి ప్రేమించువారు కావలసి యుండెను. నేను ఎన్నో ప్రయత్నములు చేసితినిగాని వృథాయైనవి. అందములేని వాడు గూడ నా ఆస్తినే ప్రేమించిరి. కాని నన్ను ప్రేమింపలేదు. నీకు నేను ఆస్తి పరుడనని తెలియదు. అయినను నన్ను ప్రేమించి

నావు. అపురూప సుందరి, భువన మోహిని, వివేకవతియగు నీవంటి ఉత్తమ యువతి ప్రేమను కట్టకడకు పొంద గలిగినందుకు నేనెంతయు గర్వించుచున్నాను. నా ఆనందము అనంతమైనది."

సర్ విలియమ్ తరువాత జెంకిన్సన్ వంకకు తిరిగి ఇట్లనెను: "ఈ యువతి నా మొగము చూచి నన్నే ప్రేమించినది. నే నీమెను విడిచి పుచ్చజాలను. నీ కీమెనిచ్చి వివాహము చేయ జాలను. కావున నేను నీ కిప్పుడు చేయగలిగిన దొకటియున్నది. ఆమెకు నే నిత్తు నన్న సొమ్మును నీకే ఇచ్చివేసెదను. రేపు నీవు వచ్చి నా గుమాస్తాను కలిసికొని అయిదువందల పౌనులను తీసికొని పోవచ్చును."

అందఱును మఱియొకసారి తమ అభినందనలను తెలియ జేయవలసి వచ్చెను. అందఱును ఇదివఱకు ఒలీవియాను అభినందించినట్లే, సోఫియానుకూడ పరిపరి విధముల అభినందించిరి. ఈ లోపల సర్ విలియమ్ మనుజులువచ్చి, "మిమ్ముల నందఱను పూటకూళ్ళ యింటికి తీసికొని పోవుటకు సిద్ధముగా నున్నాము. అచ్చట మీ గౌరవార్థము అన్ని ఏర్పాట్లు చేయబడియున్నవి" అని యనిరి.

అందఱితోబాటు నేను విచారమునకు కేంద్రమగు జైలు నుండి బయటకు వచ్చితిని. ఉదారుడగు సర్ విలియమ్ అపార మగు కరుణతో ఖైదీలకు నలువది పౌనులను పంచి పెట్టించెను. విల్మట్ అతని నుదాహరణముగా తీసికొని ఇరువది పౌనులను పంచి పెట్టించెను

గ్రామస్థులు మమ్ము హర్ష ధ్వానములతో స్వీకరించిరి.

జైలు బయటనున్న వారిలో మా గ్రామమునకు చెందిన పలు వురు అభిమానులు కూడ నుండిరి. వారందఱును మమ్ము పూట కూళ్ళ యింటివఱకు తీసికొనిపోయిరి. అచ్చట మేము గొప్ప విందులో పాల్గొంటిమి. గ్రామస్థులందఱకు గూడ వేఱుగా భోజన పదార్థములు పంచి పెట్టబడెను.

భోజనము ముగియునప్పటికి నేను బాగుగా అలసిపోయి యుంటిని. ఆ రోజంతయు నేను ఒకసారి బాధ, మఱి యొక సారి ఆనందము ఒకటి విడిచి ఒకటి అనుభవించితిని. అదియే నా అలసటకు కారణము. ఆ విషయమును అందఱకు చెప్పి, "మీకందఱకు నేను కృతజ్ఞుడగు. నేనింక విశ్రాంతితీసికోవలయును. ఇక సెలవు" అని యంటిని. పిమ్మట నా కొ[illegible]కు ప్రత్యేకింపబడిన గదిలోనికిపోతిని. అచ్చట నొంటరిగా కూర్చుండి విచారమును, ఆనందమును కలిగించు భగవానునకు హృదయపూర్వకముగ కృతజ్ఞత తెలిపితిని. పిమ్మట తెల్లవాఱువఱకుగాఢ నిదుర మునిగితిని.

# 32

మఱునాడు తెల్లవారిన తరువాత నేను గాఢనిదురనుండి మేల్కొంటిని. నేను లేచునప్పటికి నాపెద్ద కుమారుడు జార్జి నా ప్రక్కనే కూర్చుండి యుండెను. అతను నాసంతోషమును హెచ్చించు మఱియొక మంచివార్తను చెప్పుటకై వచ్చి యుండెను.

అతను నాతో నిట్లనెను: "నిన్న మీరు మీ పోయిన ధనము తిరిగి వచ్చినచో నా ప్రియురాలు అరబెల్లాను ఆఱునెం

పౌనుల నొసగెదమని వాగ్దానము చేసియున్నారు. కాని మీరా సొమ్ము నీయవలసిన పనిలేదు. మిమ్ము ఆవాగ్దానమునుండి విడి పించినాను. మీకు సొమ్మీయకుండ పారిపోయిన పట్టణ వర్తకుడు పట్టుపడినాడు. ప్రభుత్వమువారతనిని అరెస్టు చేసినారు. అతడు నిజముగా దివాళాతీయలేదు. అతనివద్ద ఇతరులకీయవలసిన సొమ్ముకంటె ఎక్కువ సొమ్మేయుండెను. కావున మీకు రావసిన సొమ్ముపూర్తిగా వచ్చును."

పోయినసొమ్ము తిరిగివచ్చునన్నవార్త నాకెంతో ఆనంద మును కలుగజేసెను. ఆయువేల పౌనులను వదలుకొన్న నాకుమా మని ఔదార్యముకూడా నాకు మితిలేని సంతోషమును కలుగ జేసెను. కాని నేనతని ఔదార్యమును న్యాయముగ అంగీకరింప వచ్చునా, అంగీకరింపకూడదా అను సందిగ్ధావస్థలోపడితిని. నేనా విషయమునుగూర్చి తీవ్రముగ ఆలోచించుచుండగా సర్ విలి యమ్ నా గదిలో ప్రవేశించెను. అంతట నేనతనికి నాసందేహ ములను తెలిపితిని.

సర్ విలియమ్ తన అభిప్రాయమునిట్లు వెలిబుచ్చెను: "వివాహ సంబంధమువలన మీ కుమారునకు గొప్పఆస్తి వచ్చు చున్నది. కావున మీరతని ఔదార్యమును నిస్సందేహముగ అంగీకరింపవచ్చును."

అతడింకను ఇట్లనెను: "నేనిప్పుడు వేటనుండి వచ్చి నాను. నేను నిన్నరాత్రే వివాహపు లైసెన్సులను తెచ్చుటకై కొందఱిని పంపియున్నాను. అవి వచ్చునని ప్రతీక్షించుచు ఎదురు చూచుచున్నాను. కావున మీరిప్పుడు అందఱను సంతోషపెట్టు

టకు సాహాయ్యపడవలసి యున్నది. మీరు నాకోరికను తిరస్క-రింపరని ఆశించుచున్నాను."

అతడావిధముగ చెప్పుచుండగా ఒక సేవకుడువచ్చెను. "వివాహపు లైసెన్సులు తెచ్చుటకు పోయినవారు తిరిగివచ్చి నారు" అని అతడు చెప్పెను. అంతటనేను సిద్ధపడి అందఱును ఉన్నచోటికి పోతిని. ఎవ్వరి మొగముచూచినను సంతృప్తి, సంతోషము తాండవ మాడుచుండెను. వారు నవ్వులాటలో మునిగియుండిరి.

వివాహబంధము చాల పవిత్రమైనది. వివాహము ఎంతో పవిత్రమైన కార్యము. అటువంటి సమయమున నచ్చటివారు నవ్వులాటలో మునిగియుండుట నాకేమాత్రము ఇష్టముగ లేకుండెను. అందువలన నేను వారికావిషయమునుగూర్చి వివరించి చెప్పితిని. "ఈ సందర్భమున మీరుచాల గంభీరముగ ప్రవర్తింప వలెను" అని హెచ్చరించితిని. నా సిద్ధాంతమును బాహాటముగ చాటితిని. అయినను వారు తమ ఉత్సాహమును నాకు వ్యతిరేక మైన విధానములోనే ప్రకటింపసాగిరి.

చర్చికి పోవుచున్నపుడుగూడ వారు గాంభీర్యమునకు తిలో దకములిచ్చి నవ్వులాటకు దిగిరి. నాకుఅపరిమితమగు ఆగ్రహము రాసాగెను. ఆ ఆగ్రహముతో నేను వెనుకకు తిరిగిపోవలయునని ఎన్నోసార్లు అనుకొంటిని. చర్చికి పోయినతరువాత మఱియొక సందేహమేర్పడెను. ఏ జంటకు ముందు వివాహము చేయవలయు నన్నదే ఆ సందేహము. ఆ సమస్యకు సరియైన సమాధానము లభింపకుండెను.

నా కుమారుని వివాహము చేసికోనున్న విక్టోరియ కన్య

ఇట్లనెను: "ముందు సర్ విలియమ్, సోఫియాల వివాహము జరుగవలయును. తరువాతనే మా వివాహము." కాని సోఫియా ఇట్లనెను: నే నంత మొఱటుగా ప్రవర్తింపను. ముందు మీావివాహమే కావలయును. నాకంటె నా సోదరుని వివాహమే ముందరగుట వాంఛనీయము."

కొందఱు విల్కాట్ కన్యను సమర్థించిరి. మఱి కొందఱు సోఫియాను సమర్థించిరి. ఆ విషయమునుగూర్చి వాదచాల పట్టుదలతో చర్చించిరి. ఎవ్వరును తమ మొండిపట్టును విడువకుండిరి. మర్యాదకు భంగముగ మాత్ర మెవ్వరు ప్రవర్తింపలేదు.

వారట్లు చర్చించుకొనుచుండగా నేను పుస్తకము తెఱచి సిద్ధముగా నిలబడి యుంటిని. ఎంతకును చర్చ ముగియకపోవుట వలన నాకు విసుగుపుట్టసాగెను. తుదకు నే నిట్లంటిని: "వివాహములు జరుగవలయునను కాంక్ష మీాలో ఎవ్వరికిని ఉన్నట్లు కనబడుట లేదు. ఇచ్చట నీదినమునకు ఏపనియు జరుగునట్లు లేదు. అందువలన మన మందఱము వెనుకకు తిరిగిపోవుట శ్రేయస్కరమని భావించుచున్నాను." అట్లని నా చేతిలోని పుస్తకమును మూసివైచితిని. అప్పుడందఱును నేను చెప్పినట్లు చేయుటకు కంగీకరించిరి. మొదట సర్ విలియమ్, సోఫియాల వివాహము జరిగెను. తరువాత జార్జి, అరబెల్లాల వివాహము జరిగెను.

మాయింటికి ప్రక్కనేయున్న ఫ్లామ్‌బరో కుటుంబమువారిని తీసికొనివచ్చుటకై ఒకబండిని పంపవలసినదని నేను నాటియుదయమునే ఆజ్ఞాపించి యుంటిని. నాయాజ్ఞ అమలు జరుపబడెను. మేమందఱము పూటకూళ్ళయింటికి పోవునప్పటికి చ్చట ఫ్లామ్‌బరో కన్యలుండిరి. జెంకిన్సన్ తనహస్తమును ఫ్లామ్‌బరో కన్య

లలో మొదటిదానికిచ్చెను. నాకుమారుడు మోజెస్ తనహస్త మును రెండవ ఫామ్‌బరోకన్య కొసగెను. (మోజెస్ రెండవ ఫామ్‌బరో కన్యను గాఢముగా ప్రేమించు చున్నాడని నాకు తెలియ వచ్చినది. అతడు నన్నడిగినపుడు వారి వివాహమునకు నాసమ్మతి నొసగుదును. వారికి కావలసిన ధనమునుకూడ నిచ్చెదను.)

మేము పూటకూళ్ళయింటికి తిరిగి వచ్చునప్పటికి మా గ్రామస్థులు మావిజయ వార్తనువిని మమ్ము అభినందించుటకై వచ్చియుండిరి. వారిలో మమ్మెదివఱకు న్యాయోద్యోగి బారి నుండి రక్షించుటకుసిద్ధపడిన వారుకూడ నుండిరి. వారుచేసిన పనిని నా అల్లుడగు సర్ విలియమ్‌కు తెలిపితిని. అంతట నతడు బయ టకుపోయి వారిని కఠినముగా మందలించెను. అప్పుడు వారు నిరు త్సాహపడిరి. వారిని ఉత్సాహ పఱచుటకును, తన పేరు చెప్పుకొని పానీయము సేవించుటకును సర్ విలియమ్ తలకొక అఱగినీ నాణెమును ఇచ్చెను.

తరువాత మేమందఱము చక్కని విందులో పాల్గొనుటకై పోతిమి. నా పెద్దల్లుడగు తార్న్‌హిల్ వంటవాడు భోజన పదార్థ ములను చక్కగా తయారుచేసి యుండెను. తార్న్‌హిల్ మాత్రము వివాహములకుగాని, విందులకుగాని వచ్చియుండలేదు. అతడొక బంధువుఇంట నివసించుచున్నాడట. ఆ బంధువెప్పు డును విచారముతో నుండును. తార్న్‌హిల్ ఆమెకు ఉత్సా హము కలిగించుటకు ప్రయత్నించుచుండును. "తార్న్‌హిల్ మారినపుడు నే నతనిని కనికరింతును" అని ఒలీవియా అతనిని గూర్చి నాతో రహస్యముగా పలికెను.

మేము భోజనములకు కూర్చుండబోవుచుండగా మఱియొక సమస్య వచ్చెను. నా పెద్దకొమార్తె ఒలీవియా పెండ్లికొమార్తె లిద్దఱికంటె పైన కూర్చుండవలెనని అనిరి. ఆ విషయమును గూర్చి దీర్ఘముగా చర్చజరుగసాగెను. అంతట జార్జి ఆచర్చకిట్లు భరతవాక్యము పలికెను: "ఎవరిఇష్టమువచ్చినచోట వారు కూర్చుండ వచ్చును. ప్రతి గౌరవనీయుడును తనభార్యను ప్రక్కనే పెట్టుకోవలయును." అతనిమాటల నందఱును హర్షధ్వానములతో స్వీకరించిరి. కాని నాభార్యకు మాత్రము సంతృప్తి కలుగలేదని నేను గ్రహించితిని. ఆమె ప్రథమస్థానమున కూర్చుండి తన ఆధిక్యమును నిరూపించుకొనదలచుచుండెను. కాని ఆమెకా అవకాశము లేకపోయెను.

మావారందఱును భోజనముచేయుచు కులాసాగా కబుర్లు చెప్పుకోసాగిరి. వారాకబుర్లలో గొప్ప తెలివితేటలు ప్రదర్శింపని మాట నిజమే. కాని అందఱకు నవ్వుపుట్టించునట్లు వారు మాట్లాడుకొన్నారన్నమాట మాత్రము నిజము.

భోజనములు పూర్తియైన తరువాత మా ప్రాతయలవాటు ప్రకారము మావార మందఱము కుంపటిచుట్టు కూర్చుంటిమి. నా చిన్నకుమారు లిరువురును నాతొడలపై కూర్చుండిరి. నేను నాభార్యవంక, కొమార్తెలవంక, కుమారులవంక, అల్లునివంక, కోడలివంక చూచి సంతోషించితిని.

ఇంకనేను ఈ జీవితములో కోరవలసిన దేదియులేదు. నా బాధ్యతలన్నియు తీఱిపోయినవి. నాకింక ఏకష్టములులేవు. నా ఆనందమును వర్ణించుటకు మాటలుచాలవు. కష్టకాలములో

నేను భగవానునకు లొంగియుంటెని. ఈ మంచికాలములో నేను భగవానునిపట్ల ఎప్పుడును కృతజ్ఞతా భావమును ప్రకటింపవలసి యున్నది. భగవానుడు నాకాశక్తిని ప్రసాదింప వలయునని హృదయ పూర్వకముగ వేడుకొనుచున్నాను.

అందఱకు శుభములు కలుగుగాక.

—(o)—



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA127B137 |
| పుస్తకం పేరు | సజ్జనులు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 369 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Ramya |
| స్కాన్ చేసినది | Haleema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |